# కృష్ణమూర్తి తత్వం

## పరిచయ సంపుటం

సంపాదకులు

కె.కృష్ణమూర్తి

సోల్ డిస్ట్రిబ్యూటర్స్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-500 001.

**KRISHNAMURTI THATHVAM – PARICHAYA SAMPUTAM**

Telugu Translation of *Krishnamurti For Beginners*

*Translated by:* **Sarojini Premchand**

(Authorised by Krishnamurthy Foundation India)



No. of Copies : 1000

First Edition : 1998

Second Edition : January, 2001

**PRICE: Rs.90/-**

*For Copies:* **Visalaandhra Publishing House**
Abids, Hyderabad - 500 001.

**Visalaandhra Book House,**
Abids, Sultan Bazar - Hyderabad,
Vijayawada, Visakhapatnam,
Kakinada, Guntur, Anantapur,
Hanmakonda, Tirupathi.

*Printed by:* **Kalanjali Graphics**, Hyderabad

# ప్రస్తావన

జిడ్డు కృష్ణమూర్తి చెప్పినది ఏమిటి అని తెలుసుకోగోరే పాఠకుల కోసం యీ సంకలన గ్రంథాన్ని ప్రచురిస్తున్నాము. ఇంతకు మునుపు కృష్ణమూర్తి రచనలు చదవనివారికి ముఖ్యంగా, యిది ఒక పరిచయ సంపుటంగా వుపయోగపడుతుంది.

నిత్యజీవితంలో ప్రతి మనిషీ ఎదుర్కొనే సమస్యలను పూర్తిగా మౌలికమైన, ఒక నవ్య దృష్టితో కృష్ణమూర్తి పరికించి విశదీకరిస్తారు. ఆ అంశమే యీ సంకలనంలోని విషయాలను ప్రత్యేకంగా ఎన్నుకోవడానికి గల కారణం.

విభిన్నమైన శాఖలకు చెందిన రచనలు యిందులో చోటుచేసుకున్నాయి- సభా ప్రసంగాలు, సందేహాలకు సమాధానాలు, వ్యాసరచనలు, ఇంటర్‌వ్యూలు, దినచర్య వృత్తాంతాలు, యితరులకు చెప్పి వ్రాయించినవి, లేఖలు, సంవాదాలు, చర్చలు- వీటిలో జీవితానికి సంబంధించిన అత్యంత ప్రధానమైన అంశాలను నిర్దుష్టతతో దృశ్యీకరించారు. ఆయన బోధనలు శిఖరాగ్ర స్థాయిని చేరుకున్న కాలం 1948 నుంచి 1983 వరకు. ఈ సంకలనంలోని విషయం ఆ కాలం నుండే సేకరించాము

సత్యం మానవుడి మనస్సు నిర్మించుకున్న పరిమితులకు ఆవలగా, 'తెలుసుకున్న వాటికి, సూత్రీకరించుకున్న వాటికి లేదా కల్పన చేసుకున్న వాటికి' ఆవలగా వుంటుందనీ, సత్యం కోసం అన్వేషిస్తున్నప్పుడు 'మొదటి అడుగే చివరదీ' అనీ అంటారు కృష్ణమూర్తి. అంటే ఎప్పటికప్పుడు కొత్తగా ఆరంభించడంలోని వైశిష్ట్యాన్ని గట్టిగా నొక్కి చెప్పారు. ఆ విధంగా చూస్తే ప్రతివారూ యీ జీవన పయనంలో ఆరంభకులే. ఈ దృష్టితో చూసినప్పుడు యీ సంకలనం అందరి కోసమూ అని చెప్పచ్చు.

జిడ్డు కృష్ణమూర్తి 1895 లో మే 12 వ తేదీన మదనపల్లిలో జన్మించారు 14 వ ఏట దివ్యజ్ఞాన సమాజం వారు చేరదీయగా, అనీబెసెంట్ సంరక్షణలో పెరిగారు. భావికాలంలో జగద్గురువుగా భాసిల్లడం కోసం కృష్ణమూర్తికి శిక్షణ నిచ్చారు. అయితే 1929 లో హాలెండులో జరిగిన సమావేశంలో జగద్గురువు అనే యీ అత్యున్నతమైన పదవినీ, తమ చుట్టూ ఏర్పడిన సంస్థలనూ, అశేషమైన ఐశ్వర్యాన్నీ అవలీలగా పరిత్యజించివేసి ఒంటరిగా నిలబడ్డారు. ఏ సంస్థల ఆధ్వర్యమూ లేకుండానే ప్రపంచమంతా పర్యటించి, మానవుడిని దుఃఖాల నుండి,

సమస్త బంధనాల నుండి విముక్తం చేయడమే ప్రధానాంశంగా ప్రసంగించారు. సత్యం అనేది బాటలులేని సీమ అనీ, అది చేరుకోవడానికి మతాలు గానీ, సంస్థలు గానీ, గురువులు గానీ అవసరం లేదని నొక్కి చెప్పారు.

మత ధర్మమూ, తాత్వికతా, మనోతత్వ విచారణా కలిసి, అపూర్వమైన తీరులో సమ్మేళవించుకున్న కృష్ణమూర్తి బోధనలు సమగ్రమైన సంపూర్ణ జీవిత దర్శనాన్ని నిర్దుష్టశైలిలో మనకు అందిస్తాయి.

1986 లో ఫిబ్రవరి 17న అమెరికాలోని ఒహాయిలో తుదశ్వాస వదిలే వరకు, 60 సంవత్సరాల పాటు యూరప్, అమెరికా, లాటిన్ అమెరికా, శ్రీలంక, భారత దేశాలలో నిర్విరామంగా పర్యటించి ప్రసంగించారు. అసంఖ్యాకమైన ప్రజలను ప్రభావితం చేశారు.

ద్వేషాలూ, అసూయలూ, సంఘర్షణలూ, జాతి మత విభజనలూ లేని ఒక నూతన ప్రపంచాన్ని నిర్మించాలంటే విద్యా విధానంలోనే మార్పు రావాలనే దృక్పథంతో ఇండియా, అమెరికా, ఇంగ్లాండ్, కెనడాలలో విద్యాసంస్థలను స్థాపించారు.

కృష్ణమూర్తి రచనల తెలుగు అనువాదాలు పాఠకులలో జీవితం ఎడల విచారణ శీలత్వాన్నీ, పరిశీలనా శక్తినీ పెంపొందిస్తాయని ఆశిస్తున్నాము.

వసంత విహార్
మద్రాసు - 600 028.

సమన్వయ కర్త
దక్షిణ భాషల అనువాద విభాగం,
కృష్ణమూర్తి ఫౌండేషన్, ఇండియా

# విషయ సూచిక

I ప్రసంగాలు

భయం ఆలోచనల్లో పుట్టి పెరుగుతుంది 3
స్వేచ్ఛ, బాంధవ్యాలు, మరణం 18
తనని తాను తెలుసుకోవడం లేకుండా ధ్యానం ఉండదు 32
దుఃఖాన్ని సమాప్తం చేయడం 47

II సందేహాలు, సమాధానాలు

సందేహాలు, సమాధానాలు 67

III రచనలు

సమస్యలూ, తప్పించుకొనే మార్గాలు 123
ఆరాటం 127
మరణం అనే యీ దుఃఖం ఎందుకు వున్నది? 130
భద్రత 138
కోపం 144
నిబద్ధీకరణం 147
స్వాభిమానం 151
మనసులోని తుఫాను 156

IV దిన చర్య వృత్తాంతాలు, లేఖకులకు చెప్పి వ్రాయించినవి, ఉత్తరాలు

భూమి మీద జీవిస్తున్న ప్రాణులంటే మనకి కనికరం వున్నదా? 165
మానవాళి భవిష్యత్తులో ఏమున్నది? 167
నేను, ఎట్లా పనిచేస్తుంటుంది-ఒక అంతర్వీక్షణ 172
మహత్వపూర్ణమైన అనుగ్రహం 177

V సంభాషణలూ, సంవాదాలు

దేవుడున్నాడా? 181
బాధ 184
పారమార్థిక జీవనం 187
నిజమైన పరిత్యాగం అంటే 193
కాంతి దర్శనం 201

# కృష్ణమూర్తి : వికాసోదయం

భారతదేశాన్ని విక్టోరియా మహారాజ్ఞి పరిపాలిస్తున్న రోజుల్లో, ఆమె సామ్రాజ్యంలోని మారుమూల ప్రాంతంలో ఒక బాలుడు జన్మించాడు. అది 1895 వ సంవత్సరం. అది మదనపల్లి అనే చిన్న వూరు - పూర్వపు మద్రాసు ప్రెసిడెన్సీలో భాగమైన చిత్తూరు జిల్లాలో వున్నది. అబ్బాయి తండ్రి తెలుగు బ్రాహ్మణుడు - పేరు జిడ్డు నారాయణయ్య, ఆ జిల్లా రెవెన్యూ శాఖలో చిన్న వుద్యోగి. ఆ పిల్లవాడికి కృష్ణమూర్తి అని పేరు పెట్టారు.

అంతకు యాభై సంవత్సరాలకు పూర్వం భారతదేశంలో విద్యా విధానం ఎట్లా వుండాలి అనే విషయం మీద థామస్ బేబింగ్టన్ మెకాలే అభిప్రాయాలు ప్రజల్లో చర్చా స్పదంగా తయారయ్యాయి. విద్యా బోధనకి యింగ్లీషు భాషే సరైన మాధ్యమం అనీ, పురోగమనానికి అదే ఆదర్శమార్గమనీ మెకాలే గట్టిగా విశ్వసించాడు. పంథొమ్మిదో శతాబ్దపు భారతదేశాన్ని మధ్యయుగపు ఐరోపాతో పోలుస్తూ, నిర్జీవమై పోతున్న సంప్రదాయాన్ని మృతభాషలో నేర్పించడానికి ప్రభుత్వ ధనాన్ని వ్యర్థం చేయడం సబబేనా అని మెకాలే వుద్రేకంగా ప్రశ్నించేవాడు. భారతదేశంలో విద్యా విధానం ఎట్లా వుండాలి అని నిర్ణయించడానికి మార్గం యింగ్లీషా, సంస్కృతమా - న్యూటనా, టాలెమీయా ఏడం స్మిత్తా, వేదాలా - మిల్టనా, మహాభారతమా - ఆధునిక వైద్యమా, ఆయుర్వేదమా - సదా చలనంలో వున్న భూమా, భూమి చుట్టూ తిరుగుతున్న సూర్యుడా అనే ప్రశ్నలకి సమాధానంలో వున్నదని మెకాలే అభిప్రాయం.

ఇండియన్ సివిల్ సర్వీసు ప్రణాళికను రచించినవాడూ, మెకాలే బావమరిదీ అయిన సి. యి. ట్రెవిల్యాన్ 'చెల్లుకు చెల్లు' అనే బ్రిటిష్ సామ్రాజ్య రీతిని ఋట్లా వివరించాడు.

> *'భారతీయులకు ప్రసాదించడానికి బ్రిటిష్‌వారివద్ద వున్నతమైన తమ విజ్ఞానం తప్ప మరొకటేమీ లేదు. తక్కినవన్నీ - పన్నులు మొదలైన ఆర్థికరాబడులు, గౌరవాలు, వ్యక్తిగత సంపాదనలు మొదలైనవి భారతీయుల వద్ద నుంచి పుచ్చుకున్నా, చివరకు బ్రిటిషువారు తాము పొందిన లాభాల్లో చాలా వాటికి పుష్కలమైన ప్రతిఫలాన్ని తిరిగి యివ్వబోతున్నారు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, భౌతిక వనరులను, సంపదనూ అర్పించుకొని భారతీయులు అందుకు బదులుగా యూరప్ సంస్కృతినీ, పాశ్చాత్య విజ్ఞానాన్నీ ముందు కాలంలో అందుకోబోతున్నారు.'*

విక్టోరియా యుగానికి చెందిన యీ మితవాదులంతా హేతువాదం పురోగమనం, స్వాతంత్ర్యం, మానవాభివృద్ధి వికాసాలు అనే ఆదర్శాలకు తమని అంకితం చేసుకున్నారు. శాస్త్రీయ చింతనను ముందుకు తీసుకొని వెళ్ళటానికి కంకణం కట్టుకుంది వారి దేశం. పారిశ్రామిక విప్లవం అవతరించడానికి ప్రధాన పాత్ర వహించింది. ఈ నేపథ్యంలో చూస్తే భారతీయ సాంప్రదాయంలో భద్రపరచవలసినంత విలువైనవేమీ వారికి కనిపించలేదు. బ్రిటిషు చరిత్ర పదిహేడవ శతాబ్దపు ఆరంభం నుండీ 'భౌతికమైన, నీతిపరమైన, మేధాపరమైన' అభివృద్ధి పథంలో నడిచిన చరిత్ర అనీ, దీనితో పోల్చదగిన పురోగమనం భారతీయ చరిత్రలో కనపడదనీ మెకాలే అభిప్రాయ పడేవాడు. ట్రెవిలియన్ మాత్రం భారతదేశం యొక్క గత చరిత్ర 'తప్పకుండా' చదవవలసిందే అని ఒప్పుకున్నాడు. అయితే కేవలం 'పురాతన విషయాల పరిశోధన' మీద ఆసక్తి వల్లనే చదవడం జరుగుతుంది అనే అభిప్రాయం వెలిబుచ్చాడు. సామ్రాజ్య సంరక్షకులు అని పిలువబడే వీళ్ళు తమ జాతి భవిష్యత్తే తమను నడిపిస్తున్నదని భావించారు. విక్టోరియా రాణి దర్బారులో ఆస్థానకవి అయిన ఆల్‌ఫ్రెడ్ లార్డ్ టెన్నిసన్ కూడా అదే భావాన్ని వుద్వేగ భరితమైన యీ కవితలో యిట్లా పొందుపరిచాడు.

*దూర తీరాల వెలుగు దీపాల*
*ఆశలూరించే పిలుపులవిగో*
*పదండి, పదండి, పయనమై పోదాం*
*ఘల్లున మారుమ్రోగే నవ్య నూతన పథాలలో*
*ఆగదు, యీ మహా ప్రపంచపు గమనం ఆగదు.*

భారతదేశంలో పాశ్చాత్య విద్యా విధానాన్ని, యింగ్లీషు భాషనీ ప్రవేశపెట్టడంలో విజయం సాధించిన వారితో అందరూ ఏకీభవించారని చెప్పలేము. సంస్కృత కళాశాల స్థాపకులూ, ప్రాచ్యతత్వాన్ని బాగా అధ్యయనం చేసినవారూ, గౌరవనీయులూ అయిన హెచ్. హెచ్. విల్సన్ వంటి కొంధరు నవభారత నిర్మాణానికి కావలసిన విషయ సామగ్రి అంతా ఆ దేశపు గత చరిత్రలోనే లభిస్తుందని విశ్వసించారు. యూరపు నుంచి వచ్చిన విజ్ఞానశాస్త్రమూ, పాండిత్యమూ భారతదేశం తన గత వైభవాన్ని పునర్నిర్మించుకోవడానికీ, తిరిగి తన 'మేధాపరమైన, నీతిపరమైన అభివృద్ధి'ని సాధించడానికీ వినియోగపడాలని విల్సన్ పదే పదే హెచ్చరించాడు. ఇరు పక్షాల వారూ కూడా సమాజ పురోగతికి పాశ్చాత్య శాస్త్రీయ విధానమూ, హేతువాదమూ ఎంతో లాభదాయకాలని వప్పుకున్నారు ఇది మెకాలే ఆధునిక శాస్త్రాన్ని మధ్యయుగాల సిద్ధాంతాలతో పోల్చి తారతమ్యాలు చూపడంలోను, విల్సన్ సంస్కృత కళాశాల పార్య

ప్రణాళికలో మెకానిక్స్, హైడ్రాలిక్స్, ఆప్టిక్స్‌ను కూడా చేర్చాలని నిర్ణయం తీసుకోవడంలోనూ కనబడుతుంది.

ఈ విధంగా యూరప్, భారతీయ సంస్కృతుల మధ్య పోటీ సాగుతున్నది. అందులో ఒకటి వలస రాజ్యాధిపతులకు చెందిన సంస్కృతి. అటువంటి పరిస్థితుల్లో పరిపాలిస్తున్న ప్రభువులకీ, దాస్యంలో వున్న ప్రజలకీ మధ్యన సంబంధాలలో అస్పష్టత, అపనమ్మిక, వుద్రిక్త వాతావరణం వుండటం సహజమే కదా. అయితే మెకాలే పాత సంప్రదాయాలను త్రోసేసి ఆధునికత్వాన్ని ఎన్నుకోవడం రాజా రామమోహనరాయ్ వంటి మేధావులను యూరప్ సంస్కృతివైపు మొగ్గేటట్లుగా చేసింది. అదే ఆ కాలానికి సబబైన మార్గంగా వారికి తోచింది.

భారత రంగంమీద యీ రకమైన వాద వివాదాలు ఎన్నో జరుగుతున్నాయి. అయితే కృష్ణమూర్తి తల్లిదండ్రులు వున్న ప్రపంచం వేరు జన్మతః బ్రాహ్మణులు కాబట్టి అనూచానంగా వస్తున్న భాషా పాండిత్యాలకూ, మత సంప్రదాయాలకూ వారు వారసులు. అయితే తాత ముత్తాతలు కాలానుగుణంగా వస్తున్న మార్పులు గ్రహించి, సంప్రదాయ బద్ధమైన తమ జీవన సరళిలో నుంచి యివతలగా వచ్చి, విశాలమైనా యింకా పరాయిదే అయిన యింగ్లీషు భాషా ప్రపంచపు మారుమూలల్లో చిన్న చిన్న వుద్యోగాలు సంపాదించుకున్నారు. అయితే, వుద్యోగాల్లో చేరినా వారు తరతరాలుగా వస్తున్న తమ ఆచార వ్యవహారాలను వదులుకోలేదు. సద్బ్రాహ్మణుని దైనిక జీవితాన్ని కుటుంబంతో, సమాజంతో, వూర్ధ్వలోకాలతో అనుసంధించే తమ కర్మకాండల అనుష్ఠానాలలో విశ్వాసాన్ని చెదిరిపోనీయలేదు.

పంథొమ్మిదో శతాబ్దంలో సాధారణమైన బ్రాహ్మణ గృహంలో కుటుంబ జీవనం పరిమితులు గల పరిధిలోనే తిరుగుతూ వుండేది అక్కడ బయట ప్రపంచంమీద ఆధారపడటం లేదు, దానికదే ఒక స్వయం సంపూర్ణమైన దినచక్ర క్రమం. పుత్రసంతానంమీద విపరీతమైన శ్రద్ధ చూపేవారు. దేవుళ్ళనూ, దేవతలనూ అధివసింపజేసి, వారి చుట్టూ పూజా పునస్కారాలూ, వ్రతాలూ చేసి, అజ్ఞాత భయంకర శక్తులనుంచి అవి తమని కాపాడుతాయనుకునేవారు. కొడుకుల అభీష్టాలకు ఏమాత్రం అడ్డుతగలకుండా ప్రవర్తించేవారు. కృష్ణమూర్తి జన్మించిన మర్నాడు ఒక జ్యోతిష్యుడిని పిలిచారనీ, జాతక చక్రం వేయించారనీ, అతనికి గొప్ప భవిష్యత్తు వున్నట్లుగా అందులో వ్రాసి వుందనీ అంతా చెప్పుకుంటారు. కొంత కాలానికి పూర్వ సంప్రదాయానుగుణంగా కృష్ణమూర్తికి అక్షరాభ్యాసం చేశారు. అంటే, వెండి కంచంలో బియ్యం పోసి, అతనిచేత అందులో ఓం అనే అక్షరం దిద్దించారు.

రెవెన్యూ శాఖలో పనిచేస్తుండటం వల్ల కృష్ణమూర్తి తండ్రి తరచుగా గ్రామాంతరం వెళ్ళవలసి వస్తుండేది. కృష్ణమూర్తి తల్లి సంజీవమ్మ. ధర్మపరాయణురాలు. నెమ్మదీ, దయాగుణమూ గల మనిషి. కుటుంబం అంటే అమిత శ్రద్ధ. శ్రీకృష్ణుడిమీద అపారమైన భక్తి. పెద్ద కూతురు పనిపాటల్లో సహాయం చేస్తుంటే, యింట్లో వున్న సభ్యులందర్నీ ప్రేమతో, ఆప్యాయతతో కనిపెట్టి చూసుకుంటూ వుండేది. కొడుకులూ, కూతుళ్ళతో వున్న పెద్ద సంసారం అది. కృష్ణమూర్తి తర్వాత నిత్యానంద మొదలైనవారు ఆమెకు జన్మించారు. పుట్టిన ప్రతివారికీ ఆచార విధులు తప్పనిసరి. కాని మతపరమైన, ధర్మపరమైన మానసిక తత్వం ఆ యింట్లో అందరికీ సమానంగా అబ్బలేదు. నిత్యానంద వయసుకు ముందే బడికి పోవడం ఆరంభించాడు. చదువులో పైకి పోయే లక్షణాలు కనిపించాయి. కాని కృష్ణమూర్తికి ఎప్పుడూ మలేరియా జ్వరం, అందువల్ల బడికి పోవడం తక్కువ. ఆ విధంగా భక్తురాలైన తల్లితోపాటే వుంటూ, ఆమె ధర్మపరాయణత్వంలో పాలు పంచుకున్నాడు. రామాయణ భాగవతాల నుంచి ఆమె కథలు చదివి వినిపిస్తూ వుండేది. ఇద్దరూ కలిసి కొండమీద వున్న శ్రీకృష్ణుని ఆలయానికి ఎక్కి వెళ్ళి, దివ్యదర్శనం జరిగినట్లుగా అనుకుంటూ వుండేవారు. అయితే తరువాత కాలంలో కృష్ణమూర్తి యీ దివ్యదర్శనాలన్నీ కేవలం నిబద్ధీకృతమైన మనసు కల్పనలని త్రోసి పుచ్చారు. ఒకవేళ క్రైస్తవునిగా పుట్టి వుంటే జీసస్ గురించి యిటువంటి దివ్యదర్శనాలు జరిగి వుండేవని అన్నారు. అయినా కూడా సంజీవమ్మలో వుండే దయా ధర్మగుణంలో నుంచి పూర్తిగా కాకపోయినా కొంతవరకు కృష్ణమూర్తి నేర్చుకొని, అందిపుచ్చుకున్నారు.

ప్రతిరోజూ ఒక ఆచారంగా జరిగే దానధర్మ విధులలో అనుకోకుండానే కృష్ణమూర్తి కూడా పాలు పంచుకోవడం గురించి నారాయణయ్య యీ విధంగా వర్ణించాడు.

> *పొద్దునపూట యింటి ముందుకి బిచ్చగాళ్ళు వచ్చేవారు. మా ఆచారం ఏమిటంటే బిచ్చం వేయడానికి రోజూ ఒక గ్లాసుడు బియ్యం విడిగా వుంచేవాళ్ళం. గ్లాసు ఖాళీ అయేదాకా చేయి జాపిన ప్రతి వారికీ కొద్ది కొద్దిగా బియ్యం పంచి పెట్టేవాళ్ళం. నా భార్య ఒక్కో రోజు కృష్ణని బిచ్చం వేయమని పంపుతుండేది. ఈ చిన్నవాడు యింకా కావాలంటూ వెనక్కి వచ్చేవాడు, గ్లాసు మొత్తం ఒక్కరి జోలెలోనే పోసేశానని చెప్తూ. అప్పుడు వాళ్ళ అమ్మ వెంట వెళ్ళి, ఒక్కొక్కరికే ఎట్లా పంచాలో నేర్పిస్తూ వుండేది.*

కృష్ణమూర్తికి రెండేళ్ళ వయసులో తీసిన ఒక చిత్రపటంలో కళ్ళు పెద్దవిగా చేసి చూస్తూ స్నేహపూరితమైన చూపులతో కెమేరాలోకి సూటిగా చూస్తూ కనబడతాడు.

కొంచెం పెరిగాక, మృదువైన హృదయమూ, వుదారగుణమూ గల బాలుడిగా తయారయ్యాడు. అయితే తరచూ మలేరియాతో తీసుకుంటూ బడికి సక్రమంగా వెళ్ళలేకపోయేవాడు. పాఠాలు సరిగ్గా నేర్చుకోలేక, తరగతిలో తక్కినవారికంటె వెనకబడి వుండేవాడు. ఉపాధ్యాయుల చేతిలో దెబ్బలు తినడం కూడా అప్పుడప్పుడు జరిగేది.

కృష్ణమూర్తికి చిన్ననాటి జ్ఞాపకాల్లో సంతోషకరమైనవి తల్లిని గురించినవే. అయితే అతనికి పదేళ్ళు నిండాయో లేదో తల్లీ, ప్రేమాస్పదురాలైన అక్కా యిద్దరూ చనిపోవడంతో నిశ్చింతగా సాగిపోతున్న ఆ కుటుంబ జీవనం ముగిసిపోయింది. ఆ సంఘటన జరిగిన ఎనిమిది సంవత్సరాల తర్వాత కృష్ణమూర్తి యిట్లా వ్రాసుకున్నాడు. '1905 లో మా అమ్మ చనిపోయాక మమ్మల్ని ప్రేమగా, మా బాగోగులు కనిపెడ్తూ చూసే వ్యక్తి నాకూ నా అన్నదమ్ములకూ లేకుండా పోయింది. మా నాన్నకు తన పనులతో తీరిక లేకపోవడం వలన మా గురించి అంతగా పట్టించుకొనేవాడుకాదు. నిజంగా చెప్పాలంటే మమ్మల్ని చూసుకోవడానికి ఎవ్వరూ వుండేవారుకాదు.'

మనిషి అంతఃప్రేరణల్లో కల్లా మతం గురించినది చాలా నిగూఢమైనది. శబ్దలక్షణ శాస్త్రాన్ని బట్టి చూస్తే 'రిలిజియన్' అనే మాట యొక్క ధాతువుకి అర్థం 'కలిపి వుంచేది' అని. ఒక దృష్టితో చూస్తే మతం స్త్రీ పురుషులను ఒక బహుళ జన సమాజంగా కట్టివేసి వుంచుతుంది. మరో స్థాయిలో అది వారిని కొన్ని దైవికమైన సిద్ధాంతాలతో బంధించి వుంచుతుంది. చావు, పుట్టుక, యుక్తవయసులోకి ప్రవేశించడం, వివాహాలు మొదలైన ప్రధాన సంఘటనల సందర్భంలో పవిత్రమైన కర్మకాండల రూపంలో యివి వుంటాయి. ఆయా సందర్భాల్లో కలిగే భావోద్వేగాలలో ఆ సమాజంలోని అందరూ పాలు పంచుకుంటారు. అందరూ కలసి ప్రదర్శించుకుంటారు. జీవితంలో ఎదురయే పెద్దపెద్ద మార్పుల సమయంలో తమ మనోభావాలను పదిమందితో కలిసి పంచుకోవడం వలన ఒంటరితనపు బాధ కొంత తట్టుకోవడం సాధ్యమవుతుంది. మతసంబంధమైన పాటలు, గాథలు, ఆచార కర్మలు మొదలైన వాటిలో ఆయా ప్రజల ఆందోళనలకు, విజయోత్సాహాలకు, భయాలకు, ఆశలకు సంబంధించిన సామూహిక స్మృతులు అభివ్యక్తమవడానికి అవకాశం వుంది. అజ్ఞాత నామధేయులైన మతగురువులు, కవులు, కళాకారులు యీ సంప్రదాయాన్ని కొనసాగించారు. ఆయా మతాలను విస్తరింపజేసుకోవడానికీ, కొత్తవారిని చేర్చుకోవడానికీ చేసిన ప్రయత్నాల్లో ఒక భాగం ఏమిటంటే విశ్వాసమూ, క్రోడీకరించి సూత్రబద్ధం చేసిన నమ్మకాలూ. ఒక దశలో యివి ఒక్కొక్క మతపు ప్రత్యేక లక్షణాలుగా తయారయ్యాయి.

కృష్ణమూర్తి పుట్టుకకు యిరవై సంవత్సరాలకు పూర్వం, దివ్యజ్ఞాన వుద్యమం అమెరికాలో ఆరంభమైంది భౌతిక వాదాన్ని, ఆ కాలంలో ప్రచారంలో వున్న శాస్త్రబద్ధమైన మానవతా వాదాన్ని గర్హిస్తూ ప్రతిరోధించే ధోరణిలో యీ వుద్యమం బయలుదేరింది. హెలెనా పెట్రొవ్నా బ్లవట్స్కీ అనే రష్యా దేశస్థురాలు దీనిని స్థాపించింది ఈవిడ భవిష్యవాణి చదవగలిగిన మర్మజ్ఞురాలు. వానరాలనుండి నరుడు పరిణామం చెందాడనే వాదాన్ని యీవిడ ఘట్టిగా ఖండించింది. పైగా క్రైస్తవులు జీసస్ క్రీస్తు సందేశానికి వక్రభాష్యాలు యిస్తున్నారని కూడా ఆరోపించింది. అతీంద్రియ శక్తులని వుపయోగించడం ద్వారా విజ్ఞానశాస్త్రం, మతమూ తత్వశాస్త్రాలను సమ్మేళవించి 'ప్రకృతిలో నిగూఢంగా వున్న రహస్యాలను, మనిషిలో అజ్ఞాతంగా దాగివున్న శక్తులను' వెలికి తీస్తాననీ ఆమె విశ్వాసభరితంగా పలికింది.

డార్విన్ సూచించిన పరిణామ సిద్ధాంతాన్ని బ్లవట్స్కీ తీవ్రంగా నిరసించింది. అయితే పంధొమ్మిదో శతాబ్దంలో బాగా ప్రాముఖ్యం సంపాదించిన పరిణామ క్రమంలో పురోగమనం అనే భావన ఆమె ఆలోచనా ధోరణిలో కూడా ప్రతిధ్వనించింది. 'భూతలం' నుండి 'దివ్యలోకాల' స్థాయివైపు 'పైకి' పోయే క్రమానుగత గమనంలో మానవజీవితం ఒక దశ అని ఆమె అభిప్రాయపడింది. వైజ్ఞానిక సత్యం, గతమూ, భవిష్యత్తూ అన్నీ కూడా దివ్యదృష్టి ద్వారా పరీక్షించి దర్శించడం సాధ్యమవుతుందని ఆమె నమ్మింది. ఆమె అనుయాయి మాటల్లో చెప్పాలంటే :-

> *'తొలినాటి పరిణామ క్రమంలో వివిధ దశలు వున్నట్లుగానే - ముడి ధాతువులు తర్వాత వృక్షజాతి, వృక్షజాతిపైన జంతువులు, జంతువులపైన మానవుడు అదే విధంగా మానవజాతికి కూడా ఒక చివరి హద్దు వున్నది; యీ సరిహద్దు దాటాక తమకంటె వున్నత స్థితిలో వున్న మరో లోకంలోకి అడుగు పెడుతుంది; మానవుల తర్వాత అధిమానవులు వున్నారు.'*

బౌద్ధము, హిందూ మొదలైన అనేక మూలాధారాల నుంచి బ్లవట్స్కీ పుష్కళంగా గ్రహించి తన వాదాలలో సమీకరించుకున్నది. ఆమె రచనలలో కర్మ, పునర్జన్మ, బంధాలనుండి మోక్షప్రాప్తి వంటివన్నీ కనబడతాయి; విముక్తి మార్గం చూపడానికి అధ్యాత్మిక మార్గనిర్దేశకులూ వుంటారు. నిజమైన ఆధ్మాత్మిక గురువు ఆమె సిద్దాంతం ప్రకారం యిట్లా వుంటాడు :

> *'అతడికి అఖండమైన జ్ఞానం వుంటుంది. బాహ్యావిషయాల జ్ఞానమూ, రహస్యమైన నిగూఢజ్ఞానమూ కూడా. ప్రధానంగా రహస్యజ్ఞానం కలిగి వుంటాడు. ఐహిక జ్ఞానాన్ని తన సంకల్పం యొక్క స్వాధీనంలో వుంచుకుంటాడు. ప్రకృతి శక్తుల్ని నిగ్రహించే సిద్ధులు పొందినవాడై వుంటాడు. ఒకప్పుడు తనలో*

*నిద్రాణంగా వుండి, ప్రస్తుతం జాగృతమైన తన ప్రాణశక్తుల సహాయంతో ప్రకృతి రహస్యాలను భేదించగల సామర్థ్యం అతనికి వుంటుంది.*

అంటే మూఢ విశ్వాసాల మతపు ఆధిపత్యాన్నీ, భౌతిక విజ్ఞాన శాస్త్రాన్నీ ఆయా సిద్ధాంతాల పరిధుల్లోనే ఎదిరించి, తలపడగల శక్తియుక్తులు అతడికి వుంటాయి. ఇది తన మనో సంకల్పాన్ని వుపయోగించడం ద్వారానూ, అతీంద్రియ శక్తుల ద్వారానూ అతడు చేయగలుగుతాడు.

1882 లో బ్లవట్స్కీ దివ్యజ్ఞాన సమాజం వారి ప్రధాన కార్యాలయాన్ని భారతదేశానికి తరలించింది. ఎందుకంటే దివ్యజ్ఞానంవారి సిద్ధాంత శాసనంలో హిమాలయ పర్వతాల్లో మహాశక్తివంతులైన పరమగురువులు వాసం చేస్తున్నారని వున్నది. మద్రాసు నగరానికి చేరువలోనే వున్న ఒక సువిశాలమైన స్థలాన్ని యిందుకోసం ఎన్నుకున్నారు. ఆ ఆవరణ అంతా పచ్చని కొబ్బరిచెట్లతోనూ, పూజనీయంగా తోపించే బ్రహ్మాండమైన మర్రివృక్షాలతోనూ కలకలలాడుతూ వుంటుంది. ఒక వైపున అడయారు నది ప్రవహిస్తూంటే మరొకవైపు బంగాళాఖాతం సరిహద్దుగా వుంటుంది. ఆ అడయారు తోట లోపల కాలక్రమేణా దివ్యజ్ఞాన సమాజం వారు ప్రత్యేకంగా ఎన్నుకున్న నమోనాల్లో నిర్మించిన దేవాలయాలు, మందిరాలు, చర్చీలు, మసీదులు ఎన్నో వెలిశాయి.

భారత భూ భాగంమీద యీ సమాజం అవతరించడం అనేక భవిష్య ప్రయోజనాలకు ఒక ద్వారాన్ని తెరిచినట్లయింది. అప్పటివరకు వున్నత వర్గాలకు చెందిన భారతీయులకు, ఆంగ్లీకరించబడిన సమాజంలో వారు భాగస్థులవడంవల్ల తమ మతాన్నీ, తమ కళలనూ యితరులు నిరసించడం అలవాటైపోయింది. అసలు వారే తమ సంస్కృతిని పాశ్చాత్య ప్రమాణాలతో కొలిచి చూడటం నేర్చుకున్నారు. అటువంటి వారికి పురాతనమైనవీ, సంకుచితమైనవీ అయిన అంశాలనుంచి తమ ఆధ్యాత్మిక గతానికి యీ సమాజపు సిద్ధాంతాలు విముక్తి గల్పించి, విశ్వాత్మకంగా రూపొందించి, ఆ విధంగా పరిపూర్ణవంతం చేయడం కనువిప్పు కలిగించింది. అటువంటి ఎంతోమందిని యీ సమాజం ఆకర్షించి తన సభ్యులుగా చేర్చుకుంది. తమ ఆధీనంలో వున్న వలస దేశస్థులను తమ మతంలోకి మార్చుకోవాలని వచ్చిన క్రైస్తవ మత ప్రచారకులు, యీ దేశపు విశ్వాసాల ఆకర్షణకు పాశ్చాత్యులే లోనవు తుండటం చూసి దిగ్భ్రాంతి చెందసాగారు. జాతీయ భావాలను పురికొల్పే విషయాలంటే అతి సందేహంతో చూసే ప్రభుత్వం కూడా యీ మతప్రచారకుల లాగే కళవళపడింది. సనాతనాచార పరాయణులైన హిందువులు కూడా తమ పాత సంప్రదాయాలకు భ్రష్టత కలుగుతుందేమోననే భయంతో యీ నూతన సమాజాన్ని ఆమోదించలేదు.

ఒక కొత్త మతాన్ని వుద్యమ స్థాయిలో నిర్మించాలంటే కథలూ, గాథలూ, పూజా కర్మలూ, ఒక ప్రత్యేక సంఘానికి సంబంధించిన కట్టుబాట్లూ పెద్ద ఎత్తున సమకూర్చుకోవలసి వుంటుంది. ఇవన్నీ అంత త్వరగానూ, సులభంగానూ చేర్చడం సాధ్యంగాదు. అయినా కూడా, పంథొమ్మిదో శతాబ్దపు చివరి సంవత్సరాల్లో, ఒక ప్రక్కన యూరప్ బలం పుంజుకొని విభిన్న జాతుల ప్రజలను తన వలసాధిపత్యం అనే ఛత్రం కిందికి తీసుకురాగా, ప్రాచ్య, పాశ్చాత్య అనే రెండు భిన్న సంస్కృతులనూ, విజ్ఞానశాస్త్రాన్ని, మతాలనూ ఒకదాని కొకటి చేరుస్తూ గొలుసులను నిర్మించగలిగిన వుద్యమానికి ఒక చిన్న మార్గం తెరుచుకున్నది. విభిన్న పరిధుల్లో శాంతియుతమైన ఒక సహోదరత్వాన్ని నిర్మించే దివ్యజ్ఞాన సమాజపు కార్యక్రమం ప్రపంచం నలుమూలలనుండీ అనేకులను ఆకర్షించి సభ్యులుగా చేర్చుకుంది.

ఈ ఆదర్శాలను అందుకోవాలనే వుద్దేశ్యంతో దివ్యజ్ఞాన సమాజంవైపు ఆకర్షితులైనవారిలో అనీబెసెంటు ఒకరు. ఈ వుద్యమంలో చేరే నాటికే యింగ్లండులోని ప్రగతి వాద, సాంఘిక వుద్యమాలలో చాలావరకు అన్నింటిలోనూ శ్రీమతి బెసెంటు పని చేసింది : మహిళా హక్కుల కోసం పోరాడింది, స్వేచ్ఛావాదులతోను, కార్మికోద్యమాలలోను పనిచేసింది; లండన్ స్కూలు బోర్డులో కార్యోత్సాహం గల సభ్యురాలిగా వుండేది. 1879 లో హెలెనా బ్లవట్స్కీ ప్రభావానికి లోను అయాక, హిందూ సనాతనత్వానికి, పాండిత్యానికి కేంద్రమైన వారణాసికి ఆమె వచ్చి చేరింది. అరవై ఏళ్ళ వయసు సమీపిస్తున్న పాశ్చాత్య మహిళకిది నిజంగా సాహసకృత్యమే. వారణాసిలో నివసిస్తూ, భారతదేశపు గతకాలపు సంపదలోనుండి ఒక నూతన సంస్కృతిని పునఃసృష్టి చేయడం కోసం ఆమె తన శక్తినంతా వినియోగించడం మొదలుపెట్టింది. సంస్కృత పండితుల సహాయంతో భగవద్గీతకు ఒక అనువాదాన్ని తయారు చేసింది. దేశంలోని పలుప్రాంతాలలో పాఠశాలలు, కళాశాలలు స్థాపించింది.

దివ్యజ్ఞాన సమాజాని (టి ఎస్) కి శ్రీమతి బెసెంట్ అధ్యక్షురాలుగా వున్నప్పుడే కృష్ణమూర్తి తండ్రి నారాయణయ్య ఆమెవద్ద గుమాస్తాగా పనిచేస్తానని వచ్చాడు. అప్పుడే ప్రభుత్వోద్యోగంనుండి రిటైరయాడాయన. ఉచిత భోజనం, వసతి ఏర్పాటు చేస్తే దానికి బదులుగా పనిచేయడానికి ఆయన సిద్ధపడ్డాడు. 1909 లో నారాయణయ్య తన ముగ్గురు పిల్లలను, ఒక మేనల్లుడిని, వయసు పైబడిన పెత్తల్లిని తీసుకొని వచ్చి, టి ఎస్ ఆవరణకి బయటగా వున్న చిన్న కుటీరంలో నివసించడం సాగించాడు. దగ్గిరలోనే మైలాపూరులో వున్న ఒక పాఠశాలలో కృష్ణమూర్తిని, అతని తమ్ముడినీ చేర్పించాడు.

ఒకరోజు అడయారులో యీ పిల్లలిద్దరూ దివ్యజ్ఞాన సమాజంలో శ్రీమతి బెసెంటుతోపాటు కలిసి పనిచేస్తున్న సి. డబ్ల్యు, లెడ్ బీటర్ దృష్టిని ఆకట్టుకున్నారు. బాలుడైన కృష్ణమూర్తిలో అసాధారణమైనదేదో లెడ్ బీటర్‌కి గోచరమైంది. 'ఏమాత్రం స్వార్థపు జాడలేని తేజోవలయం' అని దానిని ఆ తరువాత వర్ణించాడు. అప్పుడు శ్రీమతి బెసెంట్ యూరపులో వున్నది. లెడ్ బీటరు ఆమెకి నారాయణయ్య గురించీ, అతని కుటుంబంలో వున్న పిల్లల సత్ప్రవర్తన గురించీ రాశాడు. ఇంకా తను చేసిన పరిశోధన ఫలితంగా కృష్ణమూర్తి 'గతం చాలా ప్రాముఖ్యత గలది, అతని తండ్రికంటె అతను చాలా ముందున్నాడు - అసలు ప్రస్తుతం ప్రధాన కార్యాలయంలో వున్న వారందరికంటె అతను ముందున్నాడు - హ్యూబర్ట్ కంటే కూడా. అతని పూర్వ జన్మలు వుత్తమమైనవి' అని కనిపెట్టాననీ కూడా రాశాడు. ఇది మహా ఆశ్చర్యకరమైన పోలిక. ఎందుకంటే దివ్యజ్ఞాన సామాజికులు ఒక అవతార పురుషుడి కోసం చాలా వుత్సాహంగా అన్వేషిస్తున్నారు. హ్యూబర్ట్ (వేన్ హుక్) అనే పిల్లవాడిని ఆ పదవికి తగిన ముఖ్య అభ్యర్థిగా అప్పటికే శిక్షణ యిచ్చి సిద్ధం చేస్తున్నారు.

అవతార పురుషుడు రాబోతున్నాడనే విషయం అనేక మత సంప్రదాయాల్లో వున్నది. భగవద్గీతలో బాగా ప్రాచుర్యం పొందిన కొన్ని శ్లోకాలలో కృష్ణభగవానుడు ప్రతి యుగారంభములోను తాను తిరిగి అవతరిస్తూంటానని యీ మాటల్లో చెప్పాడు:

> *"ఎప్పుడు ధర్మానికి హాని కలిగి, అధర్మం వృద్ధిచెందుతూ వుంటుందో, అప్పుడు సత్పురుషుల్ని సంరక్షించి దుష్టుల్ని సంహరించి ధర్మాన్ని పునఃస్థాపించడానికి నేను అవతారం తాలుస్తూ వుంటాను."*

ప్రపంచాన్ని అంధకారంనుండి రక్షించడానికి అవతార పురుషుడొకడు జన్మిస్తాడని జూడామతం, బౌద్ధమతం, క్రైస్తవం, ఇస్లాంలోని కొన్ని మతశాఖలూ బోధించాయి. శ్రీమతి బెసెంటు నాయకత్వంలో దివ్యజ్ఞాన సమాజం కూడా ఒక ప్రత్యేకమైన అవతార సంబంధమైన సిద్ధాంత సూత్రాన్ని కనిపెట్టింది. కొద్ది కాలానికే దీనిని నిజం చేసే అనుకూల 'వాహనం' గా కృష్ణమూర్తిని వారు ఎంపిక చేసుకున్నారు.

అనేక మత సంప్రదాయాలనుంచి ప్రగాఢ శోధన చేసి గ్రహించిన అంశాలతో తయారుచేసినది థియొసాఫికల్ సిద్ధాంతం; క్రమక్రమంగా వీరంతా, కృష్ణమూర్తిని కనుక సవ్యమైన పద్ధతిలో సిద్ధపరుస్తే మైత్రేయ ప్రభువు లేక బుద్ధుని మరో అవతారం అతని శరీరంలో ప్రవేశించి, ఆ విధంగా అవతారం తాలుస్తాడని నమ్మడం ఆరంభించారు. అందుకని ఆ సమాజం వారు ప్రపంచాన్ని యీ సంఘటన కోసం తయారుచేయడానికి పూనుకున్నారు.

లెడ్ బీటరుకు ప్రాచ్యదేశాల మార్మికతత్వంలో ఆసక్తి వున్నది. దానితో పాటు అతనిలో అధికారం చలాయించే స్వభావమూ, వలసరాజ్య పాలకవర్గంలో వుండే లక్షణాలు మితిమీరిన ధోరణీ కూడా వున్నాయి. లెడ్‌బీటరుకు సాహసకృత్యాలంటే మహా యిష్టం; దానికి తోడు విపరీతమైన వూహాలోక సంచారత్వం; వీటివల్ల అతడు తన జ్ఞాపకాలకు కూడా రంగులు అద్దుతాడు. ఎంతగా అంటే అతడి జీవితంలో జరిగిన సంఘటనలే అతడు తిరిగి చెప్పినప్పుడల్లా యింకా యింకా అద్భుతంగా ధ్వనిస్తుండేవి. వ్యక్తుల చుట్టూ వుండే 'తేజోవలయాలను' పరికించడం, వారి 'పూర్వజన్మల'ను చదవడం, రహస్యనిగూఢ పద్ధతులు సాధనచేయడం మొదలైన వాటిల్లో అతడికి చాలా ప్రావీణ్యం వుండేది.

ప్రథమ పరిచయం అయీ అవగానే తన భవనానికి కృష్ణమూర్తిని తీసుకొని రమ్మని లెడ్‌బీటరు నారాయణయ్యను ఆదేశించాడు. ఒక సోఫాలో తన పక్కనే ఆ చిన్న పిల్లవాడిని కూర్చోబెట్టుకున్నాడు. తన చేతిని ఆ పిల్లవాడి తలమీద పెట్టి నాటకీయంగా మాట్లాడటం మొదలుపెట్టాడు. అందులో చిలవలు పలవలుగా మలుపులు తిరుగుతున్న ఎన్నో కథలు సాహస కృత్యాలతో, స్వార్థత్యాగాలతో కూడుకున్నవి దొర్లిపోయాయి. వాటన్నింటిలోనూ కథానాయకుడు అల్సియన్- అది కృష్ణమూర్తికి మారుపేరు అని కూడా చెప్పాడు. చిక్కగా అల్లుకొని పోయిన యీ కథనమంతా వ్రాతరూపంలోకి మార్చి 'అల్సియన్ జీవితాలు' అనే పుస్తకంగా ప్రచురించాడు. ఈ కథల్లో శ్రీమతి బెసెంట్ మొదలైన దివ్యజ్ఞాన సామాజిక సభ్యులు కూడా దర్శనమిస్తారు. అయితే భూలోకంలోనూ, అనేక యితర గ్రహలోకాల్లోనూ వారు సంచరించినప్పుడు ఆయా చారిత్రక కాలాలకు అనుగుణంగా రకరకాలైన వేరు వేరు రూపాలను వారు తాల్చుతారు. ఒకరోజు ఆరుబయట డాబా మీద యీ పూర్వ 'జీవితాల' ను లెడ్‌బీటరు అందరికీ చదివి వినిపింప జేశాడు. శ్రోతలు వుద్వేగంతో పులకించి పోయారు.

కృష్ణమూర్తికి అతని గతజన్మల పట్టికనొకటి తయారుచేసి యిచ్చాక, లెడ్‌బీటరు అతన్ని అతడు పుట్టిన వాతావరణం నుండి, అతని కుటుంబం నుండి, దివ్యజ్ఞాన సమాజపు ప్రహరీగోడకు బయటవైపు శిథిలావస్థలో వున్నవారి చిన్న యింటి నుండి యీ వైపుకు లాగుకొని రావడానికి శతవిధాలా ప్రయత్నం చేశాడు. తన కొడుకులను మైలాపూరు పాఠశాలకు పంపడం ఆపివేయమని నారాయణయ్యకు నచ్చజెప్పడం లెడ్‌బీటరు ప్రయత్నాల్లో మొదటిది. "బూట్ల తాళ్ళు అమ్ముకోవలసినవాడు వుపాధ్యాయుడై పిల్లలను కొట్టి హింసిస్తున్నాడ"ని అతని వాదం. వారికి చదువు నేర్పడానికి కొందరు పాశ్చాత్య అధ్యాపకులను ఏర్పాటుచేసి, పై నుంచి తాను పర్యవేక్షణ

చేస్తూవుండటం పిల్లలకు మంచిదని నారాయణయ్యను వొప్పించాడు. మగపిల్లలిద్దరికీ కొత్త బట్టలు కుట్టించారు. కొద్ది పింఛనుమీద జీవనం వెళ్ళదీస్తున్న వారి తండ్రి సమకూర్చలేని రకం ఆహారపదార్థాలు వాళ్ళకు తినిపించడం మొదలు పెట్టారు. వారి బ్రాహ్మణ సంస్కారానికి తగినట్లుగా పెంచుకున్న శిఖలు కత్తిరించి వేశారు. జుట్టు భుజాల వరకు పెంచి, వెనక్కు దువ్వి మధ్య పాపిళ్ళు తీయించారు. సైకిళ్ళు ఎక్కి తొక్కడం, ఆటల్లో పాల్గొనడం నేర్పించారు. ప్రతి వుదయమూ వారిని "సరే, రాత్రి మన కార్యక్రమాలను గురించి మీకు ఏవేం గుర్తున్నాయి" అని లెడ్‌బీటరు ప్రశ్నించేవాడు. వాళ్ళు సిగ్గుపడుతూ వచ్చీరాని యింగ్లీషులో సమాధానాలు చెప్తుండేవారు. లెడ్‌బీటరు 'జ్యోతిర్మండలంలో జరిగిన' ఆసక్తికరమైన విషయాలు మరికొన్ని చేరుస్తుండేవాడు.

నవంబరు నెల 1909 సం॥ లో కృష్ణమూర్తికి శ్రీమతి బెసెంటును పరిచయం చేశారు. ఇది జరిగిన ఒక నెల లోపలే ఆమె అతనికీ, నిత్యానందకూ వుపదేశదీక్ష యిచ్చి రహస్యసాధన విభాగం లోనికి ప్రవేశపెట్టింది. ఇది టి ఎస్ (థియొసాఫికల్ సొసైటీ) లోని ఒక అంతరంగి బృందం. ప్రత్యేకంగా ఎంపిక చేయబడిన యీ సభ్యులు ఆమెకు విధేయులుగా వుంటామని ప్రమాణాలు చేయాలి; జగద్గురువు రాక కోసం తమని తాము పూర్తిగా నిర్నిబద్ధంగా అంకితం చేసుకోవాలి. ఈ సిద్ధాంతాన్ని ఒప్పుకోని వారిని- అటువంటి వాళ్ళు చాలా మందే వుండేవారు- క్రింది తరగతిలోనే అంటే శిక్షణ తరగతిలోనే అట్టేపెట్టేసేవారు. దీనితో పాటుగా శ్రీమతి బెసెంటు ఆత్మిక పథము అనే మరొక సిద్ధాంతాన్ని కూడా అమలు చేసింది. ఇందులో అయిదు క్రమానుగత దశలు వుంటాయి. దీక్ష ఆరంభదశనుండి ఔన్నత్య దశవరకు వున్న యీ ప్రధాన కొలమానం మీదే సభ్యుల అర్హత నిర్ణయించబడుతుంది. ఆత్మిక పథంలో ఎవరెవరు ఏఏ ఆధ్యాత్మిక స్థాయిల్లోకి వచ్చారన్నది నిర్ణయించే అధికారం ఆమెకూ, లెడ్‌బీటరుకూ మాత్రమే వున్నది.

లెడ్‌బీటరు యిచ్చిన ఆదేశానుసారం శ్రీమతి బెసెంటు పిల్లలిద్దరూ తన గది పక్కనే వున్న గదిలో నివసించడానికి నారాయణయ్యను ఒప్పించింది. అక్కడ ఆవిడ వారికి యింగ్లీషు పుస్తకాలు చదివి వినిపించేది. వారికి యింగ్లీషులో మాట్లాడటం నేర్పిస్తూవుండేది. మరికొద్ది కాలానికి లెడ్‌బీటరు 'దివ్యశక్తులతో ఒక మహా దర్బారు' ఏర్పాటు చేశాడు. ఆ దర్బారులో దివ్యజ్ఞానంవారి పరమగురువుల్లో ఒకరైన కుతుమి కృష్ణమూర్తిని మైత్రేయభగవానుడి ముందు 'అత్యున్నతమైన యీ సహోదరత్వంలో ప్రవేశం కోసం అర్థిస్తున్న అభ్యర్థి' అంటూ సమర్పించాడు. కుతుమి పరమగురువుగా, లెడ్‌బీటరు, శ్రీమతి బెసెంటు 'వున్నత పథంలో' మార్గదర్శకులుగా కృష్ణమూర్తి

ఆధ్యాత్మిక పథంలో నవ్యారంభకుడైనాడు. శ్రీమతి బెసెంటుకు రాసిన ఒక లేఖలో మార్మికలోకంతో తన పరిచయం గురించి కృష్ణమూర్తి యీ విధంగా వర్ణించాడు :

"అప్పుడు ఆ మహాత్ముడు మొదటిసారిగా నాతో యిట్లా అన్నారు : 'ఈ సహోదరులిద్దరి మీదా నీకు ప్రేమ వున్నదా, వారి మార్గదర్శకత్వాన్ని సంతోషంగా నీవు తలదాల్చుతావా'. నేను వెంటనే సమాధానం యిచ్చాను. 'అవును, నేను హృదయపూర్వకంగా వారిని ప్రేమిస్తున్నాను'. 'అనాది నుండి అనంతం వరకు విస్తరించివున్న యీ సహోదరత్వంలో చేరాలని నీవు అభిలషిస్తున్నావా' అని వారు అడిగారు. 'నేను అర్హుడనైనప్పుడు చేరాలని కోరుకుంటున్నాను' అని నేను చెప్పాను. 'ఈ సహోదరత్వం యొక్క లక్ష్యం ఏమిటో నీకు తెలుసా' అని వారు అడిగారు. 'లోకానికి వుపకారం చేయడం ద్వారా లోగోస్ సంకల్పాన్ని నెరవేర్చడం' అని నేను సమాధానమిచ్చాను. 'నీ జీవితమంతటినీ, నీ శక్తి అంతటినీ యికమీదట యీ పనికోసమే అంకితం చేస్తానని నీ మీద ప్రమాణం తీసుకోగలవా, లోకక్షేమం కోసం నిన్ను నీవు సంపూర్ణంగా మరిచిపోగలవా, ప్రేమ స్వరూపుడైన పరమాత్మవలె నీవూ జీవితాన్ని ప్రేమమయం చేసుకోగలవా' అని అడిగారు. నేను : - 'తప్పక చేస్తాను, పరమ గురువుల సహకారంతో' అని సమాధాన మిచ్చాను. వారు యింకా యీ విధంగా అన్నారు : 'రహస్యంగా వుంచమని నీకు తెలిపిన విషయాలను రహస్యంగా వుంచుతానని వాగ్దానం చేస్తావా'. 'వాగ్దానం చేస్తాను' అని నేను సమాధానమిచ్చాను."

ఈ కార్యక్రమంలో, తన జీవితకాలమంతా స్వేచ్ఛా, అన్వేషణల పక్షం వహించి, వాటి ప్రాధాన్యాన్ని చాటి చెప్పిన కృష్ణమూర్తి పూర్తిగా వాటికి వ్యతిరేకమైన దాసత్వం, గోప్యత అనే వాటికి వాగ్దత్తం కావడం కనబడుతుంది.

ఆ మరుసటి సంవత్సరం ఒక అధ్యయన సంస్థకు అతనిని అధిపతిగా చేశారు. త్వరలోనే అది ఒక అంతర్జాతీయ సంస్థగా ఎదిగింది. దాని పేరు ప్రాచ్యతార (ది ఆర్డర్ ఆఫ్ ది స్టార్ యిన్ ది యీస్ట్'). శ్రీమతి బెసెంటు, లెడ్‌బీటరు అతని చుట్టూ నిర్మిస్తున్న సంపన్న వాతావరణానికి యిది కేంద్ర బిందువు. నూతనమైన వీరి యీ అవతార సంబంధిత విశ్వాసం గురించి ప్రశంసాత్మకమైన వర్ణన చేస్తాడు జార్జి అరండేల్.

'మా నాయకుడు అధిష్ఠించిన స్థాయి మీకు తెలుసా- మా బృందంలోని సభ్యులకు ఆమె, శ్రీ లెడ్‌బీటరు యీ లోకంలో వుండవలసిన జీవితా దర్శాలకు నిదర్శనాలు. వారిని మనం విశ్వసించి, అనుసరించిన కొద్దీ, అంత వేగంగానూ మనమూ అభివృద్ధి సాధించగలుగుతాము, వుత్తమమైన సేవలనూ అందించ గలుగుతాము... ఇప్పుడు మన ప్రపంచం గొప్ప ఆందోళనా కాలాన్ని ఎదు

*ర్కొంటున్నది, యిటువంటి పరిస్థితి వేల సంవత్సరాల కొకసారి మాత్రమే కలుగుతూ వుంటుంది. మన బృందానికి సంబంధించినంత వరకూ మన చుట్టూరా యిప్పుడు- ఆ పరిస్థితుల యొక్క కేంద్రస్థానానికి చేరువయ్యే ఏర్పాట్ల మధ్య వున్నాము. మన సమాజపు అసలైన సభ్యులను నేరుగా వారి దైహికరూపాలలోనే కలిసి మాట్లాడుతున్నాం. రెండు వేల సంవత్సరాల క్రిందట అవుతే వీరిని దేవదూతలని అని వుండేవారు. మనలో ఋషులకు ప్రేమ పాత్రులైన జాన్ మహాత్ముడు మొదలైన వారున్నారు.'*

ఈ అతిశయోక్తుల వ్యవహారం కృష్ణమూర్తి మీద ఏ ప్రభావమూ చూపినట్లు కనపడటం లేదు. వుడ్‌హౌస్ చెప్పినది యిట్లా వున్నది :

*'మేమందరం వయసులో పెద్దవాళ్ళం, విద్యాబోధనలో ప్రత్యేకత సాధించిన వాళ్ళం. యువకులను గురించిన అనుభవం మాకు వుంది. అతనిలో లేశమాత్రమైన గర్వంగాని, భేషజంగాని కనబడి వున్నా, 'పరమ పవిత్ర బాలుడి' ననే వైఖరిగాని, అహంభావంతో కూడిన గొప్పతనం కానీ ప్రదర్శించినా మేము నిస్సందేహంగా దీన్నంతా వ్యతిరేకిస్తూ నిర్ణయం ప్రకటించి వుండేవాళ్ళం.'*

మొత్తం మీద కృష్ణమూర్తి మెత్తని విద్యార్థి; నొప్పించకుండా నడుచుకోవాలని అభిలషించేవాడు; అయితే అతనిలో అందరికీ దూరంగా వుండే స్వభావం వున్నది, చూపుల్లో అస్పష్టత-శూన్యత-వుండేవి. అది చూస్తే లెడ్‌బీటరుకు ఒళ్ళు మండుతుండేది. ఒకసారి కృష్ణమూర్తి నోరు పెద్దగా తెరిచి పెట్టి శూన్యంలోకి చూస్తూ వుంటే, లెడ్‌బీటరు నిగ్రహం కోల్పోయి గట్టిగా ఒక దెబ్బ వేశాడు. ఆ పిల్లవాడిని అదో పెద్ద మలుపు తిప్పింది. ఆపైన లెడ్‌బీటరుతో అతని బాంధవ్యంలో మార్పు వచ్చేసింది. ఇంకెప్పుడూ అట్లా నోరు తెరుచుకొని వుండకుండా చూసుకున్నాడు. అంతకంటె ముఖ్యం - దీర్ఘచింతనతో కూడుకున్న ఒక విశిష్టమైన చేతన అతనిలో చోటుచేసుకుంది. పెద్దవారయాక, పధ్నాలుగేళ్ళ వయసులో వున్న ఆ బాలుడిని గురించి కృష్ణమూర్తి, అతడిది ఖాళీ వ్యక్తిత్వం అనీ, ప్రపంచంవైపు విస్మయంతో చూసేవాడనీ అన్నారు: 'అదంతా అక్కడ వున్నది; సముద్ర తీరం, గవ్వలు, తెప్పకొయ్యలు; అతను, అదంతా.' నిజమైన పారమార్థికునిలో వుండవలసిన సున్నితత్వం లేకపోవడం వలన లెడ్‌బీటర్ ఆ బాలుడిలో వున్న ప్రత్యేకతను కనిపెట్టలేక పోయాడని కృష్ణమూర్తి భావించారు. బహుశ ఆ బాలుడిలో వున్న విశేష తత్వానికున్న కీలకం అసలు యీ అస్పష్టతలోనే వున్నదేమో- అతని చేతనలో విస్తారమైన చోటు, ఒక ఖాళీతనం- దీనినే తరువాత మౌనమైన మనసు అని అన్నారు.

లెడ్‌బీటరు యీ బాలురిద్దరినీ గూఢమైన రహస్య సాధనకు చెందిన కార్యకలాపాల్లో పూర్తిగా మునిగించి, తమ కుటుంబానికీ, తమ సంస్కృతికీ దూరంగా లాక్కుని వెళ్ళిపోవడం నారాయణయ్య వ్యతిరేకించాడు. కొన్ని సంవత్సరాల క్రితం లెడ్‌బీటరు కొని అపకృత్యాలు చేసి, నిందలకు గురికావడం అందరికీ తెలిసిన విషయమే. దరిమిలా రేగిన ఘాటు విమర్శల వల్ల అతడు దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వానికి కొంతకాలం పాటు రాజీనామా యివ్వవలసి వచ్చింది. మద్రాసులోని సనాతనవాదులు కొందరి సహాయంతో నారాయణయ్య శ్రీమతి బెసెంటుమీద దావా వేశాడు. ఆవిడ తనతో చేసుకున్న ఒప్పందాన్ని అతిక్రమించి, పిల్లల్ని మళ్ళీ లెడ్‌బీటర్ శిష్యత్వంలో పడవేసిందనీ, ఆ పాత విషయాలన్నీ తిరగతోడి, ఆరోపణలు చేస్తూ వ్యాజ్యం వేశాడు. తన పిల్లల సంరక్షణ భారం తిరిగి తనకి అప్పగించవలసిందని ఆ దావాలో కోరాడు.

తన పక్షం తరపున శ్రీమతి బెసెంటు తనే ఎంతో అనర్గళంగా వాదించింది. కాని సంరక్షణ విషయంలో దావా ఓడిపోయింది. అయితే లెడ్‌బీటరు మీద చేసిన ఆరోపణలు మాత్రం నిలబడలేక పోయాయి. ఆమె ప్రివీ కౌన్సిల్‌కు అభ్యర్థన పెట్టుకుంది. మరో కొత్త తీర్పు వచ్చేలోగా పిల్లలను యింగ్లండుకు పంపివేసింది. ఈ విధంగా కృష్ణమూర్తి జీవితంలో మొదటి అంకం ముగిసింది. అర్థంలేని, నిలకడలేని చూపులతో 'స్వ' అనే భావం యింకా స్పష్టంగా రూపుదిద్దుకోకుండా వున్న ఒక పసివాడిని అతడి సాంప్రదాయకమైన పరిసరాల నుండి తొలగించి జగద్గురువుగా శిక్షణ గరిపే దశ- అదీ ముగిసిన ఆ అంకం.

ఇక్కడ దాకా వచ్చాక, కృష్ణమూర్తి ఎడల, జగద్గురువు అనే విశ్వాసం ఎడల శ్రీమతి బెసెంటు వైఖరికీ, లెడ్‌బీటర్ వైఖరికీ మధ్యనున్న వ్యత్యాసం తెలుసుకోవడం వుపయోగంగా వుంటుంది. శ్రీమతి బెసెంటు లెడ్‌బీటరును బాగా నమ్మింది; బహిరంగంగా వారి మధ్య ఏ విభేదాలూ పొడమలేదు; అయినా కూడా వారిద్దరూ కృష్ణమూర్తి భూమికను రెండు విభిన్న దృష్టులతో చూశారు.

లెడ్‌బీటరు స్వయంకృషితో పైకి వచ్చినవాడు అని చెప్పుకోవచ్చు; ముఖ్యంగా పంధొమ్మిదో శతాబ్దంలో వున్న అర్థంలో. సామాన్యమైన సామాజిక పరిస్థితుల్లో పుట్టినా మహాశక్తిమంతులుగా పరిణతి చెందిన జాన్ జేమ్స్ ఆడుబన్, సర్‌హెన్రీ స్టాన్లీల లాగానే అతడు కూడా తన జీవితాన్ని గొప్ప భావనా బలంతోను, తగినంత అభినివేశం తోను చక్కగా నిర్మించుకున్నాడు. పంధొమ్మిదో శతాబ్దపు ఆఖరి భాగంలో యూరపు ఖండంలో జీవితాలను కొత్తరకంగా వికసింపచేసుకోవడం అనేది ఒక ప్రత్యేక నైపుణ్యంతో

కూడిన కళగా విలసిల్లింది. ఈ రంగంలో లెడ్‌బీటర్ అపారమైన ప్రావీణ్యం సంపాదించాడు; అవతార పురుషునిగా కృష్ణమూర్తి అనేది అతని అపూర్వ కళాఖండం.

భారత దేశంలో జరుగుతున్న స్వాతంత్ర్య పోరాటపు విశాల రాజకీయ వేదిక మీద పరమోత్సాహంతో కృషిచేస్తున్న శ్రీమతి బెసెంటు బహుళ ప్రజాదరణ పొందిన మహిళ. బెర్నార్డ్‌షా, హెచ్.జి. వెల్స్, మహాత్మా గాంధీలతో సన్నిహితంగా మెలగ గలిగిన స్నేహం ఆమెకి వుండేది. దివ్యజ్ఞాన సమాజం ద్వారా వ్యక్తిగతంగా ఏదో లాభం పొందాలని ఆమె అభిలషించలేదు. కృష్ణమూర్తే కాబోయే జగద్గురువు కనుక అవుతే అతనిని సంరక్షించడానికి, అతనిని విద్యావంతుడిని చేయడానికి, ఒక వున్నతమైన గౌరవస్థానంలో అతనిని నిలబెట్టే మేధాపాటవం, మర్యాదా మన్ననా అతనిలో పెంపొందించడానికి ఆమె తన శాయశక్తులా పాటుపడాలనుకుంది. అతని పట్ల గౌరవం చూపుతూ సంరక్షించే అర్హులైన శిష్యులు అతని చుట్టూ సమకూడాలని ఎంతో ఆరాటపడింది. కృష్ణమూర్తి ఆమెతో విభేదించాడు. అయితే శ్రీమతి బెసెంటులోని నిజాయితీని కాని, తన ఎడల ఆమె మనోభావాల్లోని నిర్మలత్వాన్ని కాని అతడు ఎన్నడూ శంకించలేదు.

లెడ్‌బీటరు తను చేస్తున్న కృత్యాలన్నింటికి, దాదాపు ప్రతిదానికీ కూడా, నమ్మశక్యంగా నంత చిన్న వివరాలతో సహా, "పరమ గురువుల ఆదేశాలు" ఆధారమని అధికార యుక్తంగా చెప్పేవాడు. పరమగురువు కుతుమి అధికారపూర్వకంగా తనకు 'చెప్పినట్లు' అందజేసేవాడు.

> *"వారిని నాగరీకులను చేయాలి; చెమ్చాలు ఫోర్కులు వుపయోగించడం, గోళ్ళకీ, దంతధావ నానికీ బ్రష్షులు వుపయోగించడం నేర్పించాలి; నేల మీద ముడుచుకొని కూర్చోవడం కాకుండా కుర్చీల మీద హాయిగా కూర్చోవడం, కుక్కల్లాగా ఏదో ఒక మూలన జేరకుండా మనుష్యుల్లాగా మంచాలమీద నిద్రించడం నేర్పాలి"*

నాగరకమైన ప్రవర్తన అంటే యూరపియన్ పద్ధతులనీ, యింకా అంతకంటే ఆంగ్ల సమాజంలోని వున్నతవర్గాల వారి రీతులు, మర్యాదలు అనీ యీ ఆదేశాలు సూచిస్తున్నాయి. ఈ మధ్య జరిపిన అధ్యయనాల వల్ల లెడ్‌బీటరు తాను చెప్పుకున్నంత సామాజిక స్థాయికలవాడు కాదని సందేహాలు రేకెత్తినా, ఆ కాలంలో ఎంతో మంది భారతీయులు, అమెరికన్లు, రష్యాకు చెందిన వున్నత కుటుంబాలవారు అతని లాగే యీ ఆంగ్ల సమాజపు పైవర్గాన్ని చాలా గొప్పగా పరిగణించేవారు. అందుకే యీ బాలురను యింగ్లండుకు పంపమని శ్రీమతి బెసెంటును లెడ్‌బీటరు కొంతకాలంగా అర్థిస్తూనే వున్నాడు. నిజానికి అప్పటికింకా వాళ్ళు ఎవరి సంరక్షణలో వుండాలి అనే

ఘర్షణ మొదలవనేలేదు, ఆ కారణంగా వారిని దూరంగా పంపే యీ ఏర్పాటు చేయడానికి. వలస.పాలన జరుగుతున్న ఆ రోజుల ఆదర్శాలను దృష్టిలో పెట్టుకొని యీ అన్నదమ్ములిద్దరి చదువుల కోసం సముచితమైన ఒక ప్రణాళికను సిద్ధం చేశారు. 'ఇంగ్లండులోని గొప్ప విశ్వవిద్యాలయాల్లో ప్రవేశం సంపాదించడానికి తగినట్లుగా ప్రత్యేక అధ్యాపకుల చేత చదువు చెప్పించాలనుకున్నారు. వారి చెవి తమ్మెలకున్న రంధ్రాలను కుట్టించి పూడ్చేశారు. వాళ్ళ పాదాలకు నొప్పి కలిగినా సరే బూట్లు తొడుక్కోవడం అలవాటు చేశారు; మైదానాల్లో పరుగెత్తే వ్యాయామం చేయించారు; వారి జీర్ణశక్తిని బాధించే గుడ్లు, జావ వంటి వుదయపు అల్పాహారాలు తినిపించారు. కెన్సింగ్‌టన్ గార్డెన్స్‌లో గుర్రపుస్వారీలో శిక్షణ, పడవలు నడపడం, సూర్యాస్తమానం అయ్యేవరకు గ్రీష్మఋతువు సాయంకాలాల్లో 'క్రొకె' అనే బంతి ఆటను పచ్చిక బయళ్ళలో ఆడటం మొదలైనవన్నీ నేర్పించారు. నాటకాలకు, క్రికెట్ పోటీలకు, లండన్ జంతు ప్రదర్శనశాలకూ తిప్పి అన్నీ చూపించారు. సెవైల్ రో అనే ప్రఖ్యాత దర్జీల చేత వారి దుస్తులు అతి నవీనమైన తీరులో తయారు చేయించారు. ఒక ఎర్ల్‌గారి భార్య, మరో వైస్రాయిగారి కూతురు వారిని కనిపెట్టివుండి చూసుకునేవారు; సమాజంలోని వున్నత కుటుంబీకులతో పరిచయం కల్పించారు.

కృష్ణమూర్తికి పరిచయం చేసిన ఆ యింగ్లండు సమాజం అప్పుడప్పుడే విక్టోరియన్ జీవితం నుండి బయట పడుతున్నది. రోజు రోజుకీ సంపన్నమవుతూ వుండటం వల్ల సమాజంలోని కట్టడులు సడలి, స్వేచ్ఛా పూరితమూ, ప్రగతి శీలమూ అయి, ఆలోచనా శక్తినీ, మేధనూ పునరుజ్జీవింపచేసే సంస్కృతి నెలకొల్పబడటానికి సాధ్యపడింది. ఒక పక్కన మొదటి ప్రపంచ యుద్ధంలో భయంకరమైన వినాశక శక్తులు పనిచేయడం ఆరంభించినా, మరొక పక్కన 'మానవులు నిజంగానే నాగరికులుగా మారబోయే ఆ చివరి అంచుల్లోకి చేరుకున్నారేమో' ననే భావాలు కూడా వాతావరణంలో చోటు చేసుకుంటున్నాయి. 'స్వతంత్రమైన, హేతుయుక్తమైన, నాగరకమైన, సత్య సౌందర్యాలను అభిలషిస్తున్న' ఒక కొత్త సమాజాన్ని గురించిన ఆశలు కలగడానికి కొంతవరకు సర్వస మానత్వం, అందరకూ న్యాయం అనే సోషలిస్టు-ఆదర్శాల ప్రేరణే కారణం. దీనికి బెర్నార్డు షా, హెచ్.జి.వెల్స్, సిడ్నీ వెబ్, బియాట్రిస్ వెబ్ మొదలైన ఫేబియన్ సమాజపు సభ్యుల రాజకీయ సంబంధిత రచనలు దోహదం చేశాయి. వీరంతా శ్రీమతి బెసెంటుకు మిత్రులే. తత్వవేత్తలు బెర్ట్రాండ్ రసెల్, జి.యి. మూర్‌లు, రచయితలు వర్జీనియా వుల్ఫ్, లియొనార్డ్ వుల్ఫ్‌లు, టి.ఎస్. ఇలియట్, ఇ.ఎమ్. ఫోర్‌స్టర్ మొదలైనవారంతా పాత విక్టోరియాకాలానికి చెందిన సంప్రదాయాలకు కాలం చెల్లిపోయిందని భావించి, వాటిని వ్యతిరేకించ సాగారు. యూరపులోని మరికొన్ని

కేంద్రాల్లో కూడా ఒకప్పుడు పరలోక జీవితం గురించి చింతనలో మునిగివున్న శక్తియుక్తులన్నీ యిప్పుడు సామాజిక నిర్మాణాన్ని మార్చివేసే ఆలోచనల వైపుగా దృష్టి సారించాయి.

తరువాత ఒక తొమ్మిది సంవత్సరాల పాటు కృష్ణమూర్తి యూరపులోనే నివసించినా, యీ నవ్య ఆలోచనా ధోరణుల వుద్యమాలలో అతనికి ఆసక్తి కలగలేదు; సమకాలిక కళా, సాహిత్య వుద్యమాలు కూడా అతన్ని ఆకర్షించలేదు. భావోద్వేగ ప్రభావానికి లోనై తిరుగుబాటుదారులుగా తయారైన తక్కిన విద్యార్థులలాగా కాకుండా కృష్ణమూర్తి కేవలం ఒక ప్రేక్షకుడి లాగే వుండి, మొదటి ప్రపంచ యుద్ధంలో జరుగుతున్న రాక్షసకృత్యాలను, రాబోయే రష్యన్ విప్లవపు విపత్తునూ, నానాజాతి సమితి ఆధ్వర్యంలో శాంతి కోసం, మానవులలో రావలసిన శాంతి కాకుండా- శాంతి అనే ఆదర్శాన్ని తేవడం కోసం పడుతున్న అత్యుత్సాహాన్నీ పరికిస్తూ వుండిపోయాడు.

మొదట్లో కృష్ణమూర్తి లోకమంతా అతని అధ్యాపకుల చుట్టూరా తిరుగుతుండేది. వయసులో పెద్దవారూ, శ్రీమతి బెసెంటుకు, లెడ్‌బీటరుకు సన్నిహితులూ అయిన సి. జినరాజదాస, జార్జి అరండేలు లిద్దరినీ యీ అధ్యాపకత్వానికి నియమించారు. తమ స్వంత వున్నత విద్యాధ్యయనాన్ని ఆపివేసుకొని, కృష్ణమూర్తిని ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయపు ప్రవేశపరీక్షల్లో వుత్తీర్ణుడిని చేయడం కోసం తయారు చేయమని వారిని ఒప్పించడం జరిగింది. మరికొంత కాలానికి వీరి స్థానంలో వరుసగా యితర అధ్యాపకులూ నియమించబడ్డారు కానీ, ఎంత ప్రయాసపడినా ఒక్కరు కూడా కృష్ణమూర్తికి గణితంలో కాని, సిద్ధాంతాల చరిత్ర పుట్టు పూర్వోత్తరాలలో కాని, రాజకీయ శాస్త్రంలో కానీ ఆసక్తి కలిగించలేక పోయారు. అన్ని ప్రయత్నాలూ వ్యర్థమై పోయాయి. ఈ యువ విద్యార్థికి పరీక్ష చదువులకి కావలసిన బుర్ర లేనే లేదు. అంతర్గర్భంలో సృజనాత్మకత మరుగుతున్న యూరపు కానీ, ఆ రోజుల్లో మేధావంతులందరినీ కలచి వేస్తున్న సమస్యలు కానీ అతని మీద ఏ ప్రభావమూ చూపలేక పోయాయి. అతని మనస్సులో యివేవీ నాటుకోలేదు. అయితే రకరకాల భాషలు అతన్ని అలరించేవి, కవిత్వం అంటే మక్కువ చూపేవాడు. ఆక్స్‌ఫర్డులో ప్రవేశం తలకు మించినదై పోవడం వల్ల, అతనిని ఫ్రెంచి భాష, సంగీతం నేర్చుకోమని పారిస్ పంపారు.

చక్కని వస్త్రధారణ, నాగరీకమైన నడవడీతో కృష్ణమూర్తి ఒక నవీన యువకుడిలా చూపరులను ఆకర్షించేవాడు. కొద్దిగా సిగ్గుపడుతూ కనిపించేవాడు. ఏ పని ఒత్తిడీ లేనప్పుడు చిన్నపిల్లవాడిలా సరదాగా అల్లరి చేసేవాడు. బయటకు కనబడే యీ ఆకట్టుకునే గుణం వెనకాల మానవాళి దైన్య పరిస్థితిని పరిశీలిస్తున్న ఒక యువకుడూ వున్నాడు. అతడు ఎన్నో సందేహాలను వెలిబుచ్చుతున్నాడు, ప్రశ్నిస్తున్నాడు. వాటిలో

తనమీద రుద్దబడిన యీ భూమిక గురించీ, దాని చుట్టూరా వున్న ఆడంబరాలను గురించీ, తతంగాలను గురించీ కూడా ప్రశ్నలు వున్నాయి. ఆ రోజులనాటి అతని చిత్రపటం చూస్తుంటే అందగాడైన, మనోహరుడైన ఒక యువకుడు దూరంగా దృష్టిని సారించి చూస్తూ, నిరాసక్తంగా, తను దేనికీ చెందనట్లు కొంచెం అయోమయంగా కనబడతాడు. ప్రపంచంలో తన స్థానం ఏది అని తెలిసిన వ్యక్తిలో వుండే ఆత్మ విశ్వాసం, స్వార్థదృష్టి అతనిలో కనిపించవు.

★ ★ ★

లెడ్‌బీటరన్నా అతని ప్రణాళికలన్నా ప్రతిరోధం చూపడం కృష్ణమూర్తిలో అతని పద్ధెనిమిదో ఏటి నుండీ వ్యక్తమవడం మొదలయింది. ఒక పక్కన అతని తండ్రితో సంరక్షణ బాధ్యతకు సంబంధించిన దావా సాగుతూ వున్నది. లెడ్‌బీటర్‌కు వ్రాసిన ఒక లేఖలో యిట్లా వుంది :

> *"నా వ్యవహారాలన్నీ నేనే స్వయంగా చూసుకునే సమయం వచ్చిందని అనుకుంటున్నాను. పరమగురువుల ఆదేశాలను యితరులు నా మీద బలవంతానరుద్ధి, చీకాకు పెట్టడం కొన్ని సంవత్సరాలుగా జరుగుతున్నది; అంతకంటె నా అంతట నేనే వాటిని స్వీకరించి అమలు చేస్తే, యింతకంటె బాగా చేయగలనని భావిస్తున్నాను... నా బాధ్యతలేమిటి. అన్నది నా అంతట నేను గ్రహించడానికి నాకు అవకాశం యివ్వడం లేదు. చిన్న పాపాయిలా నన్ను అటూ యిటూ ఆడిస్తున్నారు."*

1920 కల్లా మానవ సమస్యలకు దివ్యజ్ఞానం ఏవిధంగా అన్వయిస్తుంది అనే సందేహం కృష్ణమూర్తిలో కలిగింది. గాఢంగా ప్రేమించిన వారిని పోగొట్టుకున్న ఒక పరిచితురాలిని గురించి యీ విధంగా వ్రాశాడు :

"అసలైన పరీక్షా సమయం వచ్చినప్పుడు, దివ్యజ్ఞానం కాని, దానికి సంబంధించిన అసంఖ్యాకమైన గ్రంథాలుకానీ ఏ సహాయమూ చేయలేవు. పరమగురువులను ఆమె భౌతికంగా గాని, మానసికంగా కానీ దర్శించాలనుకుంటున్నది. ఆ. బి చెప్పినా లె.బీ. చెప్పినా ఆమె నమ్మలేక పోతున్నది. నిజం చెప్పాలంటే గత రెండు మూడు సంవత్సరాలుగా మేము (నిత్య, నేను) అనుకుంటున్నట్లుగానే ఆమె భావిస్తున్నది... దివ్యశక్తులను జాగృతం చేయడం, యింకా అటువంటి యితర విషయాల జోలికీ పోవద్దని ఆమెకు నచ్చుజెప్పడానికి ప్రయత్నించాను; కాని ఆమె అదే కావాలని కాంక్షిస్తున్నది."

ఒక దశాబ్దంపాటు జగద్గురువు అవడం కోసం శిక్షణ పొందాడు కృష్ణమూర్తి. అయితే రహస్య, మార్మిక సిద్ధాంతాలతోను, అతీంద్రియ శక్తులతోను నిండి వున్న యీ దివ్య జ్ఞానం 'అత్యంతమైన ఆపత్కర పరిస్థితి' లో వున్న ఆ యువతికి ఏ వుపశమనమూ యివ్వలేదని గ్రహించాడు. అంతకు మునుపు జరిగిన విపత్తు, మళ్ళీ యిప్పుడు మృత్యువు చేసిన యీ ఆఘాతం ఆమెని దారుణంగా బాధిస్తున్నాయి. ఆమెకు ఏ వూరటనూ అందించలేని స్థితిలో కృష్ణమూర్తి అపరిమితమైన ఒంటరితనాన్ని అనుభవించాడు. అయితే లోలోపల ఒక నమ్మకం కలుగుతున్నది- అసలైన మతం అంటే ప్రతి మనిషీ అనుభవిస్తున్న యీ దుఃఖం అనబడేదానిని సూటిగా తాకాలి.

ఈ నమ్మకం సిద్ధాంతాలను కాని, తాత్విక జ్ఞానాన్ని కాని ఆధారంచేసుకొని కలిగినది కాదు; అంతః స్ఫురణతో కూడిన ఎరుక వల్ల కలిగినది, అది ఒక ఒరిపిడిరాయిలా అతని లోపల నిక్షిప్తంగా వుంటూనే వచ్చింది.

యూరపులో తొమ్మిదేళ్ళు గడిపాక తన స్వదేశంలోని ఆచార సంప్రదాయాలతో సంబంధం పూర్తిగా సన్నగిల్లిపోయింది. అయితే దానికి బదులుగా మరొక పాశ్చాత్య సంప్రదాయమూ అతను తలదాల్చలేదు. అతీంద్రియ ప్రపంచం కూడా అతన్ని ఆకర్షించలేదు.

1921 నాటి శీతకాలంలో యిరవై ఆరు సంవత్సరాల వయసులో అతడు ఆస్ట్రేలియా వెళ్తూ భారతదేశంలో కొద్ది రోజులు ఆగాడు. అతనితో పాటు నిత్య కూడా ప్రయాణం చేస్తున్నాడు. అయితే నిత్య ఆరోగ్యం ఏమీ బాగులేదు. క్షయవ్యాధి అతని శరీరాన్ని క్రమంగా క్షీణింపచేస్తున్నది.

ఏటా జరిగే దివ్యజ్ఞాన సమాజంవారి సమావేశాల్లో కృష్ణమూర్తి ప్రసంగించవలసి వున్నది. ఆ సందర్భంలోనే అతడు తన తండ్రిని చూడటానికి వెళ్ళాడు. బహుశ అదే అతను చివరిసారిగా తండ్రిని కలుసుకోవడం. వారి కలయికలో సంతోషం లేదు. అప్పుడు నిజంగా ఏం జరిగింది అనే విషయం తలా ఒక రకంగా చెప్తారు. కృష్ణమూర్తి తండ్రికి సాష్టాంగ నమస్కారం చేశాడు, సాంప్రదాయకమైన రీతిలో. అప్రాచ్యులైన కొడుకుల స్పర్శతో మైలపడ్డానని నారాయణయ్య అనుకున్నాడనే భావం కృష్ణమూర్తికి కలిగింది. పూర్వ చరిత్ర కానీ, ముందుకు సాగవలసిన దిశ కానీ ఏదీ లేని దశలో కృష్ణమూర్తి 1922 ఆరంభంలో, కేలిఫోర్నియాలోని ఒహాయిలో ఏకాంతజీవనం అభిలషించాడు. అక్కడ వాతావరణంలో తేమ వుండదు, ప్రశాంతమైన పరిసరాలలో జనసమ్మర్దానికి దూరంగా వున్న ప్రాంతం. నిత్య ఆరోగ్యం బాగుపడటానికి, కృష్ణమూర్తి అధ్యయనమూ, ధ్యానమూ సాగడానికి అనువైన ప్రదేశం.

అతని జీవితంలోని మహత్వపూర్ణమైన ఘట్టం అట్లా ప్రారంభమయింది. ఒహాయిలోని ఒక పిప్పలి వృక్షపు నీడలో 'మనుష్యుల సంతోషానికి అతీతమైన ఆనందంతో' కూర్చున్న వ్యక్తికీ, యూరపు అంతటా తిప్పుతూ రకరకాల పరీక్షలకు కూర్చోబెట్టినా ఎందులోనూ సఫలత సాధించలేక విసుగెట్టిపోయిన యువకునికీ పోలికే లేదు. మొదట్లో ఆరంభ సంవత్సరాల్లో తన భవిష్యకాలం గురించి అతనికి ఏవయినా అంతర్గతం నుండి సందేశాలు వినిపించి వుండవచ్చేమో కాని యిప్పుడు మాత్రం తన జీవితం ఏ దిశలో సాగాలన్నది గట్టిగా తెలిసిపోయింది. ఇక ఏ సందేహాలూ లేకుండా అతను సాగిపోయాడు.

'నా జీవితాన్ని నడిపించే తాత్వికత ఏమిటి అన్నది యిప్పుడు నాకు తెలియదు. అయితే ముందు ముందు నా తాత్వికత నాకు వుంటుంది... నా అంతట నేను అది తెలుసుకుంటాను. అప్పుడే యితరులకి నేను సహాయపడగలుగుతాను' అని అంతకు ఒక సంవత్సరానికి పూర్వం ఒక స్నేహితునికి వ్రాశాడు. అయితే అతడిని వివశత్వంలో ముంచిన ఆ మహత్వపూర్ణమైన అనుభవం పొందిన తరువాత, అతనిదైన తాత్వికత పూర్తిగా పరిణతి చెందాక కూడా, జీవితం చాలా నిగూఢమైనది, అందులో మన స్థానం ఏమిటి అనేది కనిపెట్టడం ప్రతివారూ తమకు తామే కొత్తగా తెలుసుకోవాలి అనే ఒక గ్రహింపు అతనిలో చిరకాలం వుండిపోయింది.

1922 ఆగస్టుకీ, మార్చి 1923 కీ మధ్యకాలంలో ఏం జరిగింది అన్నదానికి ఆధారాలు మనకి నిత్య వ్రాసి పెట్టుకున్న పుస్తకాల్లోనూ, ఆ యిద్దరు సోదరులూ శ్రీమతి బెసెంటుకు, లెడ్‌బీటరుకు వ్రాసిన వుత్తరాల్లోనూ చాలా వరకు దొరుకుతాయి. అదృశ్య శక్తులు మైత్రేయుడి ఆవాహనకు తన అన్న శరీరాన్ని సిద్ధం చేస్తున్నాయనీ, ఆ పవిత్రకాండను తాను సాక్షిగా తిలకిస్తున్నాననీ నిత్య భావించాడు. 1909 లో లెడ్‌బీటరు చెప్పిన భవిష్యవాణి యిప్పుడు యీ విధంగా ఫలిస్తున్నదని కూడా భావించాడు.

ఆధునికులైన పాఠకులకు ఒహాయిలో జరిగిన యీ పరిణామ ప్రక్రియను అవగాహన చేసుకోవడం అంత సులువు కాదు. దిగ్భ్రాంతిలో మునిగి పోయిన నిత్య లాగే మనం కూడా మునుపు ఎన్నడూ అనుభవంలో లేని యీ సంఘటనలను యోగంతోనో, మహాయాన బౌద్ధంతోనో ముడిపెట్టి, ఆ సంప్రదాయ సంబంధమైన శబ్దజాలం వుపయోగిస్తూ పరికించడం సహజమే. అయితే ప్రస్తుతం యీ సంఘటనల వెనక వున్న పారభౌతికమైన అర్థాలను నిర్ణయించకుండా వుండటమే వుత్తమం. దానికి బదులు కృష్ణమూర్తి జీవితంపై వీటి ప్రభావం, ప్రాధాన్యం ఏమిటి అన్నది గ్రహించడం ముఖ్యం

నిత్య 'ప్రక్రియ' అని పేరు పెట్టినది 1922 నుండి 1923 వరకు మధ్యన వున్న నెలల్లో అప్పుడప్పుడు జరుగుతుండేది. శారీరకంగా చాలా బాధాకరమూ, శ్రమ పూరితమూ అయిన యీ అవస్థలో మధ్య మధ్యన మహా సౌందర్యపు దర్శనం, సుస్పష్టమైన నిర్దుష్టతతో ప్రకాశించే క్షణాలూ కూడా వుండేవి.

ఒహాయి లోయప్రాంతంలో నివసించడం ఆరంభించగానే కృష్ణమూర్తి క్రమంగాను, సునాయాసంగానూ ధ్యానం చేయడం ఆరంభించాడు. అప్పుడు అతని మెడ వెనుక భాగంలో నొప్పి మొదలైంది. తరువాత కొద్ది వారాల్లోనే అది చాలా తీవ్రంగా తయారై, శరీరంలోని యితర భాగాలకు కూడా పాకింది. ఆ నొప్పి ప్రధానంగా వెన్నుపాము పొడుగునా, కనుల వెనకాల, తల శీర్షభాగాన వుండేది.

నొప్పితో అన్న వణికిపోవడం, బాధతో మెలికెలు తిరగడం, తరచు స్పృహ లేకుండా పడిపోవడం నిత్య చూస్తూ కూర్చునేవాడు. రకరకాల కంఠస్వరాలలో మాట్లాడటం కూడా విన్నాడు. ఒక్కొక్కసారి ఒక చిన్న పిల్లవాడు భయంతో వణుకుతున్న గొంతుతో 'కృష్ణ' వెళ్ళిపోతున్నాడు, మళ్ళీ యిక రాడు అని అనడం కూడా విన్నాడు. మరికొన్ని సమయాల్లో 'అభయమిస్తున్న ఒక ఆగంతుకుని' కంఠం కూడా విన్నాడు. నిత్య రాసుకున్న పుస్తకంలో 'అదృశ్యశక్తుల' తో జరిగిన సంభాషణలో యివతల వారు మాట్లాడిన మాటలు వ్రాసివున్నాయి. ఒక్కొక్కసారి యీ కంఠస్వరాలు అస్పష్టంగా అయిపోవడం కూడా నిత్య గమనించేవాడు. మరికొన్ని సార్లు జరిగిపోయిన సంఘటనల్లో కృష్ణమూర్తి మళ్ళీ జీవించడం కూడా నిత్య చూశాడు. తల్లి చనిపోయిన ఘట్టాన్ని, నారాయణయ్య ధోవతి చెంగుతో ముఖం కప్పుకొని ఏడవడం దృశ్యాన్ని కృష్ణమూర్తి వెనక్కు వెళ్ళి చూడటం నిత్య గమనించాడు. అప్పుడు ఆ కంఠస్వరం ఆ వ్యక్తిదిగా మారిపోయేది- ఎప్పుడో మరిచిపోయిన తన మాతృభాషలో ఏడుస్తున్న చిన్న పిల్లవాడిదిగా.

తనకు ఏం జరుగుతున్నదీ అనేది కృష్ణమూర్తి వివరించి చెప్పలేక పోయేవాడు. 'ప్రక్రియ' జరుగుతుంటే మధ్యలో అతను అపస్మారకంగా పడిపోయేవాడు. ఆ తరువాత స్పృహ వచ్చాక ఏం జరిగిందో అతనికి గుర్తుండేది కాదు. అయితే అతడు తన స్వంత మాటల్లో యిదంతా తన చేతనను ఏ విధంగా మార్పు చెందించిందీ సూచన ప్రాయంగా చెప్పడం వ్రాసిపెట్టి వున్నది. 'అసాధారణమైన అనుభవం ఒకటి నాకు జరిగింది' అని అతను చాలా సాధారణంగా రాశాడు శ్రీమతి బెసెంటుకు పంపిన లేఖలో. ఆ వుత్తరంలో యింకా యిట్లా వుంది:

> *"రోడ్డు బాగుచేస్తూ ఒక మనిషి పనిచేస్తున్నాడు, ఆ మనిషిని నేనే. అతని చేతిలో వున్న పలుగును నేనే. అతను పగలకొడుతున్న రాయి సాక్షాత్తూ నాలో*

భాగమే. లేత గడ్డిపోచల్లో వున్నది నా అస్తిత్వమే. ఆ మనిషి పక్కనే వున్న చెట్టే నేను. ఆ రోడ్డు బాగుచేస్తున్న మనిషివీ నావీ మనోభావాలు, ఆలోచనలూ దాదాపుగా ఒక్కటిగా వున్నాయి. చెట్టు మధ్యలో నుండి గాలి వీచడం నన్ను స్పృశిస్తున్నట్లే వుంది. గడ్డిపోచ మీద చీమ పాకడం నేను అనుభూతి చెందుతున్నాను. పక్షులు, ధూళి, ఆ సందడీ అంతా నాలో భాగంగా అనిపిస్తున్నది... నేను ప్రతిదాంట్లోనూ వున్నాను; అది కాదు, నాలోనే ప్రతిదీ వున్నది- ప్రాణరహితమైనవి, ప్రాణం వున్నవీ, పర్వతమూ, చిన్న పురుగూ, గాలి పీల్చే అన్ని ప్రాణులూ నాలోనే వున్నాయి.

ఈ వాక్యాలు 'అక్కడ వున్నదాని'తో అన్యోన్యత చెంది, కరిగిపోయిన ఒక వ్యక్తిత్వాన్ని వర్ణిస్తున్నాయి. కర్త, కర్మ (ద్రష్ట, వస్తువు) కలిసిపోయిన ఒక గాఢమైన సహానుభూతి కృష్ణమూర్తి సహజ స్వభావంలో మొదటి నుంచీ స్థిరంగా వుంటూ వచ్చింది. బాల్యంలో అతనిలో కనబడిన 'ఖాళీతనం' లో దీనిని స్పష్టంగా చూడవచ్చు. అతనిలో సహజసిద్ధంగా వచ్చిన యీ సహానుభూతికీ, దాని సంపూర్ణమైన అభివ్యక్తీకరణ అయిన 'నీవే ప్రపంచం' అనే ప్రవచనానికీ మధ్యన పరిపక్వమైన కృష్ణమూర్తి అంతర్దృష్టి వున్నది. తనలో గాఢంగా, స్థిరంగా వున్నయీ సహానుభూతి సాధారణ మానవుని చేతనావర్తంలో కూడా ఎందుకని ఒక ప్రధానభాగంగా లేదో కృష్ణమూర్తి నేర్చుకోవలసి వచ్చింది. ఈ వాస్తవానికి తగిన ఒక సమాధానాన్ని అతడు కనిపెట్టవలసి వచ్చింది. కృష్ణమూర్తి లేఖలో యింకా యీ విధంగా సమస్తాన్నీ ఆవరించుకొని వున్న ఆ ప్రశాంతతను గురించిన వర్ణన వుంది.

> *"నా లోపల ఒక లోతైన, అగాధమైన కొలనుకు అట్టడుగున వుండే నెమ్మది వున్నది. ఆ కొలనులాగే నా దేహాన్నీ, నా మనసునీ, అందులోని వుద్వేగాలనూ వుపరితలం మీద అలలు అలలుగా కదిలించవచ్చును గానీ, నా ఆత్మలోని నెమ్మదిని మాత్రం ఏదీ- అవును, ఏదీ అలజడి చేసి చెరపలేదు."*

శ్రీమతి బెసెంటు నిరీక్షణకూ, పెట్టుకున్న ఆశలకూ తగినట్లుగా జీవిస్తున్నాననే నమ్మిక అతనిలో పెరుగుతున్నట్లు సూచనలు కనబడతాయి.

> *"నేను కాంతిని దర్శించాను. దుఃఖాన్ని, బాధను నయంచేసి వేసే కారుణ్యాన్ని నేను అందుకున్నాను. ఆ కారుణ్యం నా కోసంగా కాదు, యీ ప్రపంచం కోసం... ఇక మళ్ళీ ఎన్నడూ అంధకారం నన్ను తాకలేదు, మహాద్భుతమైన, స్వాస్థ్యగుణం కల కాంతిని నేను దర్శించాను... ఆనందమూ, అనంత సౌందర్యమూ అనే స్రవంతిలో నేను ఓలలాడాను. దైవత్వం నన్ను పరవశత్వంలో ముంచి వేసింది."*

సుమారుగా యిదే సమయంలో అతడు లెడ్‌బీటరుకు తనను క్షమించమంటూ ఒక లేఖ వ్రాశాడు. అందులో తనను దివ్యజ్ఞానానికి మళ్లీ పూర్తిగా పునరంకితం చేసుకుంటున్నానని, యికమీదట 'పరమగురువులనూ, పరమాత్ముడినీ, సేవించు కొనడమే తన భవిష్యత్ కార్యక్రమమనీ ప్రకటించాడు.

కర్తవ్య పరాయణుడిలాగా యీ విధంగా ప్రకటించినా, తన ఆధ్యాత్మిక అనుభవాన్ని మూలాధారంగా చేసుకొని ఏ ప్రత్యేక మత సంప్రదాయాన్నీ ఆరంభించ లేదు. అంతేకాదు, దినసరి జీవసంతో పొసగని ఒక అలౌకిక స్మృతిగా చేసుకొని అందులో జీవించనూ లేదు. దాని అవశేషమే అతని చేతనలోని 'మౌన స్థలం'. అక్కడే సత్యం ఎడల వుపేక్షతో వుండే వాటినన్నింటినీ వుంచి, పరీక్షించ గలిగేది; ప్రేమ ఎడల తటస్థంగా వుండే వాటిని స్సార్ద్రపరిచేదీ అక్కడే. ఆ నిశ్శబ్దాన్ని రోజువారీ జీవితంతో అన్వయించుకోవచ్చును, మరో లోకంతో కాదు. అది అపగాహనకు తలుపులు తెరచివుంచుతుంది తప్ప, రహస్య శక్తులకోసం కాదు.

ఈ సమయంలోనే, ఎంతో దైహికబాధతోనూ, వ్యక్తిత్వాన్ని ఛిద్రంచేయడంతోనూ కూడుకొని, పరమానందకరమైన దృశ్యాలను, ప్రశాంతపూర్ణమైన కాంతినీ ప్రసాదిస్తూ, 'ప్రక్రియ' నెలల తరబడి కొనసాగుతూ వున్నది. అన్న దమ్ములు ప్రపంచమంతటా పర్యటిస్తూ వుంటే, ఖండాంతరాలలో, మహాసముద్రాలను దాటుతూ అది సాగిపోతూనే వున్నది. తన సోదరుడికి ఏం జరుగుతున్నదో నిత్యకు అర్థంకావడం లేదు. కృష్ణమూర్తికి కూడా తన చేతనావర్తంలో జరుగుతున్న యీ మార్పుల అంతరార్థం ఏమిటో, చివరకు యిది దేనికి దారితీస్తుందో అన్నది అనవగాహంగా వుంది. దివ్యజ్ఞానానికి సంబంధించిన భాషలో చెప్పాలంటే, యీ ప్రక్రియ అతీంద్రియ జ్ఞానాన్ని విస్తృత పరుస్తుందనీ, అతీంద్రియమైన సత్యాలకు 'ప్రత్యక్షబోధ' అనీ అన్నట్లుగా వారి ఆలోచనలు సాగాయి. అయితే అట్లా జరగలేదు. అసలు జరిగిందేమిటంటే, ఆ 'నిశ్శబ్దస్థలం' మరింత గాఢమై, ఒక కాంతిపుంజంగా తెరచుకున్నది. అది ఒక సంఘటన కాదు, కృష్ణమూర్తి స్వతఃసహజంగానే 'ప్రవహించిన' ఒక స్థితి అది.

అన్న పడుతున్న అవస్థ నిత్యలో ఆందోళన రేకెత్తించింది; సలహాల కోసం లెడ్‌బీటరును అర్థించాడు. అయితే లెడ్‌బీటర్ యీ విషయంలో తాటస్థ్యం వహించి నట్లు, అనుమానాలు వెలిబుచ్చుతున్నట్లు నిత్యకు అర్థమైంది. ఆస్ట్రేలియా నుండి రాసిన సమాధానంలో లెడ్‌బీటరు, ప్రస్తుతం కృష్ణమూర్తి 'మూడవ వుపదేశం'లో వుత్తీర్ణుడయాడనీ, అయితే తాను మాత్రం నాల్గవ వుపదేశం ఎప్పుడో దాటేసినట్లూ, పైగా ఒహాయి 'ప్రక్రియ' లాంటి శారీరక దుష్ఫలితాలేవీ తాను పొందనట్లూ వ్యక్త పరచాడు. ఈ జరుగుతున్న మార్పులన్నీ లెడ్‌బీటరునూ కలతపెట్టాయి; 'దుష్టశక్తులు'

ఏదైనా తన మాజీ శిష్యుడిని పట్టుకున్నాయేమోననే అనుమానంతో, దివ్యజ్ఞానంవారి వైద్యుని రహస్యంగా ఒహాయికి పంపించాడు; పరిస్థితిని గురించి తనకు నివేదిక పంపమన్నాడు. దురదృష్టవశాత్తు ఆమె పంపిన నివేదిక మనకు మిగులలేదు.

1925 లో 'పరమగురువులు-మార్గము' అనే గ్రంథాన్ని లెడ్‌బీటర్ ప్రచురించాడు. ఇందులో ప్రధానంగా వున్న ప్రతీక ఆధ్యాత్మిక పథం- యిది ప్రపంచంలో వున్న అన్ని మతాల్లోనూ కనబడుతుంది. అన్నింటికంటె అత్యంత సుందరమైన చిత్రణ బొరుబదుర్ మహాస్తూపం మీద చూడవచ్చు. జీవితమూ, పునర్జన్మ అనే దీర్ఘమైన ఆధ్యాత్మిక పథానికి సంకేతంగా అక్కడ క్రమక్రమంగా అధిరోహణ చేస్తూ, మెలికలు తిరుగుతూ పైకి పోతున్న దారి ఒకటి వుంటుంది. ఈ మార్గానికి మధ్య మధ్యలో శిల్పాలు చెక్కి వుంటాయి. వాటిలో సుబంధు జ్ఞానోదయం (సంబోధి) అందుకోవడానికి చేసిన సుదీర్ఘ ప్రయాణం చెక్కి వుంది. ఆ ప్రాచీన ప్రయాణాన్ని అనుకరిస్తూ యాత్రీకులు శిఖరాగ్రాన్ని చేరుకోవడానికి ఎక్కుతూ వుంటే, బుద్ధుని జీవితం గురించీ, అతను చేసిన సత్క్రియల గురించీ చెక్కిన శిల్పాలు దారి చూపుతుంటాయి. బాధ, విమోచనాలతో కూడుకొనివున్న ఆధ్యాత్మిక పథంలో మార్గదర్శకుల్లా అగపడే బోధిసత్వుల శిల్పాలు మార్గమధ్యంలో దర్శనమిస్తాయి.

భారతీయ తాత్విక సంప్రదాయంలోని శాఖలను రెండు రకాలుగా విభజించ వచ్చును. జ్ఞానోదయం లేక సంబోధి క్రమక్రమంగా జరుగుతుందా లేక హఠాత్తుగా కలుగుతుందా అనేది యీ విభజనకు ఆధారం. నాగార్జునుడు 'లంఘనము' (గెంతు) ను నిర్దేశించిన తాత్వికుడు. అయితే పతంజలి యోగసూత్రాలలో క్రమానుగతమైన మార్గంలో జ్ఞానోదయం సిద్ధిస్తుందని అంటాడు. లెడ్‌బీటరు అధిరోహణంలో నాలుగు దశలను గుర్తించాడు; దివ్యజ్ఞానంవారి యీ సూత్రాన్ని పైన పేర్కొన్న రెండు సంప్రదాయ ధోరణుల మధ్యన నిలబెట్టవచ్చును.

యూరపులో చిన్న చిన్న బృందాలతో సన్నిహితంగా పనిచేస్తూ ఆధ్యాత్మిక అధ్యయనం గురించి చర్చిస్తున్న యువకుడైన కృష్ణమూర్తిని పరికిస్తుంటే ఒకటి స్పష్టమవుతుంది. ఒక ప్రత్యేక మార్గంనుండి అతడు 'లంఘనం' తత్వం వైపు జరిగిపోతున్నట్లుగా కనబడుతుంది. ఇదే అతని భావప్రకృతికీ, మానవుని నిబద్ధస్థితి గురించిన అతని అవగాహనకూ చక్కగా సరిపోతుంది. యువకులైన తన శిష్యులతో నిస్వార్థత, ప్రేమ, సానుభూతుల విలువ గ్రహించమనీ, 'తెలియని దానిలోకి దూకండి... ప్రమాద పూరితంగా జీవించండి..., 'మారడం ఎంతో సులువు', అందులో ఎంతో 'సరదా' వున్నది అనీ వారిని ప్రోత్సాహపరుస్తూ బోధించేవాడు. అత్మ క్రమంగా

పరిణామం చెందుతుందని దివ్యజ్ఞానం హామీ యిస్తుంటే, అప్పటి రోజుల్లోనే కృష్ణమూర్తి తన బోధల్లో ఒక విప్లవం వంటి దానిని లక్ష్యంగా ప్రకటించాడు.

★ ★ ★

ఒక కొత్త తరానికి చెందిన దివ్యజ్ఞాన సామాజికులు, అధికారశ్రేణిలో తమ స్థానాలకోసం వుత్సాహంతో ముందుకొస్తున్నారు. హాలెండులోని హ్యాజెన్‌లో జార్జి అరండేల్ నాయకత్వం వహించాడు. 1925 ఆగస్టులో వారం రోజులపాటు జరిగిన అతి ముఖ్యమైన సమావేశాల్లో అతడు వరుసగా కొన్ని జ్యోతిర్ సందేశాలు 'భూమి మీదకు' తీసుకొచ్చాడు. తననూ, తన సహచరులనూ 'మార్గం' లో ముందుకు తీసుకొని పోవడం కోసమని. ఇంతవరకు శ్రీమతి బెసెంటు, లెడ్‌బీటర్లు మాత్రమే 'నాల్గవ వుపదేశం' దాట గలిగారు. ఇప్పుడు తనకు, లేత వయసులో వున్న తన భార్య రుక్మిణీ దేవికి, కృష్ణమూర్తికి యీ హోదా అనుగ్రహింపబడిందని అరండేల్ ప్రకటించాడు. అంతే కాకుండా మైత్రేయుడు పన్నెండుమందిని ప్రధాన శిష్యులుగా ఎన్నుకున్నాడనీ త్వరలోనే వారి పేర్లను తెలియ పరుస్తారనీ కూడా అన్నాడు.

శ్రీమతి బెసెంటు యిప్పుడు డబ్భయి సంవత్సరాల వృద్ధురాలు. కళ్ళు తిరిగే వేగంతో సాగుతున్న యీ పరిణామాలు ఆమెను సమ్మోహపరిచాయి. హాలెండులో జరిగిన తారక సభలో ప్రధానశిష్యులుగా ఎన్నుకోబడిన ఏడుగురి పేర్లను ఆమె తెలియపరచింది. వారు వెడ్జ్‌వుడ్, లెడ్‌బీటర్, జినరాజదాస, అరండేల్, రుక్మిణీదేవి, ఆస్కార్ కొల్‌స్ట్రామ్, తనూ. పరమాత్మ అవతరించే శుభసందర్భాన్ని కొనియాడుతూ ఒక ప్రపంచ విశ్వవిద్యాలయాన్ని స్థాపిస్తున్నట్లుగా కూడా ప్రకటించింది. దానికి తను ప్రధాన అధ్యక్షులుగా, అరండేల్ ప్రధానోపాధ్యాయులుగా, జేమ్స్ వెడ్జ్‌వుడ్ అధ్యయన శాఖాధ్యక్షులుగా వుంటారని తెలియపరచింది. దూరంగా ఒహాయిలో వున్న కృష్ణమూర్తి యిదంతా నమ్మలేదు. అతనికి యిదంతా అనుమానాస్పదంగా అనిపించింది. నిత్యకు తీవ్రంగా జబ్బు చేయడం వల్ల అతనికి శుశ్రూష చేయడంలో మునిగిపోయి వున్న కృష్ణమూర్తికి, యీ ప్రకటించబడిన 'జ్యోతిర్లోకపు స్థాయి' సంఘటనల్లో తాను పాల్గొన్నట్లుగా గుర్తు లేదు. అరండేల్ తదితరులు వున్నత దశను చేరుకోవడాన్ని అతను రూఢి పరచలేదు. వారిని ప్రధాన శిష్యులుగా కూడా అతను అంగీకరించలేదు.

★ ★ ★

క్షయవ్యాధితో పోరాటంలో ఓడిపోయిన నిత్య నవంబరు 1925 లో ఒహాయిలో మరణించాడు. ఆ సమయంలో కృష్ణమూర్తి భారతదేశానికి వెళ్తున్న ఓడలో ప్రయాణం చేస్తున్నాడు. అడయారులో జరుగబోయే దివ్యజ్ఞానంవారి స్వర్ణోత్సవాల కోసం అతను వెళ్తున్నాడు. ఓడ సూయజ్‌కాలువను సమీపిస్తుండగా, మొదట నిత్య ఆరోగ్య పరిస్థితి

ప్రమాదకరంగా వున్నదని, ఆ తరువాత చనిపోయాడని తంతి ద్వారా వార్తలు వచ్చాయి. నిత్య ప్రాణాలకు భయం లేదనీ, అతను నిర్వర్తించవలసిన పనుల కోసం అతడు తప్పక బ్రతికి వుంటాడనీ నచ్చజెప్పిన తరువాతే కృష్ణమూర్తి స్వర్ణోత్సవాలలో పాల్గొనడానికి బయలుదేరాడు. అంతకు ఒక సంవత్సరం మునుపు ఒక స్వప్నంలో కృష్ణమూర్తి నిత్య ప్రాణాల కోసం అర్థించాడు. ఆ కలలో పరమగురువు మహా చౌహాన్ 'అతను తప్పక బ్రతుకుతాడు' అని హామీ యిచ్చాడు. 1922 లో పొందిన మార్మికమైన అనుభూతులు సోదరులిద్దరినీ మరింత సన్నిహితంగా చేర్చాయి. ఇద్దరిదీ ఒకటే ఆశయంగా అనిపింపజేసింది. నిత్య విషయంలో తనకు కలలో లభించిన హామీ తప్పక నిజమవుతుందని కృష్ణమూర్తి అమాయకంగా ఆశించాడు. ఇప్పుడతని శోకానికి అవధులు లేకుండా పోయాయి. నిత్యవీ, అతనివీ ఒకటే అనుభవాలు, ఒకరంటే ఒకరికి సంపూర్ణమైన అవగాహన; అంత నిర్మలంగా, హాయిగా నిత్యను అతడు ప్రేమించాడు. బాల్యం నుండీ వారి జీవితాలు పరస్పరం పెనవేసుకొని పోయాయి. తమ కుటుంబం నుంచి దూరం కావడం, తము పుట్టిన సంస్కృతిని వదులుకోవడం యిద్దరూ కలిసి అనుభవించారు. ఇద్దరూ కలిసి ఒక విజాతీయ వాతావరణానికి సర్దుకొని పోయారు. ఓడ మద్రాసు సమీపిస్తుండగా కృష్ణమూర్తి ఒక సందేశాత్మకమైన ప్రకటన వ్రాశారు. అందులో అమేయమైన దుఃఖం నిండి వుంది, ఆ దుఃఖాన్ని చల్లార్చడంలోనే అతనికి నూతన శక్తి లభించింది.

> *"పాత స్వప్నం ఒకటి మరణించింది. మరో కొత్తది జన్మిస్తున్నది. ఒక నూతన దర్శనం ఆవిర్భవిస్తున్నది, ఒక కొత్త చేతన వికసిస్తున్నది. నేను ఏడ్చాను, కాని మరెవ్వరూ శోకించకూడదని నేను కోరుకుంటున్నాను."*

నిత్య మరణంతో కృష్ణమూర్తిలో దివ్యజ్ఞాన సమాజం ఎడల విముఖత ఆరంభమైందని యీ విషాదపూరితమైన అడయారు ప్రయాణంలో కృష్ణమూర్తితో పాటు ప్రయాణించిన బి. శివరావు గట్టిగా భావించారు.

> ***అతని జీవితతత్వం సమస్తం- శ్రీమతి బెసెంటు, శ్రీ లెడ్‌బీటర్‌లు చిత్రించిన*** *భవిష్యత్తులో అకుంఠితమైన విశ్వాసం, అందులో నిత్య ప్రధాన పాత్ర- అంతా భగ్నమై పోయింది.*

నిత్య మరణం గుండెలు బ్రద్దలు చేసేలాంటి సంఘటన అని ఒప్పుకోవలసిందే- అది కొంతవరకు నిజమే- అయితే దివ్యజ్ఞానం ఎడల కృష్ణమూర్తిలో అసంతృప్తి కొన్ని సంవత్సరాలుగా మరుగుతునే వున్నది. నిత్య మరణం తరువాత హాలెండులో జరిగిన సంఘటనలు పరిస్థితిని ఒక విపత్కర స్థాయికి తీసుకొచ్చాయి. 1927 లో అతడు యిట్లా వ్రాస్తున్నాడు :

*"నేను స్వంతంగా ఆలోచించడం మొదలు పెట్టినప్పుడు- యిది గత కొన్ని సంవత్సరాలుగా చేస్తూనే వున్నాను- నాలో ఒక తిరుగుబాటు చెలరేగింది. ఏ బోధలు కానీ, ఏ అధిపత్యం కానీ నాకు సంతృప్తిని యివ్వలేదు."*

నిత్య మరణానికి చాలా యేళ్ళకు పూర్వమే యీ తిరుగుబాటు ఆరంభమైంది. ఆధిపత్యం చలాయించడమంటే కృష్ణమూర్తిలో సహజంగానే వున్న రోత, దివ్యజ్ఞాన సమాజం (టి ఎస్) లో ఆధ్యాత్మిక పురోభివృద్ధి విషయంలో సుస్థిరంగా పాతుకొనిపోయిన లెడ్‌బీటర్ మధ్యవర్తి పాత్రా దానిని మరింత ఎగసన దోశాయి.

నిత్య మరణం వల్ల దివ్యజ్ఞానం ఎడల కృష్ణమూర్తిలో కలిగిన అసంతృప్తి స్పష్టంగా విదితమైంది. అడయారులో అందరి మధ్యా సంబంధ బాంధవ్యాలను బాగుపరిచి సరిచేయాలని అనీ బెసెంటు ప్రయత్నించింది. కృష్ణమూర్తి చేతులు పట్టుకొని లెడ్‌బీటరును, అరండేలును, తక్కినవారిని ప్రధాన శిష్యగణంగా పరిగ్రహించ మని మళ్ళీ మళ్ళీ అభ్యర్థించింది. కృష్ణమూర్తి మళ్ళీ రెండోసారి నిరాకరించాడు. ఆ తరువాత పాత మర్రివృక్షం నీడన జరిగిన తారాసంస్థ సభలో ప్రసంగిస్తూ కృష్ణమూర్తి శ్రోతలతో "కావాలనుకున్న వారి కోసం, కోరుకున్నవారి కోసం, కాంక్షించిన వారి కోసం మాత్రమే జగద్గురువు రాబోతున్నాడ" ని అన్నాడు.

*"సానుభూతి కోరుకుంటున్నవారి కోసమూ, సంతోషం కావాలనుకుంటున్న వారి కోసమూ, విముక్తమవాలని కోరుకుంటున్నవారి కోసమూ, అన్నింటా సంతోషం కావాలనుకుంటున్నవారి కోసమూ... వస్తున్నాను తప్ప విచ్ఛిన్నం చేయడానికి కాదు, నిర్మించడానికి వస్తున్నాను."*

జగద్గురువు రాక విషయం కలిగించిన వుద్రేకోత్సాహాలలో శ్రోతలు అసలు విషయం పట్టించుకోలేదు. తమ ఎట్టెదుట వున్న బోధకుడు హఠాత్తుగా కొత్త కొత్త ఆశయాలను ప్రకటిస్తున్నాడు; కొత్త శ్రోతల బృందాలను తయారుచేసుకోవాలని వుత్సాహంతో ఎదురుచూస్తున్నాడని కూడా వారికి తెలియదు. పాత తరానికి చెందిన దివ్యజ్ఞాన సామాజికులు 'మార్గం' లో తమ తమ నిర్దేశ స్థానాల్లో స్థిరంగా కూర్చొని వున్నారు; తమ గత జన్మల గురించీ, యితర లోకాల గురించీ సమాచారం తెలుసు కుంటూ వుండటం వారికి అలవాటై పోయింది. ఇప్పుడు కృష్ణమూర్తి యీ ప్రపంచానికి చెందిన, యీ ప్రస్తుత జీవితానికి చెందిన సమస్యలపై, విషయాలపై కేంద్రీకరించడమే తన పని అని గట్టిగా చెప్తున్నాడు. సమాధానాల కంటె సందేహాలను వెలిబుచ్చడమే ప్రధానం అంటున్నాడు- అసలు మూలంలోనే జరిగిన యీ మార్పుకు అతని శ్రోతలు సిద్ధపడి లేరు.

దివ్యజ్ఞాన బోధనల్లో ప్రతి అంశంతోనూ విభేదించే మరో కొత్త బాటను నిర్మించుకోవడం మొదలుపెట్టారు కృష్ణమూర్తి. పరిణతి చెందిన తన చింతన ద్వారా, ప్రసంగాల ద్వారా, సంభాషణల ద్వారా, రచనల ద్వారా శ్రోతల మనసులను జాగృతం చేయడానికి రకరకాల పద్ధతులు కనిపెట్టారు. సందేహించడం, ప్రశ్నించడమే ఆధ్యాత్మిక విచారణకు సరియైన పద్ధతి అని సూచించారు.

> *"సందేహం అమూల్యామైనది. మనసును అది ప్రక్షాళితం చేసి, స్వచ్ఛ పరుస్తుంది. ప్రశ్నించడమే, మనలో నాటుకున్న సందేహ బీజమే మన అన్వేషణలను సుస్పష్టంగా చేయడానికి సహాయపడుతుంది."*

హృదయాన్ని తెరచివుంచడానికి కూడా యీ బోధనల్లో తక్కువ విలువ ఏమీ యివ్వలేదు. అది సౌందర్య భావంతో ఆరంభమై, జీవితంలోని అద్భుతాలతో, ప్రకృతి వర్ణాలతో జాగృతం చేయబడి, 'స్రోతస్సు' లో దాహం తీర్చుకున్నవారి సమక్షంలో ఆనందించడం జరుగుతుంది.

టి ఎస్‌లో కృష్ణమూర్తి కొత్త బోధలకు వ్యతిరేకత త్వరలోనే బయటపడింది. క్రమంగా ఎక్కువైంది కూడా. శ్రీమతి బెసెంట్ యీ బోధలకు, పరమగురువుల శిష్యత్వానికి నడుమన వారధులు నిర్మించడానికి ఎంతో సాహసంతో ప్రయత్నించింది. చివరకు రహస్య సాధన కార్యక్రమాల శాఖను కూడా అమె మూసివేయించింది. అయినా కూడా కృష్ణమూర్తి పైపై మర్యాదల కోసం రాజీ పడలేదు. ప్రస్తుతం అతడు అన్ని విధాలైన ఆధ్యాత్మిక ఆధిపత్యాలకూ వ్యతిరేకంగా తిరుగుబాటు చేస్తున్నాడు. 1929 లో హాలెండులో జరిగిన తారకసంస్థ సమావేశంలో తారక సంస్థ సభ్యత్వాన్నంతటినీ రద్దు చేసే మహదైక నిర్ణయం తీసుకున్నాడు. అప్పుడే "సత్యం బాటలు లేని సీమ" అని ప్రకటించాడు.

★ ★ ★

1929 కి ఆరు సంవత్సరాల ముందు నుంచీ కృష్ణమూర్తి రచనల్లో అన్వేషణా దీపం అంతర్ముఖంగా తిరిగి, పరిణతి చెందుతున్న అవగాహనపై వెలుగు ప్రసరిస్తూ వుండటం కనబడుతుంది. మొట్టమొదటి రచన అయిన 'మార్గం' అపరిపక్వతతో నిండి, పలుపలు విధాలుగా సాగిపోయే వచన కవిత. ప్రధాన వస్తువు లేకుండా అస్పష్టతతో వున్న యీ రచనలో అలసిపోయిన అన్వేషి కనబడీ కనబడని మార్గంలో పైకి ఎక్కుతూ కనబడతాడు, పరిపూర్ణత్వాన్ని చేరడం కోసం. అతడు ఒంటరి, నిస్సహాయుడు, అనేక పూర్వ జన్మల భారాన్ని మోస్తూ వుంటాడు. అందులోని నాయకుడు తనలో తను అనేక భాగాలుగా ముక్కలైపోయి, మార్పు చెందుతూ వుంటాడు. అల్సియన్ జీవించిన అనేక జన్మలను తన లోపల సమీకరించుకుంటూ

వుంటాడు. 'అన్వేషణ' అనే మరొక రచన కూడా కొంతవరకు ఆత్మకథలాగే వుంటుంది. అందులో మూడు పాత్రలు నేను, నీవు, లోకం మోక్షం కోసం ఆరాటపడుతుంటాయి. ఇందులోని ప్రధాన వస్తువు, రచనాశైలి తెలుసుకోవాలంటే 'జీవనగానం' అనే యీ కవితలో చూడచ్చు :

కాలవేదన వుచ్చులో చిక్కి
ఎదుగు ఎదుగు అన్న లోలోని ఒత్తిడికి అపటినై
సంపూర్ణతే నీవు అయిన
ఓ ప్రియతమా
నీలో ఒక శకలమైన నేను
వెలుగులీనే మహదానందానికి
దారికోసం వెతుకుతున్నా

'సత్ ఆలోచన, సత్ కర్మలతో కూడిన ఒక జన్మ వృధా అయిన వేయి జన్మల కన్న మిన్న' అని 1925 లో ప్రకటించినప్పుడు, అల్సియన్‌ని చివరకు సమాధిలో పూడ్చివేసినట్లుగా అనిపిస్తుంది. 1929 తరువాత అస్పష్టంగాను, ఛాందసంగాను వుండే అల్సియన్ మాటలు, వ్యక్తీకరణ మాయమై తోటి మానవుడి దుఃఖాన్ని కరుణతో కూడిన శ్రద్ధతో వింటున్న అసలైన బోధకుడు ఆ స్థానంలో నిలబడ్డాడు. తరువాత జరిగిన సమావేశాల్లో విశ్వజనీనమైన మానవ సమస్యలను గురించే చర్చించినా, ఒక విధమైన ప్రత్యేకత, అనన్యత్వం వాటిని ఆవరించేవి. అక్కడ పాల్గొనే వారి మధ్యన వున్న అడ్డుగోడలను ఒక అపారమైన నిశ్శబ్దం కరిగించి వేసేది. ఆ విధంగా కృష్ణమూర్తి చెప్పిన 'నీవే ప్రపంచం' అనే మాటలను రూఢీ చేస్తూ.

పరిణతి చెందిన కృష్ణమూర్తి బోధలు 'నీవే నీకు ఒక దీపమై వెలుగు నిచ్చుకో' మన్న బుద్ధుని సూక్తికి ఒక కొత్త ప్రాణశక్తిని యిచ్చాయి. ఈ మాటల్లో మానవాళికంతటికీ ఒక సందేశం పొదిగి వున్నదని అతడు భావించాడు- మీ జీవితాన్ని నడిపిస్తున్న ప్రతిదానినీ ప్రశ్నించండి : మీ గురించి మీరు ఏర్పరచుకున్న మనోబింబాన్ని పరీక్షించండి, మీ అపోహలను వదిలేయండి, మీ బాంధవ్యాలపై శ్రద్ధ చూపండి. ఇందులో వున్న అంతరార్థాన్ని విప్పి చెప్పడానికి కృష్ణమూర్తి ఏ మాత్రం సంకోచించ లేదు- ఆధ్యాత్మిక జీవనంలో ఆధిపత్యం చలాయించడానికి ఎవ్వరికీ హక్కులేదు. మతగ్రంథాలకు లేదు, గురువులకు లేదు; ఆధ్యాత్మిక పురోభివృద్ధికి మధ్య వర్తులు లేరు, అధికార శ్రేణి లేదు. ప్రతి మానవుడూ తన విముక్తిని కొత్తగా కనిపెట్టవలసిందే. జగద్గురువు దారిని పోయే బాటసారి మాత్రమే.

ఆధ్యాత్మిక పరిణామవాదాన్ని ఖండిస్తూ చేసిన విమర్శను కృష్ణమూర్తి యింకా ముందుకు తీసుకొని వెళ్ళారు. ఆధ్యాత్మిక రంగంలో భూతల స్వర్గంలాంటి ఆదర్శాలకు చోటు వున్నదా అని ప్రశ్నించారు. **1933** లో తన శ్రోతలను ఆకాశాన్నంటే 'ఆదర్శాల' ను చిత్రించుకోవద్దని హెచ్చరించారు. ఆ విధంగా, భవిష్యత్తులో యింతకంటె వుత్త మంగా పరిణామం చెందాలనే వృధా ఆశలను పెట్టుకోవద్దనీ, తన బోధలను మరో ఆదర్శంగా చిత్రించుకొని, 'ఆ కొత్త ఆదర్శానికి తగినట్లుగా తనను తాను మలచుకోవాలి' అనే ప్రధమోత్సాహపు ఆలోచనను నిరోధించుకోమనీ అర్థించారు. ఆదర్శాలను చిత్రించుకోవడం సాధారణంగా మనసును మరపింపజూసే ఒక వుపాయం అనీ, యీ విధంగా మనసు బాధ్యతను ఎగవేసెయ్యాలని చూస్తుందని అతడికి తెలుసు.

> *"మీరు కారాగారంలో ఒక బందీ అవుతే, స్వేచ్ఛ అంటే ఏమిటి అని వర్ణించడంలో నేను ఆసక్తి చూపను. ప్రధానంగా నేను అప్పుడు చేసేది ఏమిటంటే ఆ కారాగారాన్ని తయారు చేసిందేమిటో చూపడం, ఆ కారాగారాన్ని పగలగొట్టడం మీ వంతు".*

కారాగారాన్ని కూల్చి వేయడం అంటే ఎక్కువగా బాధతో కూడుకున్నటువంటిదే అయిన, ఎట్ట ఎదుటనే వున్న 'ఉన్నది' తో సూటిగా తలపడటం; ఎక్కడో దూరంగానూ, దాదాపు భ్రాంతి వంటిదీ అయిన 'ఉండవలసినది' ని చేజిక్కించుకోవాలనుకోవడం కాదు.

★ ★ ★

ప్రాచ్య తారక సంస్థను రద్దు చేశాక, యాభై అయిదు సంవత్సరాలు కృష్ణమూర్తి ప్రపంచంలోని నలుమూలలా తిరిగి, జీవితదర్శనం గురించి ప్రవచిస్తూ ప్రయా ణించారు. ఈ కాలంలో అతడు స్థాపించిన ఫౌండేషన్లు అతని ప్రసంగాలను ఏర్పాటు చేయడం, అతని రచనలను ప్రచురించడం, విద్యాలయాలు నడిపించడం, అధ్య యనం, ధ్యానం చేయడానికి సౌకర్యాలు కల్పించడం చేస్తున్నాయి. ప్రతి వ్యక్తీ బోధకుడే- ప్రతి వ్యక్తీ విద్యార్థే, అన్న తన మనోభావాన్ని అతడు చిత్తశుద్ధితో అమలు పరిచారు. అందుకే తనకు ఆధ్యాత్మిక వారసులు లేరన్నారు. ఇతరుల ధార్మికస్థాయిని నిర్ణయించే ఆధిపత్యాన్ని ఎవరికీ యివ్వలేదు.

తన బోధనలు ఒక కొత్త విద్యావిధానం నెలకొల్పడానికి ఆధారంగా వుంటాయని కృష్ణమూర్తి అభిప్రాయపడ్డారు. ఇండియా, యింగ్లాండు, అమెరికాలలో అనేక విద్యాలయాలను స్థాపించారు. ఈ పాఠశాలలన్నీ ప్రకృతి సౌందర్యంతో విలసిల్లుతున్న ప్రాంతాల్లో వున్నాయి. అవి ప్రకృతి మీద ప్రేమనూ, తోటి మానవులంటే అక్కరనూ,

ప్రశ్నించే వైఖరితో జీవితాన్ని ఎదుర్కొనడాన్ని విద్యార్థులలో పెంచి పోషించడానికి కంకణం కట్టుకొన్నాయి.

కృష్ణమూర్తి తన గురించి తానే స్వయంగా యిచ్చిన సమాచారంలో, తనలో జరిగిన వికాసాన్ని అవగాహన చేసుకోవాలంటే ఒక కీలకం తనలో స్వతఃగా వున్న 'అపార నిశ్శబ్దం' అని అన్నారు. ఈ అపారత్వమే తను జన్మించిన మూఢ సంప్రదాయాచారాలనుంచి విముక్తి కలిగించింది; టిఎస్‌లో పొందిన అధివాస్తవికమైన పెంపకపు తీరునుండి నిండుగా, నిష్కల్మషంగా నిర్గమింపజేసింది; ఇంగ్లాండులో విద్యార్థి దశలో వున్నత విద్యలో వుత్తీర్ణత పొంద లేక పోయినప్పుడు తట్టుకొనడానికి అదే సహాయపడింది. అతని బోధనలకు హృదయస్థానంలో వున్న నిశ్శబ్దం అడ్డుగోడలను కరగించి వేసింది.

> *"మీరు ఒక అమెరికనూ కాదు, రష్యనూ, హిందూ, ముస్లిమూ కాదు. మీరంటే యీ పేర్లూ, యీ మాటలూ కాదు. మీరు వేరు. మీరు మానవాళిలో ఒకరు. ఎందుకంటే మీ చేతన, మీ ప్రతిస్పందనలూ, మీ విశ్వాసాలూ, మీ నమ్మకాలు, మీ సిద్ధాంతాలూ, మీ భయాలూ, మీ ఆందోళనలూ, ఒంటరితనం, దుఃఖమూ, సుఖమూ అన్నీ తక్కిన మానవాళికి వున్నటువంటివే. మీరు కనుక మారితే అది మానవాళి నంతటినీ ప్రభావితం చేస్తుంది."*

ఆ అపార నిశ్శబ్దాన్ని, సంవత్సరాల తరబడి పెంచి పోషించి, సంపూర్ణం చేస్తుండటం వల్ల అతని సుదీర్ఘ జీవితం పొడుగునా స్రవించే బ్రహ్మాండమైన విస్తృతత్వాన్ని సంతరించుకున్నది.



పంథొమ్మిదో శతాబ్దపు ఆలోచనలలో లోతుగా పాతుకొనిపోయిన పురోభివృద్ధి భావం డార్విన్ ప్రతిపాదించిన పరిణామవాదాన్ని అతిగా విస్తరించి, దానికి పుట్టుక నిచ్చిన జీవశాస్త్ర రంగాన్నుంచి బయటకు లాక్కొని వచ్చింది. ఆ యుగంలో ప్రతి విషయంలోనూ యీ వుపమానాన్ని ఒక మార్గదర్శకసూత్రంగా తయారు చేసుకున్నారు. ఇప్పుడు నిరాదరించినా ఒకప్పుడు ప్రకృతిలో మానవుడే అత్యున్నత ప్రాణి అనే ఆధిక్యభావం వున్న రోజుల్లో దానిని బలపరచడానికి ఆ పరిణామక్రమ వాదాన్ని వాడుకోవడం జరిగింది. ఆ తరువాత రోజుల్లో సర్వశ్రేష్ఠ అధికార జాతి అనే ఒక దుష్ట సిద్ధాంతం ప్రబలడానికి కూడా దీనిని ఎంచుకున్నారు. వామపక్ష రాజకీయాల్లోని సమాజ సంస్కర్తల్లో అద్భుతమైన ఆదర్శాలతో కూడుకున్న కమ్యూనిస్టు వాదానికి స్ఫూర్తి నిచ్చింది. మరో పక్షపు రాజకీయాల్లోని ఆదర్శవాదులకు ప్రస్తుత ప్రపంచంలోని

అసమానతలను కొనసాగించడానికి 'యోగ్యత గలవారే జీవించగల్గుతారు' అనే సూత్రాన్ని బలపరచే ఒక వుపయుక్తమైన సాధనంగా పనికి వచ్చింది. కృష్ణమూర్తికి తెలిసిన దివ్యజ్ఞానం, అతను పెరిగే వయసులో అతని చుట్టూ వున్న దివ్యజ్ఞానమూ కూడా పరిణామక్రమంలో పురోభివృద్ధి అనే వూహా సూత్రాన్ని అతి విపరీతంగా విస్తరించుకున్నది. ఇప్పుడున్న మానవుని స్థితినుంచి దాటి పైన ఎక్కడో దూరంగా ఆధ్యాత్మికమైన ఔన్నత్యం వున్నదనీ, అదే యికపై భవిష్యత్తులో 'మూలజాతి' అవుతుందనే కథను అల్లింది.

ఇప్పుడు, యిరవయ్యవ శతాబ్దం ఆఖరవుతున్న తరుణంలో పరిణామక్రమంలో పురోభివృద్ధి చెందడం అనే ఆలోచన గాలి తీసేసినట్లుగా నీరసపడిపోయింది. పరిణామ క్రమ వాదపు జీవశాస్త్రజ్ఞుడు అయిన స్టిఫెన్ జే గోల్డ్ ఏ మొహమాటమూ లేకుండా తన భావాలను యిట్లా వ్యక్తపరచాడు :

> *చరిత్ర నడిచిన విధానాన్ని అవగాహన చేసుకోదలిస్తే యీ పురోభివృద్ధి అనే వాదం స్థానంలో మరో కొత్తదానిని కనిపెట్టాలి. ఎందుకంటే యీ పురోభివృద్ధి అనే భావనే చాలా అసహ్యకరమైనది, అది ఆయా సంస్కృతుల్లో నిండా మునిగిపోయివుంటుంది, ఏ విధంగానూ దాన్ని సమర్థించలేము, అమల్లో పెట్టడానికి పనికిరాదు- అసలు అది చాలా మూర్ఖమైన వాదం.*

ఆధ్యాత్మిక రంగంలో పరిణామక్రమ గతమైన పురోభివృద్ధిని గురించి కృష్ణమూర్తి చేసిన విమర్శ చాలా శక్తివంతమైనది, నిరాఘాటమైనది, పరిపూర్ణమైనది. మానవ స్థితిగతులను ప్రత్యక్షంగా పరిశీలించి చేసినది. జీవశాస్త్రంలోను, సామాజిక సంస్కరణలోను, రాజకీయ సంబంధిత ఆర్థిక శాస్త్రంలోను పరిణామక్రమంలో పురోభివృద్ధి అనే సూత్రానికి గల పరిమితుల అవగాహన జరగక ముందే కృష్ణమూర్తి యీ పరిశీలన చేశారు. దివ్యజ్ఞాన సమాజంలో అతని పెంపకపు తీరుపై తిరుగుబాటులో యిది బాగా స్పష్టంగా కనపడుతుంది. కృష్ణమూర్తి జీవన తాత్వికతలో అది సుస్థిరంగా వుండిపోయిన ఒక అంశం.

**రాధికా హెర్జ్‌బర్గర్**

# భయం ఆలోచనల్లో పుట్టి పెరుగుతుంది

ప్రతి విషయంలోనూ ఒక గంభీరమైన దృష్టి వుండటం చాలా మంచిదని నాకనిపిస్తుంది. బరువైన విషయాలు మాట్లాడాలని మనం కూర్చున్నప్పుడు అది మరీ ముఖ్యం. సావధానతతో వుండగలగడం, నిశితంగా చొచ్చుకొనిపోయి చూడగల గుణం, మనలో ప్రతి ఒక్కరికీ వున్న రకరకాల సమస్యలలోకి, ప్రపంచం ఎదుర్కొంటున్న సమస్యల లోనికి లోతుగా విచారణ జరపడం - తప్పకుండా వుండి తీరాలి. పరిశీలించి చూస్తే, యీ దేశంలోనే కాదు, ప్రపంచమంతటా అల్లకల్లోలం వున్నది, విపరీతమైన అస్తవ్యస్త పరిస్థితి వున్నది; ఏ మాత్రం తగ్గుముఖం పట్టని అనేక బాధలను మనిషి యింకా ఎదుర్కొంటునే వున్నాడు. పాశ్చాత్యదేశాలలో గొప్ప సిరిసంపదలు వున్నా అక్కడ అనేక సమస్యలు కూడా వున్నాయి; ఒక ఆర్థిక, సామాజిక రంగాలలోనే కాదు, యింకా అంతకంటె లోలోపలి విషయాల్లో కూడా. అక్కడి యువతీ యువకులు తిరుగుబాటు చేస్తున్నారు. సంప్రదాయాలకు, సమాజపు ఆధిపత్యానికి, ఆ పద్ధతులకు వాళ్ళు తల వొంచడం లేదు.

ఈ దేశానికి వచ్చినప్పుడు- నేను ప్రతి సంవత్సరం యిక్కడికి వస్తుంటాను- అతి వేగంగా దిగజారిపోతున్న స్థితిగతులు, పేదరికం, మనుష్యులంటే ఏమాత్రం కనికరం లేకపోవడం, రాజకీయాలలోని వంచనా శిల్పం, పూర్తిగా అంతర్థానమై పోతున్న ప్రగాఢ ఆధ్యాత్మిక విచారణ, విభిన్న వర్గాల మధ్య ఆటవిక స్థాయిలో కలహాలు, ఏదో ఒక స్వల్ప విషయానికి నిరాహారదీక్షలు పూనడం - యివన్నీ నాకు కనబడుతూ వుంటాయి. మంటల్లో యిల్లు తగలబడి పోతున్నప్పుడు, యింతటి అల్లకల్లోలం వున్నప్పుడు, యింతటి ఘోరమైన స్థితిలో వున్నప్పుడు అల్పాతి అల్పమైన విషయాల కోసం జీవితం అంతా గడిపివేయడం, వాటికోసం హంగామా చేయడం నాయకుల యొక్క- వారు మతాచార్యులు అవచ్చు, రాజకీయ నాయకులవచ్చు- ఆ నాయకుల మానసిక స్థాయిని తెలుపుతుంది.

ఈ వాస్తవాలన్నీ- కేవలం పైకి కనిపించేవే కాకుండా, వ్యవస్థకు సంబంధించిన వాటిని, ఆర్థిక పరమైనవీ, సామాజికపరమైన వాటినే కాకుండా అంతర్గతంగా వున్నవి కూడా పరిశీలించినప్పుడు, పాత సంప్రదాయాలను పట్టుకొని వేలాడటం, పదిమంది చేత ఆమోదించబడిన ఆలోచనా ధోరణులూ, అందరిచేతా వల్లించబడే అసంఖ్యాకమైన ధర్మపన్నాలూ కనబడతాయి. అవి కూడా దాటుకొని యింకా లోపలగా వుండే లోతులలోకి అంతర్ముఖంగా వెళ్ళి కనుక చూస్తే, విపరీతమైన అస్తవ్యస్తస్థితి, పరస్పరవైరుధ్యాలు కూడా మనం చూడచ్చు.

మనం ఏం చెయాలో మనకే తెలియదు. ఒక పుస్తకంలోనుంచి మరో పుస్తకంలోకి, ఒక వేదాంతం నుంచి మరో తత్వానికి, ఒక గురువు దగ్గిం నుంచి మరో గురువు వద్దకు అంతం అనేది లేకుండా వెతుక్కుంటూ పోతూవుంటాం. నిజానికి మనం వెతుకుతున్నది నిర్దుష్టంగా చూడగలగడం కోసం కాదు. అసలు మనసు స్థితి ఏమిటీ అనేది అవగాహన చేసుకోవడానికీ కాదు. మన నుంచి మనమె తప్పించుకొని పారిపోవడానికి మార్గాలకోసం, పద్ధతుల కోసం వెతుక్కుంటూ వుంటాం. ప్రపంచ మంతటా వున్న భిన్న భిన్న మతాలు తప్పించుకొని పారిపోవడం ఎట్లా అనేదే చూపాయి. సుఖాన్నీ, తృప్తినీ యిచ్చే ఒక ఆశ్రయాన్ని కనిపెట్టే ప్రయత్నమే మనకు సంతోషాన్ని కలిగిస్తూవుంటుంది. ఇదంతా పరికించి చూసినప్పుడు- పెరిగిపోతున్న జనాభా, మనుష్యులలో వుండే అతి ఘోరమైన నిర్దాక్షిణ్యాత్మ, యితరుల మనోభావాలను, ఎదుటి వారి జీవితాలను బొత్తిగా లెక్కచేయని నిర్లక్ష్యభావం, సామాజిక నిర్మాణం వున్న తీరుని ఏమాత్రం పట్టించుకోక పోవడమూ చూసినప్పుడు, యిటువంటి అల్లకల్లోలంలోనుండి ఒక క్రమతను తీసుకొని రావడం సాధ్యమేనా అని అనిపిస్తుంది. రాజకీయపరమైన క్రమ వ్యవస్థ కాదు- రాజకీయాలు క్రమతను ఏనాటికీ స్థాపించలేవు. ఒక ఆర్థిక విధానం కానీ, మరో రకమైన సిద్ధాంతం కానీ యీ క్రమతను సాధించలేవు. అయితే మనకి క్రమత అనేది చాలా అవసరం. ఎందుకంటే బాహ్యంగానూ, అంతర్గతంగానూ కూడా చాలా చాలా అస్తవ్యస్త పరిస్థితి వున్నది. దీనిని గురించి మనకి అస్పష్టంగా, ఒక వూహగా కొద్దిగా తెలుసు. సమస్యలు చాలా భయంకరమైనవని మనం అనుకుంటాం. జనాభా విపరీతంగా పెరిగిపోతున్నది. అందుకని, "నేను యీ అల్లకల్లోలపు ఘోరావస్థలో, హింసలో, అవివేకంలో జీవిస్తున్న మనిషిని. నేను ఏం చేయగలుగుతాను?" అని మనల్ని మనమే ప్రశ్నించుకుంటాం. నిజమైన ఆసక్తి మీలో ఏ మాత్రం వున్నా మీకు మీరే యీ ప్రశ్న తప్పక వేసుకొని వుంటారు. "నేను ఒక్కడినీ చేయగలిగింది ఏమిటి" అని నన్ను నేను కనుక గట్టిగా ప్రశ్నించుకుంటే, "ఈ సమాజ వ్యవస్థను అంతర్గతంగానే కాదు, బాహ్యంగా కూడా మార్చడానికి గాని, లేదా సక్రమస్థితిని నెలకొల్పడానికి గాని నేను చేయగలిగింది ఏమీ లేదు" అనే సమాధానం రావడం తథ్యం.

సాధారణంగా "నేను చేయగలిగింది ఏమిటి" అనే ప్రశ్నను మనం వేసుకుంటాం, దానికి "ఏమీ చేయలేను" అనే సమాధానమే ఎప్పుడూ వస్తూ వుంటుంది. ఇక ఇక్కడ ఆగిపోతాం. అయితే యీ సమస్యకు మరింత లోతయిన సమాధానం రావలసిన ఆవశ్యకత వుంది. ఈ సమస్య ఎంత ముఖ్యమైనదంటే దీనికి మనలో ప్రతి ఒక్కరమూ ఒక సంపూర్ణ మానవునిగా ప్రతిస్పందించాలే తప్ప ఒక హిందువుగానో, ఒక బౌద్ధుడిగానో,

ఒక ముస్లింగానో, ఒక పార్శీగానో, ఒక క్రైస్తవునిగానో చెప్పే ఒక నిబద్ధమైన సమాధానంతో కాదు. వారంతా మరణించారు, వెళ్ళిపోయారు, సమాప్తమయినారు. ఆ మాటలకు యిక మీదట ఏ అర్థమూ లేదు. అజ్ఞానాన్ని, అంధ విశ్వాసాన్ని స్వలాభానికి వుపయోగించుకునే ఒక్క రాజకీయనాయకులకి తప్ప. ధర్మశాస్త్రాలు, తత్వవేత్తల బోధలు, మతాచార్యులు జారీ చేసే ఆజ్ఞలు, విధేయతతో అనుష్ఠించి, అనుసరించ వలసిన వారి నియమాలు- ప్రపంచ సమస్యలను గురించిన ఎరుక, చైతన్యం వున్న మనిషికి వాటిల్లో అర్థమేమీ కనబడటం లేదు.

చూడండి, తను యింతకాలం నమ్మినదానిలో మనిషికి విశ్వాసం పోయింది. రాజకీయాల్లో వుపన్యాసకుడి మీద ప్రేక్షకులు చెప్పులూ, రాళ్ళూ విసురుతున్నారంటే ఏమిటో మీకు అర్థమవుతున్నదా? అంటే అర్థం వాళ్ళు ఆ నాయకత్వాన్ని త్రోసి రాజంటున్నారన్నమాట. ఇక మీదట ప్రజలు తాము ఏం చేయాలో మరొకరు చెప్పడం సాగనివ్వరు. మనిషి విపరీతమైన నిస్పృహలో పడిపోయాడు. మానవుడు గజిబిజి స్థితిలో చిక్కుకునిపోయి వున్నాడు. అపరిమితమైన దుఃఖం వుంది. ఏ సిద్ధాంతాలైనా సరే, వామపక్షపువిగాని, మరో పక్షపువి గానీ వాటికి అర్థం లేదు. సిద్ధాంతాలన్నీ మూర్ఖమైనవనే చెప్పాలి. 'ఉన్నది' ఏమిటి అనే అసలైన వాస్తవాన్ని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు అవి ఎంత అర్థంలేనివో తెలుస్తుంది. కాబట్టి నాయకుల ఆధిపత్యమే కాదు, మతాచార్యుడి ఆధిపత్యం, పవిత్రగ్రంథపు ఆధిపత్యం, మతధర్మపు ఆధిపత్యం వేటినీ మనం లక్ష్యపెట్టనక్కరలేదు. సత్యం ఏది అనేది తెలుసుకోవాలంటే వీటిని మనం వుపేక్షించి తీరాలి. అంతేకాకుండా జరిగిపోయినదాని వద్దకు, వెనక్కి మనం వెళ్ళలేము.

మీకు తెలుసు, ఈ దేశంలో భారతీయ వారసత్వం అనీ, ప్రాచీన భారతజాతి అనీ తరచు వింటూవుంటాం. గత కాలం గురించీ, ఒకప్పటి భారతదేశం గురించీ వాళ్ళు తుదీమొదలూ లేకుండా మాట్లాడుతూనే వుంటారు. గతించిపోయిన సంస్కృతుల గురించి మాట్లాడే మనుష్యులకు ఆలోచించే శక్తి తక్కువ. వాళ్ళు జరిగిపోయిన వాటిని, గ్రంథాల్లో వున్న విషయాలను మళ్ళీ మళ్ళీ వల్లె వేస్తూవుంటారు. ఇది ప్రజలను జోకొట్టే మత్తుమందుగా చక్కగా పనిచేస్తుంది. కాబట్టి వాటన్నింటినీ మనం తిరస్కరించాలి. వాటన్నింటినీ శుభ్రంగా వూడ్చి అవతల పారేయచ్చు. పారవేసి తీరాలి. ఎందుకంటే మనకి వున్న సమస్యలు మనల్ని ఆ సమస్యల ఎడల అత్యంతమైన సావధానత్వం, లోతయిన ఆలోచన, విచారణ చూపించమని ఒత్తిడి చేస్తున్నాయి. అంతే తప్ప, ఎవరో ఒకరు వారు ఎంత గొప్పవారయినా సరే, వారు చెప్పినది పునశ్చరణ చేయమని కాదు. కాబట్టి ఒకప్పుడు జరిగిపోయిన విషయాలను, యీ ఘోరమైన

దురవస్థలకు, క్రూరత్వానికి, యీ హింసకు కారణమైన వాటినన్నింటినీ త్రోసిపుచ్చినపుడు- అప్పుడు వాస్తవాలు, నిజంగా 'ఉన్నది' ఏమిటి అన్నవి బాహ్యంగానూ, అంతర్గతంగానూ కూడా మన ఎదురుగా నిలబడతాయి. 'ఉండవలసినది' ఏమిటి అన్నది కాదు; 'ఉండవలసినది' అన్నదానికి అర్థం లేదు.

మీకు తెలుసు, విప్లవాలను, ఫ్రెంచి విప్లవం, రష్యన్ విప్లవం, కమ్యూనిస్టు విప్లవాలను 'ఉండవలసినది' ఏమిటి అన్న సిద్ధాంతం మీద నిర్మించారు. లక్షలాది ప్రజలను హతమార్చాక, సిద్ధాంతాలంటే ప్రజలకి విసుగుపుట్టిందని వాళ్ళు కనిపెడుతున్నారు. కాబట్టి యికపై మీకు సిద్ధాంతవాదులు వుండరు, యికపై మీకు నాయకులు వుండరు; ఇక మీదట మీరు ఏమి చేయాలో చెప్పడానికి ఎవరూ వుండరు. ఇప్పుడు ప్రపంచాన్ని మీకు మీరుగా ఎదుర్కోవాలి, ఒంటరిగా; నిష్క్రియగా కూర్చోడానికి వీల్లేదు. కాబట్టి మన సమస్య బ్రహ్మాండంగా పెరిగిపోయింది, భయంకరంగా తయారయింది. మీరు ఒక మనిషిగా, ఒంటరిగా, మరొకరి నుండి మద్దతు లేకుండా, సమస్యలను గురించి సుస్పష్టంగా ఆలోచించుకోవాలి. ఏ గజిబిజి చిక్కులలో పడకుండా క్రియ ఆచరించాలి. అప్పుడే సిద్ధాంతాల ఎడారిలో మీరు ఒక ఒయాసిస్‌గా అవుతారు. ఒయాసిస్ అంటే ఏమిటో మీకు తెలుసా? ఇసుక, అస్తవ్యస్తత తప్ప మరేమీ లేని మహా విస్తృతమైన ఎడారిలో కొద్దిగా చెట్లు, నీరు, ఒక చిన్న పచ్చికబయలు వున్న స్థలం యిది. మనలో ప్రతి ఒక్కరం ప్రస్తుతం అట్లాగే అయిపోవాలి. మనం వున్న చోటు ఒక ఒయాసిస్‌గా మారాలి. అప్పుడే మనలో ప్రతి ఒక్కరం నిర్దుష్టతతో వుండి, అయోమయంలో పడకుండా. వ్యక్తిగతమైన అభిరుచి ననుసరించకుండా, మన స్వాభావికమైన వుద్వేగాలనో, పరిస్థితుల ప్రాబల్యాన్నో అనుసరించకుండా, స్వేచ్ఛగా వర్తించ కలుగుతాం.

కాబట్టి యీ సమస్య చాలా పెద్దది.దాని నుంచి దూరంగా పారిపోవడం ద్వారా మీరు సమాధానం యివ్వలేరు. అది మీ గుమ్మం ఎదుటే వున్నది. కాబట్టి పరిస్థితిని మీరు గ్రహించి తీరాలి. మీ చుట్టూరా ఒకసారి చూసుకోవాలి. మీరు ఏం చేయాలి అనేది మీరే తెలుసుకొని తీరాలి. ఇప్పుడు మనం అంతా కలిసి చేయబోయేది అదే. మీరు ఏం చేయాలి అనేది యీ వక్త చెప్పబోవడం లేదు. ఎందుకంటే అతనికి ఏ ఆధిపత్యమూ లేదు. ఇది మీరు అర్థం చేసుకోవడం చాలా ముఖ్యం- ఆధ్యాత్మికమైన అధిపత్యాలు అన్నీ ముగిసి పోయాయి- ఎందుకంటే అవి గందరగోళానికీ, అంతులేని క్షోభకూ, సంఘర్షణకు దారితీశాయి. పరమాతి పరమ మూర్ఖులు మాత్రమే వాటిని అనుసరిస్తారు.

కాబట్టి, సమస్తమైన ఆధిపత్యాన్ని త్రోసి వేయగలిగితే, అప్పుడు తరచి చూడటం, అన్వేషించడం ఆరంభించగలుగుతాం. ఈ అన్వేషణ చేయాలంటే మీకు శక్తి వుండాలి. ఒక్క శరీర సంబంధమైన శక్తే కాదు, మానసిక శక్తి కూడా; మెదడు చురుకుగా పనిచేస్తుండాలి; చేసినదే మళ్ళీ మళ్ళీ చేస్తూవుండటం వల్ల మందకొడిగా తయారై వుండకూడదు. ఘర్షణ వున్నప్పుడే శక్తి వృథా అవుతూవుంటుంది. దయచేసి కాస్త యిది గమనించండి. కేవలం ఈ వక్త చెప్పాడు కాబట్టి అంగీకరిస్తే, అప్పుడందులో అర్థమే వుండదు. మనకి కావలసినది స్వేచ్ఛ; ఏదో ఒక రకమైన స్వేచ్ఛకాదు, మానవుడి సంపూర్ణ విముక్తి. కాబట్టి మనకి శక్తి కావాలి. మనలో మనస్తత్వ పరమైన, ఆధ్యాత్మికమైన ఒక గొప్ప విప్లవాన్ని కలిగించడానికే కాకుండా, తరచి శోధించడానికి, పరికించడానికి, క్రియ చేయడానికి కూడా. సంబంధ బాంధవ్యాల్లో ఘర్షణ అనేది వున్నంతవరకు, భార్యా భర్తల మధ్య కానీ, ఒక కులానికీ మరోకులానికీ, ఒక దేశానికీ మరో దేశానికీ మధ్య కానీ, బాహ్యంగా కానీ, అంతర్గతంగా కానీ- ఏ రూపంలోనైనా సరే, ఎంత సూక్ష్మరూపంలోనైనా సరే, సంఘర్షణ వున్నంతకాలం శక్తి వృథా అవడం జరుగుతుంది. స్వేచ్ఛ వున్నప్పుడు శక్తి శిఖరాగ్రస్థాయిలో వుంటుంది.

ఇప్పుడు, యీ ఘర్షణ నుంచి, యీ సంఘర్షణ నుంచి విముక్తి పొందడం ఎట్లా అనేది మనమే శోధించి, అన్వేషించి తెలుసుకుందాం. మీరూ నేనూ కలిసి అన్వేషిస్తూ, శోధిస్తూ, ప్రశ్నిస్తూ యీ ప్రయాణం చేయబోతున్నాం. అనుసరిస్తూ మాత్రం కాదు. తరచి శోధించాలంటే స్వేచ్ఛ వుండితీరాలి. భయం వున్నప్పుడు స్వేచ్ఛ వుండదు. భయం అనే భారాన్ని, బాహ్యంగానే కాదు, అంతర్గతంగా కూడా మనం మోస్తూ వుంటాం. ఉద్యోగం పోతుందేమో, తినడానికి తగినంత ఆహారం వుండదేమో, యిప్పుడు మనం వున్న స్థితిలో నుండి కిందకు పడిపోతామేమో, మనపై అధికారి అసహ్యంగా ప్రవర్తిస్తాడేమో అనేవి బాహ్యంగా వుండే భయాలు. అంతర్గతంగా కూడా ఎన్నో భయాలు వుంటాయి- జీవితంలో మనం ఏమీ సాధించలేదు అనో, విజయం సాధించగలమా అనో భయం; చనిపోవడం అంటే భయం, ఒంటరితనపు భయం; ఇతరుల ప్రేమను పొందలేనేమో అనే భయం, బొత్తిగా తోచకపోవడం అనే భయం, యింకా యిటు వంటివి. కాబట్టి యీ భయం అనేది ఒకటి వున్నది; సమస్యలన్నింటినీ తరచి శోధించి, వాటి నుండి విముక్తి పొందకుండా యీ భయమే నిరోధిస్తున్నది. ఈ భయమే మన లోపలకు లోతుగా తరచి చూసుకోకుండా మనల్ని నిరోధిస్తున్నది.

కాబట్టి మొట్టమొదటి సమస్య, నిజంగా చాలా ప్రధానమైన మన సమస్య ఏమిటంటే భయ భీతినుండి విముక్తి చెందడం. భయం ఏం చేస్తుందో మీకు తెలుసునా? అది మనసును చీకటితో నింపుతుంది. మనసును మందకొడిగా

తయారుచేస్తుంది. భయంలో నుండే హింస బయలు దేరుతుంది. భయంలో నుండే మనకు బొత్తిగా ఏమీ తెలియని ఒక దానిని పూజించడం కూడా ఆరంభమవుతుంది. అందుకని మీరు సిద్ధాంతాలను, కాల్పనిక రూపాలను- యీ కాల్పనిక రూపాలు చేతితో తయారైనవి కావచ్చు, మనసుతో తయారు చేసినవి కావచ్చు- యింకా రకరకాల తాత్విక భావాలనూ కొత్తగా తయారు చేసుకుంటారు. మీలో చాతుర్యం ఎక్కువైన కొద్దీ మీ కంఠ స్వరంలో, మీ హస్తవిన్యాసంలో ఆధిపత్యభావం ఎక్కువవుతూ వుంటుంది. మూర్ఖులు మిమ్మల్ని అనుసరించడం కూడా ఎక్కువవుతూ వుంటుంది. కాబట్టి చాలా ముఖ్యమైన ప్రశ్న ఏమిటంటే భయభీతి నుండి సంపూర్ణమైన విముక్తి పొందడం సాధ్యమేనా అన్నది. దయచేసి మీకు మీరే యీ ప్రశ్న వేసుకోండి, తెలుసుకోండి.

ఈ నాలుగు ప్రసంగాలలో మనం చేయబోతున్నది ఏమిటంటే, ఎడారివంటిదైన, అస్తవ్యస్తంలో వున్న, హింసతో నిండివున్న యీ ప్రపంచంలో నివసిస్తున్న మనిషిలో అతను చేపట్టవలసిన చర్యను మేలు కొల్పడం. అప్పుడే మనలో ప్రతి ఒక్కరం ఒక ఒయాసిస్సుగా మారుతాం. అది ఏమిటో కనుక్కోవాలంటే, ఆ స్పష్టతను, ఆ నిర్దుష్టతను అటుపైన తీసుకొని రావాలంటే, మనసు ఆలోచనలన్నింటినీ అధిగమించి ఆవలగా పోగలగాలంటే, ప్రప్రధమంగా భయాలన్నింటి నుండి విముక్తి పొంది తీరాలి.

మొట్ట మొదటగా భౌతికమైన భయం వున్నది. ఇది జంతు జాతికి స్వభావ సిద్ధమైన ప్రతి స్పందించే గుణం. మనలో వున్నది చాలా వరకు జంతువుల నుండి వారసత్వంగా లభించినదే కాబట్టి మన మెదడు నిర్మాణంలోని చాలా ఎక్కువ భాగం జంతువుల నుండి సంక్రమించినదే. ఇది వైజ్ఞానిక సత్యం. ఇది ఒక సిద్ధాంతం కాదు. ఇది ఒక వాస్తవం. జంతువులలో హింసాత్మకత వుంటుంది. మనుష్యులలోను వుంది. జంతువులకి అత్యాశ ఎక్కువ. వాటికి మెప్పుదల యిష్టం. ముద్దు చేయించు కోవడం మరీ యిష్టం. సుఖంగా వుండటం కోసం ఆరాటపడతాయి. మనుష్యుల్లో కూడా యిదే కనబడుతుంది. జంతువుల్లో తమ స్వంతం చేసుకోవాలనే గుణం, పోటీ తత్వం వున్నాయి. మనుష్యుల్లోనూ అంతే. జంతువులు గుంపులుగా జీవిస్తాయి. మనుష్యులు గూడా ఒక బృందంగా ఏర్పడి పనిచేయాలనుకుంటారు. జంతువుల్లో ఒక సాంఘిక వ్యవస్థవుంది. మనుష్యుల్లోనూ వున్నది. ఇంకా ఎన్నో వివరాలు తెలుసుకోవచ్చును. అయితే జంతువులనుండి సంక్రమించినవి మనలో చాలా వున్నాయని గ్రహించడానికి యివి చాలు.

ఈ జంతు లక్షణాల నుండి మనల్ని విముక్తి చేసుకోవడమే కాకుండా, యింకా ఆవలగా దీనిని మించి పోయి కనిపెట్టడం- కేవలం మాటల్లో శోధించడం కాదు, నిజంగా తెలుసుకోవడం- మనకు సాధ్యమేనా? సమాజం చేసిన, తాను పుట్టి పెరిగిన

సంస్కృతి చేసిన నిబద్ధీకరణాన్ని దాటుకొని మనసు ఆవలగా పోగలదా? పూర్తిగా విభిన్నమైన ఆయత ప్రమాణానికి చెందిన మరొక దానిని తెలుసుకోవాలంటే, అది దర్శించుకోవాలంటే- భయభీతి నుండి విముక్తి చెంది తీరాలి.

స్వీయరక్షణ కోసం జరిగే ప్రతిస్పందన భయపడటం కాదని నిస్సందేహంగా తెలుస్తున్నది కదా. ఆహారం, దుస్తులు, నివాసం మనకి అవసరం- మనందరికీ; ఒక్క సంపన్నులకే కాదు, ఒక్క గొప్పవారికే కాదు. ప్రతి ఒక్కరికీ అవసరమే, దీనికి రాజకీయ వేత్తలు పరిష్కారం చూపలేరు. రాజకీయవేత్తలు ప్రపంచాన్ని ఇండియా మొదలైన దేశాలుగా విభజించారు; ఒక్కొక్క దేశాన్ని ప్రత్యేకంగా ఒక స్వతంత్ర ప్రభుత్వం నడిపిస్తుంది; ఒక ప్రత్యేకమైన సైన్యం వుంటుంది; పైగా జాతీయత గురించిన విషపూరితమైన కట్టుకథలుంటాయి. అసలు రాజకీయ సమస్య ఒకే ఒక్కటి వుంది. అదేమిటంటే- మానవజాతినంతా ఐక్యం చేయడం. మీరు కనుక మీ జాతీయతా భావాలను, దక్షిణాది, వుత్తరాది, తెలుగువారు, తమిళులు, గుజరాతీలు యింకా అవీ యివీ అనే అల్పమైన విభేదాలను పట్టుకొని వేలాడుతుంటే మాత్రం అది జరిగే అవకాశం లేదు- జాతీయవాదం వట్టి మూర్ఖత్వం. సర్! ఇల్లు మంటల్లో కాలిపోతుంటే, ఆర్పడానికి నీళ్ళు తెస్తున్న మనిషిని గురించి మీరు చర్చించరు; యింటికి నిప్పు పెట్టిన మనిషి జుట్టు రంగు ఏమిటి అని ఆలోచించరు. నీళ్ళు మోసుకొని వస్తారు, అంతే. మతాలు మనుష్యుల్ని విభజించినట్లుగానే జాతీయతా భావాలు మనిషి నుండి మనిషిని విడదీశాయి; ఈ జాతీయ తత్వం, మతసంబంధమైన విశ్వాసాలు మానవజాతిని విడదీశాయి; ఒక మనిషికి ప్రతికూలంగా మరో మనిషిని నిలబెట్టాయి. ఇదంతా ఎందుకు జరిగిందో మనం గ్రహించవచ్చు. ఎందుకంటే మన స్వంతదైన ఒక చిన్న మురికిగుంటలో నివసించడమే మనందరికీ యిష్టం కనుక.

కాబట్టి మనిషి భయాన్ని తొలగించుకోవాలి. అయితే అది చేయడం చాలా కష్టసాధ్యమైన సంగతి. మనలో చాలా మందికి మనం భయపడుతున్నామనే ఎరుక వుండదు. దేనిని గురించి భయపడుతున్నామనేది కూడా మనకు తెలియదు. దేనిని గురించి భయపడుతున్నామనేది ఒకవేళ తెలిసినా యిక ఆ తరువాత ఏం చేయాలన్నది తెలియదు. అందుకని దాని నుండి పారిపోతాం. సర్! మీకు అర్థం అవుతున్నదా? నిజంగా మనం ఏమిటో దానినుండి తప్పించుకొని పారిపోతూవుంటాం,అదే భయం. దేని వద్దకైతే మనం పారిపోతామో అది మన భయాన్ని యింకా ఎక్కువ చేస్తుంది. దురదృష్టవశాత్తు వలలాగా అల్లుకు పోయిన రకరకాల పలాయన మార్గాలను మనం తయారుచేసి పెట్టుకున్నాం. కాబట్టి మనకి వున్న భయాలను గురించే కాకుండా, పారిపోవడం కోసం తయారు చేసి పెట్టుకున్న వల అల్లికల వంటి వ్యూహం గురించి కూడా మనం ఎరుక కలిగివుండాలి.

సరే, భయం అనేది ఎట్లా వునికిలోకి వస్తున్నది? ఏదో ఒక దానిని గురించి మీరు భయపడుతుంటారు- చావు అంటే భయం, భార్య అంటేనో భర్త అంటేనో భయం, వుద్యోగం పోతుందేమోనని భయం. ఇంకా ఎన్నో యిటువంటి భయాలు. ఇప్పుడు మీ భయాల్లో ఏదో ఒకదాన్ని తీసుకోండి. ఆ భయాన్నిస్పృహలోకి తెచ్చుకోండి; అది ఎట్లా వునికిలోకి వస్తున్నది, దానిని గురించి మనం ఏం చేయగలం, దానిని సంపూర్ణంగా పరిష్కరించడం ఎట్లా అనేవి పరిశీలించడం మొదలు పెడదాం. మీకూ యీ వక్తకూ మధ్య అప్పుడు ఒక సత్‌సంబంధాన్ని స్థాపించగలుగుతాం. ఇది సామూహిక మనస్తత్వ పరిశీలన కాదు. సమూహం మొత్తం కలసి చేసే స్వీయ మానసిక విశ్లేషణా కాదు. మనందరమూ కలసి ఎదుర్కోవలసిన కొన్ని వాస్తవాల లోనికి చేసే ఒక అన్వేషణ యిది. భయం అన్నది- రేపటి రోజు అంటే భయం, వుద్యోగం పోతుందనే భయం, మరణం అంటే భయం, జబ్బు చేస్తుందనే భయం, నొప్పి అంటే భయం- ఎట్లా కలుగుతున్నది? భయం అనగానే అందులో భవిష్యత్తుని గురించి కాని గతాన్ని గురించి కాని ఒక ఆలోచనా ప్రక్రియ వుంటుంది. నాకు మర్నాటిని గురించి భయం, ఏమి అవబోతుందో అన్నదానిని గురించి భయం; నాకు చావు అంటే భయం; అది యింకా చాలా దూరంలో వుంది, అయినా నాకు భయమే. సరే, భయాన్ని కలిగించేది ఏది? భయం ఎప్పుడూ మరొకదాని కారణంగా వునికిలోకి వస్తుంది. ఆ మరొక దానితో సంబంధం లేకుండా భయమే వుండదు. కాబట్టి మనకు రేపు అంటే భయం, లేదూ జరిగిపోయినది అంటేనో, జరగబోయేది అంటేనో భయం. ఈ భయాన్ని తీసుకొచ్చింది ఏది? అది ఆలోచన కాదూ? రేపు నా వుద్యోగం పోవచ్చేమోనని నేను ఆలోచిస్తుంటాను; అందువల్ల నేను భయపడతాను. నేను చనిపోవచ్చు, చనిపోవడం నాకు యిష్టం లేదు. నా జీవితకాలమంతా నికృష్టమైన, ఘోరమైన, వికృతమైన, క్రూరమైన బ్రతుకును, ఏ భావస్పందనలూ లేకుండా మొద్దుబారి పోయిన బ్రతుకునే గడిపాను, అయినా సరే, నేను చావడానికి యిష్టపడను; భవిష్యత్తు అంటే మరణం అని నా ఆలోచన చిత్రిస్తుంది; నేనేమో దానిని చూసి భయపడతాను.

ఇదంతా మీరు అర్థం చేసుకుంటున్నారా? దయచేసి మాటలను మాత్రమే అంగీకరించి వూరుకోకండి. వట్టి మాటల శబ్దాన్ని మాత్రమే ఆలకించకండి. ఇది మీ సమస్య కాబట్టి మీరు వినండి. ఇది మీ దైనందిన సమస్య, మీరు నిద్రపోతున్నా, మేలుకొని వున్నా వుండేది- ఈ భయం అనే విషయం. ఇది మీరే పరిష్కరించుకోవాలి. మరొకరెవరో వచ్చి పరిష్కరించి పెట్టరు. మంత్రాలు కాని, ధ్యానం కాని, దేవుడు కాని, మత గురువు కాని, ప్రభుత్వం కాని, మానసిక విశ్లేషకుడు గాని- ఎవ్వరూ దీనిని మీ కోసం పరిష్కరించిపెట్ట బోవడం లేదు. కాబట్టి దీనిని మీరే అవగాహన చేసుకోవాలి,

దీనిని అధిగమించి ఆవలగా పోవాలి. అందుకని దయచేసి వినండి. మీ జిత్తులమారి మనసుతో కాదు; "నేను వింటాను, నాకు యింతకు ముందే తెలిసిన దానితోనో, యింతకు ముందు విన్న వాటితోనో యితను చెప్పేది పోల్చి చూస్తాను" అని అనకండి; అంటే అర్థం మీరు వినడం లేదన్నమాట. వినడం అంటే మీ సంపూర్ణమైన ధ్యాసను అంటే సావధానతను యివ్వాలి. సంపూర్ణమైన సావధానం యివ్వడం అంటే శ్రద్ధ చూపడం. వాత్సల్యం వున్నప్పుడే, ప్రేమ వున్నప్పుడే మీకు సావధానత్వం కూడా వుంటుంది- అంటే అర్థం యీ భయం అనే సమస్యను మీరు పరిష్కరించుకోవాలని కోరుతున్నారు అని. అది పరిష్కరించుకున్నప్పుడు ఒక మనిషిగా, చెడిపోతున్న యీ ప్రపంచంలో ఒక ఒయాసిస్సును సృష్టించే స్వేచ్ఛామానవునిగా మీరు తయారవుతారు.

కాబట్టి ఆలోచన భయానికి జన్మనిచ్చి పోషిస్తుంది. నా వుద్యోగం పోగొట్టుకోవడం గురించో, నా వుద్యోగం పోతుందేమో అన్నదాన్ని గురించో నేను ఆలోచిస్తాను. ఈ ఆలోచన భయాన్ని సృష్టిస్తుంది. కాబట్టి ఆలోచన ఎప్పుడూ కాలంతో కలిపి తన్ను తాను ప్రదర్శించుకుంటుంది. ఎందుకంటే ఆలోచన అంటేనే కాలం. నాకు మునుపు వచ్చిన వ్యాధి గురించి నేను ఆలోచిస్తాను. నాకు బాధ అంటే యిష్టం లేదు, బాధ మళ్ళీ తిరిగి వస్తుందని నేను భయపడతాను. నాకు బాధ అనే ఒక అనుభవం జరిగింది; దానిని గురించి ఆలోచించడం, అది నాకు రాకూడదని కోరుకోవడం భయాన్ని సృష్టిస్తాయి. భయానికీ సుఖానికీ చాలా సన్నిహిత సంబంధం వుంది. మనలో చాలా మందిని సుఖమే నడిపిస్తుంది. జంతువులకి లాగే మనకి కూడా సుఖం చాలా ప్రధానమైనది. ఈ సుఖం అనేది ఆలోచనలోని భాగమే. మనకు సుఖం కలిగించిన ఒకదానిని గురించి ఆలోచించడంవల్ల ఆ సంతోషం లేదా ఆ సుఖం మరికాస్త ఎక్కువవుతుంది. అవును కదూ? ఇదంతా మీరు గమనించలేదూ? ఒక సంతోషకరమైన అనుభవం మీకు కలుగుతుంది- అందమైన ఒక సూర్యాస్తమయం లేదూ సెక్స్- దానిని గురించి మీరు ఆలోచిస్తారు. దానిని గురించి ఆలోచించడం వల్ల (సుఖం) ఎక్కువవుతుంది. ఒకప్పుడు మీకు కలిగిన బాధను గురించి ఆలోచించడం భయాన్ని పుట్టించినట్లుగానే యిదీ. కాబట్టి ఆలోచనే సుఖాన్నీ, భయాన్నీ సృష్టిస్తున్నది. అవును కదూ? సుఖం కావాలని, ఆ సుఖం యింకా కొనసాగాలని ఒత్తిడి జరగడానికి ఆలోచనే కారణం; భయాన్ని పుట్టించడంలో భయభీతిని కలిగించడంలో బాధ్యత ఆలోచనదే. మనంతట మనమే యిది చూడవచ్చు. ఇది నిజంగానే ప్రయోగం జరిపి తెలుసుకున్న వాస్తవం.

ఇప్పుడు, "సుఖం గురించి కాని, బాధ గురించి కాని ఆలోచించకుండా వుండటం సాధ్యమేనా? ఆలోచన యొక్క అవశ్యకత లేనప్పుడు కాకుండా ఆలోచన

ఆవశ్యకమైనప్పుడు మాత్రమే ఆలోచించడం సాధ్యమేనా?" అని మిమ్మల్ని మీరే ప్రశ్నించుకుంటారు. సర్! ఒక కార్యాలయంలో మీరు వుద్యోగం చేస్తున్నప్పుడు, ఒక ప్రత్యేకమైన పనిని నిర్వహిస్తున్నప్పుడు ఆలోచన అవసరం; అది లేకపోతే మీరు ఏ పనీ చేయలేరు. వుపన్యసిస్తున్నప్పుడు, వ్రాస్తున్నప్పుడు, సంభాషణ జరుపుతున్నప్పుడు, మీరు మీ కార్యాలయానికి వెళ్ళినప్పుడు ఆలోచన అవసరం. అక్కడ అది ఖచ్చితంగాను, నిష్పక్షపాతంగాను వుండాలి. అక్కడ మన అభిరుచి, మన స్వభావలక్షణం ఆలోచనను నడిపించకూడదు. అయితే యితర కార్యకలాపాలకు ఆలోచన అవసరం వున్నదా?

దయచేసి దీనిని అర్థం చేసుకోండి. ఆలోచన మనకు చాలా ముఖ్యమైనది; మనకు వున్న ఒకే ఒక పనిముట్టు అదే. స్మృతి ప్రతి స్పందించడమే ఆలోచన. స్మృతి అంటే అనుభవం ద్వారా, జ్ఞానం ద్వారా, సంప్రదాయం ద్వారా పోగుచేసుకున్నది. స్మృతికి కారణమైనది కాలం; స్మృతి జంతువుల నుండి సంక్రమించినది. ఈ నేపథ్యంలో మనం ప్రతి స్పందిస్తూ వుంటాం. ఈ ప్రతిస్పందనే ఆలోచన. కొన్ని కొన్ని రంగాలలో ఆలోచన ఆవశ్యకత వుంది. అయితే ఆలోచన భవిష్యత్తుగానూ, గతంగానూ తనని తాను మానసికమైన స్థాయిలో ప్రదర్శించుకున్నప్పుడు, అప్పుడు ఆలోచన భయాన్నీ, సుఖాన్నీ కూడా సృష్టిస్తుంది. ఈ విధానంలో మనసు మొద్దుబారిపోతుంది. కాబట్టి క్రియ లేని జడత్వం తధ్యం. సర్! ఆలోచన వల్లనే భయం కలుగుతున్నది. ఉద్యోగం పోతుందేమోనని ఆలోచించడం, నా భార్య మరొకరితో కలిసి పారిపోతుందేమోనని ఆలోచించడం, మరణం గురించి, జరిగిపోయిన దానిని గురించీ ఆలోచించడం మొదలైనవి. ఆలోచన గతాన్ని గురించిగానీ, భవిష్యత్తును గురించి గానీ ఒక మనోతత్వంగానో స్వీయ రక్షణ కోసమో ఆలోచించడం మానెయ్యగలదా?

మీకు యీ ప్రశ్న అర్థం అవుతున్నదా? చూడండి, మనస్సు- అందులోనే మెదడు కూడా వున్నది- తానే భయాన్ని తయారు చేయగలదు, దానిని తట్టుకోనూ గలదు. భయాన్ని తట్టు కోవడం అంటే దానిని అణచివేయడం, క్రమశిక్షణలో పెట్టడం, అదుపులో పెట్టడం, దానిని కొంత మార్చివేసి మరో పేరు పెట్టడం అనమాట. అయితే యిదంతా వుంటే ఘర్షణ వుంటుంది, వుండదూ? నేను భయపడుతున్నప్పుడు, "దీనిని అదుపులో పెట్టాలి, దీని వద్ద నుంచి పారిపోవాలి, దీనికి దూరంగా వెళ్ళిపోవాలి" అని నాలో నేనే అనుకుంటాను- దీనంతటికీ అర్థం సంఘర్షణ వున్నదని; వున్నది కదూ? ఈ సంఘర్షణ వలన శక్తి వృధా అవుతుంది. అయితే భయం ఎట్లా పుడుతుందో నేను అవగాహన చేసుకుంటే, అప్పుడు దానితో నేను తలపడగలను. ఆలోచన భయాన్ని ఎట్లా సృష్టిస్తున్నదో నేను చూశాను. అందుకని, "ఆలోచన ఆగిపోవడం సాధ్యమేనా,

లేకపోతే భయం అట్లాగే కొనసాగుతుంది కదా?" అని నన్ను నేను ప్రశ్నించుకుంటాను. ఆ తరువాత, "ఎందుకు నేను భవిష్యత్తును గురించి ఆలోచిస్తాను? రేపును గురించి ఎందుకు ఆలోచిస్తాను?" అనో, "ఎందుకు నిన్న పడిన బాధను గురించో, నిన్నటి సుఖాన్ని గురించో నేను ఆలోచిస్తాను?" అనో నన్ను నేను ప్రశ్నించుకుంటాను.

దయచేసి నెమ్మదిగా వినండి; ఆలోచన భయాన్ని సృష్టిస్తుందని మనకు తెలుసు. ఆలోచన విధుల్లో ఒకటి ఏమిటంటే నిరంతరం వ్యాపకంతో వుండటం, ఏదో ఒక దానిని గురించి ఆలోచిస్తూ వుండటం. ఒక గృహిణి ఆహారాన్ని గురించి, పిల్లలు, బట్టలుతకడం- ఇవన్నీ ఆమె వ్యాపకాలు- వీటిని గురించే ఎప్పుడూ ఆలోచిస్తున్నట్లు. ఆ వ్యాపకాలు తీసివేయండి, ఆమె అయోమయంలో పడిపోతుంది, పూర్తిగా సుఖశాంతులు కోల్పోయి, ఒంటరి తనంతో బాధపడుతుంది. దేవుడిని పూజించే మనిషి వద్ద నుండి, దైవభక్తితో పూర్తిగా నిండిపోయిన మనిషి వద్ద నుండి దేవుడిని తీసెయ్యండి; అతను పూర్తిగా అయోమయంలో పడిపోతాడు. కాబట్టి ఆలోచన ఏదో ఒక దానిని గురించిన వ్యాపకంతో వుండాలి. అది తనని గురించి కానివ్వండి, రాజకీయాల గురించి కానివ్వండి; ఒక విభిన్నమైన ప్రపంచాన్ని, ఒక కొత్త సిద్ధాంతాన్ని తయారుచేయడం ఎట్లా అనేదానితోకాని, మరొకదానితో కాని, ఈ మనసుకి వ్యాపకం వుండాలి మనలో చాలా మందిమి వ్యాపకం వుండాలనే కోరుకుంటాం. లేకపోతే అయోమయంలో పడిపోతాం; లేకపోతే ఏం చేయాలో మనకి తోచదు, ఒంటరిగా వున్నట్లు అనిపిస్తుంది, నిజంగా మనం ఏమిటో అది ఎదురుగా నిలబడి మనల్ని నిలదీస్తుంది. అర్థం అయిందా? అందువల్ల మీరు వ్యాపకంలో వుంటారు, ఆలోచన వ్యాపకాన్ని పెట్టుకుంటుంది- ఇది మీ వైపుకి మీరు, యదార్థంగా మీరు ఏమిటో దాని వైపుకి చూసుకోకుండా మిమ్మల్ని నిరోధిస్తుంది.

ఒక విభిన్నమైన ప్రపంచాన్ని, ఒక విభిన్నమైన సాంఘిక క్రమాన్ని తీసుకొని రావాలని మనం అపేక్షిస్తున్నాం. మన అక్కర మత విశ్వాసాలను గురించి కాని, అంధాచారాలను గురించి కాని, మూఢ నమ్మకాలను గురించి కానీ కాదు. నిజమైన మతం అంటే ఏది అనే దాన్ని గురించి. అది తెలుసుకోవాలంటే భయం వుండకూడదు. ఆలోచనే భయానికి ఆలవాలమని, ఆలోచనకు ఏదో ఒక వ్యాపకం వుండాలని, లేని పక్షంలో తాను అయోమయంలో వున్నట్లుగా అనుకుంటుందని మనం గ్రహించాం. దేవుడు అనే వ్యాపకాన్ని, సంఘసంస్కరణ మొదలైనవీ వ్యాపకాలుగా పెట్టుకోవడానికి ఒక కారణం ఏమిటంటే ఒంటరిగా వుండాలంటే మనకి భయం కనుక; మన లోపల ఖాళీగా వుంటే మనం భయపడతాం కనుక. ప్రపంచమంటే ఏమిటో మనకి తెలుసు: క్రూరత్వం, వికృతత్వం, హింస, యుద్ధాలు, వైషమ్యాలు, వర్గ, జాతి విభేదాలు

మొదలైనవి గల ప్రపంచం యిది. ప్రపంచం ఏమిటో- అది యిట్లా వుండాలి అని మనం వూహించేది కాదు- యదార్ధంగా ఏమిటో తెలుసుకున్నాక, దానిలో ఒక సమూలమైన పరివర్తన తీసుకొనిరావడమే మన బాధ్యత. ఆ పరివర్తన తీసుకొని రావాలంటే మనిషి మెదడులో బ్రహ్మాండమైన మ్యుటేషన్ అంటే వుత్పరివర్తనం జరగాలి; అయితే ఏ విధమైన భయం వున్నా యీ పరివర్తన జరగదు.

అందువల్ల, 'మనం పూర్తిగా, పరిపూర్ణంగా జీవించడానికిగాను ఆలోచనను అంతమొనరించడం సాధ్యమా' అని మనల్ని మనమే ప్రశ్నించుకుంటాం. మీ రెప్పుడైనా గమనించారా, సంపూర్ణమైన సావధానంతో మీరు వున్నప్పుడు, మీ ధ్యాసనంతా పరిపూర్ణంగా ఒకదానికి యిచ్చినప్పుడు, పరిశీలించేవాడు వుండడని, కాబట్టి ఆలోచించేవాడూ వుండడని; ఒక కేంద్రస్థానం వుండటం, అక్కడినుండి 'మీరు' పరిశీలిస్తూ వుండటం వుండదని? ఎప్పుడయినా చేసి చూడండి. పూర్తి సావధానత్వంతో వుండండి- 'ఏకాగ్రత' కాదు. 'ఏకాగ్రత' తో వుండటం అనేది బొత్తిగా అర్ధంలేని ఒక ఆలోచనా ప్రక్రియ. అంతకంటె మూర్ఖత్వం మరొకటి లేదు. పాఠశాలలో చదువుకొనే చిన్న పిల్లవాడు కూడా యిది చేయగలడు; మనం ప్రస్తావించుకుంటున్నది 'సావధానశీలత్వం' గురించి- అంటే సావధానంగా వుండటం. ఇప్పుడు మీరు కనుక మీ మొత్తం అస్తిత్వంతో, మీ మనసుతో, మీ మెదడుతో, మీ నరాలతో, సంపూర్ణమైన మీ శక్తితో కనుక వింటున్నట్లవుతే- వినడం మాత్రమే; అంగీకరించడం కాదు, విభేదించడం కాదు, పోల్చి చూడటం కాదు, అసలైన సంపూర్ణమైన సావధానతతో వినడం- అప్పుడు వింటూవున్న, పరిశీలిస్తూ వున్న ఒకరు వున్నారా? పరిశీలకుడు అనేవాడు లేనేలేడని మీరు కనిపెడతారు. సరే, ఒక చెట్టువైపు మీరు చూస్తున్నప్పుడు, సంపూర్ణమైన సావధానతతో చూడండి. ఇక్కడ ఎన్నో వృక్షాలు వున్నాయి, వాటివైపు చూడండి. సాయంకాలాల్లో కాకులు గూళ్ళు చేరుతున్న శబ్దాలను వింటున్నప్పుడు, వాటిని సంపూర్ణంగా వినండి. 'నాకు ఆ ధ్వనులు యిష్టం' అని కానీ, 'నాకు ఆ ధ్వనులు యిష్టంలేదు' అని కానీ అనకండి. మీ హృదయంతో, మీ మనసుతో, మీ బుద్ధితో, మీ నరాలతో వినండి, సంపూర్ణంగా. అదే విధంగా, ఆలోచన మధ్యలో కలుగ చేసుకొనడం అనేది లేకుండా చెట్టును చూడండి- అంటే అర్ధం పరిశీలకుడికి, పరిశీలిస్తున్న విషయానికి నడుమన ఎడం లేదని. అటువంటి మొత్తమైన, సంపూర్ణమైన సావధానత వున్నప్పుడు, పరిశీలకుడు అనేవాడు వుండడు. ఈ పరిశీలకుడే భయానికి వూపిరిపోసి పోషిస్తాడు. ఎందుకంటే యీ పరిశీలకుడు ఆలోచనలకు కేంద్రస్థానం; అదే యీ 'నా', యీ 'నేను', యీ 'స్వార్ధం', యీ 'అహం' అనేది. ఈ పరిశీలకుడే తనకి నచ్చని వాటిని కత్తిరించి వేస్తూ వుంటాడు. అయితే నేను చెప్తున్న ఆ స్థితి ఏమీ

లేని స్థితి కాదు. అది తెలుసుకోవాలంటే దేనినీ ఆమోదించకుండా చాలా లోతుగా శోధించ వలసిన అవసరం వుంటుంది.

చూడండి, మీరు మీ జీవితకాలమంతా ఆమోదిస్తూనే గడుపుకొస్తున్నారు. సంప్రదాయాన్ని ఆమోదించారు; సమాజాన్ని వున్నదాన్ని వున్నట్లుగా ఆమోదించారు. అన్నింటికీ 'అవును' 'అవును' అని తలవూపే ప్రాణి మీరు, అంతే. వీటిలో ఏ ఒక్కదానినీ ఏనాడూ మీరు కాదనలేదు. కాదు అని మీరు అన్నా అది కేవలం తిరుగుబాటు మాత్రమే. తిరుగుబాటు కూడా తనదైన ఒక పద్ధతిని తయారు చేసుకుంటుంది. అదే మళ్ళీ అలవాటుగా, ఆచారంగా అయిపోతుంది. అయితే, సమాజ నిర్మాణం సమస్తాన్నీ కనుక మీరు అర్థంచేసుకున్నట్లవుతే, అది సంఘర్షణలు, పోటీలు, దేవుడి పేరో, దేశం పేరో, శాంతి పేరో చెప్పుకొని దయాదాక్షిణ్యాలు లేకుండా స్వార్థాన్ని పెంచుకోవడం మొదలైన వాటి మీద ఆధారపడి వున్నట్లు గ్రహిస్తారు.

కాబట్టి భయాన్నుండి విముక్తి పొందాలంటే సంపూర్ణమైన సావధానత వుండాలి. ఈ సారి మీ మనసులో భయం ఆవరించుకుంటున్నప్పుడు- ఏం జరగబోతోందో అనే భయమో, మునుపు జరిగినదేదో మళ్ళీ తిరిగిరావచ్చుననే భయమో ఆవరిస్తున్నప్పుడు- దానికి మీ సంపూర్ణమైన సావధానతను యివ్వండి. దానినుండి పారిపోకండి, దానిని మార్చాలని చూడకండి, దానిని అణచివేయాలని ప్రయత్నించ కండి, దానిని అదుపులో పెట్టాలనీ ప్రయత్నించకండి, పూర్తిగా, సంపూర్ణంగా, మీ మొత్తం సావధానత అంతటితోనూ దానితోటే వుండిపోండి. అప్పుడు, పరిశీలకుడు అనేవాడు లేకపోవడంవల్ల భయం కూడా లేదని మీరు గ్రహిస్తారు.

మనలో వుండే విచిత్రమైన భ్రాంతుల్లో ఒకటి ఏమిటంటే అంతఃచేతన అనేది ఒకటి లోపల ఎక్కడో లోతుగా పాతుకొని పోయివున్నదనీ, దానిలో నుండి రకరకాల భయాలు బయటకు వస్తుంటాయనీ అనుకోవడం. అర్థమైందా? చేతనా వర్తం అంతటికీ కొన్ని పరిమితులున్నాయి. ఈ పరిమితులుగల చేతనకు, నిబద్ధీకరణం చెందిన యీ సత్యానికి ఆవలగా పోవాలంటే దానిని 'చేతన' గాను 'అంతఃచేతన' గాను విభజించడం వల్ల ఏ మాత్రం లాభం లేదు. ఉన్నది చేతనావర్తం మాత్రమే; వర్తమాన క్షణంలో కనుక మీరు సంపూర్ణమైన సావధానతతో వుంటే, అప్పుడు మీరు అంతఃచేతనను, పరిమితులుగల చేతననూ కూడా తుడిచిపెట్టి వేయగలుగుతారు.

సావధాన శీలతను అలవరచుకోవడం సాధ్యం కాదు. సావధానతను సంపాదించడానికి ఒక పద్ధతిగాని, ఒక విధానంగాని, ఒక శిక్షణగాని లేదు. ఎందుకంటే సావధానంగా వుండటం కోసం ఒక పద్ధతిని మీరు అవలంబించారంటే, పరధ్యానాన్ని అలవరచుకుంటున్నారన్న మాట. ఇక్కడ మీరు పరధ్యానంగా వుండటం ద్వారా

సావధానతను అలవరచుకోవాలని అపేక్షిస్తున్నారన్నమాట. ఒక పద్ధతినిగాని, ఒక విధానాన్నిగాని అనుసరిస్తున్నప్పుడు మీరు చేస్తున్నది ఏమిటి? ఒక నిర్ణీతమైన కార్యక్రమాన్ని మళ్ళీ మళ్ళీ చేయడం ద్వారా యాంత్రికంగా కొన్ని అలవాట్లను అలవరచుకుంటున్నారు; దీనివలన మనసు మందకొడిగా తయారవుతుంది. దీనివలన, మనసుకు చురుకుదనం కలగదు. మీరు గనుక ఒక సెకనుసేపు కాని, ఒక నిముషంసేపు కాని సంపూర్ణమైన సావధానతను చూపారంటే, అప్పుడు యీ క్షణికమైన సంపూర్ణ సావధానత మీరు భయపడుతున్న దానిని తుడిచి వేసేస్తుంది. ఈ సావధానతలో పరిశీలకుడు కాని, పరిశీలిస్తున్న అంశం కాని రెండూ వుండవు. అప్పుడు మనం దేనిని పరిశీలిస్తున్నామో అదే పరిశీలకుడు కూడా. అయితే, యిది అర్థం చేసుకోవాలంటే, దీనిని గ్రహించాలంటే స్థలం-కాలం అనే మొత్తం సమస్యను మనం తరచి శోధించాలి.

అయితే చూడండి, అవస్థ ఏమిటంటే- మన నిబద్ధీకరణ ఎంత పటిష్టంగా వుంటుందంటే అసలు మనం సూటిగా చూడనూ లేము, అడగలేము, ఏ ప్రశ్నలూ వేయలేము. మనకి ఏ సందేహాలూ రావు. మనం అంతా అనుయాయులం. మనందరం "అవునవును" అంటూ తలలూపే జీవులం. ప్రస్తుత విషమస్థితి మీరు మరొకరిని అనుసరించడానికి వీల్లేదని గట్టిగా హెచ్చరిస్తున్నది. గందరగోళంలో చిక్కుకున్న మీరు మరొకరిని అనుసరించకూడదు. ఎందుకంటే గందరగోళపు స్థితిలో వున్న మీరు యింకొకరిని అనుసరిస్తున్నారంటే, అయోమయంలో పడి అనుసరిస్తున్నారు తప్ప సుస్పష్టంగా తెలుసుకొని కాదు. స్పష్టంగా తెలుసుకొని వుంటే మీరు యింకొకరిని అనుసరించడం అనేది వుండనే వుండదు. మీరు గందరగోళపు స్థితిలో వుండటం వలన మరొకరిని అనుసరిస్తూ వుంటే మరికొంత గందరగోళాన్ని సృష్టిస్తారు. కాబట్టి ముందుగా మీరు చేయవలసినది ఏమిటంటే యిక్కడ ఆగి, లోతుగా శోధించండి. సూటిగా చూడండి, వినండి.

దురదృష్టం ఏమిటంటే, యీ దేశపు సంస్కృతి అని అంటూవుంటామే అది చాలా పురాతనమైనది. 'సంస్కృతి' అనే పదం చాలా గొప్పదే; కాని రాజకీయవేత్తలు, బుద్ధి కొంచెం తక్కువగా వున్నవారు, అంటే కొత్తది ఏదీ ఆలోచించడం చేతగానివారు యీ మాటను పాడుచేసి పెట్టారు. తమ బుద్ధిహీనతకి ముసుగువేసి దాచడానికి సంస్కృతి అనే యీ మాటని వాళ్ళు వుపయోగించుకున్నారు. అయితే విభిన్నమైన మరొక సంస్కృతిని- సంస్కృతి అంటే అర్థం ఎదుగుదల, వికాసం; జడమైన స్థితిలో ఆగిపోయి వుండటం కాదు- తీసుకురావాలంటే, దానిని అవగాహన చేసుకోవాలంటే ముందుగా మనతోనే ఆరంభించాలి. ఎందుకంటే మీరు యీ సంస్కృతికి- ఎన్నో

సంప్రదాయాలతో, ఎన్నో అంధాచారాలతో, ఎన్నో భయాలతో కూడుకొనివున్న, మతము, సాంఘిక విభజనలు, భాషా భేదాలు వున్న యీ భారతీయ సంస్కృతికి పుట్టిన ఫలితమే కాబట్టి. ఈ సమస్తంలో మీరూ ఒక భాగం. అదీ మీరంటే. దాని నుంచి మీరు విడిగా లేరు. నేను ఏమిటి అనే స్పృహ కలిగి, మీ సంపూర్ణ సావధానతను దానికి యిచ్చిన తక్షణమే, ఆ క్షణంలోనే అదంతా మీ నుండి రాలిపడిపోతుందని గ్రహిస్తారు. అప్పుడు గతం అనే దానినుండి పూర్తిగా విముక్తులవుతారు. మీ నిబద్ధీకరణం గురించిన ఎరుక కలిగివున్నప్పుడు దానంతట అదే రాలిపోతుంది- స్వయం సంకల్పం వల్ల కాదు, అభ్యాసం వల్ల కాదు; ఒక ప్రతిచర్య లాగానూ కాదు; కేవలం మీరు సావధానతతో వుండటం వలన నిబద్ధీకరణ నుండి స్వేచ్ఛ కలుగుతుంది.

అయితే మనలో చాలామంది పరాకుగానే జీవితాన్ని దాటవేస్తుంటారు. చాలా అరుదుగా మనం సావధానతతో వుంటాం. ఒక హిందువుగానో, ఒక బౌద్ధుడిగానో, కమ్యూనిస్టుగానో, సోషలిస్టుగానో మరోవిధంగానో మన నిబద్ధీకరణను బట్టి సాధారణంగా మనం ప్రతిస్పందిస్తూ వుంటాం. అంటే మనం పెరిగిన వాతావరణాన్ని అనుసరించి మన సమాధానాలు వస్తూవుంటాయి. కాబట్టి ఆ విధమైన ప్రతిస్పందనలు మళ్ళీ కొంత దాస్యత్వాన్ని, యింకా కొంత నిబద్ధీకరణను కలిగిస్తాయి. మీ నిబద్ధీకరణం గురించి మీకు ఎరుక కలిగినట్లయితే- ఆ స్పృహ కనుక కలిగితే- కాస్త సావధానత కనుక చూపిస్తే- అప్పుడిక మీ మనసు చేతన, అంతఃచేతనగా విభజింపబడిలేదని గ్రహిస్తారు; అప్పుడు మీ మనసు తుదీమొదలూ లేకుండా వాగుతూవుండటం అనేది ఆపినట్లుగా గ్రహిస్తారు. అందువల్ల మీ మనస్సు అత్యంతమైన సున్నితత్వాన్ని పొందుతుంది. చాలా సున్నితంగా వుండే మనస్సు మాత్రమే నిశ్శబ్దంగా వుండ గలుగుతుంది- కర్కశంగా తయారయిన మనస్సు కాదు; క్రమశిక్షణతో, కట్టుబాట్లతో, సర్దుకొని పోవడం ద్వారా, లొంగిపోయి వుండటం ద్వారా చిత్రహింసలకు లోనయిన మనస్సూ కాదు. ఇటువంటి మనస్సు ధ్యానం అనే పేరు పెట్టి మంత్రాలు వల్లె వేయడం ద్వారా ఏనాటికీ నెమ్మదిని పొందలేదు. ధ్యానం అనేది చాలా భిన్నమైనది; అది పూర్తిగా మరొకటి- ఆ విషయాన్ని గురించి వీలవుతే మనం మరొకసారి మాట్లాడుకుందాం.

మేము చెప్పినట్లుగా, భయపడుతున్న మనసుకు, అది ఎంత ప్రయాసపడినా సరే, ప్రేమ అనేది ఏ మాత్రం తెలియదు; ప్రేమ లేకుండా ఒక నూతన ప్రపంచాన్ని మీరు నిర్మించలేరు. ప్రేమ లేకుండా ఒయాసిస్సూ వుండదు. మీరే, మనుష్యులమని అనుకుంటున్న మీరే నిర్మించిన యీ సామాజిక చట్రంలో మీరు చిక్కుకొని పోయారు. దీనిలో నుంచి బయట పడాలంటే- దీనిలోనుంచి పూర్తిగా బయటపడి తీరాలి-

మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవాలి. యదార్థంగా మీరు ఏమిటి అన్నది మీ అంతట మీరే పరిశీలించుకోవాలి. అప్పుడు, ఆ తేటపడిన దానిలో నుండి క్రియ ఆవిర్భవిస్తుంది. అప్పుడు పునరుక్తి చేయడం కానటువంటిది, లొంగిపోయివుండటం కానిది, అనుకరించడం కానిది అయిన ఒక నవ్యమైన జీవనమార్గాన్ని మీ అంతట మీరే కనిపెడతారు. అదే నిజమైన స్వేచ్ఛగల జీవితం. అందువల్లనే ఆ జీవితం ఆలోచన అంతటికీ ఆవలగా వుండే ఒకదానికి తలుపులు తెరిచి వుంచుతుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, XVII వాల్యూమ్,*
*మొదటి ప్రసంగం, బొంబాయి, 1967*

# స్వేచ్ఛ, బాంధవ్యాలు, మరణం

క్రిందటిసారి మనం యిక్కడ కలుసుకొని ప్రస్తావించుకొన్న విషయాలను గురించి, మీకు అభ్యంతరం లేకపోతే మరికొంత వివరంగా యిప్పుడు మాట్లాడుకుందాం. సమూలమైన విప్లవం రావలసిన ఆవశ్యకత వున్నదని అన్నాము; కేవలం ఆర్థిక రంగంలో కాని, కేవలం సామాజికమైనది కాని కాదు; ఇంకా గాఢమైన లోతుల్లో, చేతనావర్తపు మూలంలోనే విప్లవం రావాలి. ప్రపంచపు స్థితిగతులు యీ విప్లవం జరిగితీరాలని ఒత్తిడి చేస్తున్నాయి. అంతేకాకుండా, ప్రపంచమంతటా- సాంకేతిక రంగంలో కాదు- మతపరమైన దృష్టితో చూసినప్పుడు, క్రమక్రమంగా క్షీణస్థితి దాపురిస్తున్నదని కూడా అన్నాము. ఈ 'మతం' అనే మాటను అత్యంత జాగరూకతతోనూ, ఎంతో సందేహిస్తూనూ వాడుతున్నాను. ఎందుకంటే 'మతం' అనే యీ మాటను పూర్తిగా దుర్వినియోగం చేసేశారు. మేధావులు దీనిని మొత్తంగా తృణీకరిస్తారు, తిరస్కరిస్తారు, ఆ మాట వింటేనే వాళ్ళు దూరంగా పారిపోతారు; వైజ్ఞానికులు, మేధావులే కాక మానవతా వాదులు కూడా ఆ మాటతో- ఆ మనోభావంతో, మతం అని అందరూ పిలుస్తున్న, ఆ వ్యవస్థీకరించబడిన నమ్మకాలతో తమకేమీ సంబంధం లేదంటారు. అయితే, మనం యిక్కడ మాట్లాడుతున్నది లక్షల సంవత్సరాల కాలగమనంలో అనేకమైన అనుభవాల ద్వారా, అనేకరకాల స్థితిగతుల ద్వారా నిర్మించుకున్న మన మనోతత్వపు స్వభావం లోనూ, మన చేతనావర్తపు స్వరూపంలోనూ రావలసిన విప్లవం గురించి.

ఇప్పుడు మనం యిట్లా ప్రశ్నించుకుంటున్నాం. ఈ ప్రపంచంలో- క్రూరంగా, హింసాత్మకంగా, నిర్దాక్షిణ్యంగా వుండే యీ ప్రపంచంలో, రోజురోజుకీ ప్రయోజకత్వానికే

ప్రాధాన్యత పెరిగిపోతూ, ఆ విధంగా యింకా యింకా నిర్దయాత్మకంగా తయారవుతున్న యీ ప్రపంచంలో- ఒక విప్లవాన్ని, బాహ్యమైన సామాజిక బాంధవ్యాలలోనే కాకుండా, అంతకంటె అదనంగా ఆంతరికమైన జీవితంలో కూడా తీసుకొనిరావడం సాధ్యమేనా అని. చేతనావర్తం సమస్తంలోనూ- అంటే ఆలోచనాపరిధి అంతటిలోనూ ఒక సమూలమైన విప్లవం కనుక రాకపోయినట్లయితే మనిషి క్షీణస్థితికి దిగజారి పోయి, హింస, దుఃఖం శాశ్వతంగా వుండి పోతాయి. అంతేకాకుండా, యింకా యాంత్రికంగా, యింకా సుఖాలకు నిలయంగా వుండే సమాజాన్ని తయారు చేసుకొని, చాలా చాలా కృత్రిమమైన జీవితం సాగిస్తాడు. వాస్తవంగా జరుగుతున్నది అదే అని మనం పరిశీలించి చూస్తే తెలుస్తుంది.

యంత్రాల సహాయంతో పనులు చేయించుకోవడం, సైబర్నటిక్స్ (కంప్యూటర్ల సంబంధితశాస్త్ర విజ్ఞానం) అభివృద్ధి చెందడం, ఎలక్ట్రానిక్ మెదడు మొదలైన వాటి వలన మానవుడికి తీరిక సమయం రోజు రోజుకూ ఎక్కువవుతున్నది. ఈ తీరిక సమయాన్ని అతడు వినోద కార్యక్రమాలతో గడపదల్చుకుంటాడు- అవి ఆధ్యాత్మికమైన కాలక్షేపాలు అవచ్చు, అతనికి రకరకాలైన వినోదాన్ని కలిగించేవీ కావచ్చు; మనిషికీ మనిషికీ మధ్యన గల బాంధవ్యాలను ఒకరినొకరు ధ్వంసం చేసుకొనడానికి వుపయోగించుకోవడం ఎక్కువవచ్చు కూడా యీ తీరిక సమయాల వల్ల. మనిషి అంతర్ముఖుడవడానికి కూడా యీ తీరికను వినియోగించుకోవచ్చు. కాబట్టి, యీ మూడు రకాలుగా సంభవించడానికి మాత్రమే అవకాశం వుంది. సాంకేతిక విజ్ఞానపరంగా చూస్తే మానవుడు చంద్రమండలంలో అడుగు పెట్టగలడు, అయితే దాని వల్ల మానవజాతికున్న సమస్యలు తీరవు. తన తీరిక సమయాన్ని ఆధ్యాత్మికమైన లేదా మనోల్లాసకరమైన కార్యక్రమాలతో గడిపివేసినంత మాత్రాన కూడా పరిష్కారం అవవు. చర్చికిగాని, దేవాలయానికిగాని వెళ్ళడం, నమ్మకాలు, అంధవిశ్వాసాలు, పవిత్ర గ్రంధాలు పారాయణ చేయడం యివన్నీ ఒక రకంగా కాలక్షేపం కోసం చేసే కార్యక్రమాలే. దానికి బదులు మనిషి తనలోకి తను లోతుగా చూసుకుంటే, శతాబ్దాల తరబడి మనిషి తయారుచేసి పెట్టుకున్న విలువలను ఒక్కొక్క దానినీ ప్రశ్నించి చూసి, యీ మెదడు వుత్పత్తి చేసినది కాకుండా, మరింకేదైనా వున్నదా అని తెలుసుకోవడానికి ప్రయత్నించవచ్చు. ప్రపంచమంతటా కూడా కొంతకొంతమంది రకరకాల మాదక ద్రవ్యాలు తీసుకొనీ, సామాజిక జీవనంలో ఏ విధంగానూ పాల్గొనకుండానూ, పాతుకొనిపోయిన వ్యవస్థకు వ్యతిరేకంగా తిరగబడుతున్నారు.

కాబట్టి మనం మాట్లాడుకుంటున్నది ఏమిటంటే, యిటువంటి ప్రపంచంలో జీవిస్తున్న మనిషి భిన్నమైన మరో సమాజాన్ని, పూర్తిగా విభిన్నమైన మరో క్రమ

తను తయారుచేసే ఒక విప్లవాన్ని, ఒక మానసికమైన విప్లవాన్ని తీసుకొనిరాగలడా అని.మనకి క్రమశీలత అత్యవసరం. ఎందుకంటే విపరీతమైన అస్తవ్యస్తత అంతటా ప్రబలిపోయింది. అసలు సామాజిక నిర్మాణ స్వరూపం సమస్తం క్రమరాహిత్యం, పోటీలు, స్పర్థలు, ఎదుటి వాడిని పడత్రోసైనా తాను బతకాలనుకోవడం, మనిషికి మనిషి శత్రువు అనే తత్వం, వర్గవిభజనలు, జాతిభేదాలు, దేశదురభిమానాలు, తెగల విభేదాలు మొదలైన వాటిమీద ఆధారపడి వున్నది. ఈ సమాజ నిర్మాణంలోనే అస్తవ్యస్తత వున్నది. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు. అనేక రకాల విప్లవాలు-రష్యన్ విప్లవం మొదలైన ఎన్నో రకాలవి సమాజంలో ఒక క్రమశీలత్వాన్ని నెలకొల్పడానికి ప్రయత్నించాయి కాని అవి ఘోరంగా పరాజయం చెందక తప్పలేదు. రష్యా, చైనాలలో యిది కనబడుతున్నది. అయితే మనకు క్రమత చాలా అవసరం, ఒక క్రమ శీలత్వం అనేది లేకపోతే మనం బ్రతకలేము. జంతువులు కూడా ఒక క్రమత్వాన్ని కోరుకుంటాయి. వాటిలో క్రమత అంటే ఆస్తికి సంబంధించినది, సెక్సుకు సంబంధించినది. మనలో అంటే మానవుల్లో కూడా ఆస్తికి, సెక్సుకు సంబంధించిన క్రమశీలతను ఆస్తిపై హక్కుల కోసం వదులుకోవడానికి మనకి అభ్యంతరం లేదు. ఇప్పుడు యీ రంగంలో క్రమతను సాధించడానికి మనం ప్రయత్నిస్తూ వున్నాం.

అయితే స్వేచ్ఛ వున్నప్పుడే క్రమత వుంటుంది. స్వేచ్ఛ అంటే సాధారణంగా చెప్పుకొనే అర్థంలో కాదు. స్వేచ్ఛ ఎక్కడయితే వుండదో అక్కడ అస్తవ్యస్తత వుంటుంది. అందువల్ల అక్కడ నియంతృత్వం వుంటుంది. క్రమతను తీసుకొనిరావడానికి అక్కడ మనుష్యుల మీద బలవంతంగా సిద్ధాంతాలను రుద్దడం వుంటుంది. దానివలన అక్కడ చివరకు మళ్ళీ అస్తవ్యస్తత నెలకొంటుంది. కాబట్టి క్రమత్వం అంటే అందులో క్రమశిక్షణ వుంటుందన్నమాట. అయితే సాధారణంగా క్రమశిక్షణ అని మీరు చెప్పుకొనేది లొంగిపోయి వుండటంమీద, విధేయత మీద, ఒప్పందల మీద ఆధారపడి వుంటుంది. లేదా భయపెట్టి, శిక్షించి, విపరీతమైన నిరంకుశాధికారం చలాయించి మిమ్మల్ని క్రమబద్ధంగా వుంచడం జరుగుతుంది. అయితే మనం మాట్లాడుతున్న క్రమశిక్షణ, స్వేచ్ఛ అంటే ఏమిటి అన్నది అర్థంచేసుకోవడం ద్వారా కలిగేది. స్వేచ్ఛ అంటే ఏమిటో అవగాహన చేసుకోవడమే స్వేచ్ఛకు ఒక క్రమశిక్షణను కలిగిస్తుంది.

కాబట్టి, 'స్వేచ్ఛ', 'అవగాహన' అనే యీ రెండు మాటలకి అర్థం ఏమిటన్నది మనం చక్కగా ఆకళింపు చేసుకోవాలి. సాధారణంగా మనం, 'నాకు యిది అవగాహన అయింది' అన్నప్పుడు మేధాపరంగా, శబ్దపరంగా అది వర్తిస్తుంది. ఏదైనా ఒక విషయాన్ని సుస్పష్టంగా, మీ మాతృభాషలో కానీ, మనిద్దరకూ తెలిసిన ఒక విదేశ భాషలో కానీ చెప్పినప్పుడు, 'నాకు అవగాహన అయింది' అని మీరు అంటారు

అంటే మనిషి సంపూర్ణత్వంలో కొంత భాగాన్ని మాత్రమె 'నాకు అవగాహన అయింది' అన్నప్పుడు మీరు వుపయోగిస్తారు. అంటే ఏమిటంటే, ఆ మాటలు మీ మేధ ద్వారా అవగాహన అయాయి, యీ వక్త ఏమనుకుంటున్నాడో అది మీకు అవగాహన అయింది. అయితే యిక్కడ అవగాహన అనే మాటను వుపయోగించినప్పుడు, ఒక వూహా ప్రతిపాదనను మేధాపరంగా ఆకళింపు చేసుకోవడం అనే అర్థంలో మనం వాడటంలేదు. అవగాహన అనే పదాన్ని దాని సంపూర్ణమైన అర్థంలో వుప యోగిస్తున్నాం- అంటే అవగాహన చేసుకున్నప్పుడు, మీరు చర్య తీసుకుంటారు. ఒక ఆపద వున్నది అనే సంగతి మీరు అవగాహన చేసుకున్నప్పుడు, ఆపదను మీరు స్పష్టంగా చూసినప్పుడు, తక్షణమే మీరు క్రియని చేస్తారు. అవగాహనలోని క్రియాశీలత్వమే దాని క్రమశిక్షణ. కాబట్టి యీ అవగాహన అనే మాటలోని విశిష్టతను మనం స్పష్టంగా గ్రహించాలి. మనం అవగాహన చేసుకుంటే, తెలుసుకుంటే, ఆకళింపు చేసుకుంటే, విషయాన్ని వున్నది వున్నట్లుగా చూస్తే క్రియ జరుగుతుంది. ఒక విషయాన్ని మీరు అవగాహన చేసుకోవాలంటే, మీ మనస్సునీ, మీ హేతుబుద్ధినీ, మీ శక్తిసామర్థ్యాలనే కాకుండా, మీ మొత్తం సావధానత్వాన్ని వుపయోగించాలి. అట్లా చేయని పక్షంలో అవగాహన వుండదు. ఇది బాగా స్పష్టంగా వుందని ఆశిస్తాను.

కాబట్టి, స్వేచ్ఛ గురించి అవగాహన- అంటే అది తిరుగుబాటు కాదు, అంతకంటె భిన్నమైనది అని మనం తెలుసుకుంటున్నాము. తిరుగుబాటు అంటే పాతుకొని పోయిన వ్యవస్థకు వ్యతిరేకతను ప్రకటించడం- జుట్టు కత్తిరించుకోకుండా పొడుగ్గా పెంచుకునేవారి తిరుగుబాటు వంటివి. ఒక నిర్ణీతమైన పద్ధతికి వ్యతిరేకంగా వారు తిరుగుబాటు చేస్తున్నారు; అయితే, తిరగబడినప్పుడు, మరో కొత్త పద్ధతిలో వాళ్ళు చిక్కుకొనిపోయి, దానికి ఆమోదం తెలుపుతున్నారు. మనం మాట్లాడుతున్నది తిరుగుబాటు కానటువంటి స్వేచ్ఛను గురించి. ఇది మరొకదాని నుంచి విముక్తి పొందడం కాదు; అస్తవ్యస్తతను అవగాహన చేసుకోవడంలోనే వున్న స్వేచ్ఛ. దయచేసి దీనిని స్పష్టంగా తెలుసుకోండి. క్రమరాహిత్యాన్ని అంటే అస్తవ్యస్త స్థితిని అవగాహన చేసుకోవడంలోనే దానినుంచి విముక్తి వుంది. ఆ స్వేచ్ఛే క్రమతను తెస్తుంది. ఈ క్రమతలోనే క్రమశిక్షణ వుంటుంది.

అంటే అర్థం, ప్రతికూలమైన దానిని అవగాహన చేసుకోవడంలో అనుకూలమైన చర్య జరగడం వున్నది. అనుకూల పక్షపు విధానం అవలంబించడం ద్వారా క్రమత సిద్ధించదు. క్రమరాహిత్యస్థితి అనేది యిక్కడ వున్నది. మానవుడు ఒక నిర్ణీతమైన పద్ధతిని, సామాజిక పద్ధతిని, నైతిక పద్ధతిని, మతరీతిని, తన స్వంత వ్యక్తిగతమైన అభిరుచులపైనా సుఖాలపైనా ఆధారపడిన ఒక పద్ధతిని పట్టుకొని అనుసరిస్తూ

వుండటం కారణంగా యీ అస్తవ్యస్తత ఏర్పడింది. అంటే ఆర్జనపరత్వంతో జీవితాన్ని ముడిపెట్టి చూసే వైఖరీ, పోటీ తత్వమూ, విధేయతా, ఆధిపత్యమూ అనే వాటి మీద యీ సమాజాన్ని నిర్మించారు; కాబట్టి అస్తవ్యస్తత నెలకొన్నది. ప్రతి మనిషీ పాటు పడుతున్నది తన స్వంతం కోసమే. పారమార్థికుడు పని చేస్తున్నదీ స్వార్థం కోసమే! 'దేశక్షేమం కొరకు' అని వుపన్యాసాలు చేస్తున్నా, రాజకీయ వేత్త పనిచేస్తున్నదీ స్వార్థం కోసమే. వ్యాపారస్థుడి దృష్టీ స్వలాభం పైనే, ప్రతి మనిషీ తన స్వప్రయోజనం కోసమే పాటుపడుతున్నాడు. అందులో సందేహం లేదు. కాబట్టి అతడు అస్తవ్యస్తతను సృష్టిస్తున్నాడు. కొందరు ఆదర్శవాదులున్నారు; ప్రతి మనిషీ తన కోసమే తను శ్రమ పడుతున్నాడు కాబట్టి, ఆదర్శజీవి తన దేశంకోసం, తన సమాజంకోసం, తన వర్గంకోసం, యింకా అట్లాంటివాటి కోసం పాటుపడాలని వాళ్ళు అంటున్నారు. అంటే అప్పుడు క్రమతను మనమీద బలవంతంగా రుద్దుతారనమాట- అప్పుడూ అస్తవ్యస్తత కలుగుతుంది. చారిత్రకంగా చూస్తే యిదంతా చాలావరకు నిజమే. కాబట్టి అస్తవ్యస్త స్థితిని- ప్రతి మనిషీ అస్తవ్యస్తతను ఎట్లా సృష్టిస్తున్నాడు అనేదానిని అవగాహన చేసుకోవడం వల్ల, మేధాపరంగా కాదు, మాటల్లో కాదు, మనిషి ఏంచేస్తున్నాడు అనే వాస్తవాన్ని చూడటంవల్ల, ఆ గ్రహింపు ద్వారా నిజంగా 'ఉన్నది' ని పరిశీలించడం ద్వారా, యిదంతా అవగాహన చేసుకోవడం ద్వారా ఒక క్రమశిక్షణ కలుగుతుంది. ఆ క్రమశిక్షణ క్రమతను తీసుకొస్తుంది.

కాబట్టి, 'స్వేచ్ఛ' అనే మాటను 'అవగాహన' అనే మాటను, అంతేకాకుండా 'చూడటం' అనే మాటను కూడా మనం అర్థం చేసుకోవాలి, ఆకళింపు చేసుకోవాలి. ఒక వస్తువుని మనం చూస్తామా లేదూ దానిని గురించి మనకి వున్న మనో రూపం ద్వారా చూస్తామా? ఒక చెట్టుని చూసినప్పుడు, చెట్టుని గురించి మీకు వున్న ఒక మనోబింబం ద్వారా అసలు వాస్తవంలో వున్న చెట్టుని చూస్తున్నారన్నమాట. దయచేసి యిది మీరే పరిశీలించండి, మిమ్మల్ని మీరే జాగ్రత్తగా గమనించుకోండి. చెట్టువైపు మీరు ఎట్లా చూస్తారు? ఇప్పుడే మనం మాట్లాడుతుండగానే చూడండి. ఆలోచనతోపాటు దానివైపు చూస్తారు. 'అది తాడిజాతి చెట్టు; దీని పేరు యిది, దాని పేరు అది' అని అంటారు. ఆలోచన అనేది చెట్టు అనే నిజమైన వాస్తవాన్ని పరికించకుండా మిమ్మల్ని నిరోధిస్తుంది. మరికొంచెం మనోగతంగా, మరికాస్త అంతర్ముఖంగా వెళ్ళండి. మీ భర్తవైపో, భార్యవైపో మీరు చూస్తున్నప్పుడు, ఆ వ్యక్తిని గురించి మీరు ఏర్పరచుకొన్న ఒక కాల్పనిక బింబం ద్వారా చూడటం వుంటుంది నిస్సందేహంగా. ఎందుకంటే అతనితో కాని, ఆమెతో కాని మీరు అనేక సంవత్సరాలు కలిసి జీవించడంవల్ల అతనిని గురించి, ఆమెని గురించి మీరు ఒక మనోబింబాన్ని ఏర్పరచుకొని వుంటారు. అందుకని

ఆమెవైపు లేదా అతనివైపు మీరు ఏర్పరచుకొన్న ఆ కాల్పనికరూపం ద్వారా చూస్తారు. సంబంధ బాంధవ్యం కూడా మీరు పెంచుకున్న ఆ రెండు కాల్పనిక రూపాల మధ్యనే-యిద్దరు మనుష్యుల మధ్యన కాదు. కాబట్టి మీరు నిజంగా చూడటం లేదు; ఒక కాల్పనిక బింబం మరో కాల్పనిక బింబాన్ని చూస్తున్నది, అంతే.

ఇది ముఖ్యంగా మీరందరూ గ్రహించవలసిన సంగతి. ఎందుకంటే యిప్పుడు ప్రపంచమంతటా కూడా మానవుల మధ్య వుండే పరస్పర సంబంధాలను గురించే విచారిస్తున్నారు. ఈ కాల్పనిక బింబాలు వున్నంతవరకు పరస్పర సంబంధం అనేది వుండదు. అందువల్లనే మనిషికీ మనిషికీ మధ్యన యీ సంఘర్షణ అంతా వున్నది. మనలో ప్రతి ఒక్కరం ఎదుటివారిని గురించి ఒక మనో రూపాన్ని సృష్టించుకుంటాం అన్నది అసలైన వాస్తవం. మనం ఒకరివైపు ఒకరం చూసుకుంటున్నప్పుడు, వారిని గురించి మనం ఏర్పరుచుకున్న కాల్పనిక రూపాన్ని లేదా మనల్ని గురించి వారు ఏర్పరచుకున్న కాల్పనిక రూపాన్ని చూసుకుంటున్నాం. ఈ వాస్తవాన్ని మీరు గ్రహించి తీరాలి. చూడటం వేరు, దానిని గురించి మాటల్లో చెప్పడం వేరు. ఆకలి వేస్తుంటే అది మీకు తెలుస్తుంది. మరెవరో వచ్చి మీకు ఆకలిగా వున్నదని చెప్పనవసరం లేదు. చూడండి, మీకు ఆకలిగా వున్నదని ఎవరో వచ్చి చెప్తారనుకోండి, మీరు ఆ వాక్యాన్ని ఆమోదిస్తారు. అయితే, దీని తాత్పర్యం వేరూ, మీకు నిజంగా ఆకలి వేయడం పూర్తిగా వేరూ. కాబట్టి, యిదే విధంగా మీకు యితర్లను గురించి కాల్పనిక రూపాలు వున్నాయనేది మీ అంతట మీరే నిజంగా గ్రహించాలి; ఎదుటివారిని ఒక హిందువుగానో ఒక ముస్లింగానో, ఒక కమ్యూనిస్టుగానో, లేక మరొకటిగానో మీరు చూస్తున్నప్పుడు మానవుల మధ్య వుండవలసిన సంబంధ బాంధవ్యాలన్నీ ఆగిపోతాయి. ఎదుటివారిని గురించి మీరు ఏర్పరచుకొన్న ఒక అభిప్రాయం వైపు మాత్రమే మీరు చూస్తున్నారు.

అందువల్ల, మేము అడుగుతున్నది ఏమిటంటే, యీ కాల్పనిక బింబాల తయారీలోనే ఒక విప్లవాన్ని తీసుకొనిరావడం సాధ్యమేనా అని. దయచేసి శ్రద్ధగా వినండి, దీనిలో ముడిపడి వున్న విషయాలు చాలా ఆశ్చర్యం గొలిపేవిగా వుంటాయి. మానవులు తాము నివసిస్తున్న సమాజం చేత, ఆ సంస్కృతి చేత, మతం చేత, ఆర్థికమైన ఒత్తిడుల చేత, శీతోష్ణస్థితులు, ఆహారం, వారు చదివే పుస్తకాలు, వార్తా పత్రికల చేత ప్రభావితులై నిబద్ధీకరణం చెందుతున్నారు. వారు నిబద్ధులై వున్నారు, వారి చేతనావర్తం మొత్తం నిబద్ధీకృతం అయివుంది. మనం యిప్పుడు కనిపెట్ట బోతున్న దేమిటంటే యీ నిబద్ధీకరణం కాకుండా యింకేదైనా దానిని మించి వున్నదా అని. అయితే, ఆలోచనా స్రవంతి అంతా కూడా చేతనా వర్తం అనే పరిధులలోపలకే పరిమితమై వున్నదని మీరు గ్రహించినప్పుడు మాత్రమే యీ నిబద్ధీకరణకు ఆవలగా

ఏదయినా వున్నదేమో అనేది మీరు తెలుసుకో గలుగుతారు. ఇది స్పష్టంగా వుందా? ఇప్పుడు యింకా కాస్త వివరించి చెప్పడానికి ప్రయత్నిస్తాను.

చూడండి, మనిషి ఎప్పుడూ తనని మించి అవలగా వున్నదానికోసం, ఒక పరతత్వం కోసం అన్వేషిస్తూనే వున్నాడు; దానిని "దైవం" అన్నాడు, "పరమచైతన్యం" అనీ యింకా రకరకాల పేర్లతోనూ పిలిచాడు. అతడు యిదంతా ఒక కేంద్రం నుంచి ఆరంభించాడు. అదే అతని మొత్తం చేతనావర్తం. సర్! యిటు చూడండి, మరొక విధంగా వివరిస్తాను. మనిషిలోని చేతన కాలం కారణంగా ఏర్పడినది. అతను నివసిస్తున్న సంస్కృతి ఫలితంగా ఏర్పడినది. సంస్కృతి అంటే సాహిత్యం, సంగీతం, మతం- యివన్నీ అతన్ని నిబద్ధీకృతం చేశాయి. అతను ఒక సమాజాన్ని నిర్మించు కొన్నాడు, యిప్పుడు ఆ సమాజానికే అతను దాసుడయ్యాడు. ఇది స్పష్టంగా వుందా? కాబట్టి మనిషి తను నిర్మించుకున్న సమాజంచేత నిబద్ధుడయాడు, ఆ సమాజం అతన్ని యింకా యింకా నిబద్ధీకరణకు లోనుచేస్తున్నది. మళ్ళీ యిందులో నుండి బయటపడటంకోసం, ఆ స్పృహతోనో, తనకే తెలియకుండానేనో మనిషి అన్వేషిస్తూనే వున్నాడు. స్పృహతో అంటే- మీరు ధ్యానం చేస్తుంటారు, పుస్తకాలు చదువుతుంటారు, మత సంబంధమైన కర్మకాండల్లో పాల్గొంటుంటారు, యీ నిబద్ధీకరణం నుంచి తప్పించుకొని పారిపోవడానికి యింకా అవీ యివీ చేస్తుంటారు. తెలుసుకున్న స్పృహతోనో, ఆ స్పృహ లేకుండానేనో చేతనత్వపు పరిధులను దాటి అవలగావున్న దానిని అందుకోవాలనే ఒక వెతకులాట, ఒక అన్వేషణ సాగుతూ వుంటుంది.

కాలం కారణంగా జనించిన ఆలోచన తన నిబద్ధీకరణాన్ని దాటుకొని అవలగా వెళ్ళగలనా అని విచారణ చేస్తూవుంటుంది; అది సాధ్యమనో, అసాధ్యమనో మళ్ళీ తనే అంటూవుంటుంది; లేదా అవలగా ఏదో వున్నదని గట్టిగా నొక్కి చెప్తూవుంటుంది. కాబట్టి, కాలం ఫలితంగా జనించిన ఆలోచన, చేతనా వర్తం అంతటికీ- అంటే చేతనకీ, అంతఃచేతనకీ కూడా- రంగస్థలం అయిన ఆలోచన, నూతనమైనదానిని ఏదీ కనిపెట్టలేదు. ఎందుకంటే ఆలోచన ఎప్పటికీ పాతదే. అనేక లక్షల సంవత్సరాలను జ్ఞాపకాలుగా పోగు చేసుకున్నదే ఆలోచన. జంతువుల నుండి వారసత్వంగా సంక్రమించినదాని ఫలితమే ఆలోచన. నిన్నటి అనుభవం గురించిన జ్ఞాపకమే ఆలోచన. కాబట్టి, చేతన పరిధులను దాటుకొని అవలగా పోగలగడం ఆలోచనకు ఎన్నటికీ సాధ్యంకాదు.

అందుకని, మీరు ఒక చెట్టువైపు చూస్తున్నప్పుడు, ఆలోచన ఆ చెట్టుని గురించి సృష్టించిన ఒక కాల్పనిక బింబాన్ని చూస్తూ వుంటారు. మీ భార్య వైపో, భర్తవైపో, మీ రాజకీయనాయకుడు, మీ ఆధ్యాత్మిక గురువు మొదలైనవారి వైపో చూస్తున్నప్పుడు,

ఆలోచన ఆ వ్యక్తిని గురించి తయారుచేసిన కాల్పనిక రూపాన్ని మీరు చూస్తుంటారు. కాబట్టి నూతనమైనదాన్ని మీరు చూడటం వుండనే వుండదు. ఆలోచనను సుఖం అదుపు ఆజ్ఞల్లో పెడ్తూవుంటుంది. అసలు సుఖసంతోషాలనే సూత్రమే మనల్ని నడిపిస్తూ వుంటుంది. దీనిని గురించి క్రిందటిసారి మనం కొంత మాట్లాడుకున్నాం. ఇప్పుడు మనం ప్రశ్నిస్తున్నది ఏమిటంటే యీ పరిమితులుగల చేతనావర్తాన్ని దాటుకొని ఆవలగా వెళ్ళడం అనేది సాధ్యమేనా అని. ఆలోచనను గురించి విచారణ చేయడం ధ్యానంలో ఒక భాగం. దీనికి అపారమైన క్రమ శిక్షణ వుండవలసిన ఆవశ్యకత వుంది. ఈ క్రమశిక్షణ అంటే అదుపు, అణచివేత, అనుకరణ, ఒక పద్ధతిని అనుసరించడం మొదలైన అర్థంలేని వేషాలతో కూడిన క్రమ శిక్షణ కానేకాదు.

ఇప్పుడు, విచారణ అనే యీ ప్రక్రియ ఏమిటో తెలుసుకుందాం. ఈ వక్త దీనిని పరిశీలించ బోతున్నాడు; మీరు కూడా యీ వక్తతో పాటు ప్రయాణించ దలచుకుంటే, అతను చెప్పేదానిని సావధానంగా వినడమే కాకుండా, అతనితోపాటు మీరు కూడా అందుకునే ప్రయత్నం చేయాలి, కేవలం మాటల రూపంలో కాదు, యదార్థంగా.

అమాయకత అనే రంగం వున్నదా, ఆలోచనచేత ఏ మాత్రం స్పృశింపబడని సహజస్వచ్ఛత్వం వుందా అని మనం కనిపెట్టబోతున్నాం. ఆ చెట్టువైపు యిదే ప్రప్రథమంగా చూడటం అన్నట్లుగా చూడగలనా; లోకం వైపు- గందరగోళం, బాధలు, దుఃఖం, మోసాలు, అమానుషత్వం, కపటం, క్రూరత్వం, యుద్ధాలతో కూడినటువంటి లోకంవైపు- లోకం అంటే మనకున్న సమస్త భావనాజాలంవైపు, అదే ప్రప్రథమంగా చూడటం అన్నట్లుగా చూడగలనా? ఇది చాలా ముఖ్యమైన విషయం. ఎందుకంటే, నేను కనుక అదే ప్రప్రథమంగా చూడటం అన్నట్లుగా చూడగలిగితే, నా చర్య పూర్తిగా నూతనంగా వుంటుంది. కాబట్టి మనసు యీ అమాయక స్వచ్ఛత్వం అనే రంగాన్ని కనుక ఆవిష్కరించుకోకపోతే, అది ఏం చేసినా సరే- సాంఘిక సంస్కరణలు ఎన్ని చేసినా, ఎన్ని కార్యకలాపాలు నిర్వహించినా- ఆలోచన మనసును కలుషితం చేస్తూనే వుండిపోతుంది. ఎందుకంటే మనసును తయారుచేసింది ఆలోచనే. ఆలోచన ఎప్పటికీ పాతదే.

మేము ప్రశ్నిస్తున్నది ఏమిటంటే చేతనావర్తానికి పరిధులున్నాయి కాబట్టి, యీ చేతనలో కలిగే ఏ కదలిక అయినా ఆలోచనయొక్క కదలికేనా అని; అది చేతనంలో కానివ్వండి, అంతఃచేతనలో కానివ్వండి. దేవుడిని, సత్యాన్ని మీరు అన్వేషిస్తుంటే, అది ఆలోచన చేసే అన్వేషణే కదా; కాబట్టి తనకు తెలిసిన దానిని ఫలానా అని గుర్తించడానికి అనువుగా పైకి తీసి ప్రదర్శించడమే ఆలోచన చేసే

పని. అందువల్ల యింతకు మునుపు తెలిసిన దానినే మీరు అన్వేషిస్తున్నారు. కాబట్టి మీరు నిజంగా అన్వేషణ చేయడమే లేదు. ఇది మీరు అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం. అందువల్ల అన్వేషించడం సమస్తం ఆగిపోవాలి. అంటే, నిజంగా అర్థం ఏమిటంటే 'ఉన్నది' ని మీరు వాస్తవంగా చూసితీరాలి. అంటే మీరు కోపంగానో, అసూయతోనో, పోటీ పడుతూనో, దురాశతోనో, స్వార్థపూరితంగానో, పశువులాగానో, దౌర్జన్యంతోనో, హింసాత్మకంగానో వున్నారని మీరు గ్రహించినప్పుడు, ఒక ఆదర్శాన్ని దృష్టిలో పెట్టుకొని యిదంతా చూడటం కాదు, 'ఉన్నది' ని మీరు నిజంగా వున్నది వున్నట్లుగా చూసినప్పుడు, అప్పుడు మీరు సంఘర్షణను పూర్తిగా తొలగించివేస్తారు. సంఘర్షణతో వున్న మనసు, ఆ సంఘర్షణ ఏ రకమయినదయినా సరే, ఏ స్థాయిలోనైనా సరే వున్న మనసు మందకొడిగా తయారవుతుంది. అస్తమానం పోట్లాడుకుంటున్న యిద్దరు వ్యక్తుల లాగా- వాళ్ళు జడంగా, మూర్ఖంగా వుండి, సున్నితత్వాన్ని కోల్పోయి, మొద్దుబారిపోతారు. సంఘర్షణ ఎటువంటిదయినా సరే మనసును మందకొడిగాత యారు చేస్తుంది. అయితే, 'ఉన్నది'ని, దానికి విరుద్ధమైన దానిని తేకుండా, వాస్తవంగానే మీరు చూసినప్పుడు, సంఘర్షణ బొత్తిగా వుండదు.

ఇంకా వివరంగా చెప్తాను. జంతువుల్లో హింసాత్మకత వుంటుంది. జంతువుల నుండి పరిణామం చెందిన మానవుల్లో కూడా హింస వుంటుంది; హింసాత్మకంగా వుండటం, కోపం తెచ్చుకోవడం, యీర్ష్యపడటం, అసూయ చెందడం, అధికారం కోసం, హోదా కోసం, ప్రతిష్ఠకోసం పాకులాడటం, యితర్లమీద పెత్తనం చలాయించడం, దౌర్జన్యం ప్రదర్శించడం యివన్నీ మనిషి అస్తిత్వంలో వున్నాయి. మనిషిలో హింస వున్నది- వేల సంఖ్యలో జరిగిన యుద్ధాలవల్ల యిది తెలుస్తూనే వుంది- కాని మనిషి ఒక ఆదర్శవాదాన్ని తయారుచేసి దానికి 'అహింస' అని పేరు పెట్టాడు. దయచేసి శ్రద్ధగా వినండి. ఈ దేశం, యీ భారత దేశం, నిరంతరంగా దానిని గురించే అంతులేకుండా మాట్లాడుతూ వుంటుంది. అదంతా వట్టి వూహలపోగు అయిన ఆదర్శవాదం అనబడే చెత్త. నిజంగా హింస జరిగినప్పుడు, అంటే యీ దేశానికీ, పక్కనే వున్న మరో దేశానికీ మధ్య యుద్ధం జరిగినప్పుడు, అందరూ హాయిగా ఆ యుద్ధంలో పాల్గొన్నారు; ఎంతో యిష్టంగా. సరే, వాస్తవంలో హింసాత్మకంగా వుండి, అహింస అనే ఆదర్శం మీకు వుంటే సంఘర్షణ బయలు దేరుతుంది. అహింసాత్మకంగా అవాలని మీరు సదా ప్రయత్నిస్తూ వుంటారు- సగం సంఘర్షణ అందువల్లే. హింసాత్మకంగా వుండకుండా మిమ్మల్ని మీరు క్రమశిక్షణలో పెట్టుకుంటారు- ఇందులో మళ్ళీ సంఘర్షణ వుంటుంది, ఒత్తిడి వుంటుంది. కాబట్టి, మీలో హింస వుండి, అహింస అనే ఆదర్శాన్ని అవలంబిస్తే, మొత్తం మీద మీరు హింసాత్మకంగా వున్నట్లే.

హింస మీలో వున్నదని గ్రహించడమే మొట్టమొదట మీరు చేయివలసినది- అహింసాత్మకంగా అవాలని ప్రయత్నించడం కాదు. హింసను వున్నదాన్ని వున్నట్లుగా చూడటం, దానిని మార్చడానికి ప్రయత్నించకుండా, క్రమశిక్షణలో పెట్టకుండా, ఎదుర్కొని తట్టుకోకుండా, అణచివేయకుండా, దానిని మీరు అప్పుడే ప్రప్రథమంగా చూస్తున్నట్లుగా చూడటం- అంటే ఏ ఆలోచనా లేకుండా దానిని పరికించడం.

ఒక చెట్టును అమాయకమైన స్వచ్ఛత్వంతో పరికించడం అంటే అర్థం ఏమిటో మునుపు వివరించి చెప్పాను- అంటే ఒక మనోబింబం అనేది లేకుండా దానివైపు చూడటం. అదే విధంగా హింసను కూడా ఒక మనోబింబం లేకుండా చూడాలి; అసలు హింస అన్న మాటలోనే ఆ బింబం కలిసిపోయివుంది. ఆలోచన యొక్క కదలిక లేకుండా దానివైపు చూడటం అంటే మొట్టమొదటిసారి దానివైపు చూస్తున్నట్లుగా చూడటం- కాబట్టి అమాయకత్వంతో దానివైపు చూడటం.

ఇది మీరు గ్రహిస్తున్నారని ఆశిస్తాను, ఎందుకంటే యిది అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం. తన లోపల వున్న సంఘర్షణను కనుక మానవుడు పూర్తిగా తొలగించుకో గలిగితే, అన్ని విధాలా విభిన్నమైన ఒక నవ్య ప్రపంచాన్ని అతను తయారు చేయగలుగుతాడు. అప్పుడు అది సమూలంగా జరిగిన విప్లవం అవుతుంది. అందుకని, మనం అడుగుతున్నది ఏమిటంటే, మానవుడు, నిబద్ధీకరణం చెందిన యీ జీవి, తన నిబద్ధీకరణం అంతటినీ బ్రద్దలు చేసుకొని బయట పడగలడా? అది జరిగితే అటుపైన అతను ఒక హిందువుగానో, ముస్లింగానో, కమ్యూనిస్టుగానో, అభిప్రాయాలతో, సిద్ధాంతాలతో నిండిపోయిన సోషలిస్టుగానో వుండిపోడు. అవన్నీ సమాప్తమయి పోతాయి. విషయాలను నిజంగా ఎట్లా వున్నాయో అట్లా చూడటం మీరు ఆరంభించినప్పుడు మాత్రమే యిది సాధ్యమవుతుంది.

చెట్టుని చెట్టులాగే చూడాలి; చెట్టు ఎట్లా వుంటుంది అని మీరనుకుంటుంటారో దానిని కాదు. భార్యవైపో, భర్తవైపో చూస్తున్నప్పుడు అతడు కాని, ఆమెకాని నిజంగా ఎట్లా కన్పిస్తున్నారో దానినే చూడాలి తప్ప, ఆ వ్యక్తి గురించి మీరు తయారు చేసుకున్న కాల్పనిక స్వరూపం ద్వారా కాదు. అప్పుడే వాస్తవాన్ని మాత్రమే, 'వున్నది' ని మాత్రమే మీరు చూడగలుగుతారు. అంతే తప్ప, మీ వ్యక్తిగతమైన అభిలాషలతోనూ, అభిరుచులను బట్టీ, పరిస్థితుల ప్రభావాన్ని బట్టీ వ్యాఖ్యానించుకోవడానికి ప్రయత్నించరు. పరిస్థితులు మనల్ని అదుపు చేస్తూ వుంటాయి. మన అభిలాష, మన అభిరుచి మనల్ని నడిపిస్తూ వుంటుంది. అందువల్లనే 'యదార్థంగా వున్నది' ని చూడనే చూడం, 'యదార్థంగా వున్నది' ని చూడటమే అమాయకమైన స్వచ్ఛత్వం. అప్పుడే మనసు ఒక బ్రహ్మాండమైన మార్పును పొందుతుంది.

ఇదంతా మీకు అర్థం అవుతున్నదో లేదో నాకు తెలియదు. ఒక చిన్న పిల్లవాడికి, నీవు హిందువు అని మీరు నేర్పిస్తారు; నీవు నల్లగా వున్నావు అనీ, నీ రంగు యిదీ అనీ, మరొకరికి నీవు క్రైస్తవుడివి అనీ నేర్పిస్తారు. ఇటువంటివన్నీ మీరు నేర్పిస్తారు; నేర్పించి, ఆ విధంగా అతన్ని అదుపు ఆజ్ఞల్లో పెట్టి నిబద్ధీకృతుడిని చేస్తారు. ఇప్పుడు మేము అంటున్నదేమిటంటే యీ నిబద్ధీకరణాన్ని బ్రద్దలు చేయాలంటే, నేను హిందువును అనే, నేను ముస్లింను అనే, కమ్యూనిస్టును అనే, క్రైస్తవుడిని అనే దృష్టితో ఆలోచించకుండా, విషయాలను యదార్థంలో ఎట్లా వున్నాయో అట్లా చూసే ఒక మనిషిని అనే వైఖరితో ఆలోచించడం అవసరం. అంటే నిజమైన అర్థం, వాటి విషయంలో చనిపోవడం.

మీకు తెలుసు, మనలో చాలామందికి మరణం అంటే ఒక భయానకమైన విషయం. చిన్నా, పెద్దా, వృద్ధులూ రకరకాల కారణాల వల్ల మరణం అంటే, అంతా ఒకటే తీరుగా భయపడతారు. మనం యిట్లా భయపడుతూ వుంటాం కాబట్టి అనేక రకాల సిద్ధాంతాలు కనిపెట్టాం- పునర్జన్మ, పునరుజ్జీవనం- మరణం వున్నది అనే అసలు వాస్తవాన్నుండి పారిపోవడానికి ఎన్నో రకరకాల దారులు. మరణం అజ్ఞేయమైనది (తెలియరానిది). మీ భర్తని గురించో, భార్యని గురించో మీ వద్ద వున్న కాల్పనిక రూపం తప్ప అతన్ని గురించి కానీ, ఆమెని గురించి కానీ మీకు తెలియదు. అదే విధంగా మరణం గురించి కూడా నిజంగా మీకు ఏమీ తెలియదు. ఇది అవగాహన అయిందా? మరణం అనగానే అదేదో తెలియనిది, అదేదో భయంకరమైనది. మీరు అనబడే ఒక జీవి పూర్తిగా నిబద్ధీకరణం చెంది వున్నాడు. అతనిలో వున్నదంతా అతని ఆందోళనలు, అతని అపరాధభావం, అతని క్షోభ, అతని బాధలు, అతిస్వల్పమైన అతని సృజనాత్మక శక్తీ, అవీ యివీ చేయడంలో అతని ప్రతిభ; అతను అంటే యిదంతా. తనలోని వన్నీ ఖండిస్తూ, అణచివేస్తూ వుండటమే అతని ఆలోచనల తత్వం. కాబట్టి, తనకు తెలిసినవన్నీ పోగొట్టుకుంటానేమోనని అతను భయపడుతుంటాడు. ఆలోచించడం అనేది లేనట్లయితే, 'నా' వుండదు; భయం అనేదీ వుండదు. కాబట్టి తెలియని దానిని గురించి యీ భయాన్ని సృష్టించినది ఆలోచనలు.

మరణంలో రెండు విషయాలు కలిసిపోయి వుంటాయి. భౌతికమైన ముగింపుతో పాటుగా మానసిక సంబంధమైన ముగింపు కూడా వుంది. అందుకని మనిషి ఏమంటాడంటే ఆత్మ అనేది ఒకటి వున్నది, అది ఎప్పటికీ కొనసాగుతుంది; శాశ్వతంగా వుండిపోయేది ఒకటి వున్నది. నాలోనూ, నీలోనూ; అది ఎప్పటికీ వుంటుందీ అని. ఇప్పుడు, యీ శాశ్వత స్థితిని సృష్టించినది ఆలోచనలు; ఇటువంటి ఆలోచనకు

జన్మనిచ్చినది ఎవరయినా అయ్యుండచ్చు, ప్రాచీనకాలం నాటి ఒక బోధకుడో, ఒక రచయితో, ఒక కవో, ఒక నవలా రచయితో- గొప్ప తత్వ సిద్ధాంతాలు చేసిన మత ప్రవక్త అని మీరు అనుకున్నా అనుకోవచ్చు. ఆత్మ అనే యీ భావనని, శాశ్వతమైన సత్యం అనే ఒకదానిని, తన ఆలోచన ద్వారా అతను సృష్టించాడు. మనం ఆ ఆలోచనను పట్టుకొని దాని వెనకాల వెళుతూ వుంటాం. ఆ నిబద్ధతలో చిక్కుకుని పోతాం. కమ్యూనిస్టులు కూడా యింతే- అయితే శాశ్వతమైనది ఒకటి వున్నదని వాళ్ళు నమ్మరు. వాళ్ళకు ఏదో బోధించారు, దాని ప్రకారం వాళ్ళు ఆలోచిస్తుంటారు. శాశ్వతమైనది ఒకటి వున్నదనే నమ్మకాన్ని మీకు బోధించినట్లుగానే, శాశ్వతంగా వుండేది ఏదీ లేదు అనే నమ్మకాన్ని వారికి బోధించారు. వారూ మీరూ అంతా సమానులే. ఒకరికి నమ్మకం వుంది, ఒకరికి నమ్మకం లేదు. నమ్మకం అనేది మిమ్మల్నీ, వారినీ అందర్నీ నిబద్ధుల్ని చేసింది.

సరే, మరొక వివాదం కూడా దీనికి సంబంధించినది వుంది. అది ఏమిటంటే ఆలోచన ఎప్పటికీ కొనసాగుతూ వుంటుందా అని. ఆలోచనకు మీరు బలం చేకూరుస్తూవుంటే అది కొనసాగుతుంది. అంటే మీరు ప్రతి రోజూ మిమ్మల్ని గురించి, మీ కుటుంబాన్ని గురించి, మీ దేశాన్ని గురించి, మీ కార్యకలాపాల గురించి, మీరు వుద్యోగం చేయడం గురించి, పని చేయడం, ఆలోచించడం, పనిచేయడం, ఆలోచించడం యిదంతా చేస్తుండటంవల్ల ఒక కేంద్రస్థానాన్ని తయారు చేస్తారు; అందులో వున్నది ఆలోచనల రూపంలో వున్న జ్ఞాపకాల మూట. ఇక, ఆలోచన తనకు తానుగా కొనసాగుతూ వుంటుందా అనే విషయం విచారణ చేసి తీరాలి. ప్రస్తుతం సమయం తక్కువగా వున్నది కాబట్టి అందులోకి మనం పోవద్దు.

మరణం అంటే మనకు తెలియనిది. స్వచ్ఛత్వం అనే అమాయకత్వంతో దాన్ని చూద్దామా? అర్థమయిందా మీకు? ఆ ఆకులమధ్యనుండి ప్రసరిస్తున్న చంద్రుడి కాంతిని యిదే ప్రప్రథమంగా చూస్తున్నట్లుగా చూడగలనా; ఆ కాకులు చేస్తున్న ధ్వనిని యిదే మొట్టమొదటిసారిగా వింటున్నట్లుగా వినగలనా, నాకు తెలిసిన దంతా వదిలివేసేసి పూర్తిగా అమాయకంగా? అంటే ఏమిటంటే, నిన్న అనబడే, నాకు తెలిసిన వాటికి అన్నింటికీ చనిపోవడం. నిన్నటి స్మృతిని మోసుకొని రాకుండా వుండటమే చనిపోవడం అంటే. మీరు అది యదార్థంగానే చేయాలి- దానిని గురించి అంతులేకుండా సూత్రీకరిస్తూ వుండటం కాదు. ఇందులోని ప్రాధాన్యాన్ని గ్రహించినప్పుడు మీరు తప్పకుండా చేస్తారు. దీనికి ఒక పద్ధతి అన్నది లేదని, ఒక విధానం అనేది లేదని కూడా మీరు గ్రహిస్తారు. ఎందుకంటే ప్రమాదకరమయినది ఏదయినా చూసినప్పుడు, వెంటనే ఆ క్షణంలోనే మీరు చర్య చేస్తారు. అదే విధంగా,

ఒకప్పుడు వుండిన దాని కొనసాగింపు మాత్రమే కలిగివున్న మనస్సు నూతనమైనది ఏదీ సృష్టించలేదని మీరు గ్రహిస్తారు. వైజ్ఞానిక రంగంలో కూడా మనస్సు పూర్తిగా ప్రశాంతంగా వున్నప్పుడే నూతనా విష్కరణలు సాధ్యమవుతాయి. కాబట్టి, నిన్నలకు, స్మృతులకు, గాయాలకు, సుఖాలకు చనిపోవడం అంటే అమాయకంగా, స్వచ్ఛంగా అవడం. మృత్యు రాహిత్యం, అంటే మరణం లేకుండా శాశ్వతంగా కొనసాగడం కంటే అమాయకత్వం చాలా ఎక్కువ ప్రాధాన్యం కలది. ఆలోచన అమాయకత్వాన్ని తాకలేదు. అయితే మృత్యురాహిత్యాన్ని ఆలోచన ముస్తాబు చేసి తయారు చేస్తుంది.

కాల్పనిక బింబాన్ని తయారుచేసే యంత్రాంగం నడవడానికి అధారం శక్తి. ఈ శక్తికి వున్న ముఖ్య సూత్రం ఏమిటంటే సుఖాన్ని వెతుక్కోవడం. మనం చేస్తున్నది అదే. అదే కదూ? మనకందరికీ సుఖం కావాలి. ఆ సూత్రం మీదే మనం పనిచేస్తూ వుంటాం. ఆ సూత్రం మీదే మన చర్యలన్నీ వుంటాయి. మన నీతి సూత్రాలు, మన సామాజిక సంబంధ బాంధవ్యాలు, దేవుడు అని అంటుంటారే- దానికోసం అన్వేషణ యింకా యితరాలు- అవన్నీ సుఖం కోసమే, సుఖలాలసను తృప్తిపరచడంకోసం చేసేవే, సుఖం అంటే కోరికను ఆలోచన ద్వారా కొనసాగించడం, ఎప్పటికీ వుండేలాగా.

అమ్మా, మేడం! దయచేసి యిదంతా కాగితం మీదికి ఎక్కించకండి. దీనికి పరీక్షలు లేవు. నోట్సు రాసుకొని యింటికి తీసుకెళ్ళి, ఆలోచించి, ఆ పైన సమాధానాలు వ్రాసెయ్యడానికి. మనం అందరం కలిసి యీ పని చేస్తున్నాం. మీరు క్రియ చేస్తూ వున్నప్పుడు తక్కినవాటికి వ్యవధానం లేదు. మీరు యదార్థంగా జీవిస్తున్నప్పుడు, అదే ప్రస్తుతం. రేపు కాదు. మీరు యిది గాఢంగా అర్థం చేసుకుంటూ వుంటే, నోట్సు రాసుకోవడానికి మీకు సమయం వుండదు. దయచేసి వినండి.

వినడం అంటే నేర్చుకోవడం. నేర్చుకోవడం అంటే కూడబెట్టుకోవడం కాదు. అంటే మీరు నేర్చుకున్న తరువాత, ఆ నేర్చుకున్న దానిలో నుంచే మీ చర్యలు వుంటే- అటువంటి నేర్చుకోవడం వట్టి కూడబెట్టుకోవడమే అవుతుంది. కూడబెట్టు కున్నాక, ఆ కూడబెట్టిన వాటిని ఆధారం చేసుకొని మీ చర్యలు వుంటాయి. ఆ విధంగా మీరు ఘర్షణను సృష్టిస్తారు. మీరు కనుక వింటుంటే, అంతకంటె చేయ వలసినది యింకేమీ వుండదు. మీరు చేయవలసినదంతా కేవలం వినడమే. ఆ చెట్టువైపు చూసినట్లుగా, ఆ చంద్రుడి వైపు చూసినట్లుగా, ఏ ఆలోచన లేకుండా, ఏ తాత్పర్యాలూ చెప్పుకోకుండా. ఊరికే వింటూ వుండండి. అందులో ఎంతో సౌందర్యం వుంది. ఆ వినడమే స్వీయాన్ని పూర్తిగా పరిత్యజించడం. అట్లా చేయని పక్షంలో మీరు వినలేరు.

గాఢమైన వుద్వేగం మీలో వున్నప్పుడే మీరు వింటారు. ఏ విషయమైనా సరే, దాని కోసం మిమ్మల్ని మీరు సంపూర్ణంగా పరిత్యజించుకో లేక పోతే మీలో గాఢోద్వేగం లేనట్లే. ఆ విధంగా మీ స్వీయాన్ని సంపూర్ణంగా పరిత్యజించి వింటూ వుంటే మీకు సాధ్యమైనదంతా మీరు చేసినట్లే. ఎందుకంటే అప్పుడు సత్యాన్ని మీరు చూస్తారు. ప్రతి రోజులోను వుండే సత్యాన్ని, ప్రతి ఒక్క చర్యలోను వుండే సత్యాన్ని, ప్రతి ఆలోచనలోను, ప్రతి రంగంలోనూ వున్న సత్యాన్ని వున్నది వున్నట్లుగా చూస్తూ వుంటారు. రోజువారీ జీవితపు కదలికలోని, రోజువారీ కార్యకలాపాలలోని, నిత్యకృత్యపు పనిలోని, నిత్యజీవితపు ఆలోచనలలోని సత్యాన్ని చూడటం ఎట్లాగో మీకు తెలియకపోతే మీరు దీనికి ఆవలగా ఎన్నటికీ పోలేరు; చేతనావర్తపు పరిధులకు ఆవలగా ఏమున్నదో దానిని మీరు ఏనాటికీ కనుక్కోలేరు.

కాబట్టి, మేము యింతకు ముందు చెప్పినట్లుగా, స్వేచ్ఛని అవగాహన చేసుకోవడం దానికి సంబంధించిన క్రమశిక్షణను కూడా తీసుకొస్తుంది. ఆ క్రమశిక్షణ అనుసరణ కాదు, లొంగిపోయివుండటం కాదు; ఉదాహరణకు, మరణంవైపు మీరు చాలా సావధాన శీలతతో చూడగలుగుతారు; ఆ చూడటమే క్రమశిక్షణ. మేము చెప్పినట్లుగా చేతనావర్తం పరిమితులు కలది. ఈ పరిమితుల వరకు ఆలోచనకు అందుబాటులోనే వుంటుంది. అయితే యీ పరిమితులను పగలగొట్టుకొని ఆలోచన దాటిపోలేదు. ఈ నిబద్ధీకరణాన్ని బ్రద్దలు చేయాలంటే ఎంతటి మానసిక విశ్లేషణ కానీ, ఎటువంటి తత్వశాస్త్రాలు కానీ, ఎంతటి శారీరక క్రమశిక్షణ కానీ సరిపోదు. ఆలోచనకి సంబంధించిన యంత్రాంగాన్నంతా అవగాహన చేసుకున్నప్పుడు మాత్రమే దీనిని బ్రద్దలు చేయగలుగుతాం. ఇంతకు ముందే చెప్పినట్లుగా ఆలోచన పాతది, కొత్తవాటిని ఏనాటికీ కనిపెట్టలేదు. తను ఏమీ చేయలేను అనే సంగతిని ఆలోచన గ్రహించుకున్నప్పుడు, ఆలోచన అనేదే అంతమై పోతుంది. ఆ విధంగా చేతనావర్తం యొక్క పరిమితులను బ్రద్దలు చేయడం జరుగుతుంది.

ఈ బ్రద్దలు చేసి దాటుకొనిపోవడమే పాతదానికి చనిపోవడం. ఇది ఒక సిద్ధాంతం కాదు. దీనిని అంగీకరించనూ వద్దు, నిరాకరించనూ వద్దు. 'ఇది చాలా మంచి యోచన' అనీ అనకండి, చేయండి. అప్పుడు నిన్నకు చనిపోవడంలో అమాయక శీలత వుద్భవిస్తుందని మీ అంతట మీరే కనిపెడతారు. అప్పుడు ఆ అమాయకత్వంలో నుండి పూర్తిగా విభిన్న కరమైన చర్య వస్తుంది. మానవులు దీనిని కనిపెట్టనంతవరకు, వాళ్ళు ఏంచేసినా సరే ఎన్ని సంస్కరణలు, ఎన్ని పూజా పునస్కారాలు, ఎన్ని రకాల పలాయనాలు, ఐశ్వర్యాన్ని ఆరాధించడం వంటివి ఎన్ని చేసినా సరే- వాటి వల్ల లాభం లేదు.

స్వీయాన్ని సమస్తమూ పరిత్యజించడం ద్వారా మాత్రమే కలిగే అమాయక శీలత ఎక్కడ వుంటుందో అక్కడ ప్రేమ వుంటుంది. ప్రేమ లేనప్పుడు, అమాయక శీలత లేనప్పుడు జీవితమే వుండదు. చిత్రహింస మాత్రం వుంటుంది, సంఘర్షణ మాత్రమే వుంటుంది. అమాయకత్వమూ, ప్రేమా వున్నప్పుడు పూర్తిగా భిన్నమైన ఒక కొత్త స్థితి అక్కడ వుంటుందని మీరు తెలుసుకుంటారు. దీనిని గురించి మరొకరు ఎవరూ మీకు చెప్పలేరు. ఎవరయినా చెప్పినా అది నిజం కాదు. తమకు తెలుసును అనేవారికి- నిజంగా ఏమీ తెలియదు. అయితే, యిది అవగాహన చేసుకున్న వ్యక్తి చల్లగా, చాపకింద నీరులాగా, అజ్ఞాతంగా పూర్తిగా విభిన్నమైన మరో ఆయతన స్థితిలో అడుగుపెడతాడు అది పరిశీలకుడు, పరిశీలితము అన్న వాటి మధ్యన వున్న ఎడాన్ని తొలగించడం వంటిది. ఆ స్థితి పరిశీలకుడు, పరిశీలితము వేరువెయిగా వుండే స్థితి కాదు, దానికి పూర్తిగా భిన్నమైనది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, XVII వాల్యూమ్,*
*రెండవ ప్రసంగం, బొంబాయి, 22 ఫిబ్రవరి, 1967*

# తనని తాను తెలుసుకోవడం లేకుండా ధ్యానం వుండదు

మనం క్రిందటిసారి యిక్కడ కలుసుకున్నప్పుడు సంపూర్ణమైన విప్లవం ఒకటి- అంతర్గతమైనదీ, బాహ్యమైనదీ కూడా అయిన ఒక విప్లవం- రావలసిన అవసరం గురించి మాట్లాడుకున్నాం. ప్రపంచంలో శాంతి వుండాలంటే క్రమత- బయటవుండే క్రమతే కాకుండా, అంతకంటె ముఖ్యంగా అంతర్గతంగా క్రమత- ఆవశ్యకమని మేము చెప్పాము. ఈ క్రమత అంటే రోజూ వరుసగా ఒకటే పనులు చేయడం వంటిది కాదు. క్రమత సజీవమైనది; కేవలం మేధతోను, సిద్ధాంతాలతోను, ప్రవర్తనను రకరకాల నిర్బంధాలకు లోను చేయడం ద్వారాను క్రమతను తీసుకొనిరావడం సాధ్యంకాదు. పాతది అయిన ఆలోచన, గతంలో అది ఏర్పరుచుకున్న నమూనాలో తప్ప పనిచేయలేదని కూడా మేము చెప్పాము. ఆలోచన ఎప్పుడూ పాతదే అయివుంటుంది. క్రమతను తీసుకొని రావడం ఆలోచనవల్ల సాధ్యంకాదు, ఎందుకంటే మేము యిప్పుడే చెప్పినట్లుగా క్రమత సజీవమైనది. పైగా యీ ప్రపంచంలో క్రమరాహిత్యాన్ని తీసుకొచ్చిందే ఆలోచన.

అదంతా మనం చాలావరకు వివరంగా మాట్లాడుకున్నామనే అనుకుంటున్నాను. క్రమత అంటే ఏమిటి అని కాకుండా క్రమరాహిత్యాన్ని కలిగించేది ఏమిటో మనం

చర్చించాలి అని కూడా మేము అన్నాం. ఎందుకంటే క్రమరాహిత్యం అంటే ఏమిటి అన్నది అవగాహన చేసుకోగానే, గ్రహించగానే, కేవలం మేధాపరంగా కాదు, యదార్థంగా క్రమరాహిత్యపు సమస్త స్వరూపాన్ని చూడగానే- అప్పుడు క్రమరాహిత్యం గురించిన ఆ సంపూర్ణమైన అవగాహనలోనుండి క్రమత జన్మిస్తుంది.

ఇది అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం; ఎందుకంటే మనలో చాలామంది చేసిందే మళ్ళీ మళ్ళీ చేస్తుండటం ద్వారా క్రమతను సాధించవచ్చని అనుకుంటారు; నలభై ఏళ్ళపాటు ఒకే ఆఫీసుకి వెళ్ళగలిగితే, ఒక యింజనీరుగా గాని, ఒక శాస్త్రవేత్తగాగాని ఒకే పద్ధతిలో పని చేస్తుంటే క్రమతను తీసుకొచ్చినట్లు అని మనం అనుకుంటాం. కాని ప్రతిరోజూ ఒకే వరుస క్రమంలో పనులు చేయడంకాదు క్రమత అంటే. ఈ వరుస కార్యక్రమమే అస్తవ్యస్తతకు దారితీసింది. బాహ్యంగానూ, అంతర్గతంగానూ కూడా అస్తవ్యస్తత వున్నది. అందులో ఏ సందేహమూ లేదు. అంతటా పరచుకున్న అల్లకల్లోలం వున్నది, బాహ్యంగానూ, అంతర్గతంగానూ కూడా. ఈ అల్లకల్లోలంలో నుంచి బయట పడే మార్గం కోసం మనిషి తడుముకుంటున్నాడు, చేతులెత్తి అర్థిస్తున్నాడు, గొంతు చించుకొని అరుస్తున్నాడు, కొత్త నాయకులను వెతుక్కుంటున్నాడు. ఒక కొత్త నాయకుడు - రాజకీయనాయకుడు కాని, మతాధిపతి కాని దొరుకుతే అతన్ని అనుసరిస్తాడు. అంటే అర్థం, మనిషి యాంత్రికంగా అలవాటైన ఒక రోజువారీ కార్యక్రమాన్ని, ఒక ఆశయాన్ని, ఒక పద్ధతిని అనుసరించడానికి సిద్ధంగా వుంటాడూ అని.

అయితే, యీ క్రమరాహిత్యం- అంటే అస్తవ్యస్తత ఎట్లా వచ్చిందీ అని కనుక పరిశీలిస్తే, ఎక్కడయితే ఆధిపత్యం, ముఖ్యంగా అంతర్గత ఆధిపత్యం వుంటుందో అక్కడ అస్తవ్యస్తత వున్నదని గ్రహిస్తాం. అంతర్గతమైన యింకొకరి ఆధిపత్యాన్ని బోధకుడిదో, గురువుదో, గ్రంథానిదో, మరొకరిదో- మనం అంగీకరిస్తాం. అంటే యింకొకరిని- వారి నియమ సూత్రాలను, వారి బోధలను, వారి ఆజ్ఞలను, వారి ఆధిపత్యాన్ని ఒక యంత్రంలాగా అనుసరించడం ద్వారా మన లోపల క్రమతను తేగలుగుతామని ఆశపడతాం. శాంతి కావాలంటే క్రమత అవసరం. అయితే ఒక ఆధిపత్యం వెనకాల మనం పరుగులు పెట్టి, అనుసరించి సాధించిన క్రమత్వం వల్ల గందరగోళమే కలుగుతుంది. ప్రపంచంలో, ముఖ్యంగా యీ దేశంలో ఏం జరుగు తున్నదో మీరు పరిశీలించవచ్చు. ఇక్కడ యింకా ఆధిపత్యపు పరిపాలనే సాగుతున్నది. ఇక్కడ అంతర్గత ఆధిపత్యం, శాసించడం, మరొకరిని అనుసరించాలనే బలమైన కాంక్ష చాలా పటిష్ఠంగా వేళ్ళూతన్నుకొని వున్నాయి. ఇదంతా యిక్కడి సంప్రదాయంలోని, యిక్కడి సంస్కృతిలోని అంశం. అందువల్లనే యిక్కడ ఎన్నో చిన్నా, పెద్దా ఆశ్రమాలు

వున్నాయి. ఇవన్నీ నిజంగా చూస్తే కాన్‌సెంట్రేషన్ కేంపులు, అంటే మారణ శిబిరాలు. ఎందుకంటే అక్కడ మీరు చేయవలసినవాటి గురించి వాళ్ళు చాలా నిష్కర్షగా వుంటారు. ఆధ్యాత్మిక ఆచార్యులని అంటారే, వారిదే అక్కడ సర్వాధిపత్యం. తక్కిన కాన్‌సెంట్రేషన్ కేంపుల్లోలాగే యిక్కడా మిమ్మల్ని సర్వనాశనం చేయాలని చూస్తారు. మిమ్మల్ని ఒక కొత్త చట్రంలో బిగించాలని ప్రయత్నిస్తారు. అభిప్రాయాలను మార్చడానికి, ఆలోచనా వైఖరిని మార్చడానికి, మనుష్యుల మీద ఒత్తిడి ప్రయోగించడానికి రష్యాలోని కమ్యూనిస్టులు, నియంతృత్వ ప్రభుత్వాలు కాన్‌సెంట్రేషన్ కేంపులు (మారణ శిబిరాలు) నిర్మించాయి. సరిగ్గా అదే యిక్కడ కూడా జరుగుతువ్నది. ప్రపంచంలో అల్లకల్లోలం ఎక్కువవుతున్నకొద్దీ ఆశ్రమాలు అనబడేవి కూడా ఎక్కువవుతున్నాయి. ఇవి మీకొక అద్భుతమైన భవిష్యత్తుని ప్రసాదిస్తామని నమ్మిస్తూ, మనుష్యులని పూర్తిగా వక్రంగా తయారు చేయడానికి, ఒకే నమూనాలో అచ్చుపోయడానికి, ఒక ప్రత్యేకమైన వరవడిలోకి వారిని నిర్బంధించడానికి ప్రయత్నిస్తున్న కాన్‌సెంట్రేషన్ కేంపులు. మూర్ఖులు యిదంతా నమ్ముతారు. తమకు భౌతికమైన భద్రత లభిస్తుంది కాబట్టి వీటన్నింటికీ అంగీకరిస్తారు. అక్కడి సర్వాధికారి, నియమ సూత్రాల బోధకుడు, గురువు ఏం చెప్తే మీరు ఖచ్చితంగా అదే చేయాలి. అయితే, యివన్నీ అందరూ ఎంతో యిష్ట పూర్వకంగానే చేస్తుంటారు. ఎందుకంటే దీని ద్వారా స్వర్గమో, ఏదో ప్రాప్తిస్తుందనీ యీ లోపల యిక్కడ భౌతికమైన రక్షణ లభిస్తుందనీ. ఈ విధమైన యాంత్రిక విధేయత- అసలు విధేయత అంటేనే యాంత్రికం- విపరీతమైన అస్తవ్యస్తతను పెంచి పోషిస్తుంది. చరిత్ర పుటలు తిరగేసినా, జీవితంలో ప్రతినిత్యం జరుగుతున్న సంఘటనలు గమనించినా యిది మనం గ్రహించవచ్చు.

అందుకని, అస్తవ్యస్తత అంటే ఏమిటో తేట తెల్లంగా తెలుసుకోవాలంటే అస్తవ్యస్తతకు గల కారణాలేమిటో అవగాహన చేసుకోవాలి. ఇంకొకరెవరో విశ్వాస భరితంగా చెప్పిన మాటలు నమ్మి పరమసత్యాన్ని సాధించాలని పూనుకోవడమూ, అన్వేషించ బూనడమూ అస్తవ్యస్తస్థితికి గల ప్రధానకారణం. మనలో చాలామంది గందరగోళపు స్థితిలో వున్నారు కాబట్టి, మనలో చాలా మంది విపరీతమైన ఆందోళనలో వున్నారు కాబట్టి, సౌఖ్యవంతమైన ఆధ్యాత్మిక జీవనాన్ని యిస్తాము, అని ఎవరైనా నమ్మకంగా చెప్తే, వారిని అనుసరించడానికి తయారవుతాం. ఇది చాలా విచిత్రమైన విషయం- రాజకీయాల్లో నిరంకుశత్వాన్ని, నియంతృత్వాన్ని మనం వ్యతిరేకిస్తాం. అభ్యుదయ దృక్పథమూ, నాగరికతా ఎక్కువైన కొద్దీ, ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఎక్కువైనకొద్దీ, రాజకీయ, ఆర్థిక రంగాలలో నిరంకుశత్వాన్నీ, నియంతృత్వాన్నీ నిరసించడం, ద్వేషించడం ఎక్కువవుతూవుంటుంది. అయితే, అంతర్గతంగా మరొకరి

ఆధిపత్యాన్ని, మరొకరి నిరంకుశత్వాన్ని మాత్రం ఒప్పుకుంటారు. అంటే యింకొకరెవరో సత్యానికి దారి యిది అని ఒక సాధన మార్గాన్ని నిర్ణయిస్తే, దానికి లొంగిపోయి అనుసరించడం కోసం మనసుల్ని మనం వక్రంగా చేసుకుంటాం, మన ఆలోచనల్ని వక్రంగా చేసుకుంటాం, మన జీవిత విధానాన్ని వక్రంగా చేసుకుంటాం. ఈ విధంగా చేస్తున్నప్పుడు మనలోని నిర్దుష్టతను మనం ధ్వంసం చేసుకుంటున్నామన్నమాట. నిర్దుష్టతని అంటే కాంతిని మనంతట మనమే కనిపెట్టాలి తప్ప యింకొకరి ద్వారాగాని, ఒక గ్రంధం ద్వారాగాని, ఒక మహాత్ముడి ద్వారా గాని కాదు. ఈ మహాత్ములంతా సాధారణంగా వక్రబుద్ధిగల మనుష్యులై వుంటారు. చూసేవారికి చాలా నిరాడంబరంగా **కనబడే వారి జీవితాలు అందర్నీ** విస్మయపరుస్తాయి. కాని, వారి **మనసులు మాత్రం** వంకర తిరిగి వుంటాయి. వాళ్ళ దృష్టిలో పరమసత్యం అని అనుకుంటున్నదానిని వాళ్ళే తయారు చేసి పెడుతుంటారు.

అయితే, అస్తవ్యస్తతను పూర్తిగా అర్థం చేసుకోవాలంటె, ఆధిపత్యం యొక్క సమస్త స్వరూపాన్ని, అంతర్గతంగా వుండేదానిని, బాహ్యంగా వుండే దానిని కూడా అవగాహన చేసుకోవాలి. బాహ్య ప్రపంచంలో వుండే ఆధిపత్యాన్ని మనం కాదనలేము. అది అవసరం కూడా. ఏ నాగరిక సమాజంలోనైనా అది అవసరమే. అయితే మేము మాట్లాడుతున్నది యింకొక మనిషి ఆధిపత్యం గురించి. అంటే, అందులో యీ వక్త ఆధిపత్యం కూడా వుంటుంది. మనమంతా యీ సమాజంలోని వారమే కాబట్టి, మనలో ప్రతి ఒక్కరం కలిగించే అస్తవ్యస్తతను అర్థం చేసుకుంటే తప్ప క్రమతను సాధించలేము. మనమే యీ సమాజ స్వరూపాన్ని నిర్మించాము, యీ సమాజంలోనే మనం చిక్కుకొని పోయాం. జంతువుల నుండి సంక్రమించిన జంతులక్షణాలకు వారసులమైన మనం, మానవజాతికి చెందిన మనం, మనుష్య ధర్మంగా కాంతిని, క్రమతను కనిపెట్టాలి. అయితే యీ కాంతినీ, క్రమతనూ లేదా అవగాహనను ఎవరో మరొక మనిషి ద్వారా కనిపెట్టలేము. ఆ మనిషి ఎవరయినా సరే- ఎందుకంటే యింకొక మనిషి అనుభవాలు బూటకమై వుండచ్చు. అన్ని అనుభవాలనూ ప్రశ్నించి తీరాలి. అవి మీవయినా సరే, మరొకరివైనా సరే; అనుభవం అంటే స్మృతులను మూటగట్టుకొని అవే కొనసాగించు కుంటూ వుండటం. ఒక స్పందనకు మనం యిచ్చే ప్రతిస్పందనను తమ నిబద్ధీకరణను బట్టి స్మృతులు మార్చి వేస్తూవుంటాయి. అంటే- అనుభవం కలగడం అంటే ఒక స్పందనకు ప్రతిస్పందించడం, అవునా కాదా?

అనుభవం మన వెనకటి నేపథ్యాన్ని అనుసరించే ప్రతిస్పందించగలదు. మీరు ఒక హిందువో, ముస్లిమో, క్రిస్టియనో అవుతే ఆయా మతాలు మిమ్మల్ని నిబద్ధుల్ని

చేస్తాయి. మీ మీ సంస్కృతులు మిమ్మల్ని నిబద్ధీకృతులని చేస్తాయి; ఆ నేపథ్యమే మీ రకరకాల అనుభవాలను చిత్రిస్తుంది. మీ సామర్థ్యం, చాతుర్యం వుపయోగించి మీరు ఆ అనుభవాలకు వ్యాఖ్యానాలు కల్పించి చెబుతూ వుంటారు. పదిమందీ మిమ్మల్ని గౌరవిస్తూ వుంటారు. దీనితో పాటుగా వుండే ఆ తమాషా, అదంతా మీకు తెలుసు.

కాబట్టి, యింకొకరి అనుభవాన్నే కాకుండా, మన అనుభవాన్ని కూడా మనం ప్రశ్నించాలి, సందేహించాలి. చేతన సీమను విస్తృతం చేసుకోవడం కోసం కొత్త కొత్త అనుభవాలను వెతుక్కోవడం- వివిధ రూపాల్లో వున్న మాదకద్రవ్యాల వాడకం ద్వారా యిది జరుగుతున్నది- ఇదంతా కూడా చేతనావర్తం లోపలనే జరుగుతుంది, కాబట్టి యిదంతా పరిమితులకు లోబడినదే. అందుకని, ఏ రకమైన అనుభవం కోసం అయినా- ముఖ్యంగా మతసంబంధమైనది అనీ, ఆధ్యాత్మిక సంబంధమైనది అనీ చెప్పుకొనేదాని కోసం- అన్వేషించేవారు ఆ అనుభవాన్ని ప్రశ్నించాలి, సందేహించాలి; అంతేకాకుండా దానిని పూర్తిగా త్రోసి పారేయాలి. చాలా స్పష్టంగా వున్న మనసుకు, సావధాన శీలత్వంతోను, ప్రేమతోను నిండివున్న మనసుకు యింకా ఏవో అనుభవాలు కావాలనే ఆరాటం ఎందుకుంటుంది?

సత్యం అనేదానిని రారమ్మని మనం పిలవలేము. రకరకాల పూజా ప్రార్థనలు, ప్రాణాయామం, ఒక పరమసత్యాన్ని, ఒక అనుభూతిని కనిపెట్టడం కోసం మనుష్యులు చేసే యింకా ఎన్నో గారడీలు- యివన్నీ ఎంతయినా మీరు నిత్యం అభ్యాసం చేస్తూ వుండండి. కాని, సత్యాన్ని మాత్రం యీ విధంగా పిలిచి రప్పించలేరు. కొలతలకు లోబడినది రావచ్చేమో తప్ప, కొలతలకు అందని, అప్రమేయమైనది కాదు. నిబద్ధీకరణం చెందిన మనసుతో అవగాహన చేసుకోలేని ఆ సత్యాన్ని వెంటాడుతున్న వ్యక్తి బాహ్యంగానే కాకుండా, అంతర్గతంగా కూడా అస్తవ్యస్తతను పెంచిపోషిస్తాడు.

కాబట్టి ఆధిపత్యాన్ని పూర్తిగా త్రోసిరాజనవలసిందే. అయితే, అది చాలా కష్టసాధ్యమైన కార్యం. చిన్నతనం నుంచీ ఏదో ఒక ఆధిపత్యం మన మీద పెత్తనం చేస్తూ వస్తుంది. కుటుంబం, తల్లీ దండ్రీ, పాఠశాల, అధ్యాపకుడు మొదలైనవారి ఆధిపత్యంలోనే మనం నడిచాం. శాస్త్రవేత్తకు, సాంకేతిక వైజ్ఞానికుడికీ తప్పకుండా ఆయా రంగాల్లో ఆధిపత్యం వుంటుంది. కాని, ఆధ్యాత్మికమైన ఆధిపత్యం అనబడేది మాత్రం మహా దుర్మార్గమైనది. అదే క్రమరాహిత్యానికి గల ప్రధానకారణాల్లో ఒకటి. ఎందుకంటే అది ప్రపంచాన్ని రకరకాలైన మతాలుగాను, రకరకాలైన సిద్ధాంతాలుగాను విభజించింది.

కాబట్టి, మనస్సుని సమస్తమైన ఆధిపత్యాన్నుండి విడుదల చేయాలంటే తనంటే ఏమిటో తెలుసుకోవాలి. అంటే స్వీయజ్ఞానం. నేను చెప్తున్నది వున్నతంగా వుండే మరో జీవుడు లేదా ఆత్మని గురించి కాదు. అవన్నీ మనసు చేసిన కల్పనలు, ఆలోచన చేసిన కల్పనలు, భయంలో నుండి పుట్టుకొచ్చిన కల్పనలు. మనం మాట్లాడు కుంటున్నది స్వీయం జ్ఞానం గురించి; అంటే తను యదార్థంగా ఏమిటో ఆ తనని తెలుసుకోవడం; తను ఎట్లా వుండాలి అనేది కాదు. తను బుద్ధి హీనుణ్ణని, తను భయపడుతున్నానని, తనకు చాలా ఆకాంక్షలున్నాయని, తను చాలా క్రూరుడినని, తనలో దౌర్జన్యం వున్నదని, అత్యాశ వున్నదనీ గ్రహించడం; తన ఆలోచనల వెనకాల వున్న వుద్దేశ్యాలు, తన చర్యల వెనకాల వున్న వుద్దేశ్యాలు గ్రహించడం- తనని తాను తెలుసుకోవడం ఆవిధంగా ఆరంభమవుతుంది. మీరు ఏమిటో మీకు తెలియకపోతే, మీ మానసిక ప్రక్రియలన్నీ ఎట్లా పనిచేస్తుంటాయో, మీరు ఎట్లా అనుభూతి చెందుతున్నారో, మీరు ఏమి ఆలోచిస్తున్నారో, మీ వుద్దేశ్యాలు ఏమిటో, కొన్ని పనులు మీరు ఎందుకు చేస్తారో, కొన్ని ఎందుకు చేయకుండా తప్పించుకుంటారో, సుఖం కోసం, సంతోషం కోసం మీరు పడే ఆరాటం- యిదంతా కనుక ముఖ్యంగా మీరు తెలుసుకోకపోతే మిమ్మల్ని మీరే మోసం చేసుకునే అవకాశం వుంది; మీకే కాదు, యితరులకి కూడా విపరీతమైన కీడు చేసే ప్రమాదం వుంది. ఈ ప్రాథమికమైన స్వీయజ్ఞానం కనుక లేకపోతే, ధ్యానం అనేదానికి ఆస్కారం లేదు. దానిని గురించి యిప్పుడు మాట్లాడబోతున్నాను.

చూడండి, ప్రపంచమంతటా యువతీయువకులు, పాతుకొనిపోయిన యీ వ్యవస్థను- ప్రపంచాన్ని వికృతం గాను, ఘోరంగాను, అల్లకల్లోలంగాను తయారుచేసిన యీ వ్యవస్థను- త్రోసి పుచ్చుతున్నారు, దానికి వ్యతిరేకంగా తిరగబడుతున్నారు. ఎన్నో యుద్ధాలు జరిగినై. ఒక్క వుద్యోగం కోసం వేలమంది పోటీపడుతున్నారు. పాత తరానికి చెందినవాళ్ళు తమ ఆకాంక్షలు, తమ దురాశ, దౌర్జన్యం, తమ సిద్ధాంతాలు ఆధారం చేసుకొని సమాజాన్ని నిర్మించారు. ఇప్పటి తరంవారు, ముఖ్యంగా యువత, సిద్ధాంతాలన్నింటినీ త్రోసి అవతల పడేస్తున్నారు. బహుశ యీ దేశంలో అది జరగడం లేదేమో; ఎందుకంటే మనం యింకా అంత ఆధునాతనం అవలేదు, యింకా అంత నాగరీకం చెందలేదు, ఆధిపత్యాన్నంతటినీ త్రోసిపుచ్చేంతగా. అయితే, యీ సిద్ధాంతాలను తిరస్కరించిన వాళ్ళు మళ్ళీ తమ కొత్త సిద్ధాంతాలతో యింకో పద్ధతిని సృష్టిస్తున్నారు. పొడుగ్గా జుట్టు పెంచుకోవడం యింకా అటువంటివే మరికొన్నింటిని.

కాబట్టి, తిరుగుబాటు. చేయడంతో సమస్య పరిష్కారం కాదు. సమస్యకు సమాధానం ఏమిటంటే మనలోపల క్రమశీలతను తీసుకొనిరావడం- సజీవంగా వుండే

క్రమతను; రోజువారీ కార్యక్రమం లాంటిది కాదు. రోజూ నిత్యకృత్యం లాగా చేయడమనేది మృతప్రాయమైనది. కాలేజి పరీక్షల్లో వుత్తీర్ణులయీ అవగానే- ఒక వుద్యోగం కనుక మీరు సంపాదించగలుగుతే, ఆఫీసుకు పోవడం మొదలు పెడతారు. ఇక ఆ తరువాత నలభై, యాభై సంవత్సరాలు వరుసగా ప్రతిరోజూ ఆఫీసుకు వెళుతూనే వుంటారు. అటువంటి మనస్సు ఏమయిపోతుందో మీకు తెలుసునా? ఒక దైనందిన కార్యక్రమాన్ని మీరు అలవాటు చేసుకున్నారు; అదే ప్రతి రోజూ మళ్ళీ మళ్ళీ చేస్తూ వుంటారు. పిల్లల్ని కూడా యిటువంటి కార్యక్రమం ప్రతిరోజూ వరుసగా చేయమని ప్రోత్సహిస్తారు. సజీవంగా వున్న ఏ మనిషైనా దీనికి తిరగబడవలసిందే. కాని, "నాకు బాధ్యతలున్నాయి; నేనుండే పరిస్థితుల్లో యిష్టమున్నా లేకపోయినా యిది వదలలేను" అని మీరు అంటారు. ప్రపంచం యిట్లాగే నడుస్తూ వుంటుంది. విసుగెత్తేటట్లుగా చేసినదే చేయడం, మార్పులేని స్తబ్ధత్వం, బొత్తిగా ఏమీ లేని ఖాళీతనం- వీటితో జీవితం సాగిపోతూ వుంటుంది. దీన్నంతటినీ వ్యతిరేకిస్తూ మనిషిలోని వివేకం తిరగబడుతున్నది.

అందువల్ల ఒక కొత్త సక్రమ వ్యవస్థ, ఒక కొత్త జీవిత విధానం వచ్చి తీరాలి. ఆ కొత్త క్రమత, కొత్త జీవితవిధానం రావాలంటే ప్రస్తుతం వున్న అస్తవ్యస్తతని అర్థం చేసుకోవాలి నిరాకరించడం ద్వారానే అసలైనదానిని మీరు అర్థంచేసుకోగలుగుతారు తప్ప, అసలైనదాని కోసం ఆరాటపడటం ద్వారా కాదు. సర్! మీకు అర్థమైందా? ప్రతికూలంగా వుండేదానిని తిరస్కరించినప్పుడు, త్రోసిపారేసి నప్పుడు; మానవులే సృష్టించిన సమస్తమైన సాంఘిక, అంతర్గత అస్తవ్యస్తతలన్నింటినీ మీరు అర్థం చేసుకున్నప్పుడు; ప్రతి ఒక్క మనిషీ ఆకాంక్షల తోన్నూ, అత్యాశలతోనూ, యితరులలో ఆగ్రహద్వేషాలు రగిలిస్తూ, పోటీలు పడుతూ, హోదా కోసం తపిస్తూ, అధికారం కోసం, ఆధిపత్యం కోసం ఆరాటపడుతూ వున్నంత కాలం అతడు అస్తవ్యస్తతను తయారు చేస్తూనే వుంటాడు అనేది అర్థం చేసు కున్నప్పుడు; అస్తవ్యస్తత యొక్క నిర్మాణ స్వరూపాన్ని మీరు అర్థం చేసుకున్నప్పుడు- ఆ అర్థం చేసుకోవడం అన్నదానిలో నుండే క్రమ శిక్షణ వుద్భవిస్తుంది. అణచి వుంచడం ద్వారా కలిగే క్రమశిక్షణ కాదు, అనుకరణ ద్వారా కలిగేదీ కాదు, నిరాకరణ ద్వారానే అసలైన, క్రమశిక్షణ కలుగుతుంది, అదే క్రమశీలత.

కాబట్టి, తనని తాను అవగాహన చేసుకోవడమే వివేకానికి ఆరంభం. వివేకం పుస్తకాల్లో వుండదు, అనుభవంలో వుండదు, మరొకరిని అనుసరించడంలో వుండదు, బోలెడు ధర్మపన్నాలు వల్లించడంలో వుండదు. తనని తాను అవగాహన చేసుకున్న మనస్సులో, ఆలోచన ఎట్లా పుడుతున్నది అనేది అవగాహన చేసుకున్న మనస్సులో

వివేకం వుదయిస్తుంది. మీ రెప్పుడయినా ప్రశ్నించారా, అడిగారా; ఆలోచనకి ఆరంభం ఏమిటి అనీ, ఆలోచన ఎట్లా పుడుతున్నది అనీ, బాగా అర్థం చేసుకోవలసిన చాలా ముఖ్య విషయం యిది. ఎందుకంటే ఆలోచనకు ఆరంభం ఏమిటి అన్నది అర్థం చేసుకుంటే, అప్పుడు బహుశ మీరు, మునుపు జరిగినదానిని పునరుక్తి చేసుకోవడం అనే ఆలోచనల భారం లేని మనసును కనిపెట్టగలుగుతారు. మేము యింతకుముందు చెప్పినట్లుగా ఆలోచన ఎప్పుడూ పాతదే, ఆలోచన కొత్తది ఎప్పటికీ కాలేదు. మీ అంతట మీరు కనిపెడితే తప్ప యింకొకర్లు చెప్పినది చిలకపలుకుల్లాగా తిరిగి అనడం కాదు, ఆ యింకొకరు ఎంత గొప్పవారయినా సరే- ఆలోచనకు మొదలు ఏది, ఆకుపచ్చని చిగురాకును పైకి పంపే బీజం వంటిది ఏది అనేది మీ అంతట మీరే కనుక కనిపెట్టకపోతే నిన్న యొక్క పరిమితులనుండి దాటి ఆవలగా పోవడం మీకు సాధ్యంకాదు.

ఇక, ఆలోచన ఎట్లా ఆరంభం అవుతుందో తెలుసుకోవాలంటే, మీ గురించి మీకు అవగాహన వుండాలి. విశ్లేషణ చేయడం ద్వారా కాదు. విశ్లేషణకు సమయం పడుతుంది. ఉల్లిపాయ మీద ఒక్కొక్క పొర తీసినట్లు. విశ్లేషణ ద్వారా, అంతర్ వీక్షణ ద్వారా, పైకి లేచిన ఒక్కొక్క భావనను వెంటాడి, దాని వెనకాల వున్న కారణమేమిటో పరీక్షించి, మనల్ని అవగాహన చేసుకోవచ్చు అని అనుకుంటాం- కాని దీనంతటికీ సమయం పడుతుంది. అవగాహన చేసుకోవడానికి కాలంపైన ఆధారపడితే, కాలమే క్రమరాహిత్యాన్ని తయారు చేస్తుంది. కాబట్టి కాలం అంటే దుఃఖం. మీకు అర్థమైందా? మీలో నుంచి హింసను నెట్టివేయడానికి మీరు కాలాన్ని తీసుకుంటే, హింస నుండి విమోచనాన్ని ఒక లక్ష్యంగా ఒక ఆదర్శంగా మీరు నెలకొల్పుకుంటే, ఆ లక్ష్యాన్ని చేరుకోవడానికి మీకు కొంత సమయం వుండి తీరాలి; హింసకూ, హింసలేని స్థితికీ మధ్యన వున్న దూరాన్ని మీరు ప్రయాణం చేయాలి. హింసను వదిలించుకోవ డానికి మీరు కొంత సమయం తీసుకుంటున్నప్పుడు, ఆ సమయంలో హింస అనే విత్తనాలు మీరు నాటుతునే వుంటారు- యిది సందేహం లేని వాస్తవం. "కొండ శిఖరాన్ని చేరుకున్నాక, యిక ఆపైన నేను ఏ ఆకాంక్ష పెట్టుకోను" అని మీలో మీరు కనుక అనుకుంటే, ఆకాంక్షపరుడిలో వుండే కర్కశత్వపు బీజాలను శిఖరాన్ని చేరుకునే యీ లోగా మీరు నాటుతున్నారన్నమాట. కాబట్టి తనని తాను అవగాహన చేసుకోవడం అన్నది కాలం మీద ఆధారపడి వుండదు; అది ఆ క్షణంలోనే జరగవలసినది. దాన్ని గురించి కొద్దిగా తెలుసుకుందాం.

ప్రపంచం ప్రస్తుతం అల్లకల్లోలంగా వున్నదని మనం అంటున్నాం. యుద్ధాలు వున్నాయి, ఒకే రకమైన పనులు మళ్ళీ మళ్ళీ చేయడం, చర్చిలలో వుండే వ్యవహారాలు-

యివన్నీ ప్రపంచంలో చాలా అనర్థాలని కలిగించాయి. ఇవన్నీ యింకా కొనసాగుతుండటమే అస్తవ్యస్తత అని అంటున్నాను. క్రమతను తీసుకురావాలంటే అస్తవ్యస్తత నిర్మాణ స్వరూపాన్ని అవగాహన చేసుకోవాలి. ఈ అస్తవ్యస్తతలోని ప్రధాన అంగాల్లో ఒకటి ఏమిటంటే ఆధిపత్యం. భయం కారణంగా మనం ఆధిపత్యానికి తలవంచుతున్నాం. "నాకేమీ తెలియదు; మీకు తెలుసు; దయచేసి నాకు చెప్పండి" అని మీరు అంటారు. మీకు చెప్పగలిగినవారు ఎవ్వరూ లేరు. అది మీరు గ్రహించారంటే అప్పుడు ప్రతిదీ పూర్తిగా మీ అంతట మీరే తెలుసుకోవాలి, అంతర్గతంగా, మానసికంగా; మీకు సహాయం చేయడానికి అప్పుడిక ఏ నాయకుడూ వుండడు, గురువూ వుండడు, తత్వవేత్త వుండడు, ఏ మహాత్ముడూ వుండడు. ఎందుకంటే వారంతా వ్యవహరిస్తూ వుండేది ఆలోచన స్థాయిలోనే కాబట్టి. ఆలోచన ఎప్పుడూ పాతదే. ఆలోచన ఏనాటికీ మార్గదర్శకత్వం చూపలేదు.

అందుకని, ఆలోచన యొక్క మూలాన్ని, ఆరంభాన్ని మనం కనిపెట్టబోతున్నాం. ఇది చాలా ముఖ్యం. దయచేసి యిది శ్రద్ధగా వినండి. అయితే వట్టి శబ్దాలను కాదు. వినడం అంటే ఏమిటో మీకు తెలుసునా? నేర్చుకోవడం కోసం కాకుండా కేవలం వినాలి. నేర్చుకోవడం కోసం వినకండి, మీ స్వీయాన్ని పూర్తిగా వదిలివేసి వినండి. అప్పుడు నిజమేమిటో, బూటకం ఏమిటో మీకే తెలుస్తుంది. అంటే దాని అర్థం మీరు అంగీకరించడమూ లేదు, తిరస్కరించడమూ లేదు. అంటే మీ మనసు తెరచిపెట్టివున్న ఒక జల్లెడ వంటిదనీ, అందులో ఎన్నిపోసినా ఏవీ మిగలవనీ కాదు అర్థం. అందుకు పూర్తిగా విరుద్ధమైనది. మీరు వింటున్నారు కాబట్టి అపరిమితమైన సున్నితత్వంతో వుంటారు, ఆ కారణంగా అత్యంతమైన విమర్శన శీలత కలుగుతుంది. అయితే, మరొకరి అభిప్రాయానికి వ్యతిరేకంగా వున్న మీ అభిప్రాయం మీద మాత్రం మీ విమర్శనశీలత ఆధారపడివుండదు. అదంతా ఆలోచనా ప్రక్రియ చేసే పని. దయచేసి కాకులు చేస్తున్న ఆ ధ్వనులను వింటున్నట్లుగా వినండి. ఇష్టంతోనూ కాదు, అయిష్టతతోనూ కాదు. పిల్లవాడు సుత్తితో దేనినో కొడుతున్న ఆ శబ్దాన్ని మాత్రమే వినండి, చిరాకు పడకుండా, మీ ధ్యాసను చెదిరిపోనీయకుండా. అంత సంపూర్ణంగా మీరు వింటున్నప్పుడు, మరింకేమీ చేయడానికి వుండదని తెలుసుకుంటారు. నది ఒడ్డుపై నిలబడి చూస్తున్నవారు మాత్రమే ప్రవాహంలోని సౌందర్యం గురించి వూహాగానాలు చేస్తుంటారు. ఒడ్డును దిగి వారు ప్రవాహంలో అడుగుపెట్టాక, అప్పుడిక వూహాగానం వుండదు, అప్పుడు ఆలోచన వుండదు. కదలిక మాత్రమే వుంటుంది.

ఇప్పుడు మేము వివరించ బోయేదానిని- అంటే ఆలోచన యొక్క మూలాన్ని, ఆరంభాన్ని- అర్థంచేసుకోవాలంటే తనని తాను అర్థంచేసుకోవాలి. దాని అర్థం తనని గురించి తను నేర్చుకోవాలి అని. తనని గురించి సమాచారాన్ని ఆర్జించడమూ, తనని గురించి నేర్చుకుంటూవుండటమూ అన్నవి రెండూ రెండు భిన్న విషయాలు. మిమ్మల్ని మీరు జాగ్రత్తగా గమనించడం ద్వారా, మిమ్మల్ని మీరు పరీక్షించుకొనడం ద్వారా మీ గురించి జ్ఞానాన్ని పోగుచేసుకోవచ్చును. ఈ తెలుసుకున్న దానినుండి, యీ నిలవ చేసుకున్నదాని నుండి మీరు చర్య తీసుకోవడం సాగిస్తారు. ఈ విధమైన చర్యలలో నుండి మరికొంత మీరు ఆర్జిస్తున్నారన్నమాట. అర్థమైందా? మీరు తెలుసుకున్నది, మీరు పోగుచేసుకున్నది ఎప్పుడో గతంగా మారి పోయింది. పోగుచేసుకున్నదంతా గతంలోనిదే. ఆ గతం నుండి పరిశీలించడం మొదలుపెట్టి మరికొంత పోగు చేసుకుంటారు. అయితే నేర్చుకోవడం అన్నది మాత్రం పోగుచేసుకోవడం కాదు. నేర్చుకుంటూ వుండటం వుంటూనే వుంటుంది- మీరు జాగ్రత్తగా గమనిస్తున్నప్పుడు ఆ క్రియతో పాటుగా మీరు కదులుతుంటారు. కాబట్టి యీ నేర్చుకోవడంలో అడుగున మిగిలివుండే అవశేషం ఏమీ వుండదు. ఎప్పటికీ నేర్చుకుంటూ వుండటమే. నేర్చుకుంటూ వుండటం సకర్మకవర్తమాన క్రియా శబ్దం, కర్మణి వర్తమాన క్రియ కాదు. మనం నేర్చుకోబోతున్నాం, అయితే పోగుచేసి వుంచిన వాటినుండి కాదు. ఒక భాషని నేర్చుకుంటున్నప్పుడు పోగుచేసుకోవడం వుంటుంది. ఆ శబ్దాలన్నీ తెలుసుకోవాలి, రకరకాల క్రియా పదాలను నేర్చుకోవాలి, యింకా అటువంటివి ఎన్నో వుంటాయి. నేర్చుకున్న తరువాత వాటిని మీరు వుపయోగించడం మొదలు పెడతారు. అయితే యిక్కడ మాత్రం అట్లా కానేకాదు. ఒక అపాయాన్ని చూశారంటే తక్షణమే చర్య తీసుకుంటారు. ఒక కొండ శిఖరం మీద చిట్ట చివరి అంచు వంటి ప్రమాదాన్ని చేరుకోగానే తక్షణమే మీరు క్రియను చేస్తారు.

కాబట్టి, మనం యిప్పుడు చేయబోతున్నది ఏమిటంటే ఆలోచన యొక్క మూలాన్ని, ఆలోచన యొక్క ఆరంభాన్ని కనిపెట్టడం, అవగాహన చేసుకోవడం. ఆ పని చేయాలంటే దానిని వినడం, దానితో పాటు పయనించడం అవసరం; అంటే అర్థం మీ సావధానత్వాన్ని యివ్వాలి. మీరు గాఢంగా తరచి విచారణ చేస్తున్నప్పుడే సావధానంగా వుండటం సాధ్యమవుతుంది- అంటే తరచి విచారణ చేయడానికి మీరు నిజంగానే స్వేచ్ఛగా వున్నారని, ఎవరో చెప్పిన మాటలు మిమ్మల్ని బంధించి వుంచలేదని అర్థం.

సరే, ప్రాణికోటి అంతా జీవశక్తితో నిండివుంది. నిరంతరమైన కదలిక అది. ఈ జీవశక్తి తన కదలిక ద్వారా ఒక పద్ధతిని తయారుచేస్తుంది. ఇదంతా స్వీయరక్షణ,

భద్రతల కోసం, అంటే ప్రాణాలతో బ్రతికి వుండటం- అనే దానికోసం జరుగుతుంది. జీవశక్తి, కదలిక, బ్రతికి వుండటం కోసం తయారు చేసుకున్న పద్ధతిలో చిక్కుకొని పోవడం, ఆ వరవడిలోనే మళ్ళీ మళ్ళీ చేస్తూ వుండటం- యిదే ఆలోచనకు ఆరంభం. ఆలోచనే మనస్సు. శక్తి అంటే కదలిక. ప్రాణాలతో బ్రతికి వుండటం కోసం ఏర్పరుచుకున్న పద్ధతిలో చిక్కుకు పోయిన ఆ కదలిక, సుఖపడటం, భయపడటం అనేవి మళ్ళీ మళ్ళీ చేస్తూ వుండటం ద్వారా బ్రతికి వుండటం- అదీ ఆలోచనకు ఆరంభం.

పోగు చేసుకున్న స్మృతులు, పోగు చేసుకున్న పద్ధతులు ప్రతి స్పందించడమే ఆలోచన. ఒక హిందువుగానో, ఒక ముస్లింగానో, పార్శీగా, క్రిస్టియనుగా, కమ్యూనిస్టుగా, సోషలిస్టుగానో లేదా మరొకరిగానో మీరు చేస్తున్నది యిదే. ఒకే నమూనాలోని పద్ధతుల్లోనే మనం పనిచేస్తుంటాం. ఒక పద్ధతినే మళ్ళీ చేయడం అంటే ఆలోచన్లని పునరుక్తి చేయడం; మళ్ళీ మళ్ళీ అనేకసార్లు అదే చేయడం. ఒక హిందువుగానో, ముస్లింగానో, ఒక పార్శీగానో మీరు చేస్తున్నది అదే- హిందూ సంస్కృతి, ముస్లిం సంస్కృతి లేదా పార్శీ సంస్కృతి అనే చట్రంలో బిగించుకొని పోయిన ఒక పద్ధతిని, అంతరించి పోకుండా సజీవంగా వుంచడంకోసం, మళ్ళీ మళ్ళీ చేస్తుంటారు. ప్రతి ఒక్కరి లోపల నిజంగా జరుగుతున్నది యిదే. ఆలోచన ఎప్పుడూ ఒక పద్ధతిని స్థాపించుకుంటూ వుంటుంది. పాత పద్ధతి కనుక 'సరిపోకపోతే' మరో పద్ధతిని స్థాపించుకుంటుంది. పెట్టుబడిదారీ పద్ధతి కనుక సవ్యంగా లేకపోతే, అప్పుడు కమ్యూనిజమ్ బాగా పనిచేస్తుంది; అదీ ఆ కొత్త పద్ధతి. అట్లాగే హిందూమతమో, క్రైస్తవమతమో సౌకర్యంగా లేదనుకుంటే మరో కొత్త విధానాన్ని మీరు ఏర్పాటు చేసుకుంటారు.

కాబట్టి, ఒక పద్ధతిని మళ్ళీ మళ్ళీ చేయడం అన్నది మెదడులోని కణాలను- అవి పదార్థం- వాటినే నిబద్ధీకరణం చేసివేస్తున్నది. ఆలోచన కూడ పదార్థమే. ఇది మనకు మనమే నిరూపించుకోవచ్చు. ఇది మీరు ప్రత్యక్షంగా తెలుసుకోవాలి, యీ వక్త చెప్తున్నాడని కాదు- దానికి ఏ మాత్రం విలువ యివ్వకండి. ఇది ఎట్లా వుంటుందంటే, బాగా ఆకలిగా వున్న మనిషితో భోజనం బ్రహ్మాండంగా రుచిగా వుంటుంది అని చెప్పి, అతను తినడానికి సిద్ధాంతాలను పెట్టినట్లుగా వుంటుంది. ఈ దేశంలో అదే జరుగుతున్నది. తినడానికి సిద్ధాంతాలను, ఆదర్శాలను మీకు పెడుతున్నారు- బౌద్ధ సిద్ధాంతం, హిందూ ఆదర్శం, శంకరాచార్య సిద్ధాంతం యింకా అటువంటివి. మీ మనసులు ఖాళీగా వున్నాయి కాబట్టి మాటలను మీకు ఆహారంగా పెడుతున్నారు. ఈ కారణంగా అస్తవ్యస్తత వున్నది. అందువల్ల యిదంతా త్రోసి అవతల పారేయాలి, కొత్తదానిని ఆరంభించడం కోసం. కొత్తగా ఆరంభించాలంటే

ఆలోచన యొక్క సమస్త స్వరూపాన్ని అవగాహన చేసుకోవాలి. ఇక, యీ ఆలోచన స్వరూపాన్ని మీరు ఎప్పుడు అవగాహన చేసుకుంటారంటే, మీరు ఒక సజీవమైన స్రవంతి, కదలిక అని అర్థంచేసుకోవడం మొదలుపెట్టినప్పుడు. అర్థంచేసుకోకపోతే ఆలోచనలకు మరికొంత చేర్చి పెడతారు. అప్పుడది మృతప్రాయంగా అవుతుంది. సంస్కృతి అనే చట్రంలో మీరు ఒక సజీవమైన ప్రాణి. ఆ సంస్కృతి,ఆ సంప్రదాయం, ఆ ఆధిపత్యం మిమ్మల్ని పట్టి వుంచుతాయి. ఈ చట్రం లోపల వున్న చేతనలో అస్తవ్యస్తత వుంటుంది. ఈ ప్రక్రియ సమస్తాన్ని అవగాహన చేసుకొని, అంతకంటె యింకా చాలా ముందుకు పోవడమే- యిప్పుడు మనం అదే చేయబోతున్నాం- ధ్యానం.

ధ్యానం అంటే మంత్రాలను పునశ్చరణ చేసే సూత్రం కాదు, క్రమబద్ధంగా గాలి పీల్చడం కాదు, ఒక ప్రత్యేకమైన ఆసనం వేసుకొని కూర్చుని ఎరుకగా వుండటాన్ని అభ్యాసం చేయడంకాని, సావధానత్వాన్ని అభ్యాసం చేయడంకాని కాదు- యివన్నీ బొత్తిగా యాంత్రికమైన పనులు. మనం మాట్లాడుకుంటున్నది ఒక సజీవమైనదానిని గురించి. శతాబ్దాల తరబడి యీ యాంత్రికమైన వాటిని మీరు అభ్యాసం చేస్తూనే వున్నారు. వీటిని ఆచరించినవారు మరణించారు; వారు చూసిన మనోబింబాలన్నీ వారి గతం నుండి, వారి నిబద్ధీకరణం నుండి వారు దృశ్యీకరించుకున్నవి. కాని మనం మాట్లాడుకుంటున్న ధ్యానం సజీవత్వంతో తొణికిసలాడుతుంటుంది; యాంత్రికమైన, పునశ్చరణ చేయడం వంటి, క్రమ శిక్షణా బద్ధమైన ధ్యానం కాదు. ధ్యానం అంటే ఏమిటో మీకు తెలిస్తే తప్ప- మరణం అంటే ఏమిటో లాగా తెలిస్తే తప్ప- ఒక నూతన సంస్కృతి వుండదు, నూతనమైనది ఏదీ జన్మించదు.

చూడండి, సంస్కృతి అంటే చాలా అద్భుతమైనది. అయితే అది నిరంతరంగా మీరు మాట్లాడుతూవుండే మృత సంస్కృతి కాదు- భారతీయ సంస్కృతి, హిందూ సంస్కృతి కాదు. అది ఎప్పుడో భూస్థాపితమై పోయింది, గతించి పోయింది, సమాప్తమై పోయింది. సజీవమైన సంస్కృతి అంటే యిప్పుడు యదార్థంగా జరుగుతున్నది ఏదో అది. ఈ గందరగోళం అంతటినీ, యీ గజిబిజి నంతటినీ, యీ దారుణ దుర్భరవేదన లన్నింటినీ పరిశీలించి చూసి, అందులో నుండి ఎదగడం, అందులోనుండి వికాసం చెందడం, అదీ సంస్కృతి అంటే. పోయిన మీ పూర్వీకుల వద్దకు తిరిగివెళ్ళడం కాదు.

కాబట్టి, ధ్యానం అంటే ఏమిటి అనే యీ ప్రశ్నకు సమాధానం కోసం మనం అందరం కలిసి అన్వేషించబోతున్నాం, మనందరం కలిసి ప్రయాణించబోతున్నాం.

అయితే మిమ్మల్ని మీరు తెలుసుకోవడం జరిగాకే ఆ ప్రశ్నను మీరు అడగచ్చు. మిమ్మల్ని మీరు తెలుసుకుంటే తప్ప, మీ గురించి మీకు అవగాహన వుంటే తప్ప, ఎంతగా సాధ్యపడుతుందో అంతగా మిమ్మల్ని మీరు పరికించుకుంటే తప్ప, 'ధ్యానం అంటే ఏమిటి' అని మీరు అడగకూడదు. "మిమ్మల్ని మీరు పరికించుకోవడం" ఆ క్షణంలోనే జరిగిపోతుంది. ఆ క్షణంలోనే మీ సర్వస్వమూ విశదమవుతుంది, కాలం గడిచాక కాదు. ఒక చెట్టుని, ఒక పూవుని, మీ పక్కనే వున్న ఒక మనిషిని మీ కళ్ళతో మీరు చూడగలుగుతారు. ఆ చెట్టు గురించి, ఆ మనిషి గురించి ఒక మనోబింబాన్ని మీరు కల్పించుకొని వుంటే మాత్రం ఆ చెట్టు యొక్క సర్వస్వాన్ని, మీ పక్కనే కూర్చున్న ఆ మనిషి యొక్క సమస్త సంపూర్ణత్వాన్ని మీరు చూడలేరు. అందులో సందేహం లేదు. మనోబింబం లేనప్పుడు మాత్రమే మీరు సంపూర్ణంగా చూడగలుగుతారు. ఈ మనోబింబం అంటే పరిశీలకుడు- ఒక కేంద్రం- అక్కడి నుండే మీరు పరిశీలిస్తుంటారు. ఒక కేంద్రం నుండి, అక్కడినుండి మీరు పరిశీలిస్తుంటే, పరిశీలకుడికి, పరిశీలిస్తున్న అంశానికి మధ్యన ఎడం వుంటుంది. నేను చెప్తున్న దానిమీద అంత విపరీతమైన శ్రద్ధ చూపనక్కరలేదు, మీ అంతట మీరే యిది పరిశీలించి తెలుసుకోవచ్చు. మీ భార్యని గురించో, మీ భర్తను గురించో, ఒక చెట్టును గురించో ఒక మనోబింబం మీరు కల్పన చేసుకొనివుంటే, ఆ మనోరూపమే దానిని చూస్తూ వున్న కేంద్రం. అప్పుడు పరిశీలకుడు, పరిశీలిస్తున్న అంశమూ విడివిడిగా వుంటాయి. ఇది అర్థం చేసుకోవడం చాలా ముఖ్యం. దీనిని గురించి యింకా కొంత తెలుసుకుందాం.

మొట్టమొదట ఏకాగ్రతను గురించి వున్న అపభ్రమలను తొలగించుకుందాం. ధ్యానం చేసేవారు, ధ్యానం అధ్యయనం చేసే లేదా ధ్యానం బోధించే అధ్యాపకులు పదేపదే చెప్పే ప్రథమ సూక్తుల్లో యిది ఒకటి- ఏకాగ్రతను మీరు నేర్చుకోవాలీ అని. అంటే, ఒక ఆలోచన మీదే కేంద్రీకరించడం, యితర ఆలోచనలను త్రోసిపారేసి, ఆ ఒకే ఒక ఆలోచన మీద మాత్రమే మనసును స్థిరంగా నిలపడం. ఇది చాలా మూర్ఖత్వం. ఎందుకంటే, అప్పుడు కొన్ని ఆలోచనలకు, మీరు నిరోధం చూపుతుంటారు. ఒక విషయం మీదే కేంద్రీకృతం చేయాలనే ఒత్తిడికీ, రకరకాలైన యితర విషయాల మీదకు పరుగుపెడుతున్న మీ మనసుకూ మధ్యమీలో యుద్ధం జరుగుతున్నదన్నమాట. అసలు మీరు చేయవలసినది ఆ ఒక్క ఆలోచన ఎడల సావధానత్వం కలిగి వుండటమే కాకుండా, మనసు ఎక్కడెక్కడ సంచరిస్తున్నదో దాని ఎడల, మనసులో జరిగే ప్రతి కదలిక ఎడల కూడా సంపూర్ణ సావధానత కలిగివుండటం. ఏ ఒక్క కదలికనూ నిరాకరించకుండా వున్నప్పుడే, "నా మనసు ఎక్కడెక్కడికో సంచారం పోతున్నది, నా మనసు పరధ్యానంగా వున్నది" అని మీరు అనకుండా వున్నప్పుడే, యిది సాధ్యమవు

తుంది. పరధ్యాసగా వుండటం అన్నది లేనే లేదు. ఎందుకంటే, మనసు ఎక్కడికో సంచారానికి వెళ్ళి పోయిందంటే, అది ఆ మరొకదాని మీద ఆసక్తి చూపుతున్నదని సూచిస్తుంది.

కాబట్టి, అదుపు ఆజ్ఞల్లో వుంచడం అనే మొత్తం ప్రశ్నని మీరు అర్థం చేసుకోవాలి. అయితే, దురదృష్టవశాత్తు సమయం సరిపోదు కాబట్టి యీ సాయంత్రం ఆ విషయాన్ని చర్చించలేము. మానవులం అనుకునే మనమంతా అదుపులో వుంచబడిన, నిర్జీవమైన వట్టి సత్వాలం. అయితే దీని అర్థం మనకి యిష్టమైనవి నిరాఘాటంగా చేసెయ్యాలని కాదు- నిజానికి యిది రహస్యంగా మనం చేస్తూనే వుంటాం. అయితే ప్రేమలోనే ఒక క్రమశిక్షణ కూడా వుంటుంది. అది ఏమిటో క్లుప్తంగా వివరిస్తాను.

ధ్యానం అంటే ఆలోచనలను అదుపులో పెట్టడం కాదు. ఆలోచనలను అదుపు చేసినపుడు ఆ ధ్యానం మనసులో సంఘర్షణను పెంచిపోషిస్తుంది. అయితే, యిప్పుడే మీకు విశదపరచినట్లుగా, మీరు కనుక ఆలోచన స్వరూపాన్ని, ఆలోచన పుట్టుకను అవగాహన చేసుకుంటే, అప్పుడు ఆలోచన మధ్యలో కల్పించుకోకుండా వుంటుంది. అందువల్ల, ఆలోచనకు వుండే స్థానం ఆలోచనకు వున్నది అని మీరు గ్రహిస్తారు- అంటే మీరు ఆఫీసుకి వెళ్ళాలి, మీ యింటికి మీరు తిరిగివెళ్ళాలి, ఒక భాష మాట్లాడాలి మొదలైనవి. అక్కడ ఆలోచన తన పనిని నిర్వహించాలి. అయితే, ఆలోచించడం అనే మొత్తం సంవిధానాన్ని అంతటినీ మీరు కనుక అవగాహన చేసుకుంటే, ఆ ఆలోచనా స్వరూపపు అవగాహనే దానిని క్రమశిక్షణలో వుంచుతుంది. ఇది అనుకరణ చేయడం కాదు, అణచివేయడం అసలే కాదు.

ఒక హిందువుగానో, ఒక ముస్లింగానో, పార్శీగానో, క్రిస్టియనుగానో, కేథలిక్‌గానో, కమ్యునిస్టుగానో ఒక నిర్ణీతమైన పద్ధతిలోనే కొనసాగుతూ వుండటానికి మెదడులోని కణాలు నిబద్ధీకరణం చెంది వున్నాయి. ఎన్నో శతాబ్దాలుగా మెదడు పొందిన యీ నిబద్ధీకరణం వల్ల చేసినదే మళ్ళీ పునరుక్తి చేయడం అనే పద్ధతిలో మెదడు పడిపోయింది. అందువల్ల యీ మెదడు ఒక నిరంతరమైన విచారణకు మళ్ళీ తానే ప్రధానపాత్ర వహిస్తున్నది. వివరంగా చూస్తే మీరే స్వయంగా అది తెలుసుకుంటారు.

కాబట్టి, సమస్య ఏమిటంటే మెదడు కణాలలోనే అత్యంతమైన ప్రశాంతతను తీసుకొని రావాలి. అంటే, 'నేను' కు గుర్తింపు కోసం తాపత్రయపడటం, నేను భావాన్ని కొనసాగించుకోవడం మానాలి. అర్థమైందా మీకు? భౌతికమైన స్థాయిలో మనం బ్రతికి వుండాలి, మానసిక స్థాయిలో మృతి చెందాలి. మానసికమైన స్థాయిలో వేలాది నిన్నలు మరణించడం జరిగినప్పుడే మెదడులోని కణాలు నెమ్మదిని పొందగలుగుతాయి.

అయితే యిది ఏదో ఒక వుపాయంతో ఆలోచనను ప్రభావితం చేయడం ద్వారా కాని, మంత్రాలు పునశ్చరణ చేయడం ద్వారా కాని జరగదు. ఇవన్నీ పరిపక్వత లేకపోవడం వల్ల చేసే పనులు. ఆలోచన యొక్క సమస్తమైన కదలికలు అంటే మీరే- అవగాహన చేసుకున్నప్పుడు మాత్రమే అది జరుగుతుంది. అప్పుడు మెదడులోని కణాలు అపూర్వమైన తీరులో ప్రశాంతమై పోతాయి; బాహ్య ప్రపంచంలో నుండి వచ్చే స్పందనలకు ప్రతిస్పందిస్తాయి తప్ప మరే యితర కదలికా వుండదు.

కాబట్టి, మెదడే నెమ్మదిగా వుండిపోవడం వలన మనసు సమస్తం సంపూర్ణ నిశ్శబ్దతను పొందుతుంది. అయితే యీ నిశ్శబ్దం ఒక సజీవమైన విషయం. ఇది ఒక గురువు ద్వారాగాని, పుస్తకం ద్వారాగాని, ఒక ఆశ్రమం ద్వారాగాని, నాయకుని ద్వారాగాని, ఒక ఆధిపత్యం వల్లగాని, ఒక మాదక ద్రవ్యం వల్లగాని కలిగిన ఫలితం కాదు. ఒక మాదక ద్రవ్యంగాని, ఒక రసాయనిక మత్తుమందు గాని తీసుకొని, మీ మనసును మీరు నెమ్మది పరచవచ్చు, లేదూ మిమ్మల్ని మీరే సమ్మోహపరచుకొనే పద్ధతి ద్వారా కూడా నెమ్మది సాధించవచ్చు అయితే అది మనసు తనలోకి తాను గాఢంగా చూసుకొనడం వలన కలిగిన సజీవమైన నిశ్చలత్వం కాదు. ఇటువంటి నిశ్చలత్వం వల్ల మాత్రమే మనసు అత్యంతమైన సావధానత్వాన్ని, అత్యున్నతమైన సున్నితత్వాన్ని పొందుతుంది. అటువంటి మనసు మాత్రమే ప్రేమ అంటే ఏమిటో అవగాహన చేసుకోగలుగుతుంది. ప్రేమ అంటే కోరిక కాదు, సుఖం కాదు. మనకి వున్నవల్లా కోరికా, సుఖ సంతోషాలూ, దీన్నే మనం ప్రేమ అని అంటాం. 'నేను నా భార్యని ప్రేమిస్తాను', 'మా దేవుణ్ణి నేను ప్రేమిస్తాను' మొదలైనవి అంటూ వుంటాం. దీనంతటికీ వెనకాల వున్నది భయం, సుఖం, యింద్రియానుభూతి.

కాబట్టి, యిదంతా అర్థం చేసుకొని, నిజంగా పరిశీలించినవారు, ముందుగా తమ లోపల క్రమతను తీసుకొనిరాగలుగుతారు. తన లోపల కనుక క్రమత వుంటే ప్రపంచంలో కూడా క్రమత వుంటుంది. మీలో ప్రతి ఒక్కరూ కనుక నిజంగానే మీ లోపల క్రమశీలత్వాన్ని తీసుకొని రాగల్గుతే, ఒక సక్రమ జీవనం, ఒక నూతన సమాజం, ఒక నవ్య జీవితం మీకు సిద్ధిస్తుంది. అయితే అది చేయాలంటే పాత జీవితవిధానాలను మీరు నిర్మూలించాలి. పాత జీవిత విధానాలను పరిహరించడం మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడం ద్వారానే సాధ్యమవుతుంది. ఆ అవగాహనలోనే ప్రేమ వుత్పన్నమవుతుంది.

చూడండి, మనిషి అంతులేకుండా ప్రేమను గురించి మాట్లాడుతునే వున్నాడు; ఇరుగు పొరుగును ప్రేమించు, దైవాన్ని ప్రేమించు, దయగా వుండు. అయితే ప్రస్తుతం

మీలో దయా లేదు, దాక్షిణ్యం లేదు. మీ ధ్యాసనంతా మీ మీదే ఎంతగా కేంద్రీకరించుకొని వుంటారంటే మీలో ప్రేమ అనేదే వుండదు. ప్రేమ లేనప్పుడు యిక వుండేది అంతా దుఃఖమే. కేవలం చిలక పలుకుల్లాగా మీరు వల్లించడానికి చెప్పిన సూక్తి కాదు యిది. ఇది మీరే గ్రహించాలి, మీరే కనిపెట్టాలి. దానికోసం మీరు బాగా కృషి చేయాలి. మిమ్మల్ని మీరు అవగాహన చేసుకుంటూ, నిర్విరామంగా, గాఢోద్వేగంతో కృషి చేయాలి. గాఢోద్వేగం అంటే కామం కాదు. గాఢోద్వేగం అంటే ఏమిటో తెలియని మనిషికి ప్రేమ అంటే ఏమిటో ఎన్నటికీ తెలియదు. సంపూర్ణమైన తన్మయత్వం అంటే స్వీయాన్ని పూర్తిగా పరిత్యజించడం వున్నప్పుడే ప్రేమ కలుగుతుంది. ప్రేమ మాత్రమే క్రమత్వను, ఒక నూతన సంస్కృతిని, ఒక క్రొత్త జీవన మార్గాన్ని తీసుకొని రాగలుగుతుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, XVII వాల్యూమ్,*
*మూడవ ప్రసంగం, బొంబాయి, 1967*

# దుఃఖాన్ని సమాప్తం చేయడం

ఇది చివరి ప్రసంగం. ఇక్కడ జరిగిన గత మూడు సమావేశాలలో మనిషి ఏ దిశగా పయనం సాగించాలి అన్నది చాలావరకు సూచించామనే అనుకుంటున్నాము. ఎందుకంటే ప్రస్తుతం మనం చూస్తూవున్న యీ ప్రపంచం చాలా చాలా అల్ల కల్లోలంగాను, మహా హింసాత్మకంగాను, దాదాపుగా అరాజకంగా, సంఘవిద్రోహ కరంగా తయారవుతున్నది. ఒక పక్కన యుద్ధం వున్నది, విపరీతంగా దోపిడీ చేయడం వున్నది, బలహీనులను స్వప్రయోజనానికి వాడుకోవడం వున్నది; దయా దాక్షిణ్యాలు లేని కార్యసాధకత్వం, అవకతవక పరిపాలన, అసమర్థ ప్రభుత్వం మొదలైనవీ వున్నాయి. మనందరం- మనలో ప్రతి వొక్కరూ- ఎదుర్కోవలసిన ఎన్నో సమస్యలను వరసగా ఏకరువు పెట్టచ్చు. మన దురాశలతో, మన దుఃఖాలతో, సంఘర్షణలతో, సుఖాపేక్షలతో, యితరులపై పెత్తనం చేయాలనే కాంక్షా, హోదా కోసం ఆరాటమూ వంటి వాటితో మనమే తయారు చేసుకున్న ప్రపంచం యిది.

అనేకంగా వున్న యీ సమస్యలను ఒక్కటొక్కటిగా వివరించుకుంటూ పోవచ్చు. అయితే సమస్య ఎదురుగా నిలబడి మనల్ని నిలదీసినప్పుడు వర్ణనకి, వివరణకి వుండే విలువ శూన్యం. దురదృష్టం ఏమిటంటే వివరణలు చాలా సులభంగా మనల్ని సంతృప్తి పరుస్తాయి. మాటలు నిజంగానే మన సమస్యల్ని పరిష్కరిస్తాయని

అనుకుంటాం. అందువల్ల నయాగరా జలపాతంలాగా మాటలు ప్రవహిస్తాయి. ఈ ఒక్క సమావేశంలోనే కాదు, ప్రపంచమంతటా యిదే జరుగుతున్నది. ప్రతివారూ అంతులేకుండా మాట్లాడుతునే వుంటారు. అసంఖ్యాకమైన సూత్రాలు, కొత్త కొత్త సిద్ధాంతాలు వున్నాయి; యివి చాలనట్లు మన దుర్భాగ్యం కొద్దీ కొత్త కొత్త నాయకులు- రాజకీయ రంగంలోను, ఆధ్యాత్మిక రంగంలోను కూడా- వున్నారు. ఎదుటి మనిషి ఏం చేయాలో, ఏం ఆలోచించాలో చెప్పి, అతన్ని నమ్మించడానికి రకరకాలైన సిద్ధాంతాల ప్రచారమూ జరుగుతున్నది. ఎట్లా ఆలోచించాలో తెలుసుకోవడం చాలా కష్టసాధ్యమైన పనుల్లో ఒకటి. మన సమస్య కేవలం సాంఘికమైనదో, ఆర్థికమైనదో, అటువంటిదే మరొకటో కాదు. అంతకంటె ఎక్కువగా అది ఒక ఆధ్యాత్మికమైన సమస్య. చేతన సమస్తంలోనూ ఒక విషమ పరిస్థితి ఏర్పడిన సమస్య. ఇక్కడ మాటలమీద, వ్యాఖ్యానాల మీద, నిర్వచనాల మీద మనం ఆధారపడితే అది అర్ధవిహీనంగా వుంటుంది. ఈ ప్రసంగాలు బహుశ మీకు ఏం ఆలోచించాలో కాకుండా, ఎట్లా ఆలోచించాలో అనేది సూచించి వుంటాయి. సిద్ధాంత ప్రచారం మనల్ని దాస్యంలో పడేస్తుంది. ఏం ఆలోచించాలి అనేది- గీత, ఖురాను బైబిలు, మతాచారుడు, మార్క్సు లెనిన్ సూత్రాలు, అసంఖ్యాకమైన సిద్ధాంతాలు- చెప్పాయి. అయితే, గాఢంగా ఆలోచించడం ఎట్లా అనేది, ఆలోచనలు ఒక పరిధికే పరిమితం అయి వుంటాయి అనేది మనకు తెలియని విషయాలు.

మనకి వున్న చాలా పెద్ద సమస్యల్లో ఒకటి- బహుశ ఒకే ఒక పెద్ద సమస్య- ఏదంటే, దుఃఖం. దుఃఖాన్ని పరిష్కరించుకోవడానికి, దుఃఖాన్ని అంతమొందించడానికీ మనిషి అన్ని రకాల ప్రయత్నాలూ చేశాడు. దాని నుంచి పారిపోదామని ప్రయత్నించాడు. దానిని పూజించాడు. దానికి ఎన్నో వ్యాఖ్యానాలు కల్పించాడు. కాని పుట్టినప్పటి నుంచి చనిపోయేవరకు మనిషి అంతులేకుండా యీ దుఃఖంలో మునిగితేలుతునే వున్నాడు. నాకేమనిపిస్తుందంటే, మనిషి యీ సమస్యను- మాటల్లో కాదు, భావాలలో కాదు, వ్యాఖ్యానాల్లో కాదు, అసలు వాస్తవంలోనే- ఆగకుండా ప్రవహిస్తున్న యీ దుఃఖ ప్రవాహంలో నుంచి బయటకు అడుగు పెట్టడం ద్వారా పరిష్కరించుకోనట్లవుతే, అతని సమస్యలు యింకా కోకొల్లలవుతాయి. మీరు చాలా ఐశ్వర్యవంతులై వుండచ్చు, మీ వద్ద అధికారం, అంతస్థు, పేరు ప్రతిష్ఠలు, హోదా, అన్నీ వుండచ్చు. మీరు చాలా తెలివిగలవారై వుండచ్చు, మీది ఎంతో సమాచారం సేకరించిన పదునైన బుర్ర అవచ్చు; అయినా సరే, యివన్నీ దుఃఖం అనే యీ అత్యంత ప్రధానమైన సమస్యా పరిష్కారానికి మనిషి చేసే ఒత్తిడులకు, మానవుడు పడే ఆతురతకు సమాధానం చూపలేవు, అని నాకు అనిపిస్తున్నది. ఎందుకంటే

దుఃఖం అంతమైన తరువాతే వివేకం వుదయిస్తుంది. వివేకం అంటే గడసరితనం కాదు, జ్ఞానం కాదు, సిద్ధాంతాలు కావు. వివేకం కలిగేది దుఃఖం అంతమైనప్పుడే. ఈ వివేకం లేకుండా మన మానవ సమస్యలను, బాహ్యంగానూ, అంతర్గతంగానూ కూడా, మనం పరిష్కరించుకోలేము.

చరిత్ర గతిని పరిశీలించినా, మన స్వంత జీవితంవైపు చూసుకున్నా, నిత్యజీవితంలోని మన కార్యకలాపాలు పరిశీలించినా సుఖదుఃఖాలు అనే సూత్రంలో మనిషి చిక్కుకొని పోయినట్లుగా మనం తెలుసుకోవచ్చు. సుఖమే మనల్ని నడిపిస్తూ వుంటుంది. మనలో చాలా మందికి కావలసినది సుఖమే. ఎంతో గోప్యంగా దాన్ని మనం వెంటాడుతూ వుంటాం. ఆధ్యాత్మికులందరూ సత్యం కోసం అన్వేషిస్తున్నాం అని సాధారణంగా అంటుంటారు తప్ప, నిజంగా వాళ్ళు వెతుకుతున్నది సుఖానికి ఒక సూత్రం కనిపెట్టడం కోసమే. సుఖం, అది ఏ రూపంలోనైనా సరే, వున్నప్పుడు దుఃఖం కూడా దాని వెంటనంటే వుంటుంది. ఒకటి లేకుండా మరొక దానిని పొందలేము. ఇంద్రియానుభూతి అయిన సుఖమే కాకుండా, యింద్రియానుభూతి నిచ్చే సంతోషమే కాకుండా, మీరు కనుక కొంత అభిరుచి గల మనిషవుతే, కొంత సంస్కారం వున్నవారవుతే, యింకా కొంత మేధావి రకం అవుతే- సంస్కరణాభిలాష ద్వారా, మంచి పనులు చేయడం ద్వారా, సమాజాన్ని మార్చడం ద్వారా కలిగే సుఖం కూడా వుంటుంది. పుస్తకాలు రచించడం, రాజకీయాల్లో చేరడం, మీ ఆకాంక్షలను సార్థకం చేసుకోవడానికి చేసే అంతులేని కార్యకలాపాలు- యివన్నీ కూడా సుఖ సంతోషాలని పెంచుకోవడానికే. మీ జీవితంవైపు మీరు పరిశీలించి చూసుకుంటే, మీలో ఆ స్పృహ కనుక కాస్తయినా వున్నట్లవుతే, మీ అభిరుచులు, మీ స్వభావ గుణాలే మిమ్మల్ని నడిపిస్తున్నాయని తెలుసుకుంటారు. మరింత మరింత ఎక్కువ సుఖతృప్తి కోసం జరిగే నిరంతరమైన ఒత్తిడి ఫలితంగా జనించినవే యీ అభిరుచులు, స్వభావగుణం అన్నవి. నిజంగా చూస్తే సద్గుణాలు అనేవి యీ సుఖం అనే సూత్రం మీద ఆధారపడినవే. ఈ సుఖాన్ని గురించి అవగాహన చేసుకోనంతవరకు దుఃఖాన్ని అంతం చేయడం జరగదు. ఇదంతా కొంత లోతుగా మీకు వివరిస్తాను.

అసలు జీవితం అంటే సుఖమేనా? జీవితం అంటే సంఘర్షణలూ, దారుణమైన బాధలూ, బయటా లోపలా వుండే ముగింపు లేని పోరాటాలూనా? రణరంగంగా తయారయిన జీవితం- మనకు తెలిసినదంతా యింతే. మనం సిద్ధాంతాలు అల్లవచ్చును; వేదాంతపరమైన ప్రతిపాదనల్ని గురించీ, సమాజాభివృద్ధి గురించీ, ఏం జరగాలి అనే విమర్శలు చేస్తూ అంతులేకుండా మాట్లాడవచ్చు. కాని, సుఖం కావాలని కోరే యీ విపరీతమైన ఒత్తిడిని అవగాహన చేసుకోక పోతే మాత్రం సంఘర్షణ,

దుఃఖం అనే అంతూ దరీలేని ప్రవాహంలో కొట్టుకొని పోతాం అని నాకు అనిపిస్తున్నది. సుఖాన్ని అవగాహన చేసుకోవడం అంటే దానిని తృణీకరించడం కాదు. ఎందుకంటే సుఖం, సంతోషం లాగే జీవితంలోని ప్రాథమిక అవసరాల్లో ఒకటి. అందమైన ఒక వృక్షాన్ని చూసినప్పుడు, చక్కని చిరునవ్వుతో వెలిగే ముఖాన్ని చూసినప్పుడు, ఆకు మీద మెరిసే కాంతిని చూసినప్పుడు, మీరు నిజంగానే చాలా సంతోషపడతారు. అందులో గొప్ప వుల్లాసం వున్నది.

సౌందర్యం అనేది వేరు. అది సుఖం కాదు. సౌందర్యానుభూతి ఒక భవనంలో కాని, ఒక వర్ణ చిత్రంలో కాని, ఒక కవితలో కాని, ఒకరి చేతిలో ఒకరు చేయివేసి వుండటంలో కాని, ఒక పర్వతాన్నో నదినో పరికించి చూడటంలో కాని వుండదు- ఇవి ఎంత సుఖాన్నిచ్చేవయినా కేవలం యింద్రియానుభూతులు మాత్రమే. సౌందర్యం అంటే యిందుకు పూర్తిగా విభిన్నమైనది. సౌందర్యం అంటే ఏమిటో- మేధాపరంగా కాదు, మాటల్లో కాదు- నిజంగా అర్థం చేసుకోవాలంటే, సుఖం అంటే ఏమిటి అన్నది అవగాహన చేసుకోవాలి.

చూడండి, మానవుడు సుఖాన్ని త్యజించాలని ఆదేశించడం ప్రపంచ వ్యాప్తంగా జరుగుతున్నది. మతం ద్వారానో, ఒక భావనను ఆరాధించడం ద్వారానో, మహాత్ములు, మత ప్రచారకుల ద్వారానో, సన్యాసులు, బైరాగుల ద్వారానో యిది జరుగుతున్నది. వీళ్ళంతా అదే పనిగా పెట్టుకొని మనిషిని సుఖాన్నుంచి దూరం చేశారు. సుఖపడటం తప్పనీ, అది దుర్మార్గమనీ, దాని నుంచి దూరంగా వుండాలనీ వాళ్ళు అంటారు. సంతోషంతోనే నిండిపోయివున్న మనసు, సుఖం కోసం వెతుక్కునే మనసు పరమసత్యాన్ని, దేవుణ్ణి ఏనాటికీ కనిపెట్టలేదనీ, అందువల్ల మనిషి తనను తాను హింసించుకోవాలనీ వాళ్ళు అంటారు. అయితే అటువంటివాళ్ళు దేవుణ్ణి చేరేటప్పుడు వక్రమైపోయిన, చిత్రహింసలకు గురియైన, అల్పమైన, చిన్న మనసుతో వస్తారు. వాళ్ళది సమాజం చేత, సంస్కృతి చేత పీల్చి పిప్పిచేయబడిన మనసు. అటువంటి మనసు స్వేచ్ఛతో, సజీవత్వంతో, తొణికిసలాడే ప్రాణంతో, శక్తి సామర్థ్యాలు కల, భయరహితమైన మనసుగా ఎప్పటికీ అవలేదు. చాలావరకు మనుష్యుల మనసులన్నీ చిత్రహింసలకు లోనయినవే. వాళ్ళకు అది తెలియక పోవచ్చు. వాళ్ళకా ఎరుక లేకపోవచ్చు. కుటుంబ జీవనంలో, జీవనభృతి సంపాదించుకోవడంలో, వున్నత స్థితిని అందుకునే ప్రయత్నంలో ఎంతగా వాళ్ళు మునిగి పోయి వుంటారంటే, వాళ్ళ అస్తిత్వంలో ఏయే విషయాలున్నాయనే స్పృహ వాళ్ళకే లేకపోవచ్చును.

మనిషి ఎప్పుడూ ఏదో ఒక దానికోసం వెతుక్కుంటూ వుంటాడు. ఒక ఆశయాన్ని, ఒక లక్ష్యాన్ని, ఒక తృప్తిని అందుకోవాలని కోరుకుంటూ వుంటాడు. అత్యున్నతమైన

స్థాయిలో వుండే తృప్తిని దేవుడు అని పిలుచుకుంటాడు. కాబట్టి, మనకు, ఎప్పుడూ ఏదో అందుకోవాలనే ఆరాటమే, వెతుకులాటే. ఏదో లోటు వున్నట్లుగానే మనం ఎప్పుడూ భావిస్తూ వుంటాం. అందుకని, మనలో వున్న ఆ శూన్యాన్ని నింపాలని ప్రయత్నిస్తాం. ఆ ఒంటరితనాన్ని, ఆ ఖాళీతనాన్ని, ఆ అలసిపోయిన, శక్తిని హరించివేస్తున్న, అర్థవిహీనమైన బ్రతుకుని రకరకాల భావాలతో, సార్థకత్వాలతో నింపాలని ప్రయత్నిస్తాం. చిట్టచివరికైనా ఒక మార్పులేని, ఎప్పటికీ స్థిరంగా వుండిపోయే శాశ్వతమైన దానిని అందుకోవడంలో తృప్తి సాధించాలని కోరుకుంటాం. ఇక ఆ శాశ్వతమైన స్థితికి వేయి పేర్లు పెడతాం. దేవుడనీ, సమాధి అనీ యింకా అవీ యివీ; ఇంకా ఎన్ని కొత్త పేర్లయినా కనిపెట్టచ్చు. అంతులేకుండా మనం వెతుక్కుంటూనే వుంటాం. ఎందుకు వెతుకుతున్నామో మనల్ని మనం ఎన్నడూ ప్రశ్నించుకోము. సుస్పష్టంగా కానవచ్చే సమాధానం ఏమిటంటే- మనం అసంతృప్తిగా వున్నాం, సంతోషంగా లేము, దౌర్భాగ్యకరమైన స్థితిలో, యితర్ల ప్రేమ అనేది ఎరగకుండా. భయపడుతూ వున్నాం. గట్టిగా పట్టుకొని వేలాడటానికి మనకి ఏదయినా కావాలి. మనకి రక్షణ యివ్వడానికి ఎవరయినా కావాలి- ఒక తండ్రో, ఒక తల్లో, ఎవరో ఒకరు- అందుకని మనం వెతుకుతూ వుంటాం. వెతుకుతూ వున్నప్పుడు ఏదో ఒకటి మనకు చిక్కకుండా వుండదు. దురదృష్టవశాత్తూ, వెతుకుతూవుంటే ఏదో ఒకటి మన చేతికి తప్పక దొరుకుతుంది.

కాబట్టి, ముఖ్యమైన విషయం ఏమిటంటే, వెతుక్కోకుండా వుండటం. అర్థమైందా మీకు? ఇంతకాలమూ మీకు వుపదేశించింది ఏమిటంటే- వెతుక్కుంటూ పొండి; సత్యంతో ప్రయోగాలు చేయండి; సత్యాన్ని అన్వేషించండి; దాని వెనకాల పడండి; వెంటాడండి; దానిని అందుకోడానికి పరుగెత్తండి; మిమ్మల్ని క్రమశిక్షణలో, అదుపు ఆజ్ఞల్లో పెట్టుకోండి- అని. ఇప్పుడు యింకొకరు ప్రవేశించి "అవన్నీ చేయకండి, వెతకడం మానేయండి" అని అంటున్నారు. వెంటనే అతన్ని వెళ్ళిపొమ్మని చెప్పడమో, మీ ముఖాన్ని మరో వైపుకి తిప్పుకోడమో సహజంగా మీలో నుంచి వచ్చే ప్రతిచర్య. లేదా, ఎందుకు అతను యీ విధంగా అంటున్నాడు అనేది మీ అంతట మీరే తెలుసుకోవడానికి ప్రయత్నించండి; ఆమోదించ వద్దు, నిరాకరించవద్దు; కానీ, ప్రశ్నించండి. అసలు మీరు వెతుకుతున్నది ఏమిటి?

మీ గురించి ప్రశ్నించుకొని శోధించండి. మీరు ఏదో వెతుకుతున్నారు. మీ జీవితంలో అంతర్గతంగా మీకేదో లోటుగా అనిపిస్తున్నది- ఒక రకమైన నేర్పు లేదని కాదు, వుద్యోగం చాలా చిన్నదనీ, డబ్బు ఎక్కువ లేదనీ- ఆ స్థాయిలో కాదు. మనం వెతుకుతున్నది అసలు ఏమిటి? మనం ఎందుకు వెతుకుతున్నామంటే, మన లోలోపల, మనకుటుంబం మీదా, సమాజం మీదా, సంస్కృతి మీదా, అసలు మన

మీద మనకే విపరీతమైన అసంతృప్తిగా వుంది; మనల్ని ధ్వంసం చేస్తున్న, సతతం నమిలివేస్తున్న యీ అసంతుష్టిని తృప్తి పరచాలనీ, దానిని మించి ఆవలగా పోవాలనీ కోరుకుంటుంటాం. మనలోని యీ అసంతుష్టి దేనికోసం? అసంతుష్టిని చాలా సులభంగా తృప్తిపరచవచ్చని నాకు తెలుసు. అసంతుష్టిలో పడిపోయిన ఒక యువకుడికి- అతను కమ్యూనిస్టు అవచ్చు, విప్లవకారుడు అవచ్చు- మంచి ఉద్యోగం ఒకటి యిస్తే అన్నీ మరిచిపోతాడు. చక్కని యిల్లు యివ్వండి, మంచి కారు, అందమైన తోట, అంతస్థు యిస్తే అతనిలోని అసంతృప్తి అదృశ్యమవడం గమనిస్తాం. ఒక వేళ సిద్ధాంత పరమైన విజయం లభించినా కూడా అతనిలోని అసంతుష్టి అదృశ్య మవుతుంది. అయితే మీలో అసంతుష్టి ఎందుకు కలిగింది అనే ప్రశ్న మీరు ఎన్నడూ వేసుకోరు- అంటే చిన్న వుద్యోగాల్లో వుండి గొప్ప వుద్యోగాలు కావాలనుకునేవారి గురించి కాదు యిది. సుఖమూ, దాని మొత్తం స్వరూపమూ, దాని అర్థమూ, దీని ద్వారా దుఃఖం గురించీ పరీక్షించాలంటే ముందుగా అసంతుష్టికి మూలకారణం ఏమిటో తెలుసుకోవాలి.

సర్! చూడండి, పాఠశాల రోజుల నుంచి చనిపోయేవరకు పోల్చిచూడటంలోనే మన చదువు, మన నిబద్ధీకరణం సాగుతాయి. మరొకరితో నన్ను నేను పోల్చిచూసుకుంటాను. మిమ్మల్ని మీరే జాగ్రత్తగా గమనించండి. నేను చెప్తున్నది శ్రద్ధగా వింటూ, మీ మనసు ఎట్లా పనిచేస్తున్నదో పరికించండి. మీ మీద రెండు బాధ్యతలు వున్నాయి. వక్త చెప్తున్నది వినడమే కాకుండా, ఆ వింటున్నప్పుడు యదార్థంగా మీ మానసిక స్థితిగతులు ఏమిటో కూడా పరిశీలించాలి. అందుకని మీలో ఒక సావధానత వుండాలి. వక్తను గురించి, అతను చెప్తున్నదానిని గురించి కూడా ఎరుకగా వుండాలి. మిమ్మల్ని మీరు పరిశీలించుకుంటూ వుండాలి. అయితే, మీరు కనుక యదార్థంగా వింటున్నట్లవుతే- అంటే అవగాహన చేసుకోవాలని ప్రయత్నించడం కాదు, వక్త వుపన్యసిస్తున్నదానిని మీకు అన్వయించుకోవడం కాదు, నిందించడం కాదు, సర్దుబాటు చేసుకోవడం కాదు, నిరాకరించడమో, అంగీకరించడమో కాదు- అట్లా వింటున్నప్పుడు వక్త అనే ఒకరు కానీ, మీరు కానీ లేనేలేరని, కేవలం వాస్తవం మాత్రమే, అంటే 'వున్నది' అనేది మాత్రమే వున్నదని మీరు తెలుసుకుంటారు. అదీ వినడం అనే కళ. వక్త చెప్పేది కాని, మీ స్వంత అభిప్రాయాలను, నిర్ణయాలను కాని వినడం కాదు, 'యదార్థంగా వున్నది' ని వినడం. మనం ఎప్పుడూ మరొకరితో మనల్ని పోల్చి చూసుకుంటూ వుంటాం. నేను మందకొడిగా కనుక వుంటే, బాగా చురుకైన వాడిని అవాలని కోరుకుంటాను. నేను కనుక వట్టి డొల్ల మనిషినవుతే గంభీరంగా అవాలనుకుంటాను; ఏమీ తెలియని అజ్ఞానినవుతే చాలా తెలివిగా వుండాలి,

జ్ఞానం సంపాదించాలి అని కోరుకుంటాను. ఎప్పుడూ యితర్లతో నన్ను పోల్చి చూసుకుంటూ, యితరులతో పోల్చుకొని, నన్ను తూకం వేసుకుంటూ వుంటాసు- గారి కారుని మించిన కారు, వారికంటె మంచి ఆహారం, వారిని మించిన యిల్లు, వారి కంటె మంచి ఆలోచనా విధానం, అట్లాగ. పోల్చి చూడటం అనేది సంఘర్షణను పెంచి పోషిస్తుంది. అసలు పోల్చిచూడటం ద్వారా అవగాహన కలుగుతుందా? రెండు సంగీత స్వరాలను, రెండు సూర్యాస్తమయాలను పోల్చి చూసినప్పుడు, ఒక వృక్షాన్ని మరో వృక్షంతో పోల్చి చూసినప్పుడు, వాటిలో ఒక్కటయినా అర్థమవుతుందా? పోల్చి చూడటం అనేది ఏమాత్రం లేనప్పుడే ఒక విషయం మనకి అర్థమవుతుందా?

కాబట్టి, ఏ రకమైన పోల్చిచూడటమూ లేకుండా, మరొక వ్యక్తితో గాని, ఒక భావంతోగాని, ఒక ఆదర్శ పురుషునితోకాని, ఒక దృష్టాంతంతోకాని పోల్చుకోవడానికి అనుగుణంగా మిమ్మల్ని సరిదిద్దుకోవడం అన్నది లేనేలేకుండా జీవించడం సాధ్యమేనా? ఎందుకంటే పోల్చిచూస్తున్నప్పుడు, 'యిక ముందు ఎట్లా వుండాలి' లేదా 'ఒకప్పుడు ఎట్లా వుండింది? అన్నదానితో పోల్చి మిమ్మల్ని తూకం వేసుకుంటున్నప్పుడు, యిప్పుడు 'వున్నది' ఏమిటో దానిని మీరు చూడటం లేదు. దయచేసి వినండి. ఇది చాలా సరళంగానే వుంటుంది. అందువల్లనే, అతిచాతుర్యమూ, అతి జిత్తుల మారితనమూ వున్న మీకు బహుశ అది అందకుండా పోతున్నది. ఏ రకమైన పోల్చిచూడటమూ లేకుండా యీ ప్రపంచంలో జీవించడం సాధ్యం కాదా అని మేము ప్రశ్నిస్తున్నాము. సాధ్యంకాదు అని అనకండి. అసలు మీరెప్పుడూ ప్రయత్నించలేదు.' నేను చేయలేను, అది అసాధ్యం; ఎందుకంటే పోల్చిచూడటం అనేది నా నిబద్ధతలో ఒక ప్రధాన భాగం' అని మీరు అనరు. తరగతి గదిలో ఒక పిల్లవాడిని మరొక పిల్లవాడితో పోలుస్తారు. 'అతనంత తెలివిగా నీవు లేవు' అని అధ్యాపకుడు అంటాడు. 'బి' అనేవాడిని 'ఎ' తో పోల్చినపుడు 'బి' ని అధ్యాపకుడు నాశనం చేస్తున్నాడన్నమాట. జీవితమంతా యిదే పద్ధతిలో కొనసాగుతూ వుంటుంది.

అభివృద్ధికి, అవగాహనకి, మేధాపరమైన వికాసానికీ పోల్చిచూడటం అత్యావశ్యక మని మీరు అనుకుంటారు. కాని, అవసరం లేదు అని నాకనిపిస్తున్నది. ఒక చిత్రంతో మరొక చిత్రాన్ని పోల్చిచూస్తున్నప్పుడు ఏ ఒక్కదాన్నీ మీరు సరిగ్గా చూడటంలేదు. పోల్చడం లేనప్పుడు ఒక్కదానివంకే మీరు చూడగలుగుతారు. కాబట్టి, యిదే పద్ధతిలో, మరొకరితో మిమ్మల్ని మానసిక పరంగా పోల్చిచూడటం అనేది జీవితంలో ఎప్పటికీ లేనేలేకుండా జీవించడం సాధ్యమేనా? రాముడితో కాని, గీతతోకాని, సీతతోకాని, ఎవరితోనయినా సరే; నాయకుడితో, మీ దేవుళ్ళతో, మీ ఆదర్శాలతో బొత్తిగా పోల్చి చూసుకోకుండా వుండటం. పోల్చి చూడటం- ఏ స్థాయిలోనైనా సరే లేనేలేని మనసు

బ్రహ్మాండమైన సామర్థ్యాన్ని, బ్రహ్మాండమైన సజీవత్వాన్ని పొందుతుంది. ఎందుకంటే అప్పుడది 'వున్నది' ఏమిటి అన్నదానిని చూస్తుంటుంది కాబట్టి.

చూడండి, సర్! నేను ఒక డొల్ల మనిషిని. చాలా లోతైన స్వభావం, శక్తి సామర్థ్యాలు, ప్రగాఢమైన ఆలోచనా శక్తీ, జీవన విధానమూ వున్నాయని పేరుపడిన ఒక వ్యక్తితో నన్ను పోల్చి చూసుకుంటాను. నేను డొల్ల మనిషిని, సంకుచిత బుద్ధి కలవాడిని, అల్పుడిని కాబట్టి ఆ వ్యక్తితో నన్ను నేను పోల్చుకుంటాను. అతనిలాగా వుండాలని అవస్థ పడతాను. అతనిలాగా వుండటం కోసం అతన్ని అనుకరిస్తాను, అతని మాటలు వుదహరిస్తూ వుంటాను, అతన్ని అనుసరిస్తాను. ఆ విధంగా నన్ను నేనే ధ్వంసం చేసుకుంటాను. ఈ ఘర్షణ అంతులేకుండా కొనసాగిపోతూనే వుంటుంది. అయితే, పోల్చిచూడటం అన్నది అసలు లేనేలేకపోతే నేను మందబుద్ధిని అని నాకు ఎట్లా తెలుస్తుంది? మీరు అన్నారు కాబట్టా? నేను ఒక వుద్యోగం సంపాదించుకోలేక పోయాను కనుకనా? పాఠశాలలో సరిగ్గా చదువుకోలేదు కనుకనా? అసలు పోల్చి చూడటమే లేకుండాపోతే నేనొక మందబుద్ధిని అని నాకు అనిపిస్తుందా? అందువల్ల, నేను ఏమిటో అదే నేను. నేను ఒక స్థితిలో వున్నాను, అక్కడ నుండి కదలగలను, కొత్తవి కనిపెట్టగలను, మార్పు చెందగలను. కాని, మరొకరితో నన్ను నేను పోల్చు కుంటున్నప్పుడు జరిగే మార్పు మాత్రం పూర్తిగా కృత్రిమమైనది. దయచేసి యిదంతా శ్రద్ధగా వినండి, యిది మీ జీవితం. అంటే, పోల్చిచూడటం లేనప్పుడు 'వున్నది' వుంటుంది. అక్కడి నుంచి నేను కదులుతాను. జీవితంలోని ప్రాథమిక సూత్రాల్లో యిది ఒకటి. ఆధునిక జీవితం మనిషిని పోల్చిచూడటం, పోటీలు పడటం, అంతులేని పోరాటాలలో, యితరులతో కలహాలలో చిక్కుకొని పోవడం అనే నిబద్ధీకరణానికి లోను చేసింది. పోల్చిచూడటం లేనప్పుడే 'వున్నది' ని నేను చూడగల్గుతాను. కాబట్టి, పోల్చి చూడటం అన్నది వట్టి కుర్రతనపు వ్యవహారమని, అపరిపక్వతను సూచిస్తుందని నేను, మాటల్లోనే కాదు, యదార్థంగానే అర్థంచేసుకుంటాను.

సర్! ప్రేమ వున్న చోట పోల్చిచూడటం వుంటుందా? ఒకరిని మీరు మీ హృదయంతో, మీ మనసుతో, మీ శరీరంతో, మీ సంపూర్ణ అస్తిత్వంతో ప్రేమించి నప్పుడు, వారిని సొంతం చేసుకోవడం కాదు, వారిపై పెత్తనం చలాయించడం కాదు 'ఇదినాది' అనడం కాదు; అప్పుడు పోల్చి చూడటం అనేది వుంటుందా? పోల్చి చూడటం లేనప్పుడు మాత్రమే 'వున్నది' ని మీరు చూడగలుగుతారు. ఇది కనుక మనం అర్థం చేసుకుంటే, అప్పుడు సుఖం యొక్క సమస్త స్వరూపం ఏమిటో తెలుసుకోవడం, తరచి శోధించడం మనం ఆరంభించవచ్చు.

'ఉన్నది' ని భవిష్యత్తుతోనే కాకుండా, జరిగిపోయిన గతంతో కూడా పోల్చిచూడకుండా వుండటం- దీనికి బ్రహ్మాండమైన సావధాన శీలత్వం అత్యావశ్యకం అవుతుంది. మీకు అర్థమైందా? నిన్న నాకు కొంత సుఖం లభించింది- యింద్రియానుభూతమైన సుఖం; అసాధారణమైన వెలుగును ప్రసరించిన ఒక భావం; కాంతితో పూర్తిగా నిండిపోయిన ఒక మేఘాన్ని నిన్న చూశాను; కాని యివాళ దాన్ని నేను చూడలేక పోతున్నాను- అది నాకు మళ్ళీ కావాలి. కాబట్టి వర్తమానాన్ని, ఒకప్పుడు జరిగిన దానితో పోలుస్తాను. ఇకముందు ఎట్లా వుండాలి అన్నదానితో వర్తమానాన్ని పోల్చిచూడాలనుకుంటాను. ఈ పోల్చిచూడటం ద్వారా విలువగట్టడం అనేదాని నుంచి విముక్తం చెందాలంటే అఖండమైన తెలివితేటలు, సున్నితశీలత్వం అవసరం. తెలివి, సున్నితత్వం సంపూర్ణంగా వుండితీరాలి. అప్పుడే 'వున్నది' ని అవగాహన చేసుకోగలుగుతారు. అప్పుడు మీలో గాఢోద్వేగం వున్నదని గ్రహిస్తారు. 'ఉన్నది' ని అందుకోవడానికి మీకు శక్తి వుంటుంది. అయితే 'వున్నది' ని 'జరిగినదాని' తోనూ, 'ఉండవలసినదాని' తోనూ మీరు పోల్చి చూస్తుంటే ఆ శక్తిని మీరు పోగొట్టుకుంటారు.

సరే, యింతవరకు స్పష్టంగా వుందని ఆశిస్తాను. మేధాపరంగా కాదు, ఎందుకంటే దానివల్ల ఏమాత్రం లాభం వుండదు. అంతకంటె మీరు లేచి బయటకు వెళ్ళి పోవడం మంచిది. అయితే, నిజంగానే యిది మీకు అవగాహన అవుతే, అప్పుడు సుఖం వైపు సూటిగా చూడగలుగుతారు. అప్పుడు నిన్న పొందిన సుఖంతో దీనిని పోల్చిచూడరు. రేపు పొందబోయే సుఖంతో కూడా పోల్చిచూడరు. సుఖంకోసం వెతుక్కుంటున్న ఆ అసలు మనసును మీరు పరికిస్తారు. సుఖం గురించిన యీ సూత్రాన్ని మనిషి అర్థం చేసుకోవాలి తప్ప, 'నాకు సుఖం కావాలి' అనకూడదు. మీకు సుఖం కావాలంటే బాధను కూడా స్వీకరించాలి. దానితో పాటు దుఃఖాన్ని కూడా. ఒకటి లేకుండా రెండోది పొందడానికి వీల్లేదు. ఏ రూపంలో వున్న సుఖాన్నయినా సరే వెతుక్కుంటున్నప్పుడు సంఘర్షణలతో కూడిన ప్రపంచాన్ని మీరు తయారు చేస్తున్నారు. 'నేను ఒక హిందువుని' అని మీరు అంటే- మనం తగిలించుకునే యితర పేర్ల చీటీలు కూడా మీకు తెలుసు- మీకు గొప్ప ప్రాముఖ్యం వున్నట్లు మీకు అనిపిస్తుంది. ఒక నదిని పూజిస్తుంటే తక్కిన నదులన్నింటినీ మీరు తృణీకరించినట్లుగా ఒక కుటుంబానికి చాలా గొప్ప ప్రాముఖ్యత వచ్చిందంటే తక్కిన కుటుంబాలన్నింటినీ తృణీకరించినట్లే. అందుకే కుటుంబాలే విపత్తులకు కారణం అవుతున్నాయి. ఒక వృక్షాన్నో, ఒక దేవుడినో మీరు పూజిస్తే తక్కిన వృక్షాలన్నింటినీ, దేవుళ్ళందరినీ తృణీకరించినట్లే లెక్క. ప్రస్తుతం అదే జరుగుతున్నది. మీ స్వంత, ప్రత్యేకమైన చిన్ని దేశాన్ని మీరు పూజిస్తుంటే, తక్కిన దేశాలన్నింటినీ మీరు తృణీకరించినట్లే.

అప్పుడు మీరు కలహానికి తయారుగా వుంటారు; యుద్ధం చేయడానికీ, ఒకరి నొకరు చంపుకోడానికీ కూడా.

కాబట్టి సుఖం, దేవుళ్ళని పూజించడంలో, సత్యాన్ని అన్వేషించడంలో, 'నా దేశం', 'నా కుటుంబం', 'నా హోదా' అని అనడంలో కూరుకొనిపోయివుంది. వీటన్నింటిలోను కలిసిపోయివున్నది సుఖమే. ఈ సుఖమే చెప్పశక్యంకాని విపరీతాలను సృష్టిస్తున్నది. ఇది మనం అర్థం చేసుకోవాలి. తృణీకరించకూడదు. ఎందుకంటే, తృణీకరించిన క్షణంలోనే మీ చేతిని మీరే కత్తిరించి వేసుకున్నట్లవుతుంది, మీ కళ్ళను మీరే పొడుచుకున్నట్లవుతుంది. ఆపైన అందమైన మేఘాన్నికాని, సుందరమైన స్త్రీనికాని, చక్కని వృక్షాన్నికాని చూసే సుఖం లేకుండా చేసుకోవడం లాంటిది. కాబట్టి, సుఖం యొక్క అసాధారణమైన ప్రాముఖ్యాన్ని, సుఖం ఎట్లా కలుగుతుందో అన్నదానిని మనం అర్థం చేసుకోవాలి. అది అర్థం చేసుకున్నప్పుడు, సుఖం యొక్క ప్రత్యేకత ఏమిటో తెలుసుకుంటారు. అదేమిటో యిప్పుడు మనం చూద్దాం.

చూడండి, ప్రపంచంలోని మతాలన్నీ మీకు కోరికలు వుండకూడదని చెప్పాయి. ఆధ్యాత్మికులనబడే వారి సూక్తుల్లో ఒకటి ఏమిటంటే, కోరికలు లేకుండా వుండటానికి, నిష్కామంగా వుండటానికీ మీరు శతవిధాలా ప్రయత్నించాలీ అని. అదంతా వట్టి మూర్ఖత్వం. ఎందుకంటే, ఏదయినా ఒకటి చూసీ చూసేలోపలే కోరిక మనలో కలుగుతుంది. కోరిక అనేది ఒక ప్రతిచర్య. ప్రకాశవంతమైన ఒక రంగుని చూసినప్పుడు, దానివైపు బాగా పరికించి చూడండి. మీకు తెలుసా, మహా సౌందర్యవంతమైన వాటిలో రంగు ఒకటి. రంగు అంటే దైవం. దానివైపు చూడండి. 'నాకు ఎరుపు అంటే యిష్టం' అని కాని, 'నీలం యిష్టం' అని కాని అనకండి. ఊరికే మేఘాల రంగుని గమనించండి. చీరె రంగుని, వసంతకాలంలో అప్పుడే చిగురించిన ఆకుల వర్ణాన్ని చూడండి. అట్లా చూసినప్పుడు, అందులో సుఖం ఏమీ లేదని, కేవలం సౌందర్యం మాత్రమే వున్నదనీ కనిపెడతారు. సౌందర్యం ప్రేమ లాగానే కోరిక కాదు, సుఖమూ కాదు.

ఇప్పుడు యీ కోరిక అనే సమస్య సమస్తాన్నీ అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం. నిజంగా చూస్తే యిది చాలా సరళంగా వుంటుంది. దీనిని గురించి మనుష్యులు ఎందుకంత గలభా చేస్తారో నాకు తెలియదు. అది ఎట్లా వూపిరి పోసుకుంటుందో మీరే చూడచ్చు. మొదట పరికించడం, ఆ తరువాత యింద్రియానుభూతి, పరిచయం, కోరుకోవడం. అంతే, అంతకంటే ఏమీ లేదు. ఇక సమస్య యిప్పుడు మొదలవుతుంది. ఇప్పుడు ఆలోచన ప్రవేశించి, ఆ కోరికను గురించి తలపోస్తుంది. అదే సుఖంగా తయారవుతుంది. అంటే ఏమిటంటే- సర్! పెద్ద, లోతైన లోయలు వున్న ఒక అందమైన పర్వతాన్ని నేను చూస్తాను. మంచుతో కప్పుకొనిపోయి,

వుషాకాంతిలో మెరిసిపోతూ, ఏకాంతంగా వున్న నిండైన వుజ్వల రమణీయ ప్రకాశం అది. దాన్ని నేను చూస్తాను. ఆపైన ఆలోచన యిట్లా అనడం మొదలు పెడుతుంది, 'ఎంత అందంగా వుంది! ఎల్లకాలం దానినే చూస్తూ వుండిపోవాలని వుంది' అని. ఆలోచన అంటే స్మృతి మనం చూసినదానికి ప్రతిస్పందించడం- అది యిట్లా అంటుంది, 'నాకు అక్కడ నివసించాలని వుంది' అని. లేదూ ఒక అందమైన ముఖాన్ని నేను చూస్తాను. ఆ ముఖాన్ని గురించి ఆలోచిస్తాను. ఆపైన నిరంతరంగా దాన్ని గురించే ఆలోచించడం సుఖాన్ని యిస్తుంది. సెక్స్- మీరు అనుభవించిన ఆ సుఖం, దానిని గురించి, మీలోపల అది వదిలిన మనోబింబం గురించి మీరు ఆలోచిస్తూ వుంటారు- ఎంత ఎక్కువగా ఆలోచిస్తే అంత ఎక్కువ సుఖం మీకు. ఆ తరువాత కోరిక, ఆలోచన సుఖాన్ని కొనసాగించడాన్ని తీసుకువస్తుంది. ఇదంతా వివరంగా తెలుసుకుంటే చాలా సుకరంగా మీకు బోధపడుతుంది.

ఇప్పుడు, ఒకరు అడుగుతారు, 'కోరికను తాకకుండా వుండటం ఆలోచనకు సాధ్యమేనా' అని అర్థమవుతున్నదా? ఈ సమస్య మీది. సజీవత్వంతో, సౌందర్యంతో తొణికిసలాడుతున్న అసాధారణమైన అందాన్ని చూసినప్పుడు, ఆలోచనను అక్కడికి రానివ్వకూడదు. ఎందుకంటే ఆలోచన దానిని తాకిన క్షణమే, ఆలోచన పాతది కాబట్టి, ఆలోచన దానిని ఒక సుఖంలాగా వక్రీకరిస్తుంది. అందువల్ల సుఖంకోసమూ, మరింత మరింత సుఖం కోసమూ ఒత్తిడి బయలుదేరుతుంది. అది మనం యివ్వకపోతే సంఘర్షణ బయలుదేరుతుంది, భయం కలుగుతుంది. కాబట్టి, ఒక విషయంవైపు ఆలోచన లేకుండా చూడటం సాధ్యమేనా? అట్లా చూడాలంటే అఖండమైన సజీవత్వంతో మీరు వుండాలి, కదలలేని దుర్బలస్థితిలో కాదు. అయితే, మత బోధకులు, 'కదలిక లేని దుర్బల స్థితిలో పడివుండండి, పరమ సత్యాన్ని అందుకోవడానికి అవిటితనంతో రండి' అని మీతో అన్నారు. కాని, అవిటితనంతో మీరు పరమసత్యాన్ని చేరుకోలేరు. సత్యాన్ని చూడాలంటే నిర్దుష్టత గల మనసు, ఏ వైకల్యాలూ లేని, సహజ స్వచ్ఛత్వంతో వుండే మనసు, గందరగోళంలో లేని, చిత్రహింసలకు లోనుకాని, స్వేచ్ఛగా వున్న మనసు కావాలి. అప్పుడే సత్యాన్ని చూడగలుగుతారు. ఒక చెట్టువైపు చూస్తున్నప్పుడు, స్పష్టంగా వున్న కళ్ళతో, ఏ మనోబింబమూ లేకుండా, చెట్టుని మీరు చూడాలి. ఆలోచన కోరిక గురించి ఆలోచించినప్పుడు- ఆలోచన నిరంతరం కోరిక గురించే ఆలోచిస్తుంది- అందులో అది సుఖాన్ని పొందుతుంది. ఆలోచన ఒక వస్తువుని గురించిన మనోబింబాన్ని సృష్టిస్తుంది. ఆ కాల్పనిక బింబాన్ని గురించి, ఆ చిహ్నాన్ని గురించి, ఆ బొమ్మని గురించి ఎప్పుడూ ఆలోచిస్తూవుండటం సుఖానికి

దారితీస్తుంది. చాలా అందమైన ఒక శిరస్సును చూస్తారు. దానివైపు బాగా పరికించి చూస్తారు. "ఇది చాలా అందమైన శిరస్సు, చక్కని తలకాయ, మంచి తలకట్టు వుంది" అని ఆలోచన అంటుంది. దాన్ని గురించి యింకా ఆలోచించడం ఆరంభిస్తుంది. అది చాలా సుఖంగా, సంతోషంగా అనిపిస్తుంది.

ఆలోచన లేకుండా ఒకదానిని చూడటం అంటే అర్థం మీరు ఆలోచించడం మానివేయాలని కాదు- అసలు అంశం అది కాదు. కోరిక అంటే- చూడటం, యింద్రియానుభూతి చెందడం, పరిచయం అని తెలుసుకొని, కోరిక మధ్యలో ఆలోచన దూరి కల్పించుకున్నప్పుడు, మీలో ఆ ఎరుక వుండాలి. కోరిక పని చేసే ప్రక్రియ అంతటిని గురించీ, కోరిక కలిగిన ఆ క్షణంలోనే ఆలోచన దానిమీద పడి తొందరపెట్టడం గురించీ ఎరుకతో వుండాలి. దీనికి తెలివి తేటలే కాకుండా ఎరుకతో వుండవలసిన ఆవశ్యకత కూడా వున్నది. అంటే అపూర్వమైన సౌందర్యాన్ని కాని, అపూర్వమైన వికృత రూపాన్ని కాని చూసినప్పుడు ఎరుకగా వుండటం. అప్పుడు మనసు పోల్చి చూడదు. సౌందర్యం వికృతత్వం కాదు, వికృతత్వం సౌందర్యం కాదు. కాబట్టి సుఖాన్ని అవగాహన చేసుకోవడం ద్వారా దుఃఖాన్ని గురించి తరచి శోధించ వచ్చును.

దుఃఖం గురించి తెలుసుకోకుండా మీరు ఏం చేసినా సరే- అత్యున్నతమైన సాంఘిక హోదాను, అధికార హోదాను, ఆధ్యాత్మిక అంతస్థును, రాజకీయ హోదాను- దేన్ని అధిరోహించినా సరే- మీరు మాత్రం ఏదో విధంగా కీడు చేస్తూనే వుంటారు. మీ దేవుడు పేరు చెప్పుకొనో, మీ దేశం పేరు చెప్పుకొనో, మీ పార్టీ, మీ సమాజం, మీ సిద్ధాంతాల పేరు చెప్పుకొనో కీడు చేస్తూనే వుంటారు. హానికారకులవుతారు మీరు. అందులో సందేహం లేదు.

సరే, దుఃఖం అంటే ఏమిటి? మళ్ళీ ఒకసారి 'వున్నది' ని చూడండి; 'ఏది వుండాలి' ని కాదు. ఎందుకంటే, మీరు బాగా అర్థంచేసుకొని వుంటే, పోల్చి చూడటం యిప్పుడు మానేసి వుంటారు. కేవలం 'వున్నది' ని మాత్రం చూస్తారు. అందువల్ల పరికించి చూడటానికి మీకు శక్తి వుంటుంది. పోల్చి చూడటంలో ఆ శక్తి వృధా అయిపోకుండా వుంటుంది. మానవుడికి వున్న సమస్యల్లో ఒకటి ఏమిటంటే శక్తి ఎట్లా వస్తుంది అనేది. నీచమైన, అల్పమైన మనుస్సులున్న యీ మతవాదులే మళ్ళీ, "శక్తి కావాలంటే బ్రహ్మచర్యం అవలంబించాలి, శక్తి సంపాదించాలంటే మీరు ఆకలితో కృశించాలి, వుపవాసాలు చేయాలి, ఒక్క పూటే భోంచేయాలి, గోచీపాత ధరించాలి, పొద్దున రెండు గంటలకి లేవాలి, ప్రార్థనలు చేయాలి' - అని అన్నారు. ఇంతకంటె

బుద్ధిహీనత మరొకటి లేదు. ఎందుకంటే యీ విధంగా చేసి మిమ్మల్ని మీరే ధ్వంసం చేసుకుంటున్నారు, మీ శక్తిని ధ్వంసం చేసుకుంటున్నారు. యదార్థమైన 'వున్నది' ని మీరు చూసినప్పుడు శక్తి వస్తుంది. అంటే అర్థం పోల్చిచూడటంలో శక్తి వృథా అవడం లేదనమాట.

దుఃఖం అంటే ఏమిటి అని అడుగుతున్నాం. దుఃఖాన్ని జయించడానికి మానవుడు అనేక మార్గాలు అవలంబించాడు- పూజల ద్వారా, పారిపోవడం ద్వారా, త్రాగుడు ద్వారా, వినోదకాలక్షేపం ద్వారా ప్రయత్నాలు చేశాడు. అయితే దుఃఖం మాత్రం అట్లాగే వుండిపోయింది. దుఃఖాన్ని కూడా తక్కిన అన్నింటిలాగా అవగాహన చేసుకోవలసిందే. దానిని నిరాకరించకండి, అణచిపెట్టకండి, దానిని తట్టుకోవడానికి ప్రయత్నించకండి; అర్థం చేసుకోండి. అది ఏమిటో బాగా పరికించి చూడండి. దుఃఖం అంటే ఏమిటి? నేను మీకు చెప్పాలా? ప్రేమిస్తున్నానని మీరు అనుకుంటున్న వ్యక్తిని మీరు పోగొట్టుకుంటే దుఃఖం; పూర్తిగా, సంపూర్ణంగా సఫలత చెందలేక పోవడం దుఃఖం; అర్హత, అవకాశం మీకు దొరకనప్పుడు దుఃఖం; సఫలత చెందాలని మీరు కోరుకుంటూ, సాఫల్యం చెందడానికి ఏ మార్గమూ లేనప్పుడు దుఃఖం; మీ లోపల వున్న ఏమీలేని ఖాళీతనం, ఒంటరి తనం మీ ఎట్ట ఎదుట నిలబడి ప్రశ్నిస్తున్నప్పుడు దుఃఖం; ఇంకా తన మీద తనకే జాలి అనే బాధ కూడా దుఃఖంలో వుంటుంది. తన మీద తనే జాలిపడటం అంటే ఏమిటో మీకు తెలుసా? మిమ్మల్ని మీరే నిందించుకోవడం, మీకే తెలియకుండానో, ఒక్కొక్కసారి తెలిసి కూడా. మీ మీద మీరే సానుభూతి కురిపించుకోవడం. 'నేనిప్పుడున్న స్థితిలో, చుట్టు వున్న వాతావరణానికి విరుద్ధంగా ఏమీ చేయలేను' అని అనడం. మిమ్మల్ని మీరే ఒక పీడగా భావించుకోవడం. మీ పరిస్థితికి మీరే దిగులు చెందడం. అదే మీమీద మీరే జాలిపడటం. అంటే స్వీయానుకంప. దుఃఖం ఆవిధంగా వుంటుంది.

దుఃఖాన్ని అర్థంచేసుకోవాలంటే మొదట యీ స్వీయ అనుకంప గురించి ఎరుక కలగాలి. దుఃఖానికున్న కారణాల్లో యిదీ ఒకటి. ఒక మనిషి చనిపోవడం వల్ల మీరు ఒక్కరే మిగిలినప్పుడు, మీరు ఎంతో ఒంటరిగా వున్నారు అనే స్పృహ మీకు కలుగుతుంది. ఒక మనిషి చనిపోవడం వల్ల డబ్బు, ఆదాయం ఏమీ లేక, మీకు భద్రత వుండదు. ఇతర్ల మీద ఆధారపడి జీవిస్తారు. ఆ పైన యిబ్బందుల గురించి చెప్పుకోవడం మొదలు పెడతారు, మీ మీద మీకే జాలి ఆరంభమవుతుంది. కాబట్టి, దుఃఖానికి వున్న కారణాల్లో ఒకటి స్వీయానుకంప; ఇది వాస్తవం; మీరు ఒంటరిగా వున్నారన్న వాస్తవంలాగే యిదీ ఒక వాస్తవం. 'ఉన్నది' అంటే యిదే. స్వీయాను

కంపవైపు బాగా పరికించి చూడండి. దానిని తట్టుకోవాలని ప్రయత్నం చేయకండి, నిరాకరించకండి, 'దీనితో నేను ఏం చేయాలి' అని అనకండి. వాస్తవం ఏమిటంటే స్వీయానుకంప వున్నది. వాస్తవం ఏమిటంటే మీరు ఒంటరిగా వున్నారు. ఆ వాస్తవం వైపు సూటిగా చూడగలరా? నిన్న మీ వద్ద డబ్బు వున్నప్పుడో, ఆ మనిషి వున్నప్పుడో, ఆ శక్తి సామర్థ్యాలు వున్నప్పుడో- అది ఏదయినా సరే- అప్పుడు ఎంత బ్రహ్మాండమైన భద్రతలో వున్నారు అనేదానితో పోల్చి చూడకుండా, ఊరికే దానివైపు చూడండి. అప్పుడు స్వీయానుకంపకు ఏ మాత్రం స్థానం వుండదని గ్రహిస్తారు. అట్లాగని ఆ పరిస్థితిని వున్నదున్నట్లుగా మీరు స్వీకరించాలని కాదు.

దుఃఖానికి గల ఒక కారణం మనిషిలోని విపరీతమైన ఒంటరితనం. మీకు చాలామంది స్నేహితులు వుండవచ్చు. ఎంతోమంది దేవుళ్ళుండచ్చు. గొప్ప జ్ఞానం మీరు సంపాదించి వుండచ్చు. అంతూ పొంతూ లేకుండా రాజకీయాల గురించి కబుర్లు చెప్పుకుంటూ, అనేకమైన సాంఘిక కార్యకలాపాల్లో పాల్గొంటూ వుండచ్చు- చాలా మంది రాజకీయ వేత్తలు కబుర్లతోనే కాలక్షేపం చేస్తుంటారు- అయినా కూడా యీ ఒంటరితనం అట్లాగే వుండిపోతుంది. అందువల్ల, జీవితానికి ఒక విశిష్టతను ఆపాదించాలని, మానవుడు ఒక అర్థాన్ని, ఒక ప్రత్యేకతను కనిపెడతాడు. ఇంకా ఆ ఒంటరితనం అట్లాగే మిగిలి పోతుంది. అందుకని, పోల్చి చూడటం అనేది లేకుండా ఆ ఒంటరితనంవైపు బాగా పరికించి చూడగలరా? దాని నుంచి తప్పించుకోవాలని ప్రయత్నించకుండా, దానికో ముసుగు వేయాలనుకోకుండా, పారిపోవాలని ప్రయత్నించకుండా, వున్న దానిని వున్నట్లుగా చూడగలరా? అప్పుడు యీ ఒంటరితనం పూర్తిగా విభిన్నమైన మరొకటిగా మారడం చూడగలుగుతారు.

మనిషి ఒంటరిగానే వుండాలి. కాని మనం ఒంటరిగా లేము. వేలకొద్దీ ప్రభావాలు, వేలకొద్దీ నిబద్ధీకరణాలు, మానసికమైన వారసత్వాలు, సిద్ధాంత ప్రచారాలు, సంస్కృతులు- యివన్నీ కలసి ఏర్పడగా వచ్చిన ఫలితమే మనం. మనం ఒంటరిగా లేము. అందువల్ల మనల్ని నకలు మనుష్యులని అనవచ్చు. ఒకరు ఒంటరిగా వున్నప్పుడు, సంపూర్ణమైన ఒంటరి తనంలో వున్నప్పుడు, వారికి ఒక కుటుంబం వుంటే వుండచ్చు గాక, కాని ఆ కుటుంబానికి చెందినవారుగా వారు వుండనప్పుడు, ఒక దేశానికి గాని, ఒక సంస్కృతికి గాని, ఒక ప్రత్యేకమైన నిబద్ధతకు గానీ చెందినవారుగా వుండనప్పుడు- తాము దేనితోనూ సంబంధంలేని వారం- ఏ తత్వంతోను, ఏ కార్యక్రమంతోను ఏ కుటుంబంతోను, ఏ దేశంతోను సంబంధంలేని వారం అనే భావం కలుగుతుంది. ఈ విధంగా పరిపూర్ణమైన ఒంటరితనంలో వున్నవారే సహజస్వచ్ఛత్వం గల అమాయకులుగా వుంటారు. ఈ అమాయకత్వమే మనసును దుఃఖం నుండి విముక్తం చేస్తుంది.

దుఃఖంతో నిండిపోయిన మనసుకు ప్రేమ అంటే ఏమిటో ఎన్నటికీ తెలియదు. మీకు తెలుసా ప్రేమ అంటే ఏమిటో? పరిశీలించేవాడికి, పరిశీలిస్తున్న అంశానికీ మధ్యన స్థలం వున్నట్లవుతే ప్రేమ లేనట్లే.

స్థలం అంటే ఏమిటో మీకు తెలుసునా? మీకూ, ఆ చెట్టుకూ మధ్యన వున్న ఎడం, మీకూ, మీరు ఎట్లా వుండాలని అనుకుంటున్నారో దానికీ మధ్యన వున్న ఎడం. ఒక కేంద్రం- అంటే పరిశీలకుడు వున్నప్పుడు ఎడం అన్నది ఏర్పడుతుంది. అర్థమవుతున్నదా? ఒక విధంగా యిది చాలా సరళమైనదే; అయితే పోను పోను పరమ సంక్లిష్టంగా తయారవుతుంది. ముందు సరళంగా ఆరంభిద్దాం. ఈ వక్తముందు వున్న శబ్ద గ్రహణ యంత్రం (మైక్రోఫోను) చూడండి. ఈ మైక్రోఫోను ఒక స్థలంలో వున్నది. అయితే మైక్రొఫోను కూడా కొంత చోటును సృష్టిస్తున్నది. నాలుగు గోడలతో వున్న ఒక యిల్లు వుంది. ఆ నాలుగు గోడల బయటనే కాకుండా, వాటి మధ్యన కూడా స్థలం వున్నది. అట్లాగే మీకు చెట్టుకు మధ్యన చోటు వున్నది. మీకు, మీ పొరుగువారికి మధ్యన, మీకు, మీ భార్యకు మధ్యన చోటు వున్నది. మీకు, మీ పొరుగువారికి మధ్యన, మీకు, మీ భార్యకో భర్తకో లేదూ యింకొకరికో మధ్యన యీ చోటు వున్నంతకాలం, యీ స్థలాన్ని తయారుచేస్తున్న ఒక కేంద్రం వున్నదని అర్థంచేసుకోవాలి. ఇదంతా అర్థం అవుతున్నదా? నక్షత్రాల వంక చూస్తున్నప్పుడు ఆ నక్షత్రాలను చూస్తున్న మీరు వుంటారు; ప్రకాశిస్తున్న నక్షత్రాలతో, స్వచ్ఛమైన చల్లని గాలితో కూడిన సాయంత్రపు రమణీయమైన ఆకాశమూ వుంటుంది- మీరు, అంటే పరిశీలకుడు, పరిశీలిస్తున్న అంశమూ వుంటాయి.

కాబట్టి, స్థలాన్ని సృష్టిస్తున్న కేంద్రం అంటే మీరే. ఒక చెట్టు వైపు మీరు చూస్తున్నప్పుడు, మీ గురించీ, ఆ చెట్టు గురించీ మీలో ఒక మనోబింబం వుంటుంది. ఆ కాల్పనిక బింబమే చెట్టుని చూస్తున్న కేంద్రం. కాబట్టి మధ్యన ఒక ఎడం ఏర్పడుతున్నది. మేము చెప్పినట్లుగా యీ ఎడం లేనప్పుడే ప్రేమ వుంటుంది- అంటే పరిశీలకుడు తనకూ ఆ వృక్షానికీ మధ్యన సృష్టించే ఆ స్థలం లేనప్పుడు. మీ భార్యను గురించి మీకొక కాల్పనిక బింబం వుంటుంది. మీ భార్యకూ మీ గురించి ఒక కాల్పనిక బింబం వుటుంది. ఈ కాల్పనిక బింబాన్ని మీరు పది సంవత్సరాల పాటో, రెండు సంవత్సరాల పాటో లేదూ ఒక్క రోజులోనో, ఆమె సుఖాలతో, మీ సుఖాలతో, ఆమె అవమానాలతో, మీ అవమానాలతో నిర్మించుకుంటూ వచ్చారు. ఆమెని నసతో వేధించడం ద్వారా, పెత్తనం చలాయించడం ద్వారా, యింకా అటువంటి వాటి ద్వారా దానిని నిర్మించుకొచ్చారు. ఈ రెండు కాల్పనిక బింబాల మధ్యనున్న పరిచయాన్ని

'బాంధవ్యం' అంటున్నాం. ఏ కాల్పనిక బింబమూ లేనప్పుడే ప్రేమ వుంటుంది- అంటే అర్థం ఎడం లేనప్పుడు అన్నమాట. ఇంద్రియ సంబంధమైన స్థలం కాదు; భౌతికమైన స్థలం కాదు; అంతర్గతమైన స్థలం వుండనప్పుడు ఎడం లేనప్పుడు సౌందర్యం వుంటుందే, ఆ విధంగా.

స్వీయాన్ని, అంటే తనని తాను పరిత్యజించడం అన్నది లేనప్పుడే ఎడం వుంటుంది. చూడండి, మీకు అవగాహన అవని విషయాలను గురించి మాట్లాడు తున్నాం. ఇంతకు ముందు ఎప్పుడూ మీరు యిది చేసి చూడలేదు. మీకు, మీ భార్యకూ మధ్యన వున్న, మీకూ ఆ వృక్షానికీ మధ్యన వున్న, మీకూ ఆ నక్షత్రాలకో, ఆ ఆకాశానికో, మబ్బులకో మధ్యన వున్న స్థలాన్ని మీరెప్పుడూ తొలగించలేదు. మీరెప్పుడూ నిజంగా పరికించి చూడలేదు. సౌందర్యం అంటే ఏమిటో మీకు తెలియదు. ఎందుకంటే ప్రేమ అంటే ఏమిటో మీకు తెలియదు కాబట్టి. దాన్ని గురించి మాట్లాడతారు, దానిని గురించి రాస్తారు; కాని అదేమిటో మీకు తెలియనే తెలియదు. కాబట్టి ఆ అనుభూతిని మీరు పొందలేదు. బహు అరుదుగా ఎప్పుడైనా పొందారేమో. స్వీయాన్ని పరిత్యజించడం అనే ఆ సంపూర్ణమైన తన్మయత్వాన్ని. ఎందుకంటే స్వీయం అనే ఆ కేంద్రమే తన చుట్టూ తానే యీ స్థలాన్ని తయారుచేసుకుంటుంది. ఈ స్థలం వున్నంతవరకు ప్రేమ వుండదు, సౌందర్యమూ వుండదు. అందువల్లనే మన జీవితాలు యింత శూన్యంగా, యింత కరడుగట్టుకొని పోయి వున్నాయి.

మీరు రోజూ ఆఫీసుకి వెళ్తారు- ఎందుకో నాకు తెలియదు. "నేను వెళ్ళి తీరాలి, ఎందుకంటే నాకు బాధ్యతలున్నాయి, సంపాదించాలి. నా కుటుంబాన్ని పోషించాలి" అని మీరంటారు. ఏ పనైనా మీరు ఎందుకు చేసి తీరాలో నాకు తెలియదు. మీరు బానిసలు- అంతే. ఒక చెట్టుని చూస్తున్నప్పుడు గాని, ఎదుట కూర్చున్నవారి ముఖంవైపు చూస్తున్నప్పుడు గాని, మీరు పరిశీలించి చూడనే చూడరు. ఒకవేళ ఆ ముఖంవైపు మీరు పరికించి చూసినా, ఒక కేంద్రం నుంచి చూస్తారు. ఈ కేంద్రం మీకు, ఆ వ్యక్తికి మధ్యన చోటును సృష్టిస్తుంది. ఆ ఎడాన్ని అధిగమించడానికి కొందరు ఎల్ఎస్‌డి వంటి మత్తు పదార్థాలు సేవిస్తున్నారు. ఆ మత్తుమందులు తీసుకోవడం వల్ల మీ మనసు అసాధారణమైన సున్నితత్వాన్ని పొందుతుంది. ఒక రసాయనిక మార్పు జరుగుతుంది. ఆ తరువాత ఎడం పూర్తిగా మాయమవుతుంది. అయితే నేను అవి తీసుకున్నానని అనుకోకండి. (నవ్వులు). అవన్నీ కృత్రిమమైన పద్ధతులు. కాబట్టి యదార్థమైనవి కావు. అవన్నీ క్షణికమైన సంతోషాన్నీ, తాత్కాలికమైన

స్వర్గసుఖాన్నీ, క్షణికమైన ఆనందాన్నీ యిచ్చే సాధనాలు. ఆ రకంగా దానిని పొందడం సాధ్యంకాని విషయం.

కాబట్టి ప్రేమ, సౌందర్యం లేనప్పుడు సత్యం వుండదు. మీ మహాత్ములు, మీ దేవుళ్ళు, మీ మతాచార్యులు, మీ గ్రంథాలు యిది వొప్పుకోరు. అందువల్లే మీరింత దుఃఖావస్థలో •వున్నారు. ప్రేమను గురించి కంటే గీత గురించో, ఖురాన్ గురించో, బైబిల్ గురించో మీరు మాట్లాడాలనుకుంటారు. దీనికి అర్థం ఏమిటంటే మురికి వీధులని, పరమ ఛండాలాన్ని, దారి పొడుగునా వున్న రోతనీ చూసి కూడా మీరు సహిస్తూ వుంటారు. మురికికి మీ సహకారం అందిస్తారు. ఎప్పుడు సహకరించకుండా వుండాలో మీకు తెలియదు. ఈ వ్యవస్థకు మీ సహకారం అందిస్తారు. "లేదు, నేను సహకరించను, ఏది ఏమయినా సరే నేను లెక్కచేయను" అని ఎప్పుడనాలో మీకు తెలియదు. ఆ మాట మీరు అన్నారంటే మీలో ప్రేమ వుండబట్టి, మీలో సౌందర్యం వుండబట్టి. మీరు తిరగబడటం కాదు దానికి కారణం. అప్పుడు మీకు తెలుస్తుంది, మీలో యిది వున్నప్పుడు సౌందర్యం, ప్రేమ వుంటాయని. అప్పుడు 'వున్నది ఏది' అన్న పరిగ్రాహ్యత వుంటుంది. అదే ప్రేమ. అప్పుడు మనసు అప్రమేయంగా (కొలతల్లో చూపలేనంతగా) తనని మించి ఆవలగా పొగలుగుతుంది.

కాని, మీకు పనులు వున్నాయి. ప్రతి రోజూ ఆఫీసుకి వెళ్ళినప్పుడు ఒక తుఫానులాగా పని చేసి తీరాలి. కష్టపడాలి. కాని యిది ప్రేమని సాధించడం లేదు. ఎందుకంటే వినయాన్ని ఎట్లా సంపాదించలేరో అట్లాగే ప్రేమను కూడా సాధించి అందుకోలేరు. గర్విష్ఠి మనిషే మాటల్లో వినయాన్ని సాధిస్తాడు. అయితే అతను గర్విష్ఠిగానే మిగిలిపోతాడు. వినయం లాగే ప్రేమని కూడా అలవర్చుకోలేము. సౌందర్యాన్నీ అలవర్చుకోలేము. ఎరుకగా లేకుండా సత్యాన్ని చూడటం సాధ్యం కాదు. మీరు ఎరుకగా వుంటే- ఏదో నిగూఢ తత్వం గురించి కాకుండా- మీరు చేస్తున్న దానిని గురించి, మీరు ఎట్లా అగుపిస్తారు, ఎట్లా నడుస్తారు, ఎట్లాతింటారు, దేనిని గురించి మాట్లాడతారు అనే ఎరుక వుంటే, అప్పుడు ఆ ఎరుక ద్వారా సుఖం యొక్క, కోరిక యొక్క, దుఃఖం యొక్క స్వభావలక్షణం, మనిషిలో వున్న విపరీతమైన వొంటరితనమూ, ఏమీ తోచకపోవడమూ గ్రహించడం మొదలుపెడతారు. అప్పుడు 'స్థలం' అని మనం అంటున్నదానిని చూడటం ఆరంభిస్తారు. ఎక్కడయితే మీకు మీరు చూస్తున్న వస్తువుకు మధ్యన ఎడం వుంటుందో అక్కడ ప్రేమ లేదని మీరు గ్రహిస్తారు.

ప్రేమ లేనప్పుడు మీరు ఏం చేసినా సరే- సంస్కరణలు చేయండి, ఒక కొత్త సాంఘిక క్రమాన్ని తీసుకొని రండి, సైద్ధాంతికమైన అభ్యుదయాన్ని గురించి

అంతులేకుండా మాట్లాడండి అవన్నీ బాధలకే దారితీస్తాయి. ఇక యిప్పుడు అంతా మీ చేతుల్లోనే వుంది. నాయకులు లేరు, గురువులు లేరు; మీరు ఏం చేయాలో చెప్పడానికి ఎవరూ లేరు. మీకు మీరే వెలుగును చూపించుకునే దీపం కావాలి. కాబట్టి, మీరు వొంటరిగా వున్నారు. మతిభ్రష్టం పొందిన, దౌర్జన్య పూరితమైన యీ ప్రపంచంలో మీరు వొంటరిగా వున్నారు. అందుకనే యీ సిద్ధాంతాల ఎడారిలో మీరు ఒక ఒయాసిస్ అవాలి. ఈ ఒయాసిస్ ప్రేమ వున్నప్పుడే ప్రాణం పోసుకుంటుంది.

*దీ కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, XVII వాల్యూమ్,*
*నాల్గవ ప్రసంగం, బొంబాయి, **1967***

# సందేహాలూ, సమాధానాలు

**ప్రశ్న : మానవుడి సమస్యలు పరిష్కరించాలంటే రావలసినది ఆర్థికవిప్లవం కానీ, సామాజిక విప్లవం కానీ కాదు; కావలసినది మత విషయకమైన విప్లవం అని మీ ప్రసంగంలో అన్నారని యీ రోజు వార్తాపత్రికలో చదివాను. మతవిషయకమైన విప్లవం అంటే మీ అర్థం ఏమిటి?**

కృష్ణమూర్తి : మొట్ట మొదట అసలు మతం అంటే మనం ఏమనుకుంటున్నామో చూద్దాం. మనలో చాలామందికి అసలు మతం అంటే ఏమిటి? మతం అంటే ఫలానా అని చెప్పే ఒక సిద్ధాంతంగా కాదు, అసలు వాస్తవంలో ఏమిటి? చాలామంది దృష్టిలో సర్వసాధారణంగా మతం అంటే కొన్ని కొన్ని మూఢ విశ్వాసాలూ, ఆచారాలూ, వుపనిషత్తుల్లో, గీతలో, బైబిల్లో ఏం చెప్పారూ అనేవి. లేదా నిబద్ధీకరణం చెందిన మన మనసుల్లోనుంచి, హిందువులుగానో, క్రైస్తవులుగానో, కమ్యూనిస్టు ధోరణిలోనో రూపుదిద్దుకున్న మన మనసుల్లో నుంచి పుట్టుకొచ్చిన అనుభవాలతో, అలౌకికమైన స్వప్నాలతో, ఆశలతో, వూహలతో తయారు చేసినదాన్ని మతం అని అనుకుంటాం. ఒక రకమైన నిబద్ధీకరణంతో ఆరంభమైన మనం, దానికనుగుణంగా వుండే అనుభవాలనే పొందుతూ వుంటాం. మతం అని మనం పిలుస్తున్నదంతా ఏమిటంటే ప్రార్థనలు, కర్మకాండలు, అంధ విశ్వాసాలు, దేవుడిని ప్రత్యక్షం చేసుకోవాలనుకోవడం, ఆధిపత్యానికి తలవంచడం, అసంఖ్యాకమైన మూఢాచారాలు- అంతే కదూ? అదేనా మతం అంటే? నిజంగా సత్యం ఏమిటి అన్నది తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నవారు అసలు యిదంతా పూర్తిగా విసర్జించి పారేయాలి, వదిలేయవద్దూ? గురువుల ఆధిపత్యాన్ని, వుపనిషత్తుల ఆధిపత్యాన్ని, తన స్వీయ అనుభవాల ఆధిపత్యాన్నీ అన్నింటినీ పూర్తిగా వదిలివేయాలి. ఆ విధంగా ఆధిపత్యమంతా తొలగించుకొని ప్రక్షాళితం అయింది కాబట్టి మనసు కొత్తదానిని ఆవిష్కరించుకోగలుగుతుంది. అంటే అర్థం మీరు హిందువుగానో, క్రైస్తవునిగానో, బౌద్ధునిగానో వుండటం మానేస్తారు. అటువంటి వ్యవహారంలో వుండే బుద్ధిహీనతను గ్రహించి దానినుండి మీరు బయటపడాలి. అది మీరు చేస్తారా? ఎందుకంటే అట్లా చేస్తే ప్రస్తుత సమాజాన్ని మీరు ధిక్కరించినట్లవుతుంది, మీ వుద్యోగం వూడచ్చు. కాబట్టి భయం మీ మనసుమీద పెత్తనం వహిస్తుంది; అందుకని మీరు ఆధిపత్యానికి తలవంచుతూనే వుంటారు.

మతం అని మనం యిప్పుడు అంటున్నది మతం కానే కాదు. దేవుడంటే మనకు నమ్మకం వున్నదా, నమ్మకం లేదా అన్నది మన నిబద్ధీకరణం మీద ఆధారపడి వుంటుంది. మీకు దేవుడంటే నమ్మకం వుంటుంది, కమ్యూనిస్టుకి దేవుడు లేడు అనే

దాంట్లో నమ్మకం వుంటుంది. ఈ రెంటి మధ్యన ఏం భేదం వుంది? వీరిద్దరిలో ఏ మాత్రం వ్యత్యాసం లేదు. ఎందుకంటే మీరు నమ్మటంలో శిక్షణ పొందారు; అతనికి నమ్మకుండా వుండటంలో తర్ఫీదు యిచ్చారు. కాబట్టి నిజంగా తరచి శోధించాలనుకునేవారు ఆ పద్ధతులన్నీ సంపూర్ణంగా తిరస్కరించాలి. తిరస్కరించి తీరద్దూ? ఇందులోని ప్రాధాన్యతనంతా అర్ధంచేసుకున్నారు కాబట్టి తిరస్కరించాలి.

భద్రతాలేమి వల్ల, భయపడుతుండటం వల్ల, అంతర్గతమైన వెలితి వల్ల ఒక దేశంతోనో, ఒక సిద్ధాంతవాదంతోనో, దేవుని మీద విశ్వాసంతోనో మనం పూర్తిగా ఐక్యమై పోతాం. దీనివల్ల ఏం జరుగుతున్నదో ప్రపంచమంతటా కనిపిస్తూనే వుంది. మతాలన్నీ ప్రేమనీ, సహోదరభావాన్నీ, యింకా అటువంటివాటినీ ఒక ప్రక్కన ప్రవచిస్తూనే మనిషిని మనిషినుండి విడదీస్తున్నాయి. మీరు సిక్కులు, నేను హిందువుని, అతడు ముస్లిం, మరొకరు బౌద్ధులు. ఈ గందరగోళం, యీ విభజనలు, యివన్నీ చూసినప్పుడు మరో కొత్త రకమైన ఆలోచనా సరళి వుండితీరాలని మనం గ్రహిస్తాం. అయితే మనం హిందువులగానో, క్రైస్తవులుగానో, యింకా రకరకాలుగానో వుండి పోయినంతవరకు కొత్త రకంగా ఆలోచించడమన్నది జరగదు అని స్పష్టంగా కనబడుతూ వున్నది. దీనంతటినుండీ విముక్తమవాలంటే మిమ్మల్ని, మీ అస్తిత్వం యొక్క మొత్తం స్వరూపాన్ని మీరు తెలుసుకొని తీరాలి. ఎందుకు అంగీకరిస్తుంటారో, ఎందుకు ఆధిపత్యాన్ని అనుసరిస్తారో గ్రహించి తీరాలి. అదంతా మీరు చాలా స్పష్టంగా చూడాలి. మీకు గెలుపు కావాలి; కష్టాలు మీదపడ్డప్పుడు ఆధారపడటానికి దేవుడంటూ ఒకడున్నాడని ఎవరయినా మీకు హామీ యివ్వాలి. నిజంగానే ఆనందంగా, సంతోషంగా వున్న వారు ఎవ్వరూ దేవుడిని గురించి తలుచుకోనే తలుచుకోరు. బాధల్లో, సంఘర్షణలో వున్నప్పుడే దేవుడిని తలచుకుంటాం. అయితే యీ బాధల్నీ, సంఘర్షణనీ తయారు చేసుకున్నదీ మనమే. ఈ ప్రక్రియనంతా అవగాహన చేసుకోనంతవరకు వూరికే దేవుడిని గురించి అన్వేషించడం నిస్సందేహంగా భ్రాంతిలో పడవేస్తుంది.

కాబట్టి నేను మాట్లాడుతున్న మతపరమైన విప్లవం అంటే ఏదో ఒక మతాన్ని పునరుద్ధరించడమో, సంస్కరించడమో కాదు. అది సర్వమతాల నుండి, సమస్తమైన సిద్ధాంతవాదాల నుండి సంపూర్ణమైన విముక్తి- అంటే నిజమైన అర్థం ఏమిటంటే వీటిని తయారుచేసిన సమాజం నుండి విముక్తి. ఆకాంక్షా పరత్వం వున్న మనిషి మతచింతనా పరుడు అవలేడు. ఆకాంక్షాపరత్వం వున్న మనిషికి ప్రేమ అంటే తెలియదు. అతను ప్రేమను గురించి మాట్లాడవచ్చుగాక. ఒకరు లౌకిక దృష్టిలో ఆకాంక్షాపరులు కాకపోవచ్చు. అయితే తాను మహాత్ముడినవాలనో, ఆధ్యాత్మిక రంగంలో

గుర్తింపు పొందాలనో, పైలోకంలో ఫలితం రాబట్టాలనో కోరుకుంటుంటే అతనిలో ఆకాంక్షాపరత్వం వున్నట్లే. కాబట్టి మనసు అన్ని మంత్రాలను, పూజలను, నమ్మకాలను, అంధవిశ్వాసాలను, యింకా అటువంటి వాటి నన్నింటినీ త్రోసి అవతల పారవేయడమే కాకుండా, అసూయనుండి కూడా విముక్తి పొందాలి. మనిషి సంపూర్ణమైన స్వేచ్ఛను పొందడమే మతపరమైన విప్లవం. అప్పుడే అతడు జీవితాన్ని పూర్తిగా విభిన్నమైన దృష్టితో సమీపిస్తాడు. ఒక సమస్య తరువాత మరొక సమస్యను సృష్టించుకోవడం ఆపివేస్తాడు.

ఇవన్నీ వట్టి మాటలుగానో, మేధావిత్వంగానో భావిస్తూ మీరు విని వుంటారు. ఎందుకంటే, 'ఆకాంక్ష అనేదే లేకపోతే నేను జీవితంలో ఏం చేయగలుగుతాను? సమాజం నన్ను నాశనం చేసేస్తుంది' అని మీలో మీరు అనుకుంటూ వున్నారు. సమాజం మిమ్మల్ని నాశనం చేస్తుందా అని నేను ప్రశ్నిస్తున్నాను. సమాజాన్ని అవగాహన చేసుకొని, దానిని నిలబెడుతున్న యీ ఆకాంక్షా పరత్వం, అసూయ, గెలుపు కోసం ప్రయాస పడటం, మతపరమైన మూఢవాదాలు, విశ్వాసాలు, అంధాచారాలు అనే మొత్తం నిర్మాణ స్వరూపాన్ని అంతా తిరస్కరించిన మరుక్షణమే మీరు సమాజంలో నుండి యివతలగా వచ్చేస్తారు. కాబట్టి సమస్య మొత్తాన్ని మళ్ళీ కొత్తదనంతో చూస్తారు. బహుశ అప్పుడు సమస్య అనేదే లేకపోవచ్చు. అసలు మీరు యిదంతా కేవలం మాటల స్థాయిలోనే విన్నారేమో. అప్పుడు మళ్ళీ రేపు అంతా యధాతధంగా పాతపద్ధతిలోనే కొనసాగిస్తారు. గీతనో, బైబిలునో చదువుకుంటారు. మీ గురువు వద్దకో, మతాచార్యుల వద్దకో వెళ్తారు. మళ్ళీ అన్నీ మామూలే. ప్రసంగం అంతా విని మేధాపరంగా, వాచ్యంగా అదంతా మీరు ఆమోదించవచ్చు. అయితే మీ జీవితం దీనికి వ్యతిరేకమైన దిశలో పోతూవుంటుంది. కాబట్టి మీరు మరొక సంఘర్షణను తయారు చేసుకుంటారు. అందువల్ల అసలు మీరు వినకపోవడమే మంచిది. ఎందుకంటే ప్రస్తుతం మీకున్న సంఘర్షణలు, సమస్యలు చాలవన్నట్లు మరొకటి అదనంగా చేర్చడం ఎందుకు. ఇక్కడ కూర్చుని, చెప్తున్నవన్నీ వినడం చాలా బాగుంటుంది. అయితే దీనితో మీ వాస్తవ జీవితానికి ఏ సంబంధమూ లేనప్పుడు, మీరు చెవులు మూసుకొని వుంచుకోవడమే చాలా మంచిది. ఎందుకంటే సత్యం విన్నాక, అట్లా జీవించకపోతే, అప్పుడు మీ జీవితం ఘోరమైన గందరగోళంలో పడిపోతుంది. దుఃఖభూయిష్ఠమూ, చీకాకుల మయమూ అవుతుంది. నిజానికి మీ జీవితం అట్లాగే వుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, X వాల్యూమ్,*
*న్యూఢిల్లీ అక్టోబర్ 10, 1956*

**ప్రశ్న : మా అందరిలోనూ ఏవో భయాలు- యుద్ధాన్ని గురించో, వుద్యోగం కనుక వుంటే అది పోతుందేమోననో, వుగ్రవాదులని గురించో, మా పిల్లలలో కనబడుతున్న దౌర్జన్యం గురించో, అప్రయోజకులైన రాజకలయవేత్తల పాలిట పడ్డామే అనో- యిట్లా రకరకాల భయాలు మా జీవితాలను ఎప్పుడూ కళవళ పెడుతూవుంటాయి. ఇటువంటి యీ జీవితాన్ని మేము ఏవిధంగా ఎదుర్కోవాలి?**

*కృష్ణమూర్తి :* ఎట్లా ఎదుర్కొంటారు? ప్రపంచం రోజు రోజుకూ హింసాపూరితంగా తయారవుతున్నదనే విషయం మనం వొప్పుకొని తీరాలి- అది స్పష్టంగా కనబడు తున్నది. యుద్ధ ప్రమాదం కూడా స్పష్టంగా కనబడుతూనే వున్నది. మన పిల్లలు హింసాత్మకంగా తయారవుతున్నారనే ఒక కొత్త వైపరీత్యం కూడా మన కళ్ళముందు వున్నది. కొంతకాలం కిందట భారతదేశంలో పిల్లలతల్లి అయిన ఒకావిడ మా వద్దకు రావడం గుర్తుకొస్తున్నది. భారతీయ సంప్రదాయం ప్రకారం తల్లి అంటే చాలా గౌరవనీయమైన స్థానంలో వుండే వ్యక్తి. ఈ తల్లిని తన పిల్లల ప్రవర్తన దిగ్భ్రాంతిలో ముంచింది. పిల్లలు ఆమెని కొడుతున్నారట- భారతదేశంలో కనీ వినీ ఎరగని సంగతి. అంటే యీ హింస, దౌర్జన్యం ప్రపంచమంతా వ్యాపిస్తున్నాయి. ఇక యీ ప్రశ్న అడిగినవారు అన్నట్లుగా వుద్యోగం పోతుందనే భయం ఒకటి వున్నది. ఇవన్నీ చూస్తూ, యిదంతా తెలిసి, ప్రస్తుతం యిట్లా వున్న యీ జీవితాన్ని మీరు ఏవిధంగా ఎదుర్కోవాలి?

నాకు తెలియదు. నేను ఎట్లా ఎదుర్కోవాలో నాకు తెలుసు. మీరు ఎట్లా ఎదుర్కొంటారో నాకు తెలియదు. మొట్టమొదటగా, జీవితం అంటే ఏమిటి? ఎక్కడ చూసినా దుఃఖం, మితిమీరిన జనాభా, అప్రయోజకులైన రాజకీయవేత్తలు, రకరకాల మాయలూ, మోసాలూ, చిత్తశుద్ధిలేక పోవడం, లంచగొండితనం వంటివి నిరాఘాటంగా సాగుతున్న ప్రపంచంలో మన అస్తిత్వం అన్నది ఏమిటి? ఇదంతా ఎట్లా ఎదుర్కోవాలి? అందుకు మొదట తప్పనిసరిగా తరచి చూడవలసినది జీవించడం అంటే అర్థం ఏమిటనేది. ప్రస్తుతం వున్న ప్రపంచంలో జీవించడం అంటే ఏమిటి? మన నిత్య జీవితాన్ని అసలు ఎట్లా గడపాలి, సిద్ధాంతరూపేణా కాదు, తాత్త్విక యోచనగా కాదు, ఆదర్శవాదంగా కాదు, అసలు వాస్తవంలో మన నిత్య జీవితాన్ని ఎట్లా జీవించాలి?

మనం కనుక పరీక్షిస్తే, బాగా గాఢమైనస్పృహతో గమనిస్తే, అది ఒక నిరంతరమైన సమరం, నిరంతరమైన పోరాటం, ప్రయాస మీద ప్రయాస పడుతూ వుండటం. ఉదయం నిద్రలేవడం ఒక ప్రయాస. ఏం చేయాలి మనం? తప్పించుకొని పారిపోవడం సాధ్యం కాదు. ఈ ప్రపంచంలో జీవించడం అసాధ్యం అని అనుకున్న చాలామంది, అన్నింటినీ వదిలేసి ఎక్కడో హిమాలయాల్లోకి వెళ్ళిపోయి, అంతర్ధానమయ్యారు.

అదంతా కేవలం తప్పించుకోవడం, యదార్థాన్నుండి పారిపోవడం. అది కూడా సమష్ఠిగా నివసించే సహజీవన సంఘాల్లో చేరి కలసిపోవడం లాంటిదే, బోలెడు ఆశ్రమాలూ, ఆస్తులూ వున్న గురువును చేరి అందులో పడి మునిగిపోవడం వంటిదే. వీళ్ళంతా నిత్యజీవితపు సమస్యలని పరిష్కరించుకోరు. సమాజంలో రావలసిన మార్పు, మానసికమైన విప్లవాల గురించి లోతుగా శోధించరు. వీటినుంచి పారిపోతారు. ఇక మనం,మనమూ తప్పించుకొని పారిపోకుండా, యీ వున్న ప్రపంచంలోనే నిజంగా జీవిస్తుంటే, అప్పుడు మనం ఏం చేయాలి? మన జీవితాల్ని మార్చుకోగలమా? మొత్తం జీవితంలో సంఘర్షణ అనేది లేకుండా చేసుకోగలమా, ఎందుకంటే సంఘర్షణ కూడా హింసలో ఒక భాగమే- అది సాధ్యమేనా? మన జీవితాలకు ఆధారం ఏమిటీ అంటే ఏదో ఒక గొప్పదనాన్ని సాధించాలనే పోరాటం; ప్రయాసా, పోరాటమూ.

ఈ ప్రపంచంలో నివసిస్తున్న మనుష్యులం మనం- మనల్ని మార్చుకోగలమా? అదే అసలైన ప్రశ్న- సమూలంగా, మనో తత్వంలోనే పరివర్తన తీసుకొనిరాగలమా? కాలక్రమేణా వచ్చే పర్యవసానంగా కాదు, కాలానికి కట్టుబడకుండా. లోతుగా ఆలోచించేవారికి, నిజమైన ఆధ్యాత్మికులకు రేపు అనేది వుండదు. రేపు లేదు అని అనడం చాలా కఠినవాక్యం. ఇవాల్టి రోజును సంరంభంతో పూజించడం అన్నది మాత్రమే వుంది. ఈ జీవితాన్ని ప్రతిరోజూ, పరిపూర్ణంగా, యదార్థంగా జీవించగలమా, మన బాంధవ్యాలలో పరివర్తన తేగలమా? అసలు సమస్య అదీ, ప్రపంచం ఎట్లా వుంది అన్నది కాదు. ఎందుకంటే ప్రపంచం అంటే మనమే. దయచేసి యిది గ్రహించండి : ప్రపంచం అంటే మీరు, మీరు అంటే ప్రపంచం. ఇది స్పష్టంగా కనబడుతున్న, భయంకరమైన వాస్తవం. ఆసాంతంగా ఎదుర్కోవలసిన ఒక పెద్ద సమస్య- అంటే ఎంతో అసహ్యమైనవన్నీ కలిగివున్న యీ లోకం అంటే మనమే అనీ, మనకీ అందులో భాగస్వామ్యం వుందనీ, యిదంతా యిట్లా వుండటంలో బాధ్యత మనమీద కూడా వున్నదనీ, మధ్య ప్రాచ్యంలో జరుగుతున్నదానికి, ఆఫ్రికాలో జరుగుతున్నదానికి, ప్రపంచమంతటా జరుగుతున్న మతిలేని వ్యవహారాలన్నింటికీ మనమూ బాధ్యులమేనని గ్రహించడం. మన తాతలు, మన ముత్తాతలు చేసిన క్రియలకు- బానిసత్వం, వేలకొద్దీ యుద్ధాలు, సామ్రాజ్యాల్లోని క్రూరత్వం- మనం బాధ్యులం కాకపోవచ్చును కానీ మనమూ అందులోని వాళ్ళమే. మన బాధ్యతను మనం గ్రహించకపోతే, అంటే మన సమస్త బాధ్యతను, మనం చేసే పనులకు, ఆలోచనలకు, ప్రవర్తనకు మన బాధ్యతను మనం గుర్తించకపోతే, అప్పుడు బొత్తిగా ఏ ఆశా లేనట్లే. లోకం సంగతి తెలుసు కాబట్టి వ్యక్తిగతంగా, విడివిడిగా మనం యీ వుగ్రవాదపు సమస్యను పరిష్కరించలేమని తెలుసు కాబట్టి. అది ప్రభుత్వాల సమస్య. పౌరులకు భద్రత, రక్షణ కల్పించడం వారి విధి. అయితే అది వారు లక్ష్య పెట్టడంలేదు.

తమ ప్రజలను రక్షించుకోవాలనే సంగతి ప్రతి ప్రభుత్వమూ నిజంగానే కనుక పట్టించుకుంటే, అప్పుడు యుద్ధాలు వుండవు. కాని ప్రభుత్వాలకు కూడా మతిస్థిరత్వం పోయినట్లే కనబడుతున్నది. వాళ్ళకి కావలసినదల్లా పార్టీ రాజకీయాలు, వాళ్ళ అధికారం, వాళ్ళ పదవులు, వాళ్ళ పలుకుబడి- అవన్నీ, ఆ నాటకం అంతా మీకు తెలుసు.

కాబట్టి, కాలాన్ని లెక్కలోకి తీసుకోకుండా, అంటే రేపు గురించి, భవిష్యత్తు గురించి ఆలోచించకుండా, యివాళే అత్యంత ప్రధానం అన్నట్లుగా మనం జీవించగలమా? అంటే అర్థం, మన ప్రతిస్పందనల ఎడల, మనలోని గందరగోళం ఎడల అశేషమైన జాగరకతతో వుండాలి- మనపై మనమే ఒక పరమావేశాన్ని ప్రయోగించుకోవాలి. మనం చేయగలిగిన పని యిదొక్కటేగా కనబడుతున్నది. ఇది కనుక మనం చేయకపోతే మానవుడికి భవిష్యత్తు లేదు. పత్రికల్లో వస్తున్న పతాక శీర్షకలను మీరు చూస్తున్నారో లేదో నాకు తెలియదు- యుద్ధం కోసం జరుగుతున్న సన్నాహాలను గురించి. సన్నాహాలు జరుగుతున్నాయంటే అది తప్పక జరిగి తీరుతుందన్నమాటే- వంటకాలు తయారు అవుతున్నట్లుగా. ప్రపంచంలోని సామాన్య ప్రజలకీ సంగతి పట్టినట్లు లేదు. మారణాయుధాల తయారీలో మేధాపరంగా, వైజ్ఞానికంగా పాల్గొంటున్న వాళ్ళూ లక్ష్యపెట్టడం లేదు. వాళ్ళకు కావలసినదల్లా తమ వృత్తిలో పైకి పోవడం, తమ వుద్యోగాలు, తమ పరిశోధనా. చాలా సామాన్య పౌరులుగా లెక్కించబడే మనలాటి వాళ్ళం, మధ్య తరగతి అని పిలవబడే మనం కూడా కనుక లక్ష్యపెట్టకపోతే మాత్రం మనమంతా నడి సముద్రంలో దూకినట్లే. ఇందులోని విషాదం ఏమిటంటే మనం యిది లెక్కచేస్తున్నట్లుగా కనబడటంలేదు. అందరం కలసి ఒకచోట చేరడం, కలిసి ఆలోచించడం, కలిసి పనిచేయడం లేనే లేదు. సంస్థల్లోనూ, సభల్లోనూ చేరడానికి మాత్రం చాలా వుత్సాహం చూపుతాం. అవి యీ యుద్ధాలు, యీ నరికి పోగులు పెట్టుకోవడాలు ఆపు చేస్తాయని ఆశపడతాం. ఇంతవరకూ అవి ఏమీ చేయలేదు. సభలూ, సంస్థలూ వీటిని ఆపడం అనేది జరగదు. మానవ హృదయమే, మానవ మస్తిష్కమే అసలు యీ పనులను చేయిస్తున్నది. దయచేసి యివి ఆవేశంతో అంటున్న మాటలని అనుకోకండి. నిజంగానే చాలా గొప్ప వుపద్రవాన్ని మనం ముఖాముఖిగా ఎదుర్కొబోతున్నాం. ఇందులో పాల్గొంటున్న చాలా ప్రముఖులైనవారిని మేము కలుసుకున్నాం. వారు యీ విషయంలో చాలా నిర్లక్ష్యంగా వున్నారు. మనం కనుక యిది పట్టించుకున్నట్లయితే, మన నిత్యజీవితాన్ని సవ్యంగా గడుపుతే, ప్రతిరోజూ మనం ఏం చేస్తున్నామన్న స్పృహ మనలో వుంటే, అప్పుడు భవిష్యత్తు కొంత ఆశాజనకంగా వుంటుంది.

*(మీటింగ్ లైఫ్)*

**ప్రశ్న : మీరు వుపన్యాసాలు యిస్తూ ఎందుకు కాలాన్ని వృథా పుచ్చుతారు; దానికి బదులుగా ప్రపంచానికి క్రియాశీలకంగా ఏదయినా సహాయం చేయచ్చు గదా?**

కృష్ణమూర్తి : సరే, 'క్రియాశీలకంగా' అంటే మీ అర్థం ఏమిటి? ప్రపంచాన్ని మార్చివేసి, యింతకంటె మంచి ఆర్థికమైన సర్దుబాట్లను తేవడమా, మొత్తం సంపద పంపిణీని, సంబంధ బాంధవ్యాలను యింతకంటే మెరుగు పరచడమా? ఇంకా కఠినంగా చెప్పదలుచుకుంటే, మీకు ఒక మంచి వుద్యోగం వెదికి పెట్టడమా? ప్రపంచంలో మార్పు రావాలని మీరు కోరుకుంటున్నారు- బుద్ధివున్న ప్రతి మనిషీ అదే అనుకుంటున్నాడు- ఈ మార్పును తెచ్చే ఒక పద్ధతిని కోరుతున్నారు మీరు. ఆ విషయకంగా ఏదయినా చేయకుండా వుపన్యాసాలతో కాలాన్ని వృథాచేస్తున్నానని ఆకారణంగా అడుగుతున్నారు. సరే, నేను చేస్తున్నది నిజంగా కాలం వృథా చేయడమేనా? పాత సిద్ధాంతవాదాల స్థానంలో, పాత పద్ధతుల స్థానంలో ఒక కొత్త సూత్రావళిని నేను ప్రచారం చేస్తే అప్పుడది తప్పకుండా కాలం వ్యర్థం చేయడమే అవుతుంది, అవదూ? నేను చేయాలని మీరు కోరుకుంటున్నది బహుశ అదేనేమో? అయితే, ఆచరించడానికి, జీవించడానికి, మంచి వుద్యోగం సంపాదించడానికి, యింతకంటె మంచి లోకాన్ని నిర్మించడానికి మీరు చెప్తున్న క్రియాశీలకమైన ఒక విధానాన్ని సూచించడానికి బదులుగా, ఒక నిజమైన విప్లవం రాకుండా నిరోధిస్తున్న ప్రతిబంధకాలు అసలు ఏవి అనేది తెలుసుకోవడం ముఖ్యం కదూ? విప్లవం అంటే వామ పక్షంవైపుకీ కాదు, మరో పక్కకీ కాదు; మౌలికమైన, సమూలమైన విప్లవం; సిద్ధాంతాలమీద ఆధారపడినది కాదు, ఎందుకంటే, మనం ముందే చర్చించినట్లుగా ఆదర్శాలు, నమ్మకాలు, సిద్ధాంతవాదాలు, మూఢవిశ్వాసాలు అసలు చర్యకు ప్రతిబంధకాలవుతాయి. మన చర్యలు భావాల మీద ఆధారపడినంతవరకు ప్రపంచ పరివర్తన, విప్లవం జరగవు. ఎందుకంటే అప్పుడు కేవలం మర్డోదానికి ప్రతిస్పందనగా మాత్రమే కార్యాచరణ జరుగుతుంది. అందువల్ల కార్యాచరణ కంటె భావాలకే ప్రాధాన్యం ఎక్కువవుతుంది. ఇప్పుడు ప్రపంచంలో సరిగ్గా యిదే జరుగుతున్నది, అవును కదూ? కార్యాచరణ జరగాలంటే చర్యలను నిరోధించే ప్రతిబంధకాలు ఏమిటో మనం కనిపెట్టాలి. అయితే మనలో చాలామంది కార్యాచరణ కావాలనుకోవడం లేదు. అదీ మనకున్న క్లిష్టపరిస్థితి. అంతకంటే మనకి చర్చలు జరపడం, ఒక సిద్ధాంతాన్ని తోసేసి, దాని స్థానంలో మరో సిద్ధాంతం పెట్టడమూ యిష్టం. ఆ విధంగా కార్యాచరణ చేయకుండా సిద్ధాంతాలను పట్టుకొని పారిపోతాం. ఇదంతా చాలా స్పష్టంగానే వుంది కదా, వుందా లేదా? ప్రస్తుత సమయంలో ప్రపంచం ఎన్నో సమస్యలను ఎదు ర్కొంటున్నది. జనాభా పెరుగుదల, ఆకలి చావులు, జాతులుగా వర్గాలుగా ప్రజల్లో

విభజనలు యింకా యిటువంటివి. జాతీయవాదం వల్ల వచ్చే సమస్యల పరిష్కారం కోసం కొంతమంది కలిసి ఒక బృందంగా ఏర్పడి ఎందుకు ప్రయత్నించరు? ఒక పక్కన మన జాతీయ భావాలను వదలకుండా పట్టుకొని కూర్చుని, అంతర్జాతీయతను సాధించాలని మనం ప్రయత్నిస్తే మళ్ళీ యింకో సమస్యను తయారుచేస్తాం. మనలో చాలామంది చేస్తున్నది యిదే. కాబట్టి నిజంగా చూస్తే ఆదర్శాలే కార్యాచరణను నిరోధిస్తున్నాయని గ్రహించవచ్చు. ఒక రాజకీయ వేత్త, చాలా వున్నతమైన అధికార స్థానంలో వున్న వ్యక్తి, యీ ప్రపంచాన్నంతా ఒక వ్యవస్థ క్రిందకు తెచ్చి, ప్రజలందరికీ తిండి దొరికేటట్లుగా చేయవచ్చని అన్నారు. అప్పుడది ఎందుకు జరగడం లేదు? ఆలోచనల్లో వైరుధ్యాలుండటం వలన, నమ్మకాల వలన, జాతీయ వాదాలున్న కారణంగా జరగడం లేదు. కాబట్టి సిద్ధాంతాలే నిజంగా ప్రజల ఆకలిని తీర్చకుండా నిరోధిస్తున్నాయి. మనలో చాలా మంది భావాలతో ఆటలాడుతుంటారు; తాము చాలా గొప్ప విప్లవకారులమని అనుకుంటారు, 'క్రియాశీలకం' లాంటి మాటలతో మనల్ని మనమే సమ్మోహ పరచుకుంటాం. అసలు ప్రధానమైన సంగతి ఏమిటంటే భావాల నుండి, జాతీయవాదాల నుండి, మతపరమైన అన్ని నమ్మకాలనుండి, విశ్వాసాల నుండి మనల్ని విముక్తి చేసుకోవడం. అప్పుడు, ఒక విధానాన్ని అనుసరించి కాని, ఒక సిద్ధాంతవాదాన్ని అనుసరించి కాని కాకుండా, అవసరాలకు తగినట్లుగా మనం చర్యలు తీసుకుంటాం. కాబట్టి అటువంటి కార్యాచరణకు అడ్డుతగిలే అవరోధాలను, ప్రతిబంధకాలను ఎత్తి చూపడం కాలాన్ని వ్యర్థం చేయడం ఎంతమాత్రం కాదు, గాలి పోగుచేయడమూ కాదు. మీరు చేస్తున్నది నిస్సందేహంగా అర్థంలేని పని. మీ భావనలు, మీ నమ్మకాలు. మీ రాజకీయ, ఆర్థిక, మత సంబంధమైన పరమౌషధాలన్నీ వాస్తవంగా ప్రజలను విడదీసి, యుద్ధాలకు దారితీయిస్తున్నాయి. సిద్ధాంతాలనుండి, నమ్మకాలనుండి మనసు విముక్తి పొందినప్పుడే, సవ్యమైన చర్య తీసుకో గలుగుతుంది. దేశ భక్తుడు, జాతీయవాది అయిన వ్యక్తి సహోదరభావం అంటే ఏమిటో ఎప్పటికీ తెలుసుకోలేడు; దాన్ని గురించి అతడు ఎంతయినా మాట్లాడవచ్చు గాక. అంతే కాకుండా అతను ఆర్థిక రంగంలోనూ, యితర రంగాల్లోనూ చేసే పనులు కూడా యుద్ధాన్ని ప్రేరేపించేవిగా వుంటాయి. కాబట్టి సవ్యమైన కార్యాచరణ ద్వారా సమూలమైన, శాశ్వతమైన పరివర్తన రావాలంటే మనసులో అంటే పైపై వుపరితలంలోనే కాదు, మూల మట్టంలోనే సిద్ధాంతాలనేవి వుండకూడదు. స్వీయాన్ని గురించిన ఎరుక ద్వారా, స్వీయాన్ని గురించి తెలుసుకోవడం ద్వారా మాత్రమే సిద్ధాంతాల నుండి స్వేచ్ఛ పొందడం జరుగుతుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, VI వాల్యూమ్,*
*1 జనవరి 1950, కొలంబో*

**ప్రశ్న : మాలో చాలామందికి ప్రతిరోజూ తప్పనిసరిగా చేయవలసిన ఒకటే రకం పనులతో విసుగొచ్చేసింది. అయితే యీ పనులు, అంటే ఆ వుద్యోగాలే మా జీవనాధారం. చేస్తున్న పనులతోనే సంతోషంగా జీవించటం మాకు వీలవుతుందా?**

కృష్ణమూర్తి : నిజమే, ఆధునిక నాగరికత వ్యక్తిగతంగా మనకి ఏ మాత్రం యిష్టంలేని పనులను మనచేత బలవంతంగా చేయిస్తున్నది. ప్రస్తుతం వున్న సమాజపు నిర్మాణం పోటీలు, నిర్దాక్షిణ్యత యుద్ధం అనే వాటిని ఆధారం చేసుకొని వుంది. దానికి కావలసినది వుదాహరణకి, ఇంజనీర్లు, శాస్త్రజ్ఞులూ అనుకుందాం. ప్రపంచంలో ప్రతి చోటా వీళ్ళ అవసరమే కనబడుతున్నది. ఎందుకంటే యుద్ధపరికరాలని వీళ్ళు యింకా బాగా అభివృద్ధి చేయగలుగుతారు, దయాదాక్షిణ్యాలు లేని యాంత్రికమైన సామర్థ్యాన్ని దేశంలో యింకా పెంపుచేయ గలుగుతారు. కాబట్టి ఒక వ్యక్తిని యింజనీరుగానో, శాస్త్రజ్ఞునిగానో తయారు చేయడానికే విద్యా విధానమంతా నడుంకట్టుకొని కూర్చుంది. అతను వీటికి అర్హుడా కాడా అన్న సంగతి ఎవరికీ అక్కర్లేదు. ఇంజనీరు అవడంకోసం విద్య అభ్యసిస్తున్నవారికి యింజనీరు అవడం అసలు యిష్టమే లేకపోవచ్చు. అతనికి చిత్రకళ మీదో, సంగీతం మీదో, మరోదాని మీదో అభిరుచి వుండచ్చు. అయితే పరిస్థితులు- విద్యా విధానం, కుటుంబ సంప్రదాయం, సమాజపు వొత్తిడులు మొదలైనవన్నీ అతన్ని యింజనీరే అయితీరాలని ఆదేశిస్తాయి. ఈ విధంగా ఒకే రకమైన పనులని తయారు చేస్తున్నాం, చాలామంది అందులో చిక్కుకొని పోతున్నారు. ఇక ఆ తరువాత నిస్పృహ,బాధ, అసంతృప్తి వారిని జీవితాంతం వెంటాడుతూ వుంటాయి. ఇది అందరికీ తెలిసినదే.

ముఖ్యంగా యిది విద్యావిధానానికి సంబంధించినది. అవును కదూ? ఒక కొత్తరకమైన విద్యావిధానాన్ని, అంటే బోధకునికి, విద్యార్థికి యిద్దరికీ కూడా తము చేస్తున్న పని మీద ప్రేమ వుండే విద్యావిధానాన్ని మనం తీసుకురాగలమా? ప్రేమ- ఆ మాటని అచ్చంగా ఆ అర్థంలోనే అంటున్నాను. అయితే, ఎంతసేపూ గెలుపు, అధికారం, పదవి, ప్రతిష్ఠ సాధించడానికి ఒక సాధనంగా మీ పనిని మీరు వుపయోగించు కుంటుంటే ఆ పని మీద మీకు ప్రేమ వుండదు. ఇప్పుడున్న తీరులో వున్న యీ సమాజం బొత్తిగా విసుగెత్తి పోయిన, ప్రతిరోజూ చేసే పనుల్లో చిక్కుకొని పోయిన వ్యక్తులనే తయారు చేస్తున్నదనడంలో సందేహం లేదు. కాబట్టి, పూర్తిగా భిన్నమైన వాతావరణాన్ని తీసుకొని రావాలంటే, విద్యార్థులు, పిల్లలు తాము చేసేది ప్రేమతో చేయగలిగే వాతావరణంలో పెరగాలంటే, విద్యావిధానంలోను, యితర విషయాల్లోనూ కూడా ఒక బ్రహ్మాండమైన విప్లవం రావలసిన అవసరం వుంది. లేదూ?

ప్రస్తుత పరిస్థితుల్లో, ఒకే రకమైన పనులు ప్రతిరోజూ చేయడం, విసుగెత్తిపోవడం మనం భరిచవలసి వస్తున్నది. అందుకని రకరకాల మార్గాల్లో పారిపోవడానికి ప్రయత్నిస్తూ వుంటాం. వినోద కాలక్షేపాలు, టెలివిషన్, రేడియో, పుస్తకాలు, మతం అని మనం పిలిచేది మొదలైన వాటిలోపడి పారిపోవాలని ప్రయత్నిస్తూ వుంటాం. అందువల్ల మన జీవితాలు డొల్లగా, శూన్యంగా, మందకొడిగా తయారవుతాయి. ఇట్లా డొల్లగా వుండటం వల్ల ఆధిపత్యానికి తలవంచడం పెరుగుతుంది. దానివల్ల మనం లోకంతో పాటు కలిసి వున్నామనే భావం, కొంతబలం ఒక స్థానం మనకి దొరుకుతాయి. ఇదంతా మనకు హృదయగతంలో తెలుస్తునే వుంటుంది. కాని యిందులో నుంచి బయటపడటం చాలా కష్టం. ఎందుకంటే బయటపడాలంటే కావలసినది అతి సాధారణమైన భావోద్వేగంకాదు; దానికి అత్యంతంగా ఆవశ్యకమైనవి ఆలోచన, శక్తి, కృషి.

కాబట్టి, మీరు కనుక ఒక నూతన ప్రపంచాన్ని తయారు చేయాలనుకుంటే, మానవులు అనుభవించిన యీ భయంకరమైన యుద్ధాలూ, యీ క్షోభా, యీ ఘోరాలు చూశాక తప్పక తయారు చేసి తీరాలి- అప్పుడు ఒక మత విషయైక విప్లవం మనలో ప్రతి ఒక్కరిలో వచ్చి తీరాలి. ఆ విప్లవం ఒక నవ్య సంస్కృతినీ, ఆసాంతం కొత్తదైన ఒక మతాన్నీ- అది ఆధిపత్యంతో కూడిన, పురోహితుల ఆచారవిధులతో కూడిన, మూఢ విశ్వాసాలు, కర్మకాండలతో కూడిన మతం కాదు- తీసుకువస్తుంది. అన్ని విధాలా భిన్నమైన ఒక సమాజాన్ని తయారు చేయాలంటే యీ మత విషయైక విప్లవం వచ్చి తీరాలి. అంటే వ్యక్తి లోలోపలే జరిగే విప్లవం; అంతే తప్ప నియంతృత్వాన్ని, బాధలని, భయాన్ని పెంచి పోషించే ఆ ఘోరమైన రక్తపాతాల విప్లవం కాదు. ఒక నూతన ప్రపంచాన్ని- అంటే పూర్తిగా భిన్నమైన అర్థంలో కొత్తదానిని- మనం నిర్మిస్తే, అప్పుడది మన అందరి ప్రపంచం అవుతుంది; ఒక జర్మన్ ప్రపంచమో, రష్యన్ పపంచమో, హిందూ ప్రపంచమో అవకూడదు. ఎందుకంటే మనమంతా మానవులం, యీ భూమి మనది.

అయితే, దౌర్భాగ్యం ఏమిటంటే, మనలో చాలా తక్కువ మంది వీటిని గురించి లోతుగా ఆలోచిస్తారు. ఎందుకంటే దీనికి ప్రేమ ఆవశ్యకమవుతుంది, భావోద్వేగం కాదు, ఆవేశతత్వం కాదు. ప్రేమ చాలా దుర్లభమైనది. భావోద్వేగంతోను, ఆవేశంగానూ వుండేవారు సాధారణంగా చాలా క్రూరంగా వుంటారు. పూర్తిగా భిన్నమైన ఒక కొత్త సంస్కృతిని తేవాలంటే మనలో ప్రతి ఒక్కరిలోనూ యీ మతపరమైన విప్లవం జరగాలని నాకు అనిపిస్తున్నది. అంటే అర్థం స్వేచ్ఛ పొందాలని. మత సూత్రాలన్నిటి

నుండీ, అంధ విశ్వాసాలన్నిటినుండే కాదు, వ్యక్తిగతమైన ఆకాంక్షా పరత్వం నుండి, స్వార్థపూరిత కార్యకలాపాల నుండి కూడా స్వేచ్ఛ పొందాలి. అప్పుడు మాత్రమే ఒక నూతన ప్రపంచం అవిర్భవించ గలుగుతుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, X వాల్యూమ్,*
*హేంబర్గ్, 15 సెప్టెంబర్, 1956.*

**ప్రశ్న : నేను, నా భార్య ఎప్పుడూ పోట్లాడుకుంటూ వుంటాం. మా యిద్దరికీ ఒకరంటే మరొకరికి యిష్టమే. అయినా ఎందువల్లో యీ కీచులాటలు వస్తూనే వుంటాయి. చాలా అసహ్యంగా తయారయింది యిది. ఇదంతా మానెయ్యాలని ఎన్నో రకాలుగా ప్రయత్నించాం. కాని యిద్దరమూ మానసికంగా ఒకరి నుంచి యింకొకరం స్వతంత్రంగా వుండలేకపోతున్నాం. మీ సలహా ఏమిటి?**

**కృష్ణమూర్తి :** ఆధారపడటం అన్నది వున్నంతవరకు వొత్తిడి తప్పదు. నేను ఒక సఫలత సాధించడం కోసంగాను, అసంఖ్యాకమైన ప్రజలకు వుపన్యాసాలు యిచ్చే గొప్పవాడినని అనుకోవడానికి గాను శ్రోతలుగా మీ ఆలంబనాన్ని కోరుతుంటే, అప్పుడు నేను మీ మీద ఆధారపడుతున్నానన్నమాట, మిమ్మల్ని స్వలాభం కోసం వుపయోగించుకుంటున్నాను, మానసికంగా నాకు మీ అవసరం వుంది. ఈ ఆధారపడటాన్ని ప్రేమ అంటున్నాం. మన సంబంధ బాంధవ్యాలన్నీ దీని మీదే నిర్మించుకున్నాం. మానసికంగా నాకు మీ అవసరం వుంది, మీకూ మానసికంగా నా అవసరం వున్నది. మీకు నాకు మధ్యన వున్న బాంధవ్యంలో, మానసికంగా నాకు మీరు చాలా ముఖ్యులు అవుతారు. ఎందుకంటే మీరు నా అవసరాలు తీరుస్తున్నారు- ఒక్క శారీరకంగానే కాదు, అంతర్గతంగా కూడా. మీరు లేకపోతే నేను అయోమయమై పోతాను, సందిగ్ధంలో పడిపోతాను. మీ మీద నేను ఆధారపడుతున్నాను; మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. ఆ ఆధారపడటం గురించి సందేహాలు రేకెత్తినప్పుడల్లా సందిగ్ధంలో పడతాను- అప్పుడు భయం కలుగుతుంది. ఈ భయాన్ని దాచడానికి రకరకాల కపటవేషాలు వేస్తాను. భయం బారినుండి తప్పించుకొని పోవడానికి అవి సహాయం చేస్తాయి. మనకి యిదంతా తెలుసు. మనలో వున్న శూన్యాన్ని, మనలో వున్న వొంటరితనాన్ని కప్పిపుచ్చడానికి సాధనాలుగా ఆస్తిని, సమాచారాన్ని, దేవుళ్ళనీ, రకరకాల భ్రాంతులను, బాంధవ్యాలను వుపయోగిస్తూ వుంటాం. అందువల్ల అవన్నీ చాలా ఎక్కువ ప్రాధాన్యాన్ని సంతరించు కుంటాయి. మనకి పలాయన మార్గాలుగా వుపయోగపడుతున్న వాటి విలువ బ్రహ్మాండంగా ఎక్కువవుతుంది.

కాబట్టి ఆధారపడటం అన్నది వున్నంతవరకు భయం వుండి తీరుతుంది. అది ప్రేమకాదు. దానిని ప్రేమ అని మీరు పిలవవచ్చు; దానికి ఒక చక్కని, శ్రావ్యమైన మాట తొడిగి కప్పి పుచ్చవచ్చు. అయితే వాస్తవంలో దాని అడుగున వున్నది ఖాళీతనం. ఏ చికిత్సా విధానానికీ లొంగని ఒక గాయం అక్కడ వున్నది దాని ఎడల స్పృహ వున్నప్పుడు, దాని ఎరుక కలిగినప్పుడు, దానిని అవగాహన చేసుకున్నప్పుడు అది అంతమై పోతుంది. వివరణల కోసం మీరు వెతకనప్పుడు మాత్రమే అవగాహన కలుగుతుంది. చూడండి, యీ ప్రశ్న అడిగినవారు ఒక వివరణ అవసరమని కోరుతున్నారు. నేను చెప్పే నాలుగు మాటలు అతనికి కావాలి. మాటలతోనే మనం తృప్తిపడిపోతాం. ఆ కొత్త వివరణను- అందులో అసలు కొత్తదనం అంటూ వుంటే- దాన్ని మీరు మళ్ళీ మళ్ళీ పారాయణ చేస్తారు. అయితే సమస్య మాత్రం యింకా అట్లాగే వుంటుంది; కీచులాటలు యింకా సాగుతూనే వుంటాయి.

అయితే యీ ఆధారపడటం అనే ప్రక్రియని- బాహ్యంగా కనబడేవి, అంతర్గతంగా దాగివుండే ఆధారపడటాలని, మనోతత్వ సంబంధమైన వాంఛలను, 'మరింత' ఎక్కువ కావాలనే ఒత్తిడులనూ- వీటన్నింటినీ కనుక అర్థం చేసుకుంటే, అప్పుడు మాత్రమే 'ప్రేమ' వుండటానికి తప్పక అవకాశం వుంటుంది. ప్రేమ వ్యక్తి నాశ్రయించుకొనీ వుండదు, నిరాధారంగానూ వుండదు. అది ఒక అస్తిత్వపు స్థితి. అది మనసుకు సంబంధించినది కాదు. మనసు దానిని సంపాదించుకోలేదు. ప్రేమని మీరు అభ్యాసం చేయలేరు. ధ్యానం ద్వారా కూడా దానిని పొందలేరు. భయం లేనప్పుడు, ఆందోళనా భావం, ఒంటరితనం అంతమైపోయినప్పుడు, ఆధార పడటమూ, స్వాధీనం చేసుకోవడమూ లేనప్పుడు ప్రేమ జనిస్తుంది. మనల్ని మనం అవగాహన చేసుకున్నప్పుడే, మన లోపల దాగివున్న వుద్దేశ్యాలను మనం పూర్తిగా గ్రహించుకున్నప్పుడు, మనసు తన లోలోపలి లోతులలోకి ఒక సమాధానమో, ఒక వివరణో వెతకకుండా తొంగి చూసుకో గలిగినప్పుడు, తన లోపలి ప్రతిదానికీ ఒక పేరు తగిలించడం ఆపివేసినప్పుడు అది జనిస్తుంది.

నిజంగా మన దురవస్థల్లో ఒకటి ఏమిటంటే, మనలో చాలామంది జీవితంలోని పైపై కృత్రిమ విషయాలతో- ముఖ్యంగా వివరణలతో- సంతృప్తి పడిపోతారు. వివరణలు యివ్వగానే అన్నీ పరిష్కారం అయిపోయాయని అనుకుంటారు. వివరణలు యివ్వడం మనసు సాగించే ఒక కార్యకలాపం. దేనికైనా సరే, ఒక పేరు తగిలించ గలిగామంటే, ఫలానాది అని గుర్తించగలిగామంటే చాలు- ఎంతో సాధించేశామని అనుకుంటాం. గుర్తించడం, పేరు పెట్టడం, వివరణ యివ్వడం అనేవి ఏవీ లేని

తత్వం ఒకటి వున్నదంటెనే మనసు గందరగోళంగా అయిపోతుంది. వివరణలు అనేవి లేనప్పుడే, మాటలలో మనసు చిక్కుకొని పోనప్పుడే, ప్రేమ జనించడానికి ఆస్కారం వుంటుంది.

*(ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, VI వాల్యూమ్,*
*లండన్, 15 ఏప్రిల్ 1952*

ప్రశ్న : **ఏ సమాజ వ్యవస్థలోనైనా వివాహం అన్నది తప్పక అవసరం. కాని మీరు మొత్తం వివాహవ్యవస్థనే వ్యతిరేకిస్తున్నారు. దీనికి ఏమంటారు? దయచేసి యీ సెక్స్ అనే సమస్యను కూడా వివరించండి. ప్రస్తుతం వున్న అతి ముఖ్యమైన సమస్యల్లో యుద్ధం తరువాత స్థానాన్ని యిది ఆక్రమిస్తున్నది. ఇది ఎందుకు యిట్లా తయారైంది?**

**కృష్ణమూర్తి** : చాలా సునాయాసంగా ఒక ప్రశ్న అడగవచ్చు. అయితే అసలు సమస్యలో లోతులను చాలా జాగ్రత్తగా పరికించడమే ప్రయాసతో కూడుకున్న పని. అందులోనే సమాధానం వుంటుంది. ఈ సమస్యను అర్థం చేసుకోవాలంటే దానిలో పెనవేసుకొని వున్న ఎన్నో అంతర్గర్భితమైన వాటిని కూడా చూడాలి. మనకు వున్న సమయం చాలా కొద్ది కాబట్టి అది చేయడం కష్టం. అందుకని క్లుప్తంగా చెప్పవలసి వస్తున్నది. చాలా శ్రద్ధతో మీరు వినకపోయినట్లయితే అర్థంచేసుకోవడం సాధ్యం కాకపోవచ్చు. సమాధానాన్ని కాకుండా అసలు సమస్యనే తరచి విచారిద్దాం. ఎందుకంటే సమాధానం సమస్య లోపలే వున్నది తప్ప ఎక్కడో దూరంగా లేదు. సమస్యను స్పష్టంగా అర్థం చేసుకుంటున్నకొద్దీ, సమాధానం కూడా స్పష్టమవుతూ వుంటుంది. కేవలం సమాధానం కొరకే వెతికినట్లవుతే అది మీకు దొరకదు. ఎందుకంటే సమాధానం కోసం సమస్యకు అవతలగా ఎక్కడో వెతుకుతూ వుంటారు. వివాహాన్నే తీసుకుందాం. సైద్ధాంతికంగా కాదు, ఆదర్శంగా కాదు. అట్లా చూస్తే అది పరమ మూర్ఖత్వం. వివాహాన్ని ఒక ఆదర్శవాదంగా చేయవద్దు. ఉన్నదానిని వున్నట్లుగా చూద్దాం. అప్పుడే ఆ విషయంలో ఏదయినా చేయగలుగుతాం. అది ఒక పూలబాట అన్నట్లుగా చిత్రించుకుంటే యిక దానిని గురించి ఏ చర్యా తీసుకోలేము. దానివైపు పరికించి చూసి, వున్నదానిని వున్నట్లుగా కనుక చూస్తే, అప్పుడు చర్యతీసుకోవడం బహుశ సాధ్యపడవచ్చు.

సరే, వాస్తవంలో అసలు ఏం జరుగుతుంది? యౌవనంలో వున్నప్పుడు శరీర సంబంధమైన, సెక్స్ సంబంధమైన వాంఛ చాలా తీవ్రంగా వుంటుంది. దీనికి హద్దులు

ఏర్పరచడం కోసం వివాహం అనే వ్యవస్థను ఏర్పాటు చేశారు. ఇరు పక్షాలలోను యీ శరీర సంబంధమైన వాంఛ వుంటుంది. అందువల్లనే మీరు పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు, పిల్లల్ని కంటున్నారు. ఒక పురుషుడికో, ఒక స్త్రీకో జీవిత పర్యంతం మిమ్మల్ని కట్టి వేసుకుంటుంటారు. ఈ విధంగా సుఖాన్ని అందించడానికి ఒక శాశ్వతమైన ఏర్పాటూ, మీ భద్రతకు హామీ లభిస్తాయి. దీని ఫలితంగా క్రమక్రమంగా మీరు క్షీణించిపోతారు. అలవాటు అనే చక్రంలో పడి, జీవిస్తూ వుంటారు. అలవాటు అంటేనే క్షీణించి పోవడం. ఈ శరీర సంబంధమైన, సెక్స్ సంబంధమైన వాంఛను అవగాహన చేసుకోవాలంటే విశేషమైన తెలివి వుండాలి. అయితే యింత వివేకం మనలో కలిగేలా మనకి విద్యాబోధన చేయడంలేదు. కలిసి జీవితం గడపవలసిన పురుషునితో లేదా స్త్రీతో ఎట్లాగో ఒకలాగా నెట్టుకొని పోతుంటాం. 20, 25 ఏళ్ళ వయసులో నేను పెళ్ళి చేసుకుంటాను. ఇక తక్కిన జీవితకాలమంతా, ఆ స్త్రీ గురించి నాకు ఏమీ తెలియకపోయినా ఆమెతో నేను గడిపితీరాలి. ఆమెను గురించి నాకు కాస్తయినా తెలియదు. అయినా జీవితాంతం ఆమెతో నేను జీవించాలని మీరు అంటున్నారు. వివాహం అనే పేరుతో మీరు పిలుస్తున్నది యిదేనా? నేను ఎదుగుతున్న కొద్దీ, పరిశీలిస్తున్న కొద్దీ, ఆమెకూ నాకూ మధ్య ఎన్నో వ్యత్యాసాలు కనిపిస్తుంటాయి. ఆమె వేరూ అని, ఆమె అభిరుచులు పూర్తిగా భిన్నమైనవనీ గ్రహిస్తాను. ఆమెకి క్లబ్బులకి వెళ్ళడం అంటే చాలా యిష్టం. నాకేమో గంభీరమైన విషయాల్లో ఆసక్తి; లేదూ ఆమెకి యిందులోనూ నాకు అందులోనూ ఆసక్తి. అయినా కూడా మీకు పిల్లలు కలుగుతారు. అదే యిందులో వున్న వింత. సర్! స్త్రీలవైపు చూస్తూ చిరునవ్వులు చిందించకండి. ఇది మీ సమస్య. సరే, నేనొక బాంధవ్యాన్ని స్థిరపరచుకున్నాను. దానిలోని విశిష్టత ఏమిటో నాకే తెలియదు. అదేమిటో నేను కనిపెట్టనూ లేదు, అవగాహనా చేసుకోలేదు.

చాలా చాలా కొద్దిమందికి, ప్రేమించే వారికి మాత్రమే వివాహ బాంధవ్యానికి వున్న విలువ తెలుసు. వారికి అది విడదీయరానిది. కేవలం ఒక అలవాటు వంటిదో, ఒక సౌకర్యం వంటిదో కాదు. అది శరీర సంబంధమైన, సెక్స్ సంబంధమైన అవసరాల మీద ఆధారపడినది కాదు. ఏ నిబంధనలూ లేని ఆ ప్రేమలో వ్యక్తిత్వాలు పూర్తిగా కలిసి ఒకటై పోతాయి. అటువంటి బాంధవ్యంలోనే వుపశాంతి లభిస్తుంది. ఆశ వుంటుంది. అయితే మీలో చాలామందిలో మీమీ వివాహ బాంధవ్యాల్లో యిటువంటి ఐక్యత వుండదు. వేరువేరుగా వున్న రెండు వ్యక్తిత్వాలు కలసి ఒకటై పోవాలంటే, మిమ్మల్ని మీరు తెలుసుకోవాలి, ఆమే తనని తాను తెలుసుకోవాలి. దీని అర్థమే

ప్రేమ. కాని మీకు ప్రేమ లేదు, అదీ స్పష్టంగా కనబడుతున్న వాస్తవం. ప్రేమ ఎప్పుడూ కొత్తగా, నవ్య నూతనంగా వుంటుంది. అది కేవలం కోరికలు తృప్తి పరచుకోవడం కాదు. వట్టి అలవాటూ కాదు. దానికి ఏ షరతులూ వుండవు. మీ భర్తని, లేదా భార్యని మీరు యీ విధంగా చూడరు. అవునా? మీ ఏకాంతవాసంలో మీరు నివసిస్తుంటారు, తన ఏకాంతవాసంలో ఆమె నివసిస్తుంటుంది. అయినా నిరాటంకంగా సెక్స్ సుఖపు అలవాట్లను సాగించుకుంటూ వుంటారు. ఒక స్థిరమైన ఆదాయం క్రమం తప్పకుండా వస్తూ వుంటే ఆ వ్యక్తి ఏమై పోతాడు? నిస్సందేహంగా దిగజారి పోతాడు. మీరా సంగతి గమనించలేదూ? స్థిరమైన ఆదాయాన్ని పొందుతున్న ఒక వ్యక్తిని జాగ్రత్తగా గమనించండి. అతని బుద్ధి అతివేగంగా శుష్కించి పోతూ వుండటం మీరు చూడవచ్చు. అతను గొప్ప పదవిలో వుండవచ్చు, మహా చాతుర్యంగల వాడనే ఖ్యాతి వుండచ్చు. అయితే జీవితంలోని అసలైన ఆనందాన్ని మాత్రం అతను కోల్పోయాడనే చెప్పాలి.

అదే విధంగా మీ వివాహం- నిరంతరంగా సుఖాన్ని అందిస్తూ వుండే ఒక శాశ్వతమైన గని. అవగాహన అన్నది లేని, ప్రేమ అన్నది లేని ఒక అలవాటు. అందులోనే మీరు జీవించక తప్పదు. మరో గత్యంతరం లేదు. ఫలానా విధంగా మీరు చేయాలి అని నేను చెప్పడం లేదు. కాని అసలు సమస్యవైపు దృష్టి సారించమంటున్నాను. అదంతా సబబుగా వుందని మీరనుకుంటున్నారా? అంటే మీ భార్యని వదిలేసి మీరు మరొకరి వెంటపడాలని కాదు అర్థం. అసలు యీ బాంధవ్యంలోని అర్థం ఏమిటి? ప్రేమించడం అంటే అన్యోన్యత. మీ భార్యతో మీకు అన్యోన్యమైన సంబంధం వున్నదా? శారీరకంగా కాకుండా? ఆమెని గురించి మీకు తెలుసా, ఆమె శరీరం కాక? ఆమెకి మీ గురించి తెలుసా? మీ యిద్దరూ ఎవరి ఏకాంతవాసంలో వారు వుంటూ, మీ మీ స్వాభిలాషలు నెరవేర్చుకుంటూ, మీ ఆకాంక్షలు, మీ అవసరాలు వెతుక్కుంటూ, మీ విషయ తృప్తికై, ఆర్థికమైన లేదా మానసికమైన భద్రతకై ఒకరినొకరు వుపయోగించుకోవడం లేదూ? ఇటువంటి బాంధవ్యం నిజమైన బాంధవ్యం కానే కాదు- ఇది మానసిక, శారీరక, ఆర్థిక అవసరాలను పరస్పరమూ స్వార్థ పూరితంగా నెరవేర్చుకొనే ఒక విధానం- దీనిలో నుంచి సంఘర్షణ, క్షోభ, సాధించుకోవడం, స్వంతంచేసుకోవాలనే ఆదుర్దా, అసూయ మొదలైనవి పుట్టుకొస్తాయనడంలో సందేహం లేదు. ఇటువంటి బాంధవ్యం ఫలితంగా వికృతమైన శిశువులు, వికృతమైన నాగరికత తప్ప మరొకటి జనిస్తుందా?

కాబట్టి యీ ప్రక్రియనంతా, యిదంతా అసహ్యకరమైనది అని కాకుండా, మీ కళ్ళముందు జరుగుతున్న ఒక నిజమైన వాస్తవం అని గ్రహించడం ముఖ్యం. అది గ్రహించాక, అప్పుడు మీరు ఏం చేస్తారు? దానిని అట్లాగే వదిలివేయలేరు కాబట్టి, అయినా దానివైపు చూడటం మీకు యిష్టం లేదు కాబట్టి, త్రాగుడునో, రాజకీయాలనో, సమీపంలో వున్న మరో స్త్రీనో అలవరచుకుంటారు. ఏదయినా ఫరవాలేదు, అది మీ యింటినుంచి, సాధించే మీ భార్యనుంచో లేదా భర్త నుంచో దూరంగా తీసుకొనిపోతే చాలు. ఆ విధంగా సమస్యని పరిష్కరించి వేశానని అనుకుంటారు. అదీ మీ జీవితం. కాదంటారా? అందువల్ల, యీ సంగతేదో మీరు తేల్చుకోవాలి. అంటే సమస్యని నేరుగా ఎదుర్కోవాలి అని అర్థం. అంటే ఏమిటంటే, అవసరమైతే విడిపోవాలి. ఎందుకంటే తల్లీదండ్రీ అస్తమానం ఒకరి నొకరు సాధించుకుంటూ, పేచీలు పడుతూవుంటే దాని ప్రభావం పిల్లల మీద పడకుండా వుంటుందా?

కాబట్టి వివాహాన్ని ఒక అలవాటుగా, ప్రతిరోజూ సుఖాన్ని అందజేసేదానిగా అలవరచుకుంటే, అది మనిషి దిగజారిపోవడానికి కారకమవుతుంది. ఎందుకంటే అలవాటులో ప్రేమ వుండదు. ప్రేమ అలవాటయిపోదు. ప్రేమ అంటే చాలా వుల్లాసకరమైనది. సృజనాత్మకమైనది. నవ్యనూతనమైనది. అందుకని అలవాటు ప్రేమకి పూర్తిగా ప్రతికూలమైనది. అయితే మీరు అలవాటులో చిక్కుకుపోయారు. ఎదుటివారితో మీ బాంధవ్యం అలవాటుగా మారిందంటే అది నిస్పందేహంగా నిర్జీవమై పోయినట్లే. కాబట్టి మనం మళ్ళీ అసలు మూలవిషయానికే వస్తున్నాం. అది ఏమిటంటే సమాజ సంస్కరణ జరగాలంటే అది మీ మీదే ఆధారపడి వుంది. న్యాయశాసనాల మీద కాదు. చట్టాల వల్ల మళ్లీ కొత్త అలవాట్లు, లొంగి పోయివుండటం ఎక్కువవుతాయి, అంతే. కాబట్టి ఒక బాధ్యత గల వ్యక్తిగా సంబంధ బాంధవ్యాల విషయంలో మీరు ఏదయినా చేయాలి- చర్య తీసుకోవాలి. అయితే మీ మనసు, హృదయమూ జాగృతం అయినప్పుడే చర్య తీసుకోగలుగుతారు. మీలో కొంతమంది నాతో ఏకీభవిస్తున్నట్లుగా తలలు ఆడిస్తున్నారు. కాని పరిణామమూ, మార్పూ తీసుకొనివచ్చే బాధ్యత మీపై వేసుకోవడం మీకు యిష్టంలేదనే వాస్తవం మాత్రం చాలా స్పష్టంగా కనబడుతున్నది. సవ్యంగా జీవించడం ఎట్లా అన్నది కనిపెట్టడం అనే పెద్ద అల్లకల్లోలాన్ని నెత్తిన వేసుకోవడం మీకు యిష్టం వుండదు. అందువల్ల సమస్య అట్లాగే వుండిపోతుంది. కలహించుకుంటుంటారు, మళ్ళీ సర్దుకుపోతుంటారు; చివరకు మీరు చనిపోతారు, చనిపోతే ఏడవడానికి ఎవరో ఒకరు వుంటారు. ఏడుపు చనిపోయినవారిని గురించి కాదు, తమ ఒంటరితనం తలుచుకొని. ఏ మార్పూ లేకుండానే మీరు గడిపివేస్తూ వుంటారు. అయినా, చట్టాలు చేయగల, గొప్ప పదవులు చేపట్టగల, దేవుణ్ణి గురించి

మాట్లాడగల, యుద్ధాలు ఆపే మార్గాలు కనుక్కోగల గొప్ప మానవులం అని మీరు అనుకుంటుంటారు. వీటివల్ల ఏం లాభంలేదు. ఎందుకంటే అసలు ముఖ్యమైన విషయాలని మీరు పరిష్కరించనే లేదు.

ఇక, సమస్యలోని రెండో భాగం సెక్స్; సెక్స్‌కి యింతకి ప్రాముఖ్యం ఎందుకు వచ్చిందీ అని ఈ వాంఛ మీమీద యింతటి ప్రాబల్యం ఎట్లా సంపాదించింది? అని మీరెప్పుడైనా ఆలోచించారా? అందులో మునిగితేలుతూ వుంటారు కాబట్టి ఆ సంగతి మీరెప్పుడూ ఆలోచించలేదు. అసలు యీ సమస్య ఎందుకున్నది అన్నది కూడా మీరెప్పుడూ అన్వేషించలేదు. సర్! యీ సమస్య ఎందుకు కలిగిందని మీరు అనుకుంటున్నారు? దానితో తలపడాల్సివచ్చినప్పుడు దానిని పూర్తిగా అణచి వేసుకుంటే ఏమవుతుంది - బ్రహ్మచర్యం అనే ఆదర్శం మొదలైనవి మీకు తెలుసు. అప్పుడు ఏం జరుగుతుంది? సమస్య అట్లాగే వుండిపోతుంది. స్త్రీని గురించి ఎవరైనా మాట్లాడితే మీరు సహించలేరు మీలో వున్న లైంగిక వాంఛలను పూర్తిగా అణుచు కోవడం ద్వారా సమస్యని పరిష్కారం చేయచ్చని మీరనుకుంటారు, కాని అది మిమ్మల్ని వదలకుండా వెంటాడుతుంది. ఇది ఎట్లా వుంటుందంటే ఒక యింట్లో మీరు నివసిస్తూ, వికారంగా వుండే వస్తువులన్నీ ఒక గదిలో పడేసి దాచినట్లు. అయితే అవన్నీ యింకా యింట్లోనే వుంటాయి. కాబట్టి, క్రమశిక్షణ ద్వారా యీ సమస్యని పరిష్కారం చేయలేము- క్రమశిక్షణ అంటే యిక్కడ నిగ్రహించుకోవడం, అణచివేసుకోవడం, మనసు మరో దాని మీదకు మళ్ళించడం. ఇవన్నీ మీరు ప్రయత్నించారు. బయటపడే మార్గం యిది కాదు. మరి ఏది దారి? సమస్యని అవగాహన చేసుకోవడమే మార్గం. అవగాహన చేసుకోవడం అంటే ఖండించడమూ కాదు, సమర్థించడమూ కాదు. అదేమిటో యిప్పుడు మనం చూద్దాం.

మీ జీవితాల్లో సెక్స్ యింత ప్రధానమైన సమస్యగా ఎందుకు తయారయింది? లైంగిక చర్య, ఆ భావన తననితాను మరిచిపోవడానికి ఒక మార్గం కాదూ? నేను అంటున్నదేమిటో మీకు అర్థం అవుతున్నదా? ఆ చర్యలో యిద్దరూ సంపూర్ణంగా ఐక్యం కావడం జరుగుతుంది. ఆ క్షణంలో సంఘర్షణలన్నీ పూర్తిగా ఆగిపోతాయి. అపారమైన సంతోషం కలుగుతుంది. ఎందుకంటే ఒక ప్రత్యేకమైన అస్తిత్వంతో వుండవలసిన అవసరం అప్పుడు మీకు వుండదు. పైగా ఎప్పుడూ మిమ్మల్ని నమిలివేస్తూ వుండే భయం కూడా అప్పుడు వుండదు. అంటే అర్థం, ఒక క్షణం సేపు స్వీయ స్పృహ మాయమవుతుంది. మిమ్మల్ని మీరు మర్చిపోవడంలో వుండే నిర్మలత్వం, స్వార్థాన్ని తోసివేయడంలో వుండే ఆనందం మీకు తెలుస్తాయి. సెక్స్ చాలా ప్రాధాన్యాన్ని సంతరించుకుంటుంది, ఎందుకంటే జీవితంలో ఏ వైపు చూసినా

సంఘర్షణలతోను, అహాన్ని పెంచుకోవడంలోను, నిరాశానిస్పృహలలోను మీరు గడుపుతుంటారు కాబట్టి. సర్! మీ జీవితం వైపు రాజకీయ, సామాజిక, మతపరమైన మీ జీవితాలవైపు మీరే ఒకసారి చూసుకోండి- ఏదో అవాలని మీరు ఎప్పుడూ ప్రయాసపడుతూ వుంటారు. రాజకీయాల్లో గొప్ప అధికారస్థానంలో వుండాలనీ, హోదా, ప్రతిష్ఠ సంపాదించాలనీ కోరుకుంటుంటారు. మీ దృష్టి యింకెవరి వైపో తిప్పకండి. మంత్రుల దిక్కుగా చూడకండి. అవన్నీ మీకు దొరికితే మీరూ అట్లాగే ప్రవర్తిస్తారు. కాబట్టి, రాజకీయాల్లో ప్రయాసపడుతున్నారు, మిమ్మల్ని మీరు యింకా పెంచుకోవాలని ప్రయత్నిస్తున్నారు, అవునా కాదా? దానివల్ల మీరు సంఘర్షణను సృష్టిస్తున్నారు. 'నా' ను కాదనలేరు, వదులుకోలేరు. పైగా 'నా' కు యింకా ఎక్కువ బలాన్ని చేకూరుస్తుంటారు. ఇతర విషయాలకు సంబంధించి కూడా, ఆస్తిపాస్తుల అధికారం విషయంలో, మీరు అనుసరించే మతవిషయంలో యిదే పద్ధతి అవలంబిస్తుంటారు. మీరు చేస్తున్న వాటిల్లో, మీరు పాటిస్తున్న మతాచారాల్లో అర్థంలేదు. వట్టి నమ్మకం, అంతే. కొన్ని పేర్లనీ, మాటలనీ పట్టుకొని వేళ్ళాడుతుంటారు. పరిశీలించి చూశారంటే అక్కడ కూడా కేంద్రస్థానం అయిన 'నా' గురించిన స్పృహ నుండి స్వేచ్ఛ లేదు. ఒక పక్కన మీ మతం అహాన్ని మర్చిపొమ్మని చెప్తూనే వుంటుంది. కాని మీ పద్ధతి అంతా మీ స్వార్థానికి యింకా బలం చేకూర్చుకోవడానికే; మీరే అన్నింటికంటె అతి ముఖ్యమైన జీవి. గీత చదువుతారు, బైబిల్ చదువుతారు. కాని మీరు మాత్రం మంత్రిగానే మిగిలిపోతారు. బలహీనుల్ని దోపిడీ చేస్తూ, ప్రజల్ని పీల్చి పిప్పి చేస్తూ, గుళ్ళూ గోపురాలూ కట్టిస్తూ వుంటారు.

కాబట్టి ఏ రంగంలో, ఏ కార్యకలాపంలో మునిగితేలుతున్నా మీ స్వార్థాన్ని, మీ ప్రాముఖ్యతను, మీ ప్రతిష్ఠను, మీ భద్రతను గట్టిచేసుకుంటుంటారు. అందువల్ల స్వార్థాన్ని మర్చిపోవడానికి ఒకే ఒక మార్గం మిగిలింది. అదే సెక్సు. అందుకని ఆ స్త్రీకాని, ఆ పురుషుడు కాని మీకు చాలా ముఖ్యం అవుతారు. అందుకని వారిని మీరు స్వంతం చేసుకొని తీరాలి. కాబట్టి యీ స్వంతం చేసుకోవడాన్ని అమలులో పెట్టి, స్వాధీనంలో వుంచుకునే భరోసాను సమకూర్చే సమాజాన్ని మీరు నిర్మించుకుంటారు. తక్కిన అన్నింటిలోనూ 'నేను' కే ప్రాధాన్యం; సహజంగానే సెక్స్ చాలా ముఖ్యమైన సమస్య అయి కూర్చుంటుంది. సర్! యిటువంటి స్థితిలో పరస్పర వైరుధ్యాలు లేకుండా, బాధ లేకుండా, నిస్పృహ లేకుండా జీవించడం సాధ్యం అని మీరనుకుంటున్నారా? అయితే మతంలో కాని, సామాజిక కార్యకలాపాల్లో కాని నిజంగానే, చిత్తశుద్ధిగా స్వార్థచింతన లేనప్పుడు సెక్స్‌కు యింత పెద్ద స్థానం వుండదు.

రాజకీయాల్లో గాని, సమాజంలో గాని, మత విషయాల్లో కాని, ఏ గొప్పా లేకుండా సామాన్యంగా వుండిపోవాలంటే మీకు భయం. కాబట్టి సెక్స్ ఒక సమస్య అవుతున్నది. ఈ విషయాలన్నింటిలోనూ మీరు కనుక తగ్గిపోయి వుండటానికి, సామాన్యులుగానే వుండటానికి ఒప్పుకుంటే, అప్పుడు సెక్స్ అసలు సమస్యే కాదని మీరు గ్రహిస్తారు.

ప్రేమ వున్నప్పుడు మాత్రమే సౌశీల్యం వుంటుంది. ప్రేమ వున్నప్పుడు సెక్స్ ఒక సమస్య అవదు. ప్రేమ లేకుండా బ్రహ్మచర్యం అనే ఆదర్శాన్ని సాధించాలనుకోవడం అసంబద్ధం. ఎందుకంటే ఆదర్శం నిజంకాదు, భ్రమ. మీరు ఏమిటో, అది నిజం. మీ మనసుని, మీ మనసు చేసే పనులని మీరే అవగాహన చేసుకోక పోతే సెక్స్‌ని కూడా అర్థం చేసుకోలేరు. ఎందుకంటే సెక్స్ మనసుకి సంబంధించినది. సమస్య అంత చిన్నదేమీ కాదు. కొన్ని అలవాట్లను అభ్యాసం చేసుకోవడం వల్ల ఏ లాభమూ జరగదు. తోటి మనుష్యులతో, ఆస్తిపాస్తులతో, సిద్ధాంతాలతో మీకుండే సంబంధ బాంధవ్యాలను గురించి అపారమైన ఆలోచన, లోతైన పరిశోధన అవసరం. సర్! దీని అర్థం ఏమిటంటే మీరు మీ హృదయాన్ని, మీ మనసును అత్యంతమైన కఠిన పరిశీలనకి గురి చేయాలి. ఆ విధంగా మీలో ఒక సంపూర్ణ పరివర్తనాన్ని తీసుకొనిరావడం జరుగుతుంది. ప్రేమ అంటేనే పవిత్రమైనది. ప్రేమ వున్నప్పుడు అంటే మనసు సృష్టించిన పవిత్రత అనే ఒక వూహ కాకుండా, నిజమైన ప్రేమ వున్నప్పుడు యీ సెక్స్ ఒక సమస్య అవదు. దాని అసలైన అర్థం చాలా భిన్నంగా వుంటుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, V వాల్యూమ్,*
*న్యూఢిల్లీ, 19 డిసెంబర్ 1948*

**ప్రశ్న : గందరగోళంగా వున్న యీ ప్రపంచాన్ని ఎదుర్కొని నిలబడాలంటే మా పిల్లలకి ఎటువంటి విద్యావిధానం వుండాలి?**

కృష్ణమూర్తి : ఇది చాలా పెద్ద ప్రశ్న. అవునా కాదా? రెండు నిముషాల సమాధానం సరిపోదు. అయినా క్లుప్తంగా చెప్పడానికి ప్రయత్నిస్తాను. తరువాత ఎప్పుడయినా వివరాలలోకి పోవచ్చును.

సమస్య పిల్లలకి ఎటువంటి విద్య వుండాలి అని కాదు; అసలు అధ్యాపకుడికే ముందు చదువు నేర్పించాలి, తల్లిదండ్రులకీ నేర్పించాలి అన్నది. (గుసగుసగా

నవ్వులు). దయచేసి నవ్వకండి. మిమ్మల్ని నవ్వించడానికి, మీరు వినోదించడానికి చమత్కారంగా మాట్లాడటంలేదు. పూర్తిగా విభిన్నమైన, ఒక కొత్త విద్యావిధానం మనకి అవసరం కదూ?- కేవలం జ్ఞాపకశక్తిని వృద్ధి చేసుకునేది కాదు; పిల్లలకు ఒక కౌశలాన్ని నేర్పించేది కాదు; ఏదో ఒక వుద్యోగానికి, జీవనోపాధి గడించుకోడానికి వారిని తయారుచేసేది కాదు. వారిని నిజంగా తెలివిగల వారిగా చేసే విద్యావిధానం కావాలి. తెలివి అంటే యీ సమస్త ప్రక్రియను, జీవితం అనే యీ సమస్త ప్రక్రియను ఆకళింపు చేసుకోవడం; జీవితంలోని ఒక చిన్న ముక్క గురించి తెలుసుకోవడం కాదు.

అసలు సమస్య నిజంగా యిదీ. మనం, అంటే పెద్దవాళ్ళం చిన్నపిల్లలు స్వేచ్ఛగా, సంపూర్ణమైన స్వేచ్ఛలో ఎదగడానికి తోడ్పడగలమా? అంటే అర్థం, పిల్లల యిష్టప్రకారం వాళ్ళని వదిలేయాలని కాదు. స్వేచ్ఛగా వుండటం అంటే ఏమిటో మనం అర్థం చేసుకున్నాం కాబట్టి, స్వేచ్ఛ అంటే ఏమిటో పిల్లలు అర్థం చేసుకోవడానికి వారికి సహాయం చేయగలమా?

ప్రస్తుతం చదువు అంటే లొంగిపోయి వుండటానికి సిద్ధపరిచే ఒక ప్రక్రియ. సమాజంలో వున్న ఒక రకమైన నమోనాకు అనుగుణంగా వుండేటట్లు పిల్లవాడిని తయారు చేయడం. అంటే, ఒక వుద్యోగం సంపాదించుకొని, నలుగురిలో మర్యాదస్థుడిగా పేరు తెచ్చుకొని, చర్చికి వెళ్తూ, తక్కినవారిలాగే వుండటం, చని పోయేదాకా యీ ప్రయాస పడుతూ వుండటం. అంతర్గతంగా స్వేచ్ఛగా వుండి, పెద్దవుతున్నకొద్దీ జీవితంలో వుండే సంక్లిష్టతలన్నీ ఎదుర్కోగలగడానికి అతన్ని మనం తయారుచేయడం లేదు. అంటే, ఆలోచించగలిగే శక్తిసామర్థ్యాలు యివ్వాలి తప్ప, అతను ఎట్లా ఆలోచించాలో నేర్పడం కాదు. దీనికి అవసరమైనది ఏమిటంటే ముందుగా అధ్యాపకుడు అధికారపు ఆధిపత్యాన్నుండి, అన్ని రకాల భయాలనుండి, జాతీయ భావాల నుండి, వివిధ నమ్మకాల నుండి, సంప్రదాయాల నుండి తన మనసును విముక్తం చేసుకోవాలి. అప్పుడే పిల్లలు మీ సహాయంతో, మీ వివేకంతో, స్వేచ్ఛగా వుండటం అంటే ఏమిటి, ప్రశ్నించడం అంటే ఏమిటి, తరచి శోధించడం అంటే ఏమిటి, కొత్తవి కనిపెట్టడం అంటే ఏమిటి అనేవి అర్థం చేసుకుంటారు.

అయితే, చూడండి, అట్లాంటి సమాజం కావాలని మనం కోరుకోవడం లేదు. ఒక నూతన ప్రపంచం మనకి అక్కర్లేదు. పాత ప్రపంచమే మళ్ళీ పునరావృతం అవుతే చాలు మనకి. కాస్త రూపు మార్చుకొని, యింతకంటె యింకొంచెం బాగా, మరి కాస్త మెరుగు పెట్టుకొని వస్తే చాలు మనకి. పిల్లలు పూర్తిగా లొంగిపోయి వుండాలి

అనీ, ఏమాత్రం ఆలోచించకూడదు అనీ, ఎరుకగా వుండకూడదనీ, అంతర్గతంగా నిర్దుష్టతతో వుండకూడదనీ మనం కోరుకుంటాం. ఎందుకంటే వారిలో స్పష్టంగా చూసే శక్తి వుంటే గట్టిగా పాతుకొని పోయిన మన విలువలకు ప్రమాదం వాటిల్లవచ్చు. కాబట్టి యీ సమస్యలోని అసలు అంశం ఏమిటంటే, అధ్యాపకుడికి సరియైన విద్య గరపడం ఎట్లా అనేది. మీరూ, నేనూ- ఎందుకంటే బోధించేది తల్లిదండ్రులూ, సమాజమే కాబట్టి- ఏ విధంగా మీరూ, నేను మనలోపల స్పష్టతను సాధించగలుగుతాం అనేది తెలుసుకోవాలి. అప్పుడే పిల్లలు కూడా స్వేచ్ఛగా ఆలోచించగలుగుతారు. అంటే నిశ్చలంగా వుండే మనసు, నెమ్మదిగా వుండే మనసు, దాని ద్వారా నూతనమైన విషయాలను గ్రహించడమూ, సృజించడమూ పిల్లలలో కలుగుతుంది.

ఇది నిజంగానే చాలా ముఖ్యమైన ప్రశ్న. అసలు మనం చదువుకుంటున్నది ఎందుకు? ఉద్యోగం కోసమా? కేథలిక్ మతాన్నో, ప్రొటెస్టెంట్ మతాన్నో స్వీకరించడానికా, కమ్యునిస్ట్ సిద్ధాంతాలో, హిందూమత సిద్ధాంతాలో ఆమోదించడానికా? ఒక సంప్రదాయాన్ని అనుసరించడానికో, ఒక వుద్యోగంలో సర్దుకొనిపోవడానికోనా? లేదూ చదువు యింతకంటె చాలా భిన్నమైనదా? అది జ్ఞాపకశక్తిని వృద్ధి చేసుకోవడం కాదు, అవగాహన చేసుకొనే ప్రక్రియ. విశ్లేషణ ద్వారా అవగాహన కలగదు. మనసు చాలా నెమ్మదిగా వుండి, బరువు భారాలన్నింటినీ దింపుకొని వున్నప్పుడు మాత్రమే కలుగుతుంది. విజయం సాధించాలనే ఆరాటంతోనూ, భంగపడుతూనూ, ఓటమి అంటే భయపడుతూనూ వున్నప్పుడు కాదు. మనసు నిశ్చలంగా వున్నప్పుడు మాత్రమే అవగాహన కలగడానికి, వివేకం కలగడానికి అవకాశం వుంది. అటువంటిది నేర్పించేదే సవ్యమైన విద్యావిధానం. దీనిద్వారా తక్కినవన్నీ తప్పక సాధ్యపడతాయి.

అయితే మనలో చాలా మందికి దీనిలో ఏమాత్రం ఆసక్తి లేదు. మీకో కొడుకు వుంటే అతడొక వుద్యోగస్థుడవాలి. మీకు కావలసిందల్లా అంతే- అతని భవిష్యత్తు బాగుండాలి. మీకు వున్నవి అన్నీ- మీ ఆస్తిపాస్తులు, మీ విలువలు, నమ్మకాలు, సంప్రదాయాలు- అవన్నీ మీ పిల్లలకు వారసత్వంగా వచ్చి తీరాలా? లేదూ సత్యం అనే దానిని తనంతట తానే కనిపెట్టడానికోసమై అతను స్వేచ్ఛగా పెరగాలా? అది జరగాలంటే ముందుగా యీ వారసత్వాలన్నీ మీరు వదులుకోవాలి; తరచి శోధించడానికి, సత్యం ఏది అన్నది కనిపెట్టడానికి మీరు స్వేచ్ఛగా వుండాలి.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, IX వాల్యూమ్,*
*ఆమ్‌స్టర్‌డామ్, 19 మే 1955*

**ప్రశ్న : సైకో సోమాటిక్ వ్యాధి అంటే ఏమిటి? అది నయంచేసుకోవడానికి మార్గాలు ఏమిటో మీరు సూచించగలరా?**

కృష్ణమూర్తి : సైకోసొమాటిక్ వ్యాధి నయంచేసుకోవడానికి మార్గాలు కనుక్కోవడం సాధ్యమని నేను అనుకోను. అసలు మనసుకు చికిత్స చేసే ఒక పద్ధతిని వెతకడమే వ్యాధికి కారణమవుతున్నదేమో. ఒక మార్గం కనిపెట్టాలి, ఒక పద్ధతిని అభ్యసించాలి అని అన్నప్పుడు దాని అర్థం- ఆలోచనలను హద్దుల్లో వుంచడం, అదుపు చేయడం, అణచి వేయడం అని. అంటే మనసుని అవగాహన చేసుకోక పోవడం. భౌతిక శరీరాన్ని మనసు వ్యాధిగ్రస్తం చేస్తుంది అనేదానిలో సందేహం లేదు. కోపంగా వున్నప్పుడు భోజనం చేస్తే కడుపులో నొప్పి, అజీర్ణం కలుగుతాయి. చాలా తీవ్రంగా ఎవరినైనా మీరు ద్వేషిస్తే శరీరం అనారోగ్యానికి గురి అవక తప్పదు. మనసుని ఒక ప్రత్యేకమైన విశ్వాసానికి పరిమితం చేస్తే మానసిక వైకల్యంగాని, నరాల సంబంధమైన జబ్బులు గాని కలుగుతాయి. అవి మళ్ళీ మీ శరీరంమీద ప్రభావం చూపుతాయి. ఇదంతా సైకోసోమాటిక్ ప్రక్రియలో భాగం. అయితే అన్ని వ్యాధులూ సైకోసొమాటిక్‌వే అని చెప్పడానికి వీల్లేదు. కాని, భయమూ, ఆందోళనా మొదలైన మానసికమైన కలతలు శరీర అనారోగ్యానికి తప్పక దారితీస్తాయి. కాబట్టి మనసును ఆరోగ్యవంతంగా చేయడం సాధ్యమేనా? మనలో చాలామంది సవ్యమైన ఆహారం తీసుకోవడం మొదలైన జాగ్రత్తలు పాటించి శరీర ఆరోగ్య విషయంలో శ్రద్ధ చూపుతుంటారు. ఇది అవసరమే. కాని మనసును దిగజారిపోకుండా వుంచుకుంటూ, ఎప్పుడూ ఆరోగ్యంగా, నవ్యనూతనంగా, అప్రమత్తంగా, సజీవంగా మనసుని వుంచుకోవాలనే శ్రద్ధ చాలా తక్కువమందికి వుంటుంది.

సరే, మనసు చెడిపోకుండా వుండాలంటే మరొకరిని అనుసరించడం ఏమాత్రం వుండకూడదు. అది స్వతంత్రంగా, స్వేచ్ఛగా వుండాలి. అయితే అట్లా స్వేచ్ఛగా వుండటానికి మన విద్యావిధానం మనకు సహాయపడటం లేదు. పైగా యీ దిగజారిపోతున్న సమాజంలో యిమిడిపోయేటట్లుగా మనల్ని తయారుచేస్తుంది. అప్పుడు మనసు కూడా దిగజారిపోతుంది. భయపడుతూ వుండాలని, యితర్లతో పోటీపడాలని, మన గురించీ, మన భద్రత గురించీ ఎప్పుడూ ఆలోచిస్తూ ఉండాలనీ బాల్యం నుండీ మనకు నూరిపోస్తారు. దీనివల్ల మనసు నిరంతరమైన సంఘర్షణకు లోనవడం సహజమే. ఆ సంఘర్షణ ఫలితం శరీరం మీద కనబడుతుంది. కనుక యీ సంఘర్షణ అనే ప్రక్రియనంతా అప్రమత్తమైన జాగరూకత వహించి మనంతట మనమే తెలుసుకుంటూ, అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం. అంతే తప్ప మనస్తత్వ శాస్త్రజ్ఞుడి మీదనో, గురువు మీదనో ఆధారపడకూడదు. ఒక గురువుని

అనుసరించడం అంటే మీ మనసుని ధ్వంసంచేసుకోవడమే. ఆ గురువు వద్ద వున్నదని మీరు అనుకుంటున్నది ఏదో మీకూ కావాలని అనుకోవడం వల్లనే మీరు అతని వెంటపడుతున్నారు. దిగజారిపోవడానికి యీ విధంగా నాంది పలుకుతున్నారు. లౌకిక విషయాల్లో కాని, ఆధ్యాత్మిక విషయాల్లో కాని గొప్పవాళ్ళం కావాలని ప్రయాస పడటం అధోగతికి పోయే మార్గాల్లో ఒకటి ఎందుకంటే యిటువంటి ప్రయాస వల్ల మిగిలేది ఆందోళనే. దాని ఫలితంగా భయమూ, నిస్పృహ, మానసిక అనారోగ్యం తప్పవు- యివి మళ్ళీ శరీరం మీద తమ ప్రభావాన్ని చూపుతాయి. ఇదంతా మీకు స్పష్టంగా వున్నదని ఆశిస్తాను. మనసుకు చికిత్స చేయడానికి యింకొకరిని ఆశ్రయిస్తున్నారూ అంటే హీనస్థితికి దిగజారడంలో అదీ ఒక అంశమే.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, IX వాల్యూమ్,*
*బొంబాయి, 28 మార్చి, 1956*

*ప్రశ్న :* **నా శరీరమూ, మనసూ రెండూ కూడా బాగా లోతుగా పాతుకొని పోయిన వాంఛలతోనూ, సచేతనమైన, అచేతనమైన భయాలతోను తయారు చేయబడ్డాయేమో అనిపిస్తూ వుంటుంది. నా మనసును నేను జాగ్రత్తగా కనిపెట్టే వుంటాను. కాని తరచుగా యీ సాధారణ భయాలే నన్ను పూర్తిగా లోబరిచేసుకున్నట్లు అనిపిస్తుంది. నేను ఏం చేయాలి?**

*కృష్ణమూర్తి :* సర్! ముందుగా భయం అంటే ఏమిటో తెలుసుకుందాం. భయం అంటే ఏమిటి? భయం మరొకదాని ఆధారంతోనే నిలబడ గలుగుతుంది. దానికి ఒంటరిగా అస్తిత్వం లేదు. ఏదో ఒకదానికి సంబంధించినదిగా అది వుంటుంది. అంటే- మీరు నా గురించి ఏమంటారో, ప్రజలు నా గురించి ఏమనుకుంటారో, వుద్యోగం పోతుందేమో, వృద్ధాప్యంలో భద్రత ఎట్లా, తల్లిదండ్రులు చనిపోతారేమో- యింకా యిటువంటివి ఎన్ని వున్నాయో దేవుడికే తెలియాలి. భయం అనేది ఏదో ఒక అంశాన్ని గురించి వుంటుంది.

సరే, యీ భయం ఎట్లా తొలిగిపోతుంది? ఒక ప్రత్యేక రకమైన క్రమశిక్షణ ద్వారా భయాన్ని పోగొట్టుకోగలమా? క్రమశిక్షణ అంటే నిరోధించడం; యీ నిరోధాన్ని అభ్యసించడం, అలవరచుకోవడం. దీనివల్ల మనసులో నుండి భయం తొలగి పోతుందా? లేక దాన్ని కొంత దూరంగా నిలబెడుతుందా? మధ్యలో ఒక గోడ కట్టినట్లు; అయితే గోడకు అవతలి వైపున భయం అట్లాగే వుండిపోతుంది. కాబట్టి నిరోధంతో గాని, ధైర్యాన్ని అలవరచుకోవడం ద్వారా గాని భయాన్ని తొలగించలేము. ఎందుకంటే

ధైర్యం భయానికి వ్యతిరేకమైన గుణం. మనసు ధైర్యమూ, భయమూ అనే రెండింటిలో చిక్కుకొని పోయినప్పుడు, మళ్ళీ వీటికి నిరోధాన్ని అలవరచుకోవడమే తప్ప పరిష్కారం జరగదు. కాబట్టి ధైర్యం అలవరచుకోవడం ద్వారా భయాన్ని పోగొట్టుకోలేము.

అయితే నేను భయాన్ని పోగొట్టుకోవడం ఎట్లా? దయచేసి శ్రద్ధగా వినండి. ఇది మన సమస్య. మీదీ, నాదీ, భయాన్నుంచి విముక్తి కోరే ప్రతి మానవుడిదీ కూడా. ఎందుకంటే భయం నుంచి నేను విముక్తి పొందానంటే అప్పుడు యీ 'నా', ప్రపంచంలో యింత దుర్మార్గాన్నీ, యింతటి క్షోభనూ సృష్టిస్తున్న యీ 'స్వార్థం' అనేది అదృశ్యమై పోతుంది. భయానికి కారణం యీ 'నేను' అన్నదాని స్వభావమే కాదూ? నాకు భద్రత కావాలి, ఆర్థికమైనదో, కాకపోతే రాజకీయమైనదో నాకు భద్రత కావాలి. లేదా నాకు సమాజంలో కీర్తి కావాలి. పైలోకంలో నాకు భద్రత కావాలి. దేవుడి వద్ద నుంచి నాకు హామీ కావాలి, ఆయన నన్ను భుజం తట్టి మెచ్చుకోవాలి. 'వచ్చే జన్మలో నీ అదృష్టం బాగుంటుంది' అనాలి. ఇట్లా నాతో అనడానికి, నన్ను ప్రోత్సహించడానికి, ఆశ్రయమూ, రక్షణా యివ్వడానికి ఒకరు నాకు కావాలి. ఎటువంటి రూపంలోనైనా సరే భద్రత కోరుకుంటున్నప్పుడు దాని వెనకాల భయం తప్పకుండా వుండి వుంటుంది. ఈ భయంలో నుండే పుట్టుకొస్తాయి ప్రాథమికమైన కాంక్షలన్నీ కూడా. కాబట్టి భయం అంటే ఏమిటి అనేది కనుక నేను అవగాహన చేసుకుంటే అప్పుడు బహుశ ఎడతెగని యీ కోరికల్లో నుండి బయట పడటం జరుగుతుంది.

భయం అంటే ఏమిటో నేను ఎట్లా అవగాహన చేసుకోగలను? క్రమ శిక్షణ అమలు పరచకుండా, నిరోధం చూపకుండా, దాని నుంచి పారి పోకుండా, రకరకాలైన భ్రాంతులలోనో, సమస్యలలోనో, గురువులలోనో, వేదాంతులలోనో పడిపోకుండా అసలు భయాన్ని ఎట్లా ఎదుర్కోగలుగుతాను, ఎట్లా అర్థం చేసుకోగలుగుతాను, ఎట్లా దాని నుండి విముక్తి చెంది అవలగా పోగలుగుతాను? భయానికి దూరంగా పారిపోకుండా వున్నప్పుడే, నిరోధం చూపకుండా వున్నప్పుడే దానిని అర్థం చేసుకోగలుగుతాను. ఇప్పుడు, యీ నిరోధించే సత్వం ఎవరు, ఏమిటి అన్నది మనం తెలుసుకుందాం. భయాన్ని నిరోధిస్తున్న యీ 'నేను' ఎవరు? సర్! మీకు అర్థమవుతున్నదా? అంటే- నేను భయపడుతున్నాను; నేను మర్యాదస్థుడిగా పేరు పొందాలనుకుంటున్నాను, కాబట్టి ప్రజలు నా గురించి ఏమంటారో అని భయపడుతున్నాను. నేను లోకంలో ఎన్నో సాధించాలనుకుంటున్నాను. పేరు, ప్రతిష్ఠ, అధికారము సంపాదించాలని కోరుకుంటున్నాను. అందుకని నాలో ఒక భాగం వీటి వెనకాల పరుగులు పెడుతున్నది. లోలోపల, నేను ఏది చేసినా ఆశాభంగానికే దారి తీస్తుందనీ, నేను చేయాలను కుంటున్నవే నాకు ఆటంకంగా నిలుస్తాయని మరొక భాగం అనుకుంటుంది. కాబట్టి

నాలో రెండు ప్రక్రియలు పనిచేస్తున్నాయి ఒకటి అన్నీ సాధించాలనీ, పరువు ప్రతిష్ఠలు సంపాదించాలనీ, విజయం చేపట్టాలనీ కోరుకుంటున్న సత్యం; మరొకటి యివన్నీ నేను సాధించలేనేమోనని ఎప్పుడూ భయపడుతూ వుండే రెండో సత్యం.

నాలోనే రెండు ప్రక్రియలు పనిచేస్తూ వున్నాయన మాట. రెండు కోరికలు, రెండు వ్యాపకాలు- 'నేను సంతోషంగా వుండాలనుకుంటున్నాను' అని అనేది ఒకటి, యీ ప్రపంచంలో సంతోషం లేనే లేదేమో అని తెలుసుకున్న మరొకటి. నేను ధనవంతుడిని కావాలి. లక్షలాది పేదవారు నాకు కనబడుతూనే వున్నారు. అయినా సరే, ధనవంతుడినవాలని నేను ఆకాంక్షిస్తాను. భద్రతకోసం కాంక్ష నన్ను నడిపిస్తున్నంత వరకు, ఆ కాంక్ష నన్ను తరుముతున్నంత వరకు నాకు విముక్తి లేదు. మళ్ళీ నా లోపలే కరుణ, ప్రేమ, సున్నిత తత్వమూ కూడా వున్నాయి. నా లోపల ఒక అంతులేని సమరం జరుగుతునే వుంటుంది. ఆ సమరమే బయటపడి, సంఘవిద్రోహకరంగా తయారవుతుంది, యింకా ఎన్నో జరుగుతాయి. ఇప్పుడు నేను ఏం చేయాలి? ఈ లోపలి సమరాన్నుండి, అంతర్గతమైన యీ సంఘర్షణ నుండి నేను ఎట్లా విముక్తుడి నవుతాను?

నా లోపల ఒక్క ప్రక్రియను మాత్రమే నేను పరిశీలించుకుంటూ, ద్వంద్వ ప్రక్రియను అలవర్చుకోకుండా వుంటే సంఘర్షణను ఎదుర్కోవడానికి అవకాశం వుంది. అంటే సద్గుణాలని, ధైర్యాన్ని అలవరచుకోకుండా భయాన్ని దాని స్వస్వరూపంలోనే పరిశీలిస్తూ వుంటే భయంతో తలపడవచ్చు. దీని అర్థం ఏమిటంటే 'వుండవలసిన దానిని' కాకుండా 'వున్నదానిని' తెలుసుకుంటే, అప్పుడు 'వున్నదానిని' ఎదుర్కొన గలుగుతాం. అయితే మనలో చాలామందికి 'వున్నది' ఏది అని తెలియదు. ఎందుకంటే చాలామంది 'వుండవలసినది' ఏది అన్నదానిలోనే ఆసక్తి చూపుతారు కాబట్టి. ఈ 'వుండవలసినది' ద్వైదీభావాన్ని సృష్టిస్తుంది. 'ఉన్నది' ఎప్పుడూ ద్వైదీభావాన్ని సృష్టించదు. 'ఉండవలసినది' సంఘర్షణను, ద్వైదీభావాన్ని తీసుకువస్తుంది.

కాబట్టి 'వున్నది' ని, ఘర్షణను కలిగించే దాని వ్యతిరేకమైన దానిని తీసుకు రాకుండా చూడగలనా; 'వున్నది' ని ఏ నిరోధభావమూ లేకుండా చూడగలనా? ఎందుకంటే నిరోధించడమే వ్యతిరేకమైన దానిని తయారు చేస్తుంది. అవును కదూ? అంటే, నేను భయపడుతున్నప్పుడు ఏ నిరోధభావమూ నాలో కలిగించుకోకుండా ఆ భయంవైపు చూడగలనా? ఎందుకంటే భయాన్ని వ్యతిరేకిస్తూ నిరోధభావం కలిగిన ఆ క్షణంలోనే మళ్ళీ మరొక సంఘర్షణను నేను సృష్టిస్తాను. 'ఉన్నది' ని ఏ నిరోధ భావమూ లేకుండా నేను చూడగలనా? అట్లా చేయగలిగితే, భయంతో నేరుగా తలపడటం నాకు చేతనవుతుంది.

సరే, భయం అంటే ఏమిటి? భయం ఒక మాటా? ఒక భావమా? అది ఒక ఆలోచనా? యదార్థమా? భయం అనే మాట ద్వారా భయం వునికిలోకి వస్తున్నదా లేక ఆ మాటకూ భయానికీ సంబంధం లేదా? సర్! దయచేసి నాతో పాటు కలిసి ఆలోచించండి. అలసిపోకండి. మనస్సును అటు యిటూ పోనీయకండి. మీకు నిజంగానే యీ భయం అనే సమస్య గురించి అక్కర వుంటే- మీ ఒక్కరికే కాదు, ప్రతి మనిషికీ యిది తప్పకుండా వుంటుంది- చావు అంటే భయం, మీ తాతగారో, అమ్మమ్మో చనిపోతారనే భయం- యింత ఘోరమైన కారునలుపు బరువును మీరు మోస్తున్నారు కాబట్టి, యీ సమస్యను పక్కకి తోసేయకుండా దానితో సూటిగా మీరు తలపడవద్దూ? ఈ సమస్యను జాగ్రత్తగా పరిశీలిస్తే, భయానికి దూరంగా పారిపోవడంతోనూ, ధైర్యం అలవరుచుకోవడం మొదలైన పద్ధతులతోనూ దానికి అడ్డంగా గోడలు కట్టడం ద్వారా భయాన్ని వ్యతిరేకించే నిరోధ భావాన్ని పెంచు కుంటున్నంత కాలం సంఘర్షణ తప్పదని తెలుస్తుంది. నిరోధ భావమే యీ సంఘర్షణను, రెండు వ్యతిరేకతల మధ్య సంఘర్షణను సృష్టిస్తుంది. రెండు వ్యతిరేకతల మధ్య గల సంఘర్షణ ద్వారా అవగాహన చేసుకోవడం ఏనాటికీ సాధ్యం కాదు.

పూర్వ పక్షానికీ, ప్రతి పక్షానికీ మధ్యన జరిగే సంఘర్షణ ఫలితంగా సమన్వయం సిద్ధిస్తుందనే వాదంలో నిజం లేదు. 'ఉన్నది' అనే వాస్తవాన్ని అర్థం చేసుకోవడం వల్ల అవగాహన కలుగుతుంది తప్ప దానికి వ్యతిరేకమైన దానిని సృష్టించడం వల్ల కాదు. కనుక, నిరోధభావం లేకుండా, అక్కడ నుండి పారిపోకుండా, భయాన్ని ముఖాముఖిగా ఎదుర్కోగలనా, దాని వైపు చూడగలనా? భయంవైపు చూస్తున్నయీ సత్యం ఏమిటి? నేను భయపడుతున్నాను అన్నప్పుడు, యిందులోని 'నేను' ఏమిటి, 'భయం' ఏమిటి? అవి రెండు వేరు వేరు దశలా, రెండు వేరు వేరు ప్రక్రియలా? 'నేను' భావిస్తున్న భయం వేరూ, నేను వేరూనా? నేను వేరూ, భయం వేరూ అయితే, అప్పుడు ఆ భయాన్ని నేను ఏదయినా చేయగలను, దానిని మార్చగలుగుతాను, నిరోధించగలుగుతాను, పక్కకి తోసేయగలుగుతాను. అయితే, భయమూ నేను కనుక వేరు వేరు కాకపోతే అప్పుడు చర్య పూర్తిగా భిన్నంగా వుంటుంది కదూ?

సర్! యిదంతా బొత్తిగా వూహకి అందనంత అస్పష్టంగానూ, క్లిష్టంగానూ వున్నదా? బాగా వివరంగా తెలుసుకుందాం రండి. దయచేసి శ్రద్ధగా వినండి. వాదించకుండా వూరికే వినండి. ఎందుకంటే వినడం వల్ల మాత్రమే, వాదప్రతివాదాల్లో పడిపోకుండా వట్టిగా వినడం వల్ల మాత్రమే నేను చెప్తున్నది మీరు ఆకళింపు చేసుకో గలుగుతారు.

భయాన్ని నిరోధిస్తున్నంత వరకు, భయపు బారినుండి నాకు విముక్తి వుండదు. పైగా సంఘర్షణ ఎక్కువవుతుంది, బాధ ఎక్కువవుతుంది. నిరోధభావం చూపనప్పుడు భయం మాత్రమే వుంటుంది. ఇక, భయం పరిశీలకుడి నుండి, 'నేను భయపడుతున్నాను' అనే 'నా' నుండి విడిగా వుంటుందా? 'నేను భయపడుతున్నాను' అంటున్న యీ 'నేను' ఏమిటి? నేను భయం అని పిలుస్తున్న ఆ మనోభావంతోనే యీ 'నా' అనేది కూడా తయారు చేయబడింది కదూ? 'నా' అంటే భయం అనే భావమే కదా? భయం అనే మనోభావం లేకపోతే 'నా' కూడా వుండదు. కాబట్టి యీ 'నా', యీ భయమూ ఒక్కటే. భయం కాకుండా 'నా' అనేది ఒకటి విడిగా లేదు. కాబట్టి భయమే 'నేను'. కనుక వున్నది భయం ఒక్కటే.

ఇప్పుడిక, యిది విచారణ చేద్దాం. భయం అనేది కేవలం ఒక మాటా? భయం అనే ఒక మాటను, ఆ భావాన్ని, ఆ సంకేతాన్ని, ఆ దశను- అసలు వాస్తవంతో ఏ సంబంధమూ లేకుండా మనసు సృష్టించిందా? దయచేసి వినండి. భయమే 'నా', ఇది కాకుండా మరో 'నేను' అనేది విడిగా లేదు. మానవుడు, యీ 'నేను'- 'నేను చాలా దురాశ కలవాడిని' అని అంటాడు. 'నేను' దే ఆధిపత్యం అంతా. ఆ గుణం 'నేను' నుండి విడిగా లేదు. 'నేను దురాశనుండి విముక్తి పొందాలి' అని 'నేను' అనుకుంటున్నంతవరకు, అది ప్రయత్నం చేస్తూనే వుంటుంది, పోరాటం సలుపుతూనే వుంటుంది. కాని ఆ 'నేను' లో దురాశ మాత్రం యింకా అట్లాగే వుంటుంది. ఎందుకంటే దురాశ లేకుండా వుండాలని అది కోరుకుంటూ వుంటుంది కనుక. అదే విధంగా 'నేను భయాన్ని పోగొట్టుకోవాలి' అని 'నేను' అనుకున్నప్పుడు అది నిరోధ భావాన్ని అలవరుచుకుంటున్నది. అందువల్ల సంఘర్షణ కలుగుతుంది. భయం మాత్రం ఎప్పటికీ తొలగిపోదు. అందువల్ల భయమే 'నేను' అనే వాస్తవాన్ని గుర్తించినప్పుడు, ఆ వాస్తవాన్ని అవగాహన చేసుకున్నప్పుడు, యీ 'నేను' భయాన్ని గురించి ఏమీ చెయ్యలేదని తెలుసుకున్నప్పుడు మాత్రమే భయం నుంచి విముక్తి కలుగుతుంది. "నేను భయపడుతున్నాను, యీ భయాన్ని గురించి ఏదయినా చేయాలి" అని అంటున్న ఆ 'నేను' ను చూడండి. భయాన్ని గురించి అది పనిచేస్తున్నంతకాలమూ నిరోధభావాన్ని కలిగించి, ఆ విధంగా సంఘర్షణను యింకా పెంచుతుంటుంది. మనం కనుక భయం అంటేనే 'నా' అని గుర్తిస్తే అప్పుడు 'నేను' పనిచేయడం మానేస్తుంది. అప్పుడు మాత్రమే భయం తొలగిపోతుంది.

చూడండి, భయంగాని, ఒక బలమైన కాంక్షగాని, సెక్స్ సంబంధమైన వాంఛగాని కలిగినప్పుడు దాని గురించి ఏదో ఒకటి చేయడం మనకు అలవాటై పోయింది. వాంఛ, 'నా' వేరువేరుగా వున్నాయని అనుకుంటూ దానిపై చర్య తీసుకుంటాం.

కాబట్టి కోరికను 'నా' తో కలిసి కాకుండా వేరుగా వున్నదని అనుకుంటూ మనం చూస్తున్నంతవరకు సంఘర్షణ తప్పదు. 'నా' లేకుండా కోరిక వుండదు. నేనే కోరిక. అవి రెండూ విడివిడిగా లేవు. దయచేసి యిది గ్రహించండి. భయం అంటే 'నేనే' అనీ, దురాశ అంటే 'నేనే' అనీ, అవీ నేనూ ఒకటే తప్ప విడి విడిగా వుండమనీ గ్రహించినప్పుడు కలిగే ఆ భావం చాలా బ్రహ్మాండమైన అనుభవం.

ఆలోచించేవాడు లేనప్పుడు ఆలోచన వుండదు. ఆలోచన అంటూ వున్నంతవరకు ఆలోచించే వాడూ వుంటాడు. ఆలోచించేవాడు, ఆలోచన విడివిడిగా లేరు. అయితే ఆలోచనే ఆలోచించేవాడిని సృష్టిస్తున్నది. అతన్ని వేరుగా విడదీస్తున్నది. ఎందుకంటే ఆలోచన నిరంతరంగా శాశ్వతత్వం కోసం ఆరాటపడుతుంటుంది, అందుకని 'నేను' ను శాశ్వతంగా వుండే ఒక సత్యంగా సృష్టిస్తుంది. ఆ 'నేను' ఆలోచనను అదుపులో వుంచుతుంది. అయితే ఆలోచన లేకుండా 'నేను' లేదు. మీరు ఆలోచించకుండా వున్నప్పుడు, ఫలానా అని గుర్తిస్తూ లేనప్పుడు, విచక్షణ చేస్తూ లేనప్పుడు యీ 'నేను' అన్నది వుంటుందా? అప్పుడు యీ 'నా' వుంటుందా? ఆలోచన అనే ప్రక్రియే 'నా' ను తయారు చేస్తున్నది. ఆ 'నా' యే మళ్ళీ ఆలోచనను నడిపిస్తుంది. అంతు లేకుండా యీ ప్రయాస అంతా యిట్లా సాగిపోతూనే వుంటుంది.

భయాన్ని పూర్తిగా పోగొట్టుకోవాలనే వుద్దేశ్యం వుంటే, అప్పుడు భయం అంటే 'నేను', 'నేను' కాకుండా భయం అనేది విడిగా లేదు అనే సత్యాన్ని గ్రహించి తీరాలి. అదీ వాస్తవం. ఒక వాస్తవాన్ని ఎదుర్కొన్నప్పుడు చర్య జరుగుతుంది- యిది చేతన మానసం ద్వారా జరుగుతున్న చర్య కాదు; ఆ చర్యను ఎన్నుకోవడం లేదు, నిరోధభావం వల్లా.ఆ చర్య జరగడం లేదు. అది సత్యం అనే చర్య. అటువంటప్పుడు మాత్రమే మనసును అన్ని రకాల భయాల నుండి విముక్తం చేయడం సాధ్యమవుతుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, VII వాల్యూమ్,*
*బొంబాయి, 15 ఫిబ్రవరి 1953.*

**ప్రశ్న : నా లోపల ఎంతో సంఘర్షణ వుంది, ఎన్నో బాధలున్నాయి. ఈ బాధలకు గల కారణాలను గురించి, యీ బాధలను నివారించే మార్గాలను గురించి, వేల సంవత్సరాలుగా మనకు బోధిస్తూనే వున్నారు. అయినా అప్పుడు ఎట్లా వున్నామో యిప్పుడూ అట్లాగే వున్నాం. ఈ బాధలు లేకుండా చేసుకోవడం సాధ్యమా?**

**కృష్ణమూర్తి :** మనం బాధల్లో వున్నామనే స్పృహ ఎంతమందికి వున్నదంటారు? ఒక సిద్ధాంతం లాగా కాకుండా, నిజంగానే మీలో సంఘర్షణ వున్నదని మీరు

తెలుసుకున్నారా? తెలుసుకొని వుంటే మీరేం చేస్తారు? దాన్నుంచి పారిపోవాలని చూస్తారు; కాదూ? మనలోపల యీ సంఘర్షణ, బాధ వున్నాయనే స్పృహ కలగగానే మేధకు సంబంధించిన వ్యాపకాలలోనో, పనిలోనో, వినోదాలలోనో, సౌఖ్యాల్లోనో మునిగిపోయి, అది మరచిపోవాలని ప్రయత్నిస్తాం. బాధల నుంచి తప్పించుకొని పారిపోవాలని చూస్తాం. నాగరీకమైనవైనా సరే, మోటువైనా సరే అన్ని పలాయనాలూ సమానమే, కాదంటారా? అసలు సంఘర్షణ అంటే అర్థం ఏమిటి? మీలో సంఘర్షణ వున్నదని మీరు ఎప్పుడు తెలుసుకున్నారు? 'నా' అనే స్పృహ మీకు కలిగినప్పుడే సంఘర్షణ బయలుదేరుతుంది. ఈ 'నాకు' హఠాత్తుగా తన గురించిన స్పృహ కలిగినప్పుడు మాత్రమే సంఘర్షణ వున్నదనే ఎరుక వస్తున్నది. అది లేనప్పుడు ఏ మార్పులూ లేని, ఒక కృత్రిమమైన, జడమైన, ఒకటే రకమైన నిత్యకృత్యపు జీవితాన్నే మీరు గడిపి వేస్తుంటారు, అవునా? సంఘర్షణ వున్నప్పుడు మాత్రమే మీ గురించి మీకు చైతన్యం కలుగుతుంది. ఏ వైరుధ్యాలూ లేకుండా, ఆశాభంగాలు లేకుండా అన్నీ సాఫీగా జరిగిపోతున్నంత కాలమూ మీ గురించిన చైతన్యం తల ఎత్తదు. నన్ను బంతిలాగా అటూ యిటూ నెట్టివేయనంతకాలం, నాకు కావలసినది నాకు లభిస్తున్నంత కాలం నాలో సంఘర్షణ వుండదు. నాకు అడ్డు తగలగానే నాగురించి నాకు స్పృహ కలుగుతుంది, క్షోభ పడతాను. ఇంకో రకంగా చెప్పాలంటే, నేనులో తన చర్యలకు ఆశాభంగం ఎదురవుతున్న భావం కలిగినప్పుడు మాత్రమే సంఘర్షణ ఆరంభమవుతుంది. కాబట్టి మనకు కావలసింది ఏమిటి? ఏ ఆశాభంగాలూ ఎదురవకుండా నాకు నిరంతరంగా స్వీయ సాఫల్యత సిద్ధించే చర్యలే జరగాలి. అంటే జీవితంలో మనకి ఏవీ అడ్డు తగలకూడదు. వేరే మాటల్లో చెప్పాలంటే, మన కోరికలు నెరవేరుతూ వుండాలి. కోరికలు నెరవేరనప్పుడు సంఘర్షణ బయలుదేరుతుంది, వైరుధ్యాలు మొదలవుతాయి. కాబట్టి మన సమస్య ఏమిటంటే, సఫలత ఎట్లా సాధించాలి, భంగపాట్లు ఏవీ లేకుండా స్వీయ సాఫల్యం సాధించడం ఎట్లా నాకు నా స్వంతానికి- ఆస్తి కావాలి, ఒక మనిషి కావాలి, బిరుదులు కావాలి, యింకా అవీ యివీ. అవి నాకు స్వంతమైతే, యింకా నాకు కావలసిన వన్నీ కూడా నాకు లభ్యమవుతూవుంటే నేను సంతోషంగా వుంటాను. అప్పుడు ఏ వైరుధ్యాలూ వుండవు. కాబట్టి మనం ఆశిస్తున్నది స్వీయ సాఫల్యం కోసం; ఆ తృప్తి మనకు లభిస్తున్నంత వరకు ఏ ఘర్షణా వుండదు.

సరే, ప్రశ్న ఏమిటంటే స్వీయ సాఫల్యసిద్ధి అనేది అసలు వున్నదా? అంటే, నేను గొప్పతనాన్ని సాధించగలనా, గొప్పగా అవగలనా, సత్యం ఏది అని గ్రహించ గలనా? ఇటువంటి యీ కోరికలో ఒక నిరంతరమైన పోరు జరగడం లేదూ? అంటే

ఏదో అవాలని, ఏదో సాధించాలని, స్వీయ సాఫల్యసిద్ధి జరగాలని ఆరాట పడుతున్నంత వరకు భంగపాటూ వుంటుంది, భయమూ వుంటుంది, సంఘర్షణా వుంటుంది. కాబట్టి స్వీయ సాఫల్యత అనేది అసలు వుంటుందా? అసలు స్వీయ సాఫల్యం అంటే అర్థం ఏమిటి? స్వీయ సాఫల్యం అంటే మన అర్థం ఏమిటంటే స్వలాభం- అంటే 'నా' మరింత పెద్దగా, గొప్పగా, ప్రముఖంగా అవడం. 'నేను' ఒక గవర్నరు అవడమో, పెద్ద వుద్యోగస్తుడిని అవడమో, బ్యేంక్ మేనేజరు అవడమో మొదలైనవి. ఇంకా కొంత లోతుగా దీన్ని పరిశీలిస్తే, స్వార్థం పనిచేస్తున్నంతవరకు అంటే తను చేసే చర్యల్లో నేను గురించిన స్పృహ వున్నంతవరకు భంగపాటు తప్పదు. ఆకారణంగా బాధలు కూడా తప్పవు. కాబట్టి మన సమస్య బాధలను తట్టుకోవడం ఎట్లా, సంఘర్షణను తొలగించడం ఎట్లా అని కాదు; ఈ 'నా' యొక్క, తన యొక్క స్వభావగుణాలని అవగాహన చేసుకోవడం. ఇదంతా నేను మరీ జటిలంగా తయారు చేయడం లేదనే ఆశిస్తున్నాను. కేవలం సంఘర్షణను తట్టుకోవడం గురించీ, దుఃఖాన్ని తొలగించడం గురించీ మాత్రమే ప్రయత్నిస్తే దుఃఖాన్ని సృష్టించిన కర్త స్వభావాన్ని మనం అర్థం చేసుకోలేము.

ఆలోచన తన స్వంత వికాసం కోసమూ, తన స్వంత పరివర్తన కోసమూ, తన స్వీయ అభ్యున్నతి కోసమూ అపేక్షిస్తున్నంతవరకు సంఘర్షణ, వైరుధ్యాలు వుంటూనే వుంటాయి. కాబట్టి, నన్ను నేను అవగాహన చేసుకోనంతవరకు సంఘర్షణ, బాధ తప్పవు అన్న సుస్పష్టమైన వాస్తవానికే మళ్లీ మనం వచ్చి చేరాం. అందువల్ల దుఃఖాన్నీ, సంఘర్షణనూ తట్టుకోవడం ఎట్లా అన్నది తెలుసుకోవడం కంటె తననితాను అవగాహన చేసుకోవడం ముఖ్యం. ఇది యింకా వివరంగా తరువాత తెలుసుకుందాం. అయితే, పూజా పునస్కారాల ద్వారా, వినోద కాలక్షేపాల ద్వారా, నమ్మకాల ద్వారా, యింకా రకరకాలైన వ్యాపకాల ద్వారా బాధల నుంచి పారిపోవడం వలన, మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడం అనే అసలు ప్రధాన సమస్య నుంచి మీ ఆలోచనలను యింకా చాలా దూరంగా నెట్టి వేస్తున్నారు. దుఃఖాన్ని అర్థంచేసుకోవాలంటే యీ రకరకాలైన పారిపోవడాలన్నీ ఆగిపోవాలి. అప్పుడే చర్య జరుపుతూ వున్న మిమ్మల్ని మీరు ఎదుర్కో గలుగుతారు. చర్య జరుపుతున్న మిమ్మల్ని అవగాహన చేసుకోవడం లోనే- అంటే అర్థం మీ సంబంధ బాంధవ్యాలను అవగాహన చేసుకోవడంలోనే ఆలోచనలను అన్ని సంఘర్షణలనుండి పూర్తిగా విముక్తం చేసి, ఆనందమైన స్థితిలో, యదార్థ్యమైన స్థితిలో జీవించగల మార్గం మీకు కనబడుతుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, V వాల్యూమ్,*
*న్యూ ఢిల్లీ, 14 నవంబర్ 1948*

**ప్రశ్న : కాంక్షలు ఎన్నయినా వాటిలోని అసలు విషయం ఒకటే అని మీరు అన్నారు. అంటే దైవాన్ని చూడాలని తపించే మనిషిలోని కాంక్షకూ, ఆడవాళ్ళ వెంటపడేవారిలోనూ, తప్పతాగి మైమరచే వారిలోనూ వుండే కాంక్షలకూ వ్యత్యాసం ఏమీ లేదని మీరనుకుంటున్నారా?**

కృష్ణమూర్తి : కాంక్షలన్నీ ఒకే మాదిరివి కాకపోవచ్చు. అయితే అవన్నీ కాంక్షలే. మీకు దేవుడి మీద కాంక్ష వుండచ్చు; నాకు తాగాలనే కాంక్ష వుండచ్చు; యిద్దరమూ ఆ ఒత్తిడికి లోనవుతూ వున్నాం; యిద్దర్నీ కాంక్ష ప్రేరేపిస్తున్నది. అది మిమ్మల్ని ఒక దిక్కులోనూ, నన్ను మరో దిశగానూ తోస్తూ వుంటుంది. మీరు వెళ్తున్నది గౌరవ మర్యాదలు గల మార్గం, నాది అటువంటిది కాదు. కాకపోగా నన్ను సమాజ విరోధి అని కూడా అంటారు. కాని మనసుని సద్గుణాలతోను, దేవుడితోను నింపుకున్న మునులూ, సన్యాసులూ, పారమార్థికులు అని మనం అంటూ వుంటామే వారూ, వ్యాపార వ్యవహారాలు, స్త్రీలు, త్రాగుడు మొదలైన వ్యాపకాలలో మునిగిపోయి వున్నవారూ అంతా ఒకటే; అందరిలోనూ ప్రధానంగా వున్న లక్షణం ఒకటే; ఆదే తమ తమ వ్యాపకాల్లో పూర్తిగా మునిగి పోయివుండటం అర్థమవుతున్నది కదూ? ఒకరికి సమాజపరంగా గౌరవం వుంటుంది. త్రాగుడు అనే వ్యాపకాన్ని మనసులో పెట్టుకున్న యింకొకరిని సమాజం వెలివేస్తుంది. కనుక, సామాజిక కోణం నుంచి మీరు తప్పొప్పులు నిర్ణయిస్తున్నారు. కాదంటారా? సన్యాసం పుచ్చుకొని, ఒక ఆశ్రమంలో చేరి, రాత్రింబగళ్ళు దైవప్రార్థనలు చేస్తూ, మధ్యలో కొంతసేపు తోటపనీ అదీ చేస్తూ, మనసుని పూర్తిగా దేవుడితో, ప్రాయశ్చిత్తాలతో, క్రమశిక్షణతో, యింద్రియ నిగ్రహంతో నింపుకునే వారిని పుణ్యపురుషులనీ, మహాత్ములనీ మీరు అంటారు. తన వ్యాపార వ్యవహారాలు చూసుకుంటూ, స్టాక్ ఎక్స్ఛేంజిని గుప్పిట్లో పెట్టుకొని, ఎప్పుడూ డబ్బు సంపాదించే వ్యాపకాల్లో మునిగితేలే మనిషిని గురించి, 'అబ్బే, మనందరి లాగే మామూలు మనిషి' అని చప్పరించేస్తారు. కాని యిద్దరు చేస్తున్నదీ వారి వారి వ్యాపకాల్లో మునిగివుండటమే. మనసు ఏ వ్యాపకంతో వున్నది అన్నది నాకు ప్రధానం కాదు. మనసుని దేవుడు అనే వ్యాపకంతో నింపుకున్న వ్యక్తి దేవుణ్ణి ఎప్పటికీ కనుక్కోలేక పోవచ్చు. ఎందుకంటే దేవుడు ఒక వ్యాపకంగా పెట్టుకునే విషయం కాదు. అది మనకు తెలియనిది, కొలతల్లో యిమడ్చలేనిది. దేవుడిని ఒక వ్యాపకంలాగా మీరు పెట్టుకోలేరు. అట్లా చేస్తుంటే మీ దృష్టిలో దేవుడు అంటే చాలా చవక రకం అన్నమాట.

మనసు ఏ వ్యాపకంతో వున్నది అనేది కాదు ముఖ్యం. ఆ వ్యాపకం వంటిల్ల వచ్చు, పిల్లలవచ్చు, వినోదకాలక్షేపమో, వంట ఏం చేయాలి అన్నదో, సద్గుణాలో,

దేవుడో యింకా అటువంటిదేదైనా కావచ్చు. ఏదో ఒక వ్యాపకంతో మనసు నిండిపోయి వున్నదనే వాస్తవం చాలా ముఖ్యమైనది. మనసు ఎప్పుడూ ఏదో ఒక వ్యాపకంలో పడివుండి తీరాలా? అర్థం చేసుకుంటున్నారా? వ్యాపకంలో పడి వున్న మనసు ఒక కొత్తదానిని దేన్నయినా, తన వ్యాపకాన్ని కాకుండా మరొకదాన్ని చూడగలుగుతుందా? ఏ వ్యాపకంతోనూ లేనప్పుడు మనసుకు ఏమవుతుంది? మీకు యిది అర్థమవుతున్నది కదూ? ఏ వ్యాపకమూ లేకపోతే అప్పుడసలు మనసు అనే ఒకటి వుంటుందా? విజ్ఞాన శాస్త్రజ్ఞుడికి తన సాంకేతిక సమస్యలు, తన యంత్ర సంబంధమైన విషయాలు, గణితమూ వ్యాపకాలుగా వుంటే గృహిణికి వంటయిల్లూ, తన పాపాయీ వ్యాపకాలు. ఏ వ్యాపకమూ లేకుండా వుండిపోతామేమోనని మనకు భయం. సామాజికంగా దీనివల్ల ఏ అనర్థాలు కలుగుతాయో అని భయం. ఏ వ్యాపకమూ లేకుండా వున్నప్పుడు మీరు ఏమిటో అది వున్నది వున్నట్లుగా కనిపెట్టవచ్చు. కాబట్టి వ్యాపకం మీరు ఏమిటో దాని నుండి పారిపోవడానికి తోడ్పడుతున్నది.

అయితే, మనసు నిరంతరంగా వ్యాపకంలో మునిగి వుండాలా? మనసుకు ఏ వ్యాపకమూ లేకుండా వుండటం సాధ్యమేనా? క్షమించండి, సమాధానం మీవద్ద లేని ఒక ప్రశ్నను వేస్తున్నాను. ఆ సమాధానాన్ని మీరు కనిపెట్టాలి; అది మీరు తెలుసు కున్నప్పుడు ఒక అపూర్వమైన అద్భుతం జరగడం చూస్తారు.

మీ మనసు ఏవిధంగా వ్యాపకాలతో నిండిపోయి వుంటుందో మీ అంతట మీరే తెలుసుకోవడం చాలా ఆసక్తికరంగా వుంటుంది. ఒక చిత్రకారుడు తన కళ, తన పేరు, తన పెరుగుదల, రంగులు కలుపుకోవడం, తన కీర్తి, తన ఖ్యాతి- వీటి వ్యాపకంతో నిండిపోయి వుంటాడు. పండితుడు తన జ్ఞానం అనే వ్యాపకంతో నిండిపోయి వుంటాడు. స్వీయజ్ఞానం పొందాలని పూనుకున్న మనిషికి తన గురించి తెలుసుకోవడమే వ్యాపకంగా వుంటుంది. ఒక చీమ లాగా ప్రతి చిన్న ఆలోచనను, ప్రతి కదలికను గమనించడానికి ప్రయత్నిస్తుంటాడు. వీరందరు చేసేది ఒకటే. బొత్తిగా ఏ వ్యాపకమూ లేకుండా వున్న మనసు, సంపూర్ణంగా ఖాళీగా వున్న మనసు, ఏ వ్యాపకమూ లేని మనసు మాత్రమే కొత్తదానిని అందుకో గలుగుతుంది. అయితే మనసు వ్యాపకంతో వున్నంతవరకు కొత్తది ఆవిర్భవించలేదు.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, IX వాల్యూమ్,*
*ఒహాయి, 14 ఆగష్టు 1955*

ప్రశ్న : **మనం చనిపోయాక, యీ భూమిమీదే మళ్ళీ పుడతామా? మరో లోకంలోకి నిష్క్రమిస్తామా?**

కృష్ణమూర్తి : ఇది మనందరిలోనూ చాలా ఆసక్తి రేకెత్తించే ప్రశ్న, చిన్నవారిలో పెద్దవారిలో కూడా; కాదంటారా? అందువల్ల కొంచెం లోతుగా దీనిని విశదపరుస్తాను. ఇప్పుడు నేను చర్చించబోతున్న యీ విషయాన్ని, కేవలం అందులోని శబ్దాలనే కాకుండా, అందులో వున్న అసలైన ఆ అనుభూతిని కూడా దయచేసి గ్రహించమని మీకు మనవి చేస్తున్నాను.

మరణం అనే ఒకటి వున్నదని మనకందరికీ తెలుసు. ముఖ్యంగా వృద్ధులకు తెలుసు. పరిశీలించే దృష్టి వున్న చిన్నవారికీ తెలుసు. 'అది వచ్చేదాకా ఆగి, అప్పుడు దాని సంగతి తేల్చుకుందాం' అని చిన్నవాళ్ళు అంటుంటారు. పెద్దవాళ్ళు మరణానికి సమీపంగా వచ్చేశారు కాబట్టి రకరకాల వుపశమన మర్గాలు వెతుక్కుంటూ వుంటారు.

దయచేసి యిది అర్థంచేసుకొని మీకు మీరే అన్వయించుకోండి. మరొకరి మీద రుద్దకండి. ఎప్పుడో ఒకరోజు చనిపోతారని తెలుసు కాబట్టి దాన్ని గురించి కొన్ని సూత్రాలు మీరు తయారుచేసి పెట్టుకుంటారు. అవునా? దేవుడి మీద నమ్మకం పెంచుకుంటారు. పునరుత్థానాన్నో, కర్మనో, పునర్జన్మనో నమ్ముతారు. ఇక్కడో, మరో లోకంలోనో మళ్ళీ జన్మిస్తామని మీరు అనుకుంటారు. లేకపోతే మరణం అనివార్యమనీ, ప్రతివారూ చనిపోవలసిందే అనీ చావుని గురించి హేతువాదం చేస్తారు. చెట్టు వాడి, ఎండి పోతుంది. భూమిని సారవంతం చేస్తుంది. మళ్ళీ యింకో కొత్త చెట్టు పెరుగుతుంది. మీ నిత్య జీవనపు విచారాల్లో, ఆందోళనల్లో, అసూయల్లో, యీర్ష్యల్లో, మీ పోటీలలో, మీ సిరిసంపదల్లో తలమునకలుగా మునిగిపోయి కనుక మీరు వుంటే మరణం గురించి ఆలోచించే వ్యవధానం కూడా వుండదు. అయితే మీ మనసు లోపలగా అది వుండే వుంటుంది. చేతనంగానో, అచేతనంగానో అది అక్కడ లేకుండా వుండదు.

ముందుగా, చావుని గురించి మీరు వంట పట్టించుకున్న నమ్మకాలను, హేతువాదాలను, వుపేక్షాభావాన్ని అన్నింటినీ వదుల్చుకోగలరా? ఈ క్షణంలోనే వాటన్నింటి నుండి మిమ్మల్ని విముక్తి చేసుకోగలరా? అన్నింటికంటె ముఖ్యమైనది ఏమిటంటే, జీవిస్తూ వుండగానే, పూర్తి చైతన్యంతో వున్నప్పుడే, చురుకుగా, ఆరోగ్యంగా వున్నప్పుడే మరణ గృహంలో ప్రవేశించడం. చావు ఎప్పుడొస్తుందా అని ఎదురుచూస్తూ కూర్చోవడం కాదు. అది ఒక్క రెప్పపాటులో మిమ్మల్ని ఏ ప్రమాదంలోనో ఎత్తుకు పోవచ్చు. లేదా జబ్బు చేసి తీసుకుంటూ, మెలిమెల్లిగా అచేతనావస్థలోకి మీరు

వెళ్ళిపోవచ్చు. మరణం కలిగినప్పుడు అది ఒక అద్భుతమైన ఘడియ అవాలి, ప్రాణంతో వుండటమంత మహాశక్తివంతమైనదీ అవాలి.

సరే, ప్రాణం వుండగానే నేను మరణగృహంలో ప్రవేశించగలనా, మీరు ప్రవేశించగలరా? అదీ సమస్య- పునర్జన్మ వున్నదా లేదా అని కాదు. మనం మళ్ళీ జన్మించే మరో లోకం వున్నదా అనీ కాదు. అవన్నీ బొత్తిగా పరిణతిలేని పసివయసు ఆలోచనలు. బ్రతికి వున్న మనిషి ఎప్పుడూ 'ప్రాణం అంటే ఏమిటి' అని అడగడు. బ్రతికి వుండటం గురించి అతను సిద్ధాంతాలూ చేయడు. సగం చచ్చి, సగం ప్రాణంతో వున్న మనిషి మాత్రమే జీవితానికి గల ప్రయోజనం గురించి మాట్లాడుతూవుంటాడు.

కనుక, మీరూ నేను కూడా, జీవించి వుండగానే, చైతన్యంతోను, చురుకుగాను వున్నప్పుడే, మనకు ఏ ఏ శక్తి సామర్థ్యాలు వున్నాయో అవన్నీ, యింకా వున్నప్పుడే- మరణం అంటే ఏమిటో తెలుసుకోగలమా? అప్పుడు మరణం వేరూ, జీవించడం వేరూగా వుంటాయా? మనలో చాలామందికి సజీవంగా వుండటం అంటే శాశ్వతమైనవి అని మనం అనుకునేవి అట్లాగే కొనసాగుతూ వుండటం. అంటే మన పేరు, మన కుటుంబం, మన ఆస్తిపాస్తులు, ఆర్థికంగాను, ఆధ్యాత్మికంగాను మనకు లాభసాటిగా వుండేవి, మనం అలవరచుకున్న సద్గుణాలు, మనోద్వేగాల ద్వారా మనం ఆర్జించుకున్న విషయాలు- యివన్నీ ఎప్పటికీ వుండిపోవాలని కోరుకుంటాం. మరణం అనే పేరుతో మనం పిలిచే ఆ క్షణం మనకు బొత్తిగా తెలియని క్షణం. అందుకని భయపడతాం. అందుకు వూరటగా, వుపశమనంగా వుండే దాని కోసం ప్రయత్నిస్తాం. మరణించాక మళ్ళీ యింకో జీవితం వుంటుందా వుండదా అనీ, యింకా సవాలక్ష సంగతుల గురించీ తెలుసుకోవాలనుకుంటాం. అవన్నీ వ్యర్థమైన సందేహాలు. అవన్నీ సోమరి పోతులూ, జీవించి వుండగానే మరణం గురించి తెలుసుకోవడం యిష్టపడని వారూ వేసే ప్రశ్నలు. కాబట్టి మరణం గురించి మీరూ, నేనూ కలిసి కనిపెడదామా?

చనిపోవడం అంటే ఏమిటి? మీకు తెలిసినవన్నీ పూర్తిగా ముగిసిపోవడం. మీరు తెలుసుకున్నదంతా ముగిసి పోకపోతే అది మరణం కాదు. మరణం అంటే ఏమిటో ముందే తెలుస్తే అప్పుడు మీరు భయపడవలసిన పనే లేదు. అయితే మరణం మీకు తెలుసా? అంటే, అనిత్యమైన ఒకదానిలో ఎల్లకాలం కొనసాగుతూవుండే దానిని కనిపెట్టాలనే నిరంతర పోరాటాన్ని మీరు సజీవంగా వున్నప్పుడే ఆపివేయ గలరా? అజ్ఞేయమైన దానిని (తెలుసుకోలేనిదానిని), మరణం అని మనం అనే ఆ స్థితిని జీవించి వుండగానే మీరు తెలుసుకోగలుగుతారా? మరణించాక ఏమవుతుందో అన్నదానిని గురించి పుస్తకాల్లో మీరు చదివిన రకరకాల వర్ణనలను, వుపశమనం

కోరుతూ మీలోలోపల వున్న అచేతన కాంక్షలు జారీ చేస్తున్న ఆజ్ఞలను అన్నింటినీ పక్కకి నెట్టేసి, అద్భుతమైన ఆ స్థితిలో వుండే ఆ అనుభూతిని యిప్పుడే రుచి చూడగలరా, అనుభవించగలరా? ఇప్పుడే ఆ స్థితిని కనుక మీరు అనుభూతి పొందగలిగితే అప్పుడిక జీవించడం, చనిపోవడం రెండూ ఒకటే అవుతాయి.

కాబట్టి, 'నేను' అనేది- విస్తారమైన చదువు, విజ్ఞానం, అసంఖ్యాకమైన అనుభవాలు, పోరాటాలు, ప్రేమలు, ద్వేషాలు కలిగివున్న యీ 'నేను' - సమాప్తం చెందగలదా? సమస్తమైన ఆ జ్ఞాపకాలు 'నేను' లో ముద్రితమై వున్నాయి- అటువంటి యీ 'నేను' సమాప్తమై పోగలదా? ఒక ప్రమాదంలో గాని, ఒక వ్యాధివల్లగాని అంతమై పోవడం కాకుండా, యిక్కడ కూర్చొనివుండగానే మీరు, నేను ఆ ముగింపు ఏమిటో తెలుసుకోగలమా? అప్పుడు మరణం గురించీ, శాశ్వతత్వం గురించీ, దీనికి తరువాత మరో లోకం వున్నదా అనీ అవివేకమైన ప్రశ్నలు ఏవీ మీరు అడగరు. అప్పుడు అసలు సమాధానం మీకే తెలిసిపోతుంది. ఎందుకంటే అజ్ఞేయమైనది అప్పుడు వునికిలోకి వచ్చేస్తుంది. అప్పుడు పునర్జన్మ అనే వ్యర్థప్రలాపాలు, బ్రతుకు అంటే భయం, చావు అంటే భయం, వయసుపై బడుతున్నదనీ, యితర్లచేత చేయించు కోవాలేమో అని భయం, ఒంటరితనం గురించీ, మరొకరికి భారంగా వుండటం గురించీ యీ విధమైన రకరకాల భయాలు- యివన్నీ సమాప్తమై పోతాయి. ఈ మాటలు కేవలం అర్థంలేని కబుర్లు కావు. మనసు తను శాశ్వతంగా కొనసాగాలని ఆలోచించడం ఆపివేసినప్పుడు, అజ్ఞేయమైనది వునికిలోకి వస్తుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, IX వాల్యూమ్,*
*ఒహాయి, 21 ఆగష్టు, 1955.*

ప్రశ్న : **నేను భగవంతుణ్ణి ప్రార్థిస్తుంటాను. నా ప్రార్థనలు విని, ఆయన నా కోరికలు తీరుస్తుంటారు. దేవుడున్నాడు అని యిది రుజువు చేయడం లేదా?**

**కృష్ణమూర్తి** :. ఒక నిదర్శనం ఆధారంగా దేవుడున్నాడని మీరు నిరూపిస్తుంటే అది దేవుడు కానే కాదు (నవ్వులు). ఎందుకంటే నిదర్శనం లేదా రుజువు అనేది మనసుకి సంబంధించినది. దేవుడున్నాడు- లేడు అనే సంగతి నిరూపించడం మనసుకి ఎట్లా సాధ్యమవుతుంది? మనసు తన తృప్తికోసం, తన అభిరుచి ప్రకారం, తన సుఖసంతోషాల కోసం లేదా తన భయంవల్ల దేవుడు అని మీరు అంటున్న దీన్ని తయారు చేసుకుంది. అటువంటి చిత్రకల్పన దేవుడు అవడు. అది కేవలం ఆలోచన చేసిన సృష్టి; మనకు తెలిసిన దానితో అంటే గతం సహాయంతో అల్లుకొన్న చిత్రకల్పన.

మనసు వెతుకుతూ వుంటుంది, దేవుడి కోసం చురుకుగా అన్వేషిస్తూ వుంటుంది. అయితే మనసు తెలుసుకున్నది దేవుడు కాదు.

ఈ ప్రశ్న అడిగినవారు తము చేసిన ప్రార్థనలకు దేవుడు బదులు పలికాడంటున్నారు. దేవుడున్నాడనడానికి యీ రుజువు చాలదా అని అడుగుతున్నారు. ప్రేమను రుజువు చేసి చూపాలని మీరు అనుకుంటారా? ఒకరిని మీరు ప్రేమించినప్పుడు ఆ సంగతి నిరూపించాలనుకుంటారా? ప్రేమకి ఒక రుజువు వుండితీరాలని మీరు అనుకుంటే అది అసలు ప్రేమేనా? మీ భార్యాపిల్లల్ని మీరు ప్రేమిస్తూ, ఒక రుజువు చూపాలని అనుకుంటుంటే, అప్పుడది యిచ్చిపుచ్చుకునే బేరం అవుతుంది. కాబట్టి దేవుడిని మీరు ప్రార్థించడం కూడా ఒక బేరం పెట్టడం వంటిదే. (నవ్వులు). నవ్వులతో తీసిపారేయకండి. ఇది చాలా గంభీరమైన విషయం. ఒక యదార్థం. ఈ ప్రశ్న అడిగినవారు దేవుడు అని తము పిలుస్తున్నవారిని అర్థిస్తున్నారు, వేడుకుంటున్నారు. త్యాగాల ద్వారా, కర్తవ్య నిర్వహణ ద్వారా, బాధ్యతా నిర్వహణ ద్వారా సత్యాన్ని కనుక్కోలేరు. ఎందుకంటే యివన్నీ ఒక లక్ష్యం చేరుకోవడం కోసం వుపయోగించే సాధనాలు. అటువంటప్పుడు ఆ లక్ష్యానికీ, సాధనాలకూ పెద్ద వ్యత్యాసం ఏమీ వుండదు. సాధనమే లక్ష్యం అవుతుంది.

'నేను దేవుణ్ణి ప్రార్థిస్తాను. ఆయన బదులు పలుకుతాడు' అని యీ ప్రశ్న వేసినవారు అంటున్నారు. దీనిని కూడా పరిశీలిద్దాం ప్రార్థన అంటే మీ అర్థం ఏమిటి? మీరు చాలా వుల్లాసంగా వున్నప్పుడు, సంతోషంగా వున్నప్పుడు, ఏ గొడవలూ, ఏ బాధలూ లేకుండా వున్నప్పుడు ప్రార్థిస్తారా? దుర్భరమైన బాధలున్నప్పుడే, అలజడి, భయమూ, సంక్షోభమూ వున్నప్పుడే ప్రార్థిస్తుంటారు. మీ ప్రార్థన అర్థింపులతో, వేడుకోళ్ళతో కూడుకొని వుంటుంది. బాధలో వున్నప్పుడు ఎవరైనా సహాయం చేస్తే బాగుంటుందని మీరు కోరుకుంటారు, ఒక వున్నతమైన శక్తి ఏదో మీకు చేయూత నివ్వాలని కోరుకుంటారు. సహాయం కోసం వేడుకొనే రకరకాల ప్రక్రియలనే ప్రార్థన అని అంటున్నారు. అంటే ఏం జరుగుతున్నదన్నమాట? ఎవరిముందో మీ భిక్షాపాత్రను జాపుతున్నారు. అది ఎవరిముందయితే ఏమిటి- ఒక దేవదూత అవచ్చు, మీరే స్వయంగా చిత్రకల్పన చేసుకొని దేవుడు అని పేరుపెట్టుకున్న వారవచ్చు. భిక్ష ఎత్తిన మరుక్షణమే ఏదో ఒకటి మీకు దొరుకుతుంది. అయితే ఆ లభించినది అసలైనదా కాదా అనేది వేరే విషయం. మీకు కావలసినది మీ కలతలు, మీ బాధలు తీరిపోవడం. అందుకని సంప్రదాయంగా వస్తున్న కొన్ని ప్రత్యేకమైన మాటల్ని పేర్చి మీ భక్తిని బయటకు ప్రదర్శిస్తారు. ఆపకుండా పదేపదే అవి పునశ్చరణ చేయడంవల్ల మనస్సు నెమ్మదించే మాట నిజమే. అయితే అది అసలైన ప్రశాంతి కాదు. కేవలం మనసుని

మత్తులో పడేసి నిద్రబుచ్చడం. ఈ విధమైన మత్తుద్వారా వచ్చిన ప్రశాంత స్థితిలో అర్థించడం జరిగితే దానికి ప్రత్యుత్తరం కూడా వచ్చినట్లే అనిపిస్తుంది. అయితే యిది దేవుడు బదులు పలకడం కానే కాదు. మీ చిత్ర విచిత్రమైన వూహాకల్పనల్లో నుండి వచ్చినదే అది. మీరు అడిగిన ప్రశ్నకు యిదే సమాధానం. కాని యింత లోతుగా విచారించి చూడటం మీకు యిష్టం వుండదు. అందుకని ఒక ప్రశ్న వేసి వూరుకుంటారు. మీరు చేసే ప్రార్థన ఒక విన్నపం. ఏదో విధంగా మీ ప్రార్థనకు ప్రత్యుత్తరం సంపాదించాలని మీ తాపత్రయం. ఆ విధంగా మీ బాధలు తొలగి పోతాయని మీరనుకుంటారు. మీ హృదయాన్ని ఏదో ఒకటి రాచి రంపాన పెడ్తూ వుంటుంది. ప్రార్థనలు చేయడం ద్వారా మిమ్మల్ని మీరే నిశ్చలనంగా, మత్తుగా తయారు చేసుకో గలుగుతారు. ఇటువంటి కృత్రిమమైన ప్రశాంతిలో ఒక ప్రత్యుత్తరం వినబడుతుంది. అది తప్పకుండా మీకు తృప్తి కలిగించేదే అయ్యుంటుంది. లేకపోతే దాన్ని మీరే అవతలకు నెట్టిపారేసి వుండేవారు. ఈ ప్రార్థన మీకు తృప్తి కలిగించేది కాబట్టే దాన్ని మీరే తయారుచేసుకొని వుంటారు. మీరు స్వయంగా కల్పన చేసుకున్నదే మీకు సహాయపడుతున్నది. ఇది ఒక రకం ప్రార్థన. ఇంకొక రకం వున్నది, ప్రయత్న పూర్వకంగా మనసుని ప్రశాంతంగా, స్వీకార శీలంగా తెరచివుంచే వుద్దేశ్యంతో చేసే ప్రార్థన. సంప్రదాయం చేత, గతం అనే నేపథ్యంచేత నిబద్ధీకృతం కావించబడిన మనస్సు మూసుకొని పోయి కాకుండా తెరచుకొని ఎట్లా వుంటుంది? తెరచి వుంచడం అంటే అవగాహన శీలత్వం; అంటే ఆలోచనకు అందనివాటిని గ్రహించే శక్తి కలిగి వుండటం. బంధించి వేసి, నమ్మకం అనే రాటకు మనసును కట్టి పడేస్తే అప్పుడది తెరచుకొని వున్న మనసు కాదు. ఉద్దేశ్య పూర్వకంగా తెరచివుంచుతే అప్పుడు ఆ మనసు అందుకునే ప్రత్యుత్తరాలు కూడా ఆ మనసు స్వయంగా తయారు చేసుకున్నవే అయివుంటాయి. మనసును నిబద్ధీకరణం నుంచి తప్పించినప్పుడు మాత్రమే, ఒక్కొక్క సమస్యతల ఎత్తగానే దానితో తలపడటం ఎట్లాగో తెలిసినప్పుడు మాత్రమే- అప్పుడు మాత్రమే సమస్యలనేవే లేకుండా పోతాయి. వెనకటినే పథ్యం కొనసాగుతూ వున్నంతవరకు సమస్యలు తయారవుతూనే వుంటాయి. అది ఎడతెగకుండా కొనసాగాలి అనుకుంటే సంక్షోభమూ, బాధలూ ఎక్కువవుతూనే వుంటాయి. స్వీకారశీలత్వం అంటే మనసుని తెరచివుంచగలిగిన సామర్థ్యం. అంటే 'వున్నది' ని నిందించడంగాని, సమర్థించడంగాని లేకుండా స్వీకరించగలగడం. ఈ 'వున్నదీ' నుంచి పారిపోవాలనే మీరు ప్రార్థన ద్వారా ప్రయత్నిస్తుంటారు.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, VI వాల్యూమ్,*
*కొలంబో, 8 జనవరి 1950.*

**ప్రశ్న : అపరిమితమైన ఆవేదన, నైరాశ్యం నన్ను అలముకున్నప్పుడు, నా ప్రయత్నం ఏదీ లేకుండానే ఎవరో తెలియని ఆ పైవాడికి నన్ను నేను పూర్తిగా అర్పించుకుంటాను. ఆ విధంగా నాలో నిస్పృహ తొలగిపోతుంది. ఇదే లేకపోతే నేను సర్వనాశనమైపోయి వుండేవాడిని. ఈ సమర్పణ అనేది ఏమిటి, యిట్లా చేయడం తప్పా?**

కృష్ణమూర్తి : బుద్ధిపూర్వకంగా ఏదో తెలియని ఒకదానికి మనసు తన్ను తాను అర్పించుకోవడం సరియైన పద్ధతి కాదు. ఇది కూడా ప్రేమ, నమ్రత లేని మనిషి ప్రయత్నపూర్వకంగా ప్రేమని, నమ్రతని అలవరచుకోవడం లాంటిదే. నాలో హింస వున్నది, అహింసాత్మకంగా అవాలని నేను ప్రయత్నిస్తున్నంత మాత్రాన నాలో హింస లేకుండా పోదు. నేను వినయంగా ప్రవర్తిస్తూవుంటే నాలో నిజంగా నమ్రత వున్నట్లా? అట్లా ప్రవర్తించడాన్ని మర్యాద అంటాం. అది నమ్రతకాదు. ఇందులోని నిజం మీకు కనబడుతున్నదా? అబ్బ, చాలా తెలివైన మాటలు, ఎంతో చమత్కారంగా చెప్పారు. అని ప్రశంసించకండి. ఇందులో వున్నది చమత్కారం కాదు. ఉద్దేశ్య పూర్వకంగా తనని తానే మంచిగా వుండమని ప్రోత్సహించుకునే వ్యక్తి చేస్తున్నదీ, దేవుడు అని తను పేరుపెట్టుకున్న వాడికి, ఆ పైవాడికి తన్ను తాను సమర్పించుకునే వ్యక్తి చేస్తున్నదీ- బుద్ధి పూర్వకంగా; తమ యిచ్ఛానుసారం చేస్తున్న ఒక సంకల్పక్రియ. అటువంటి సమర్పణ సమర్పణ కాదు. అది తనను తాను మరచిపోవడం; మరొకర్ని తెచ్చి ఆ స్థానంలో కూర్చోబెట్టడం, భర్తీ చేయడం, ఒక విధమైన పలాయనం, తనని తానే సమ్మోహ పరచుకోవడం లాంటిది, మాదక ద్రవ్యాలు తీసుకోవడం లాంటిది, అర్థంలేని మంత్రాలను పునశ్చరణ చేయడం లాంటిది.

బుద్ధి పూర్వకంగా చేసేది కానటువంటి సమర్పణ కూడా ఒకటి వున్నది. అందులో అణుమాత్రం కూడా కోరుకోవడం, కావాలనుకోవడం వుండవు. మనసు ఒత్తిడి చేయడం వలన చేస్తే అది సమర్పణ కాదు. శాంతి కావాలనీ, నేను దేవుణ్ణి ప్రేమిస్తాను, దైవప్రేమే నా లక్ష్యం' అనీ మనసు అంటే అది ప్రేమ కానే కాదు. మనసు బుద్ధిపూర్వకంగా చేసే కార్యకలాపాలన్నీ మనసు ఎడతెగకుండా కొనసాగడానికి తోడ్పడుతుంటాయి. కొనసాగింపు వున్నదెప్పుడూ కాలంతో కలసివుంటుంది. కాలం అంతమైనప్పుడే సత్యమైనది వునికిలోకి రాగలుగుతుంది. మనసు సమర్పణ చేసుకోలేదు. మనసు చేయగలిగిందల్లా నిశ్చలంగా వుండటం. అయితే ఆశ వున్నా,

నిరాశ వున్నా నిశ్చలత్వం కలగదు. నిరాశ అనే ప్రక్రియని అర్థం చేసుకుంటే, మనసు కనుక అసలు నిరాశలో వున్న అంతరార్థాన్ని గ్రహిస్తే, అప్పుడు అందులోని నిజం తెలుస్తుంది. ఒకటి కావాలని మీరు కోరుకుంటున్నప్పుడు, అది పొందలేకపోతే నిరాశ తప్పకుండా కలుగుతుంది. కోరుకున్నది కారు అవచ్చు, స్త్రీ అవచ్చు, దేవుడవచ్చు. అన్నీ సమానమే, భేదమేమీ లేదు. ఏదయినా ఒకటి కావాలి అని మీరు కోరుకోగానే, అప్పుడే ఆ కోరడంలోనే నిరాశ ఆరంభం అవుతున్నది. నిరాశ అంటే భంగపాటు. మీరు కావాలనుకున్నది మీకు లభిస్తే తృప్తిపడతారు. కావాలనుకున్నది మీకు లభించలేదు కాబట్టే 'దేవుడికి నన్ను సమర్పించుకుంటాను' అని అంటారు. కోరుకున్నది దొరికివుంటే నిస్సందేహంగా సంతృప్తి పడివుండేవారు. అయితే త్వరలోనే ఆ తృప్తి తగ్గిపోతుంది. అప్పుడు మళ్ళీ యింకొకటి కావాలనుకోవడంలో మునిగిపోతారు. కాబట్టి తృప్తిచెందడానికి కావలసిన వస్తువును మాటిమాటికీ మార్చేస్తుంటారు. అందువల్ల దీనితోపాటుగా కలిగే ప్రతిఫలమూ, బాధలూ, వేదనలూ, సంతోషాలు తప్పవు.

ఏరకమయిన కోరికయినా సరే తనతో పాటుగా భంగపాటును, నిరాశను మోసుకొస్తుందనీ, ఆశనిరాశలనే ద్వంద్వాల మధ్య సంఘర్షణ దాని ఫలితమనీ మీరు అవగాహన చేసుకుంటే, అందులోని వాస్తవాన్ని మీరు గ్రహిస్తే- 'ఆ స్థితిని నేను ఎట్లా చేరుకుంటాను' అని వూరికే అడగడం కాకుండా, కోరిక వల్లనే బాధ కలుగుతున్నదని మీరు గ్రహించినప్పుడు- ఆ గ్రహింపే కోరిక నోరు మూయిస్తుంది. మనసు గోల చేస్తూ వుంటుందనే, మనసు నిరంతరంగా కదిలిపోతూ వుంటుందనే, నిరంతరమైన పోరాటం సాగిస్తూ వుంటుందనే ఎరుక కలిగితే, యిచ్ఛారహితంగా, స్వచ్ఛంగా, సరళంగా ఎరుక కలిగితే- అటువంటి ఆ ఎరుక మూలంగానే ఆ గోల అంతా మరోమాట లేకుండా ఆగిపోతుంది. ప్రధానమైన విషయం ఎరుకగా వుండటం. నిరాశను పోగొట్టుకోవడమూ కాదు, నిశ్శబ్దంగా వుండటమూ కాదు. స్వచ్ఛమైన తెలివి లేదా వివేకం అంటే ఎరుకగా వున్న మానసిక స్థితి; ఆ స్థితిలో యిష్టాయిష్టాలు వుండవు, ఆ స్థితిలో మనసు నిశ్శబ్దంగా వుంటుంది. అటువంటి నిశ్చలమైన స్థితిలో 'వుండటం' మాత్రమే వుంటుంది. అప్పుడు ఆ సత్యం, అంటే కాలరహితమైన ఆ అద్భుతమైన సృజనశీలత వునికిలోకి వస్తుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, VIII వాల్యూమ్,*
*బొంబాయి, 10, ఫిబ్రవరి 1954.*

ప్రశ్న : మీ అభిప్రాయంలో నిజమైన ధ్యానం అంటే ఏమిటి?

కృష్ణమూర్తి : ముందుగా, ధ్యానం చేయడంలో గల వుద్దేశ్యం ఏమిటి? అసలు ధ్యానం అంటే మనం అనుకుంటున్నది ఏమిటి? మీరు ధ్యానం చేస్తుంటారేమో నాకు తెలియదు. ఇప్పుడు మనందరం కలిసి ప్రయోగం చేసి చూద్దాం. నిజమైన ధ్యానం అంటే ఏమిటో కనిపెడదాం. ఈ విషయంలో నేను వ్యక్తంచేస్తున్న వాటిని వినడంకాకుండా, నిజమైన ధ్యానం అంటే ఏమిటి అన్నది మనందరం కలిసి కనుక్కుందాం. కలిసి అనుభవంలోకి తెచ్చుకుందాం. ధ్యానానికి చాలా ప్రాముఖ్యం వున్నది, వున్నది కదూ? నిజమైన ధ్యానం అంటే ఏమిటో మీకు తెలియకపోతే, స్వీయజ్ఞానం కూడా వుండదు. మీ గురించే మీకు తెలియకపోతే ధ్యానానికి అర్థంలేదు. ఎక్కడో ఒక మూలన కూర్చొని గాని, తోటలోనో, వీధిలోనో అటూ యిటూ పచార్లు చేస్తూ గాని ధ్యానంచేయడానికి ప్రయత్నించడంలో అర్థంలేదు. దానివల్ల ఒక విధమైన ఏకాగ్రత కలుగుతుంది. అంటే కొన్నింటిని బహిష్కరించడం. మీలో కొందరైనా యీ పద్ధతులన్నీ ప్రయత్నించే వుంటారు. అంటే, ఒక ప్రత్యేకమైన విషయం మీద కేంద్రీకరించే ప్రయత్నం చేయడం, మనసును నిర్బంధించడం, నిలకడ లేకుండా కొట్టుకుపోతున్న మనసును ఒకదానిమీద కేంద్రీకరింప జేయడం; అది సాధ్యం కానప్పుడు ప్రార్థనకు పూనుకుంటారు.

కనుక, సరియైన ధ్యానం అంటే ఏమిటి అనేది అవగాహన చేసుకోవాలనుకున్నప్పుడు మనం ధ్యానం అని అనుకుంటున్న అసత్యాలను గురించి కూడా తెలుసుకోవాలి. ఏకాగ్రత ధ్యానం కాదనడంలో సందేహం లేదు. ఎందుకంటే మీరు గమనించి చూస్తే, ఒకదానిపై ఏకాగ్రత నిలపడం అనే ప్రక్రియలో తక్కినవాటిని బహిష్కరించడం వుంటుంది. అంటే ధ్యాసను మళ్ళించడం వుంటుంది. ఒకదాని మీద ఏకాగ్రత నిలపాలని మీరు ప్రయత్నిస్తుంటారు, కాని మీ మనసు మరో దాని మీదకు షికారు వెళ్తూంటుంది. మనసు స్థిరంగా ఒకదాని మీద నిలబడటం, అది తిరస్కరించి మనసు ఎటో షికారు చేయడం అన్న రెండింటి మధ్యా సదా సమరం జరుగుతూ వుంటుంది. ఈ విధంగా సంవత్సరాల తరబడి ఏకాగ్రత సాధించడం కోసం, ఏకాగ్రత నేర్చుకోవడం కోసం ప్రయత్నిస్తూ వుంటాం. ఇదే ధ్యానం అనే తప్పుడు అభిప్రాయంలో వుంటాం.

ఇక, ప్రార్థన అనే సంగతి వుంది. ప్రార్థన ద్వారా కొన్ని ఫలితాలు పొందడం జరుగుతూ వుంది. లేని పక్షంలో లక్షలాదిమంది ప్రజలు ప్రార్థనలు చేయరు. ప్రార్థన

చేస్తున్నప్పుడు మనసు నెమ్మదించడం కూడా నిజమే. కొన్ని కొన్ని వాక్యాలు మళ్ళీ మళ్ళీ పునశ్చరణ చేస్తుండటం వల్ల మనసు నెమ్మదిస్తుంది. ఆ నెమ్మదిలో ఏదయినా తెలిసిరావచ్చు, కొంత గ్రహింపు, కొంత స్పందన అందుకోవడం జరుగుతుంది. అయితే యిదంతా కూడా మనసు చేసే యింద్ర జాలంలోనిదే. ఎందుకంటే సమ్మోహపరచుకొనే పద్ధతి ద్వారా మనసుని చాలా ప్రశాంతంగా చేసుకోవచ్చును. అటువంటి ప్రశాంతస్థితిలో అచేతన మానసంలో నుండీ, చేతన మానసానికి అవతల నుండీ ప్రచ్ఛన్నంగా వుండిపోయిన కొన్ని స్పందనలు బయటకు రావచ్చు. అయినా కూడా యీ స్థితి మనలో అవగాహన కలిగించే స్థితి మాత్రం కాదు.

సరే, ధ్యానం అంటే భక్తి కాదు- ఒక ఆలోచన మీదనో, ఒక బొమ్మ మీదో, ఒక ఆదర్శం మీదో భక్తి నిలపడం ధ్యానం కాదు- ఎందుకంటే మనసుకి సంబంధించినవన్నీ కూడా విగ్రహారాధన కిందికి వస్తాయి. ఒక ప్రతిమను పూజించడం మాత్రమే విగ్రహారాధన అనీ, వెర్రితనమనీ, మూఢవిశ్వాసమనీ మీరు అనుకోవచ్చు. కాని చాలామంది మనసులో పుట్టిన వాటిని కూడా పూజిస్తూ వుంటారు. ఇది కూడా విగ్రహారాధనే. ఒక బొమ్మకు కాని, ఒక ఆలోచనకు కాని, ఒక పరమగురువుకు కాని భక్తి చూపడం ధ్యానం కాదు. అది నిస్సందేహంగా తననుంచి పారిపోవడానికి ఒక మార్గం. ఈ పారిపోవడం చాలా సుఖంగా వుంటుంది. అయినా కూడా అది పలాయనమే.

సత్పురుషులుగా మారాలనే యీ నిరంతర ప్రయాస, క్రమశిక్షణ ద్వారా, తనని తాను జాగ్రత్తగా పరీక్షించుకుంటూ వుండటం ద్వారా సద్గుణాలు సంపాదించాలను కోవడం- యివన్నీ కూడా ధ్యానం కాదు అని గట్టిగా చెప్పచ్చు. మనలో చాలామంది యీ ప్రక్రియల్లో చిక్కుకొని పోతారు. ఇవి మనల్ని గురించిన అవగాహనను మనకి కలిగించవు కాబట్టి సవ్యమైన ధ్యానానికి యివి మార్గాలు కావు. అసలు మిమ్మల్ని మీరు అర్థంచేసుకోకపోతే సవ్యంగా ఆలోచించడానికి మీకు ఆధారం ఎక్కడుంటుంది? స్వీయ అవగాహన లేనప్పుడు మీరు చేయగలిగిందల్లా ఏమిటంటే మీ వెనకాల వున్న నేపథ్యానికి, మీ నిబద్ధీకరణం కలిగించే స్పందనలకు లొంగిపోయి వుండిపోతారు. నిబద్ధీకరణాన్ని బట్టి ప్రతిస్పందించడం ధ్యానం కాదు. అయితే యీ ప్రతిస్పందనలను గురించి ఎరుకగా వుండటంవల్ల, అంటే ఏ దూషణ భావమూ లేకుండా ఆలోచనల, మనోభావాల రాకపోకల ఎడల ఎరుకగా వుండటం వల్ల 'నేను' యొక్క తీరుతెన్నులు సంపూర్ణంగా అవగాహన అవుతాయి. అదే సవ్యమైన ధ్యానం చేసే మార్గం.

ధ్యానం అంటే జీవితాన్ని వదిలేసి దూరంగా తొలగిపోవడం కాదు. ధ్యానం అంటే తనని తాను అవగాహన చేసుకొనే ఒక ప్రక్రియ. మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడం ఆరంభించినప్పుడు చేతనావర్తంలో వున్నదానినే కాకుండా, మీ లోపల ప్రచ్ఛన్నంగా వున్న అన్ని అంశాలనూ కూడా అవగాహన చేసుకుంటారు, అప్పుడు ప్రశాంతస్థితి కలుగుతుంది. ధ్యానం ద్వారా, నిర్బంధాల ద్వారా, లొంగదీసుకోవడం ద్వారా మనసుని నెమ్మది పరుస్తే, అది నిశ్చలస్థితి కాదు. అది నిలవవుండి పోయి, కుళ్ళిన మనసు. అప్రమత్తతా, సహనమూ వుండి, సృజనాత్మకమైన స్వీకారశీలతను సంతరించుకునే మనసు కాదు. మన స్వీయ అస్తిత్వపు స్థితిగతులను, ప్రచ్ఛన్నంగా లోపల వున్న వాటినీ, వుపరితలంలో వున్న వాటినీ కూడా తేటతెల్లం చేసే ప్రతి మాట ఎడల, ప్రతి ఆలోచన, ప్రతి మనోభావం ఎడల నిరంతరమైన జాగరూకత, నిరంతరమైన ఎరుక ధ్యానానికి అవశ్యం వుండితీరాలి. ఇది మహా కఠినతరమైనది కాబట్టి, మనకు హాయిగా, సౌకర్యంగా వుండే కపటమైన వాటిల్లోకి పారిపోయి, అదే ధ్యానం అని అనుకుంటాము.

ధ్యానానికి ఆరంభం స్వీయజ్ఞానమే అని కనుక మీరు గ్రహిస్తే, యీ సమస్య మహా ఆసక్తికరంగానూ, అత్యంత ప్రధానమైనదిగానూ అవుతుంది. ఎందుకంటే స్వీయజ్ఞానం కనుక లేకపోతే, ఒక ప్రక్కన ధ్యానం అని మీరు అనుకుంటున్నది చేస్తూనూ వుండచ్చు, మరో పక్కన మీ ఆదర్శసూత్రాల మీద, మీ కుటుంబంమీద, మీ ఆస్తిపాస్తులమీద మమకారబంధం పెంచుకోనూవచ్చు. ఒకవేళ ఆస్తిపాస్తులను వదులుకున్నా ఏదో ఒక సిద్ధాంతం మీద మమకారం పెంచుకుంటారు. ఆ సిద్ధాంతం మీదే బాగా కేంద్రీకరించి, దాన్ని యింకా, యింకా వృద్ధి చేసుకుంటారు. ఇది ధ్యానం కాదని నిస్సంశయంగా చెప్తున్నాను. కనుక, స్వీయజ్ఞానం ధ్యానానికి ఆరంభం. స్వీయజ్ఞానం లేకుండా ధ్యానం వుండదు. స్వీయజ్ఞానం అనే అంశాన్ని బాగా లోలోపలకు తరచి చూసిన కొద్దీ, పైపైన వున్న మనసు ప్రశాంతంగా, నెమ్మదిగా అవడమే కాకుండా, ప్రచ్ఛన్న మానసంలో పొరలుపొరలుగా దాగి వున్నవన్నీ వెల్లడవుతాయి. ఉపరితల మానసం నెమ్మళించగానే, అచేతన మానసం అంటే చేతనావర్తంలో దాగివున్న పొరలు పైకి ప్రదర్శితమవుతాయి. వాటిలో వున్న విషయం బయటకు వస్తుంది. వాటిని గురించిన సూచనలను అవి అందిస్తాయి. ఆ విధంగా మీ అస్తిత్వం అనే మొత్తం ప్రక్రియ అంతా పూర్తిగా అవగతమవుతుంది.

ఆవిధంగా మనసు అమోఘమైన ప్రశాంతిని పొందుతుంది- నెమ్మళిస్తుంది. నెమ్మదిగా చేయబడటం కాదు; భయపెట్టిగాని, ప్రతిఫలం చూపి కాని నెమ్మదిగా

వుండమని నిర్బంధించబడటం కాదు. ఇటువంటి నిశ్శబ్దంలో సత్యం వునికిలోకి వస్తుంది. అయితే యీ నిశ్శబ్దం క్రైస్తవ నిశ్శబ్దంకాని, హిందూ నిశ్శబ్దంకాని, బౌద్ధనిశ్శబ్దం కాని కాదు. ఈ నిశ్శబ్దం వట్టి నిశ్శబ్దం. దానికి పేరు లేదు. కాబట్టి క్రైస్తవ నిశ్శబ్దం లేదా హిందూ లేదా బౌద్ధనిశ్శబ్దం అనే మార్గం అనుసరిస్తే మాత్రం నిశ్శబ్దాన్ని మీరు ఎప్పటికీ పొందలేరు. అందువల్ల సత్యాన్ని కనుగొనబోయే వ్యక్తి తన నిబద్ధీకరణాన్ని పూర్తిగా వదిలేసుకోవాలి- అది క్రైస్తవ, హిందూ, బౌద్ధ మరే యితర సమాజాలకి చెందినదైనా సరే. ధ్యానం ద్వారా, లొంగిపోయి. అనుగుణంగా వుండటం ద్వారా మన నేపథ్యాన్ని యింకా బలపరచుకుంటే, దాని వల్ల మనసు మురిగిపోతుంది. జడంగా తయారవుతుంది. అయితే ఎక్కువమంది కోరుకునేది యిది కాదు అని నేను గట్టిగా చెప్పలేను. ఎందుకంటే ఒక వరవడి ఏర్పరచుకొని, దాని ప్రకారం వెళ్ళిపోవడం ఎంతో సులువైన పని. కాని నేపథ్యం నుండి విముక్తి పొంది స్వేచ్ఛగా వుండాలంటే సంబంధ బాంధవ్యాలలో అనుక్షణం జాగరూకత అత్యంత అవసరం.

ఒక్కసారి నిశ్శబ్దం వునికిలోకి వచ్చిందంటే అప్పుడొక అద్భుతమైన, సృజనశీలక స్థితి కలుగుతుంది - అంటే అర్థం మీరు కవిత్వం రాస్తారని కాదు, చిత్రాలు గీస్తారనీ కాదు. చేయచ్చు, చేయక పోవచ్చు కూడా. ఈ నిశ్శబ్దాన్ని మీరు వెతికి పట్టుకోలేరు, నటించలేరు, అనుకరించలేరు- అసలు అప్పుడది నిశ్శబ్దం అవదు. ఏ మార్గం ద్వారానూ దీన్ని చేరుకోలేరు. 'నేను' తీరుతెన్నులు అవగాహన చేసుకున్నప్పుడే, 'నేను' తన కార్యకలాపాలతో, తన హానికరమైన చేష్టలతో పాటుగా అంతరించి పోయినప్పుడే నిశ్శబ్దం వునికిలోకి వస్తుంది. అంటే, మనసు సృష్టిచేయడం ఆపివేసినప్పుడే సృజనశీలత కలుగుతుంది. కాబట్టి మనసు సరళంగా అవాలి, నెమ్మది చెందాలి, నెమ్మది చెంది తీరాలి- ఇక్కడ 'చెంది తీరాలి' అన్నది తప్పు. మనసు నెమ్మదిగా అయితీరాలి అని అన్నప్పుడు నిర్బంధం చేయడం అన్న అర్థం వస్తుంది. 'నేను' అనే మొత్తం ప్రక్రియ అంతా అంతమై పోయినప్పుడే మనసు నెమ్మదిగా వుంటుంది.'నేను' తీరుతెన్నులు అన్నీ అవగాహన చేసుకోవడం వల్ల 'నేను' కార్యకలాపాలన్నీ అంతమైపోతాయి. అప్పుడు మాత్రమే నిశ్శబ్దం వునికిలోకి వస్తుంది. ఆ నిశ్శబ్దమే నిజమైన ధ్యానం. ఆ నిశ్శబ్దంలో శాశ్వతమైనది వునికిలోకి వస్తుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, V వాల్యూమ్,*
*లండన్, 23 అక్టోబర్, 1949.*

**ప్రశ్న : నాకు తెలిసినంతలో, ఆధ్యాత్మిక విషయాలను బోధించే తక్కిన ఆచార్యులలాగా కాకుండా, అంతర్గతమైన శాంతిని అందుకోవడానికి ధ్యానమార్గాన్ని నిర్దేశించని వారు మీరొక్కరే. అంతర్గతమైన శాంతి అవసరం అని అందరం ఒప్పుకుంటాం. కాని, ఏదో ఒక ప్రత్యేక పద్ధతిని- తూర్పుదేశాల యోగాభ్యాసమో, పాశ్చాత్యుల మనోతత్వ శాస్త్రమో సాధన చేయకుండా దానిని ఎట్లా అందుకో గలుగుతాం?**

కృష్ణమూర్తి : ఈ ఆచార్యులూ, ఆధ్యాత్మిక గురువులూ, శిష్యులూ యిదంతా పరమ దండగ కాదూ? ఒక గురువును ఆశ్రయించి శిష్యరికం మొదలుపెట్టగానే, కనుగొనడానికి, దర్శించుకోవడానికి మీకు తప్పక అవసరమైన, అనుక్షణమూ వెలుగుతూ వుండవలసిన, మీ లోపల వుండే ఆ జ్వాలను హతమార్చుకోవడం లేదూ? సహాయం కోసం అర్థిస్తూ ఒక గురువును ఆశ్రయించినప్పుడు, మీరుఅన్వేషిస్తున్న సత్యం కంటె ఆ గురువే ఎక్కువ ముఖ్యుడవటం లేదూ? కాబట్టి యీ గురుశిష్యుల పద్ధతినంతా వదిలేసేద్దాం. అసలు యీ పద్ధతిని మన రక్తంలో నుంచే తొలగించేసుకుని, అప్పుడు అసలు సమస్యను పరికిద్దాం. ఎందుకంటే దీని ప్రభావం మనలో ప్రతి ఒక్కరి మీదా వున్నది. సత్యం కనుగొనడానికి ఏ గురువూ సహాయం చేయలేడు. అందులో సందేహం లేదు. అది మన లోపలే వుంది. మనమే అది తెలుసుకోవాలి. అందుకోసంగాను కష్టాలు పడాలి; బాధ, శోధన తప్పవు. ప్రతివారూ తమంత తామే అన్వేషించుకోవాలి, అవగాహన చేసుకోవాలి. అంతేతప్ప, ఎవరో ఒక గురువును పట్టుకొని, ఆయన శిష్యరికం చేయడంవల్ల మీరు స్తబ్ధతనూ, సోమరితనాన్ని అలవరచుకోవడం లేదూ? మనసు మూసుకొనిపోయి చీకటిగా అవడం లేదూ? అంతేకాకుండా అనేక రకాల వారైనయీ గురువులూ, రకరకాలైన వారి విధానాలూ అన్నీ పరస్పర విరుద్ధంగా వుంటాయి; వారిలో వారికి పోటీలు, ప్రచారం చేసుకోవడాలు- ఆ తతంగమంతా మీ అందరికీ తెలుసు.

కాబట్టి, యీ శిష్యబృందాలు, గురువులు అనే యీ పద్ధతి అంతా వట్టి హాస్యాస్పదమూ, అవివేకమూ. అయితే యిందులో వున్న ముఖ్యమైన సంగతి యిదీ: శాంతిని అందుకోవడానికి ఒక ప్రాచ్యపద్ధతిగాని లేదా ఒక పాశ్చాత్య పద్ధతి గాని, అసలు ఏదో ఒక పద్ధతి అంటూ వుంటుందా? ఒకవేళ ఏదో ఒక పద్ధతిని సాధన చేయడం ద్వారా శాంతిని అందుకుంటే, మీరు అందుకున్నదానిలో, మీరు శాంతి అని అనుకుంటున్న దానిలో సజీవగుణం వుండదు. అది ప్రాణరహితంగా వుంటుంది. శాంతి అంటే యిట్లా వుండాలి అనే ఒక సూత్రీకరణ మీవద్ద వుంటుంది. దాని వైపుగా

వెళ్ళడానికిగాను మీరే ఒక మార్గాన్ని వేసుకొని బయలుదేరుతారు. అటువంటి శాంతి మీ లోపల వున్న కోరికకు మీరు యిచ్చుకున్న రూపమే, అవునా కాదా? అందువల్ల అది అసలైన శాంతి కాదు. అది మీకు కావాలని మీరు కోరుకున్నదీ, మీరు ఏమిటో దానికి సరిగ్గా విరుద్ధమైనదీను. నేను సంఘర్షణల్లో, దారుణమైన బాధల్లో, వైరుధ్యాలలో చిక్కుకొని పోయివున్నాను. దౌర్భాగ్యస్థితిలో వున్నాను, నాలో హింస వుంది. ఏ గొడవలూ నాలో అలజడి కలిగించని ఒక ఆశ్రయం, ఒక స్థితి నాకు కావాలి. అందుకోసం నేను నానారకాల గురువుల వద్దకూ, ఆచార్యుల వద్దకూ వెళ్తుంటాను. పుస్తకాలు చదువుతాను, నేను కోరినవి నాకు తప్పకుండా లభిస్తాయని భరోసా యిచ్చే క్రమశిక్షణలు పాటిస్తాను. శాంతిని పొందడానికి నన్ను అణచివేసుకుంటాను, నిగ్రహం అవలంబిస్తాను, లొంగిపోయివుంటాను. అదేనా శాంతి అంటే? శాంతి కావాలంటూ దాని వెనకాల పరిగెత్తితే చిక్కేదికాదు శాంతి– అది కలుగుతుంది, అంతే. అదే గమ్యం కాదు, దారిలో అదీ లభిస్తుంది. నేను – నా అనే మొత్తం ప్రక్రియనూ, నాలోని వైరుధ్యాలను, నా కోరికలను, ఆకాంక్షలను, నా గర్వాన్ని అవగాహన చేసుకోవడం నేను ఆరంభించినప్పుడు అది కలుగుతుంది. అయితే శాంతే నా గమ్యం అని కనుక నేను అనుకుంటే అప్పుడు కదలికలేకుండా మురిగిపోయిన స్థితిలో నేను జీవిస్తుంటాను. శాంతి అంటే అదేనా?

కాబట్టి, ఏదో ఒక విధానం ద్వారానో, ఒక పద్ధతో లేదా ఒక సూత్రబద్ధమైన మార్గం ద్వారానో శాంతిని సంపాదించాలనుకుంటుంటే, ఆ విధంగా శాంతిని సాధించవచ్చు, అయితే ఆ శాంతి లొంగుబాటులో వుండే శాంతి, మరణంలో వుండే శాంతి. కాని మనలో చాలామందికి కావలసినది అదే. తళుక్కుమనే ఒక ప్రకాశం ఏదో చూస్తాను, మాటల్లో పెట్టలేని అనుభవం అది, ఆ స్థితిలోనే ఎప్పటికీ వుండిపోవాలని కోరుకుంటాను, అదే కొనసాగుతూ వుండాలని కోరుకుంటాను. నిర్ద్వంద్వమైన పరమ సత్యం నాకు కావాలి. నిర్ద్వంద్వమైన పరమ సత్యం అనేది ఒకటి వుంటే వుండవచ్చు గాక, మహోన్నతమైన గొప్ప అనుభవాలు వుంటే వుండవచ్చుగాక, కాని నేను ఏదో ఒక దాన్ని గట్టిగా పట్టుకొని వేళ్ళాడుతూ వుంటే మృత్యువును ఆహ్వానిస్తున్నట్లే కాదూ? శాంతి మరణంలో లేదు. కాబట్టి యీ విధమైన గందరగోళపు స్థితిలో, సంఘర్షణలో వున్నప్పుడు అసలు శాంతి అంటే ఏమిటి అనేది నేను వూహించను కూడా లేను. నేను వూహించగలిగిందల్లా దానికి వ్యతిరేకమైన దానిని, అంతే. ఇప్పుడు నేను వున్న దానికి వ్యతిరేకమైనది శాంతి కానే కాదు. అందువల్ల యీ పద్ధతులన్నీ కూడా యిప్పుడు నేనున్న దానికి వ్యతిరేకమైన దానిని పొందడానికి

మాత్రమే నాకు తోడ్పడుతాయి. నేను ఏమిటో అవగాహన చేసుకోకుండా– దానిలోకి పూర్తిగా వెళ్ళకుండా, అంటే ఒక్క సచేతనమైన పొరల్లోకే కాకుండా, అచేతనంగా వున్న పొరల్లోకి కూడా వెళ్ళకుండా, నేను– నా అనే మొత్తం ప్రక్రియను అవగాహన చేసుకోకుండా, కేవలం శాంతికోసం వెతుక్కోవడంలో ఏమాత్రం ప్రయోజనం లేదు.

చూడండి, మనలో చాలామందికి సోమరితనం అలవాటు, స్తబ్దంగా జీవిస్తుంటాం. మనకి సహాయం చేయడానికి గురువులూ, ఆశ్రమాలూ కావాలి. నిరంతరమైన మన ఎరుక శీలత్వం ద్వారా, మన శోధన ద్వారా, మన స్వంత అనుభవాల ద్వారా, అవి ఎంత స్పష్టంగా ఎంత సూక్ష్మంగా, ఎంత అందీ అందకుండా జారిపోతూ వున్నా సరే, వాటి ద్వారానే, మనంతట మనమే కనిపెట్టాలని అనుకోము. అందుకనే చర్చిలలో, సంఘాలలో చేరతాం. ఏదో ఒకదానిలో చేరి, అనుయాయూలం అవుతాం. అంటే అర్థం, ఒక పక్కన పోరాటమూ వుంటుంది, మరో పక్కన స్తబ్దతను అలవరచుకోవడమూ వుంటుంది. అయితే ఎవరయినా నిజంగా కనుగొనాలని కోరుకుంటుంటే, ప్రత్యక్షంగా అనుభవం పొందాలని కోరుకుంటుంటే– యిటువంటి యీ అనుభవం ఏమిటి అనేది మనం యింకోసారి చర్చించుకుందాం– అప్పుడు యిటువంటివన్నీ పక్కన పెట్టి, అసలు మనల్ని మనమే అవగాహన చేసుకోవడం తప్పనిసరిగా జరగాలి. వివేకానికి స్వీయజ్ఞానమే ఆరంభం. దీని ద్వారా మాత్రమే శాంతిని పొందగలుగుతాం.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, VII వాల్యూమ్,*
*ఒహాయి, ఆగష్టు, 1952.*

ప్రశ్న: ఆలోచనలు అంతులేకుండా అట్లా ఎప్పటికీ సాగిపోతూ ఉంటాయి కదా, అటువంటప్పుడు వాటిని ఆపడం అసాధ్యమయ్యేదేనా?

కృష్ణమూర్తి: 'నాకు తెలియదు' అని కనుక నేను అంటే అప్పుడు మీరేం చేస్తారు? నిజంగానే నాకు తెలియదు. సర్! ఇక్కడ చెప్తున్న విషయాన్ని శ్రద్ధగా వినండి. ఎన్నో రకాలైన ప్రయత్నాలు జరిగాయి– ఆశ్రమాల్లో చేరడం; ఒక బొమ్మతోనో, ఒక సిద్ధాంతంతోనో, ఒక వ్యూహప్రతిపాదనతోనో మనల్ని మనం తాదాత్మ్యం చేసుకోవడం; క్రమశిక్షణ ద్వారా, ధ్యానం ద్వారా, నిర్బంధించీ, అణచివేసీ ఆలోచనలను అంతంచేయడానికి ప్రయత్నించడం– మనిషి తనకు సాధ్యమైన పద్ధతులన్నీ ప్రయత్నంచేసి చూశాడు. శత సహస్రాలైన పద్ధతుల్లో తనను తాను చిత్రహింస చేసుకున్నాడు,

ఎందుకంటే ఆలోచించడం అంటేనే దుఃఖాన్ని కొనితెచ్చుకోవడం అని గ్రహించాడు కాబట్టి. అయితే అసలు యిది ఎట్లా సాధించగలం? ఇందులో అనేకమైన విషయాలు కలిసిపోయి వున్నాయి. ఆలోచనల్ని ఆపివేయాలని మీరు ప్రయత్నించిన మరుక్షణంలోనే అది ఒక సమస్య అయి కూర్చుంటుంది. ఒక పరస్పర వైరుధ్యంగా తయారవుతుంది. ఆలోచనను అపుచేయాలని మీరు చూడటం, అదేమో యింకా యింకా సాగుతూ వుండటం. ఈ పరస్పర వైరుధ్యమే సంఘర్షణను పెంచి పోషిస్తుంది. వైరుధ్యాలన్నీ కూడా సంఘర్షణలకు ఆటపట్టులు. కాబట్టి మీరు చేసింది ఏమిటి? ఆలోచనలను మీరు అపలేక పోయారు. పైగా మరో కొత్త సమస్యను పట్టుకొచ్చారు. అదే సంఘర్షణ. ఆలోచనలను ఆపాలని ఏ ప్రయత్నం చేసినా దానివల్ల ఆలోచనకి మరికొంత మేత దొరికి, యింకాస్త బలం పుంజుకుంటుంది. మీరు ఆలోచించి తీరాలి, తప్పదు అని మీకు తెలుసు. స్పష్టంగా, దోషరహితంగా, స్థిరచిత్తంతో, హేతుబద్ధంగా, తార్కికంగా ఆలోచించడానికి మీ వద్ద వున శక్తిలో ప్రతిబొట్టూ వుపయోగించవలసి వస్తుంది. అయితే ఆరోగ్యకరమైన, హేతుబద్ధమైన, తార్కికమైన ఆలోచనలు ఆలోచించడాన్ని అపలేవనే సంగతి కూడా మీకు తెలుసు.

ఇప్పుడిక మీరు ఏం చేయాలి? ఆలోచించడం ఆపి తీరాలి అనే ఒక సూత్రం తయారు చేసుకొని, అది సాధించడానికి అణచి వేసుకోవడం, క్రమ శిక్షణలో పెట్టుకోవడం, లోపలకు త్రొక్కి వేసుకోవడం, నిరోధించడం, లొంగిపోయి వుండటం వంటి ఏ పద్ధతిని అవలంబించినా అది దండగే అని మీకు తెలుసు. అవన్నీ త్రోసి పారేశెయ్యండి. ఆ పని చేశారా? త్రోసివేసేశాక అప్పుడిక ఏం చేస్తారు? బొత్తిగా ఏమీ చేయరు! మొదట్లో యిదంతా ఆపివేయాలని ఒక ఆలోచన చేశారు. అది ఒక భావన. దాని వెనకాల ఒక వుద్దేశ్యం వుంది. అదంతా ఆపివేయాలని అసలు మీరు ఎందుకు అనుకున్నారంటే ఆలోచన ద్వారా ఏ సమస్యా పరిష్కరించలేక పోయారు కాబట్టి. అందువల్ల మనస్సు– మనస్సులోని ఏదో ఒక భాగం కాదు, ఒక ప్రత్యేకమైన చిన్న ముక్క కాదు, మొత్తం మనసు సంపూర్ణంగా– నాడీమండలం, మెదడు, మనోభావాలు, అన్నీ–వీటన్నింటినీ కలుపుకొని వుండే ఆ మనస్సు యీ విషయంలో ఏమీ చేయలేనని గ్రహించగలుగుతుందా; అది తెలుసుకున్నాక కూడా అట్లాగే సాగిపోతుందా? అట్లా సాగిపోదని మీరే కనిపెడతారు.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, XVI వాల్యూమ్, సానెన్, 19 జూలై, 1966.*

ప్రశ్న: మీరు చెప్తున్న యీ స్వీయజ్ఞానం అంటే ఏమిటి? నేను అది ఎట్లా సంపాదించగలుగుతాను? దీనికి ఆరంభం ఎక్కడ? ఎట్లా?

కృష్ణమూర్తి: సరే, దయచేసి శ్రద్ధగా వినండి. స్వీయ జ్ఞానాన్ని గురించి మీకేవేవో విపరీతమైన వూహాలు వున్నాయి– స్వీయజ్ఞానాన్ని సంపాదించడానికి రోజూ సాధన చేయాలనీ, ధ్యానం చేయాలనీ, యింకా రకరకాలవేవో చేయాలనీ మీరు అనుకుంటూ వుంటారు. కాని సర్! యిది చాలా సులువుగా చేయచ్చు. స్వీయజ్ఞానానికి మొదటిమెట్టే ఆఖరిమెట్టు కూడా; ఆరంభమే ముగింపు. ఆ మొదటి సోపానమే ఎంతో ముఖ్యమైనది. ఎందుకంటే స్వీయజ్ఞానం మరొకరి ద్వారా నేర్చుకొనేది కాదు. ఎవరో వచ్చి మీకు మీ స్వీయజ్ఞానం బోధించలేరు. మీకు మీరుగా తెలుసుకోవాలి. మీ అంతట మీరే స్వంతంగా కనుక్కోవాలి. అయితే యీ కనిపెట్టినది బ్రహ్మాండంగానూ, అత్యద్భుతంగానూ వుండదు. చాలా సరళసామాన్యంగా వుంటుంది. నిజంగా చూస్తే, మిమ్మల్ని మీరు తెలుసుకోవడం అంటే, మీ ప్రవర్తన తీరును, మీ మాటలను, దైనందిన జీవితంలోని మీ బాంధవ్యాలలో ఎట్లా వుంటారు అనేవాటిని జాగ్రత్తగా గమనించడం, అంతే. దాంతో ఆరంభించండి. అప్పుడు యీ ఎరుకతో వుండటం– అంటే– మీరు ఏవిధంగా ప్రవర్తిస్తున్నారు, నౌకరుతో మాట్లాడేటప్పుడు, పై అధికారితో మాట్లాడేటప్పుడు ఏయే మాటలు వుపయోగిస్తుంటారు, మనుష్యుల ఎడల, రకరకాల భావాల ఎడల, యితర విషయాల ఎడల మీరు ఎటువంటి వైఖరి ప్రదర్శిస్తారు అన్నవి జాగ్రత్తగా గమనించడం; యిదంతా– ఎంత మహా కఠినంగా వుంటుందో తెలుసుకుంటారు. మీ ఆలోచనలను, మీ వుద్దేశ్యాలను, సంబంధ బాంధవ్యాలనే అద్దంలో ఒకసారి గమనించండి; గమనిస్తున్న క్షణంలోనే, 'ఇది మంచిదే, అది మంచిది కాదు, నేను యిది చేయాలి, అది చేయకూడదు' అనుకుంటూ సరిదిద్దుకోవాలని చూస్తారు. బాంధవ్యాలు అనే అద్దంలో మిమ్మల్ని మీరు పరికించుకుంటున్నప్పుడు ఖండించేదో, సమర్థించేదో అయిన దృష్టి మీలో వుంటుంది. అందువల్ల మీరు చూస్తున్నదానిని వక్రీకరిస్తారు. అట్లాకాకుండా, ఆ అద్దంలో చూస్తూ, యితరుల ఎడల, సిద్ధాంతాల ఎడల, విషయాల ఎడల మీ వైఖరి ఎట్లా వున్నది అనేదాన్ని వూరికే గమనిస్తూ, తప్పొప్పుల నిర్ణయం చేయకుండా, ఖండించకుండా, ఆమోదించకుండా కేవలం యదార్థాన్ని మాత్రం చూడండి. అప్పుడు ఆ గ్రహింపులోనే దానివల్ల జరిగే చర్య కూడా వున్నదని తెలుసుకుంటారు. స్వీయజ్ఞానానికి యిదే ఆరంభం.

మిమ్మల్ని మీరే జాగ్రత్తగా గమనించుకుంటూ వుండటం, మీరు చేస్తున్నదానిని, మీరు ఆలోచిస్తున్నదానిని, మీ లోపలి వుద్దేశ్యాలు ఏమిటి, మీకు ప్రేరణ కలిగించే ఆకర్షణలు ఏవి అని పరిశీలిస్తూ వుండటం; పైగా చూడటంలో ఖండనగాని, సమర్థనగాని లేకుండా వుండటం మహా కఠినమైన పని. ఎందుకంటే మొత్తం మీ నాగరికత అంతా ఖండించడం, తప్పొప్పులు నిర్ణయించడం, విలువలు బేరీజువేయడం అనేవాటి మీద ఆధారపడి వున్నది. "ఇది చేయాలి, యిది చేయకూడదు" అని నేర్పిస్తూ మిమ్మల్ని పెంచడం జరిగింది. బాంధవ్యం అనే అద్దంలో కనబడుతున్న దానిని, ఆ వున్నదానికి విరుద్ధమైనది తయారుచేయకుండా చూడగలిగినప్పుడు, స్వీయజ్ఞానానికి ఒక ముగింపు అంటూ లేదని అప్పుడు మీరే గ్రహిస్తారు.

చూడండి, స్వీయజ్ఞానం కోసం చేసే శోధన మొదటగా ఒక బాహిరమైన కదలిక; ఆ తరువాత అది అంతర్ముఖంగా మళ్ళుతుంది. ముందుగా నక్షత్రాల దిక్కుగా చూస్తాం. ఆపైన మన లోపలకు మనం చూసుకుంటాం. అదే విధంగా, యదార్థమైన దానికోసం, దేవుడికోసం, భద్రతకోసం, సంతోషం కోసం ముందుగా యీ దృశ్య ప్రపంచంలో వెతుకుతాం. అక్కడ కనబడనప్పుడు అంతర్ముఖంగా మళ్ళుతాం. స్వీయజ్ఞానం వలన లోపలవున్న దేవుడి కోసమో, పరబ్రహ్మం కోసమో లేదూ ఏదో మీరు పెట్టుకున్న పేరు కోసమో సాగించే అన్వేషణ ఆగిపోతుంది. మనసు అప్పుడు చాలా నెమ్మదిగా అవుతుంది. అది క్రమశిక్షణ వల్ల కాకుండా కేవలం అవగాహన ద్వారా, జాగరూకతతో గమనించడం ద్వారా, మనసు తనని గురించి తాను ప్రతి క్షణమూ నిరపేక్షకమైన ఎరుకతో వుండటం ద్వారా మాత్రమే యిది జరుగుతుంది. "నేను ప్రతి క్షణమూ ఎరుకతో వుండితీరాలి" అని అనకండి. ఎందుకంటే, ఒక గమ్యం చేరాలనీ, ఒక ప్రత్యేకమైన స్థితిని అందుకోవాలనీ మనం కోరుకుంటుంటే అది మన మూర్ఖత్వానికి మరొక ప్రత్యక్ష నిదర్శనం అవుతుంది. ముఖ్యమైనది ఏమిటంటే మీ గురించి మీరు ఎరుకగా వుండటం. అదంతా పోగుచేసి నిలవవుంచు కోవడం కాకుండా ఎరుకగా వుంటూనే వుండటం. ఎందుకంటే నిలవచేసుకోవడం ఆరంభించగానే ఆ ఏర్పడిన కేంద్రంలో నుండి విమర్శించడం మొదలవుతుంది. స్వీయజ్ఞానం అంటే పోగుచేసుకొని నిలవవుంచుకునే ప్రక్రియ కాదు. సంబంధబాంధవ్యాలలో ప్రతి క్షణమూ 'కనిపెట్టడం' అనే ఒక ప్రక్రియ.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, VIII వాల్యూమ్,*
*బొంబాయి. 20 ఫిబ్రవరి 1955.*

ప్రశ్న : మీ దృష్టిలో ఎరుక అంటే ఏమిటో దయచేసి వివరంగా చెప్తారా?

కృష్ణమూర్తి : కేవలం స్పృహగా వుండటం, అంతే. మీరు తప్పొప్పులు నిర్ణయం చేస్తూ వుండటం గురించీ, మీలో వుండే అపోహల గురించీ, మీ యిష్టాలను గురించీ, అయిష్టాలను గురించీ ఎరిగివుండటమే ఎరుక. ఏదయినా ఒక విషయాన్ని మీరు చూస్తుంటే, ఆ చూడటం మీద మీ పోల్చిచూడటం, ఖండించడం, తప్పొప్పులు తీర్మానించడం, విలువలు కట్టడం అనే వాటి ప్రభావం వుంటుంది. వీటన్నింటి పర్యవసానమే మీరు చూడటం. కాదంటారా? మీరు ఏదయినా చదువుతున్నప్పుడు, చదువుతూ వుండగానే తప్పొప్పులు నిర్ణయిస్తూ, విమర్శిస్తూ, ఖండిస్తూ, ఆమోదిస్తూ వుంటారు. ఎరుకగా వుండటం అంటే ఆ జరుగుతున్న క్షణంలోనే యీ తప్పొప్పుల నిర్ణయం, విలువలు బేరీజు వేయడం, అభిప్రాయాలు ఏర్పరచుకోవడం, సంప్రదాయ బద్ధత, సమ్మతమూ, నిరాకరించడమూ అనే యీ మొత్తం ప్రక్రియనంతా చూడటం.

సరే, యిదంతా లేకుండా ఎరుకగా వుండటం ఎవరికైనా సాధ్యమేనా? ప్రస్తుతం మనకు తెలిసిందల్లా విలువలు బేరీజు వేసే ప్రక్రియ ఒక్కటే. అది, ఆ విలువలు కట్టడం ఎట్లా వచ్చిందంటే మన నిబద్ధీకరణపు, మన నేపథ్యపు, మన మతపరమైన, నీతిపరమైన, మనం నేర్చిన విద్యకి సంబంధించిన ప్రభావాలు అన్నింటినీ మిళితం చేసుకోగా వచ్చిన ఫలితం అది. మన స్పృహ అని మనం అంటున్న అది మన జ్ఞాపకాల ద్వారా కలుగుతున్నది- 'నా' అనే జ్ఞాపకం, డచ్‌వాడిని, హిందువుని, బౌద్ధుడిని, కేథలిక్‌ని, మరొకరిని, మరొకరిని అనే స్మృతి. 'నేను' అంటే- నా జ్ఞాపకాలు, నా కుటుంబం, నా ఆస్తిపాస్తులు, నా గుణగణాలు- అంటే పరికించడం, తప్పొప్పులు నిర్ణయించడం, విలువలు కట్టడం. మనం అప్రమత్తంగా కనుక వుంటే యివన్నీ మనకు చిరపరిచితమైనవే అని గ్రహించవచ్చు. సరే, యివన్నీ లేకుండా, 'నేను' లేకుండా ఎరుకగా వుండటం సాధ్యం కాదా? ఖండించడం లేకుండా కేవలం చూడటం, పరికించి చూడటం సాధ్యమవుతుందా? మనసులోని కదలికలను, మన స్వంత మనసును, తప్పొప్పులు నిర్ణయించడం లేకుండా, విలువలు కట్టడం లేకుండా, 'ఇది మంచి' 'ఇది చెడు' అంటూ ఖండించకుండా వూరికే పరిశీలించడం సాధ్యం కాదా?

'నేను' లోనుండి వుత్పన్నమయే ఎరుక, అంటే విలువలు కట్టడాలతోను, తీర్పులు చెప్పడాలతోను కూడుకొని వున్న ఎరుక ద్వైదీభావాన్ని, రెండు వ్యతిరేక భావాల మధ్య, 'వున్నది' 'వుండవలసినది' అనే రెండింటి మధ్య సంఘర్షణను సృష్టిస్తుంది. అటువంటి ఎరుకలో తప్పొప్పులు నిర్ణయించడం వుంటుంది, భయం వుంటుంది, విలువలు కట్టడం వుంటుంది; ఖండించడమూ, ఫలానాది అని

గుర్తించడమూ వుంటాయి. ఇదంతా కేవలం 'నా' యొక్క, 'స్వ' యొక్క, 'నేను' యొక్క ఎరుక- యిందులో నేనుకు సంబంధించిన సంప్రదాయాలు, స్మృతులు మొదలైనవన్నీ మిళితమై వుంటాయి. ఇటువంటి ఎరుక పరిశీలిస్తున్నవాడికి, అతడు పరిశీలిస్తున్న దానికి మధ్య, నేను ఏమిటి అన్నదానికి నేను ఎట్లా వుండాలి అన్నదానికి మధ్య సంఘర్షణను సృష్టిస్తుంది. కాబట్టి ఖండించడం, తప్పొప్పులు నిర్ణయించడం, విలువలు కట్టడం అనే ప్రక్రియ లేకుండా ఎరుకగా వుండటం సాధ్యం కాదా? నా వైపుకు నేను వూరికే చూసుకోవడం- నాలో వున్నవి ఎటువంటి ఆలోచనలయినా సరే- ఖండించకుండా, తప్పొప్పులు నిర్ణయించకుండా, విలువలు కట్టకుండా చూసుకోవడం సాధ్యం కాదా? మీరెప్పుడయినా యిది ప్రయత్నించారేమో నాకు తెలియదు. ఇది చాలా కఠినాతికఠినమైన పని. ఎందుకంటే చిన్నతనం నుండీ మనకు యిచ్చిన శిక్షణ వల్ల మనం ఎప్పుడూ ఖండించడమో, ఆమోదించడమో చేస్తూ వుంటాం. ఈ ఖండన, ఆమోదం అనే ప్రక్రియలో ఆశాభంగం వుంటుంది, భయం వుంటుంది, నమిలివేస్తున్నలాంటి బాధ, ఆందోళన వుంటాయి. ఇదే 'నా' అనే, 'నేను' అనే ప్రక్రియ.

కాబట్టి, యిదంతా తెలుసుకున్నాక, ఒక ప్రయాసగా కాకుండా, ఖండించకూడదు అని ప్రయత్నించకుండా, తప్పొప్పుల నిర్ణయాలు చేయకుండా మనసు ఎరుకగా వుండగలదా? ఎందుకంటే 'నేను ఖండించకూడదు' అని అన్న మరుక్షణమే ఖండన అనే ప్రక్రియలో మనసు చిక్కుకొని పోయివుంటుంది. మనస్సు ఆవేశ రహితంగా గమనించగలదా, ఆ విధంగా తనకు విషయాలతో, మనుష్యులతో, వివిధ భావాలతో వున్న బాంధవ్యం అనే అద్దంలో తన ఆలోచనలను, తన మనోభావాలను పరిశీలించుకోగలదా? అటువంటి మౌనమైన పరిశీలన వలన ఏకాకితత్వము, ఆర్ద్రత లేని మేధావితత్వమూ అలవడి, పెరిగిపోతాయని అనడానికి వీల్లేదు. అందుకు పూర్తిగా విరుద్ధంగా జరగవచ్చు. నాకు ఒక విషయం గురించి అవగాహన కలిగినప్పుడు యిక ఖండించడం అనేది వుండనే వుండకూడదు; పోల్చి చూడటం కూడా వుండకూడదు- ఇది నిజంగా చాలా సులువైన విషయం. కానీ పోల్చిచూడటం ద్వారా అవగాహన జరుగుతుందని మనం అనేకమైన వాటితో రకరకాలుగా పోల్చి చూస్తుంటాం. మన విద్యావిధానంలో అంతా పోల్చి చూడటమే. మన సమస్తమైన నీతి సూత్రాలు, మతవ్యవస్థా అంతా పోల్చి చూడటం, ఖండించడం అనే వాటితో ముడిపడి వున్నాయి.

కాబట్టి, నేను చెప్తున్న ఎరుక ఏమిటి అంటే- ఖండించడం అనే మొత్తం ప్రక్రియను ఎరిగివుండటం, దాన్ని పూర్తిగా అంతం చేసి వేయడం. ఇందులోనే తప్పొప్పుల నిర్ణయం లేకుండా పరిశీలించడమూ వుంటుంది. అయితే యిది చాలా

కష్టతరమైన పని. దీని అర్థం ఏమిటంటే, యిది ఫలానా అని మాటల్లో అనడానికి, పేర్లు పెట్టడానికి స్వస్తి చెప్పాలి, వాటిని పూర్తిగా ఆపివేయాలి. నాలో దురాశ వుంది, స్వంతానికి కూడబెట్టుకునే తత్వం వుంది, కోపంగా వుంటాను, ఆవేశంగా వుంటాను, లేదా మరొకటీ అని ఎరిగినప్పుడు, వాటిని ఖండించకుండా కేవలం పరిశీలించడం, ఎరుకగా వుండటం సాధ్యం కాదా? అంటే అర్థం, ఆ మనోభావానికి ఒక పేరు పెట్టడం అనేదే ఆపివేయాలి అని; ఉదాహరణకి, 'దురాశ' అనే ఒక పేరు నేను పెట్టినప్పుడు, ఆ పేరు పెట్టడమే దాన్ని ఖండించే ప్రక్రియ అవుతున్నది. అసలు 'దురాశ' అనే ఆ మాట వినగానే దండనార్హమైనది అని మన నాడీమండలం అంటుంది. ఇటువంటి తీర్పుల నుండి మనస్సును విముక్తం చేయడం అంటే పేర్లు పెట్టడాన్ని అంతం చేయాలి. నిజంగా చూస్తే యీ పేర్లు పెట్టడం ఆలోచిస్తున్నవాడు చేస్తున్న పని. ఆలోచిస్తున్నవాడు తనని ఆలోచననుండి వేరు చేసుకుంటుంటాడు- ఇది పూర్తిగా కృత్రిమమైన పద్ధతి, యిందులో నిజం లేదు. ఉన్నది ఆలోచించడం ఒక్కటే. ఆలోచిస్తున్నవాడు వుండడు. అనుభవం చెందుతున్న ఒక స్థితి వున్నది తప్ప, అనుభవిస్తున్న ఒక జీవి లేడు.

కాబట్టి ఎరుక, పరిశీలన అనే యీ సమస్త ప్రక్రియ అంతా ధ్యానప్రక్రియ. ఇంకో విధంగా చెప్పాలంటే ఆలోచనల రాకపోకలకు నిరభ్యంతరంగా సమ్మతించడం. మనలో చాలామందిలో ఏ పిలుపూ లేకుండానే ఒక దాని తర్వాత యింకొకటిగా ఆలోచనలు వస్తూ వుంటాయి. ఆలోచనలకు ముగింపే వుండదు. అన్ని రకాలైన తిరుగుబోతు ఆలోచనలను రానిచ్చి మనసు వాటికి దాస్యం చేస్తుంటుంది. ఇది మీరు గ్రహిస్తే అప్పుడు ఆలోచనలను మనమే పిలవచ్చు- ఆలోచనలను పిలిచి, వుదయిస్తున్న ఒక్కొక్క ఆలోచన వెనకాలే వెళ్ళడం. మనలో చాలామందికి పిలవకుండానే ఆలోచనలు వస్తాయి. ఎటు నుంచి బడితే అటు నుంచి అవి వస్తుంటాయి. ఈ ప్రక్రియనంతా అర్థం చేసుకొని, ఆలోచనలను ఆహ్వానించి, ఒక్కొక్క ఆలోచననూ కొసదాకా వెంబడించడమే నేను వర్ణించిన ఎరుక అనే మొత్తం ప్రక్రియ. ఇందులో పేర్లు పెట్టడం అన్నది వుండదు. అప్పుడు మనస్సు అద్భుతమైన నెమ్మదిని పొందినట్లు గమనిస్తారు. ఇది అలసట వల్లా కాదు, క్రమశిక్షణ ద్వారానూ కాదు, తనని తాను చిత్రహింస చేసుకోవడం, అదుపు చేసుకోవడం వంటి పద్ధతుల ద్వారా కూడా కాదు. తన కార్యకలాపాలను గురించి తను ఎరుకగా వుండటం వల్ల మనసు పరమాశ్చర్యకరంగా నెమ్మదినీ, నిశ్చలతనూ, సృజనాత్మకతనూ పొందుతుంది- ఏ క్రమశిక్షణా, ఏ బలవంతమూ అమలు చేయకుండానే యిది జరుగుతుంది.

అప్పుడు, అటువంటి మానసిక నిశ్చలత్వంలో ఏ ఆహ్వానమూ లేకుండానే సత్యమైనది ఆవిర్భవిస్తుంది. సత్యాన్ని మీరు ఆహ్వానించలేరు. అది అజ్ఞేయమైనది. ఇటువంటి నిశ్శబ్దంలో అనుభవం పొందుతున్నవాడు వుండడు. కాబట్టి అనుభవంలోకి వచ్చినదానిని దాచుకోవడం జరగదు. 'నా సత్యానుభవం' అంటూ జ్ఞాపకం పెట్టుకోవడం జరగదు. అప్పుడు కాలరహితమైనది అస్తిత్వంలోకి వస్తుంది. దానిని అనుభవం పొందినవాడు కాని, అనుభవాలను స్మృతిలో పెట్టుకొనేవాడు కాని కొలతలలో చెప్పలేడు. సత్యం అనేది ప్రతి క్షణంలోను కలుగుతూ వుంటుంది. దానిని అలవరచుకోలేము. ఒక జ్ఞాపకంగా దానిని పోగుచేసి వుంచుకోలేము, దాచుకోలేము. అనుభవం పొందుతున్నవాడు వుండని ఒక ఎరుక కలిగినప్పుడు మాత్రమే అది వస్తుంది.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, IX వాల్యూమ్,*
*ఆంస్టర్‌డేమ్, 26 మే 1955.*

**ప్రశ్న : మీరు చెప్పేవి వింటున్నప్పుడు మీరు చాలా చదివారనీ, సత్యాన్ని ప్రత్యక్షానుభవంలోకి తెచ్చుకున్నారనీ కూడా అనిపిస్తుంది. అటువంటప్పుడు జ్ఞానాన్ని ఆర్జించడం దోషమని మీరెందుకనుకుంటున్నారు?**

కృష్ణమూర్తి : ఎందుకో చెప్తాను వినండి. ఈ ప్రయాణం ఒంటరిగా చేయవలసినది. జ్ఞానాన్ని మీ వెంటపెట్టుకున్నప్పుడు అది ఒంటరి ప్రయాణం అవదు. గీతను, వుపనిషత్తులను, ఆధునిక మనోవైజ్ఞానిక శాస్త్రాన్ని మీరు చదివివున్నట్లయితే, పండితుల దగ్గిర మీ గురించిన సమాచారాన్ని, వాళ్ళ దృష్టిలో అసలు మీరు ఏం సాధించాలి అన్నదీ పోగుచేసుకున్నట్లయితే- ఆ జ్ఞానం ఒక ప్రతిబంధకంగా తయారవుతుంది. అమూల్యమైన సంపద వున్నది పుస్తకాల్లో కాదు, మీ లోపల, మీ మనసులోనే దాగివుంది. ఆ అమూల్యసంపదని కనిపెట్టడం మీ మనసుకొక్కదానికే చేతనవుతుంది. స్వీయజ్ఞానం పొందడం అంటే మీ మనసు తీరుతెన్నులు తెలుసుకోవడం; దానిలోని సూక్ష్మాసూక్ష్మాలను గురించి, వాటి అంతరార్థాలను గురించి ఎరిగివుండటం. దీనికోసం ఒక్క పుస్తకం కూడా చదవనక్కరలేదు. నిజం చెప్పాలంటే నేను యివేవీ చదవలేదు. చిన్న పిల్లవాడిగా వున్నప్పుడు, ఆ తరువాత కొంత వయసు వరకు యీ పవిత్ర గ్రంథాలనే వాటిని కొన్నింటిని యథాలాపంగా తిరగవేసివుండవచ్చు. అంతే తప్ప వాటిని ఎన్నడూ నేను అధ్యయనం చేయలేదు. అట్లా అధ్యయనం చేయాలని నాకు లేదు. అమూల్యమైనవన్నీ మరెక్కడో వుండటం వల్ల యిది చదవడం అంటే నాకు

విసుగ్గా వుంటుంది. అమూల్య సంపద ఏ పుస్తకాల్లోనూ లేదు, మీ గురువులోనూ లేదు. అది మీ లోపలే వుంది. మీ మనసును మీరు అవగాహన చేసుకోవడం అన్నదే ఆ అమూల్య ధనాగారాన్ని తెరిచే తాళంచెవి. మీ మనసును మీరు అర్థం చేసుకోవాలి. పతంజలి చెప్పిన ప్రకారంగానూ కాదు; చాలా చాతుర్యంతో విషయాలను వివరించి చెప్పగల ఎవరో ఒక మనోవైజ్ఞానిక నిపుణుడు చెప్పిన ప్రకారంగానూ కాదు. మిమ్మల్ని మీరు మెళకువతో గమనిస్తూ వుండటం ద్వారా, మీ మనస్సు అంటే చేతన మానసమే కాదు, అచేతన మానసంలోని నిగూఢమైన పొరలతో సహా- ఎట్లా పనిచేస్తున్నదో పరిశీలించడం ద్వారా అర్థం చేసుకోవాలి. మీ మనస్సును మెళకువతో కనుక గమనిస్తూ వుంటే, దానితో ఆటలాడుతూ వుంటే, అప్రయత్నంగా అభివ్యక్తీకరిస్తూ మనసు స్వేచ్ఛగా వున్నప్పుడు దానిని పరికిస్తుంటే, మాటల్లో చెప్పలేనన్ని అమూల్య సంపదలను అది తెరిచి చూపిస్తుంది. అప్పుడు మీరు యీ పుస్తకాలన్నింటినీ మించి పోతారు. అయితే దీనికి అత్యంతమైన సావధాన శీలత్వం, జీవశక్తి, తీవ్రమైన అభిలాష చాలా ఆవశ్యకం. కాలక్షేపానికి చేసే వ్యాఖ్యానాలతో తృప్తిపడే దంతవేదాంతం కాదు. అందువల్ల మనస్సు తను తెలుసుకున్న జ్ఞానాన్నుంచి విముక్తి పొంది వుండాలి. సంపాదించిన జ్ఞానంతో ఆవరించుకొని పోయి వున్న మనస్సు 'వున్నది' ఏమిటనేది ఏనాటికీ కనుక్కోలేదు.

*ది కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ జె. కృష్ణమూర్తి, IX వాల్యూమ్,*
*బొంబాయి, 25 మార్చి 1956.*

# సమస్యలూ, తప్పించుకొనే మార్గాలూ

'నాకు ఎన్నో ముఖ్యమైన సమస్యలున్నాయి. వాటిని పరిష్కరించాలని నేను ప్రయత్నించినకొద్దీ యింకా క్లిష్టంగా, బాధాకరంగా తయారవుతున్నాయి. ఏం చేయాలో పాలుపోవడంలేదు, ఎటూ తోచకుండా వుంది. వీటికి తోడు నాకు చెవుడు కూడా వుంది. అందుకోసం పరమ వికారమైన యీ యంత్ర మొకటి పెట్టుకుంటున్నాను. నాకు చాలామంది పిల్లలున్నారు. నా భర్త నన్ను వదిలేసి వెళ్ళిపోయారు. పిల్లల్ని గురించే చాలా దిగులుగా వుంది. నేను పడ్డ బాధలు, కష్టాలు మాత్రం వాళ్ళకి రాకూడదని కోరుకుంటున్నాను'.

మన సమస్యలకి ఒక పరిష్కారం వెతికి పట్టుకోవాలని ఎంత ఆత్రపడుతుంటాం! పరిష్కారం వెతికే ఆ తొందరలో అసలు సమస్యని గురించి సరిగ్గా విచారించలేము. సమస్యని మౌనంగా పరిశీలించడానికి అది అడ్డు తగులుతుంది. అసలు ప్రధానమైన విషయం సమస్య తప్ప పరిష్కారం కాదు. గట్టిగా చూస్తే పరిష్కారాన్ని కనిపెట్టవచ్చు. అయితే సమస్య మాత్రం అట్లాగే కొనసాగుతుంది. ఎందుకంటే సమస్యకీ పరిష్కారానికీ ఏ సంబంధమూ లేదు. మనం వెతుకుతున్నది సమస్యనుంచి పారిపోయే మార్గం కోసం. పరిష్కారం అనేది వట్టి పైపై చికిత్స. దానివల్ల సమస్యను అవగాహన చేసుకోవడం జరగదు. అన్ని సమస్యలకు మూలస్థానం ఒక్కటే. ఆ మూలస్థానాన్ని అర్థంచేసుకోకుండా సమస్యల్ని పరిష్కరిద్దామని చూడటం వల్ల గందరగోళమూ, బాధా ఎక్కువవుతాయి. అసలు మొదట సమస్యని అవగాహన చేసుకోవాలనే వుద్దేశ్యం మనకి నిజంగా వుందా లేదా, అసలు యీ సమస్యలేవీ లేకుండా వుండాలనే ఆవశ్యకతను గ్రహించామా అనే సంగతి స్పష్టంచేసుకోవాలి. అప్పుడే సమస్యలను తయారు చేస్తున్న కర్తని సమీపించగలుగుతాము. సమస్యల నుంచి విముక్తి లేకుండా ప్రశాంతి లేదు. సంతోషంగా వుండాలంటే ప్రశాంతి అవసరం. అయితే అదే గమ్యం అని కాదు. పిల్లగాలులు వీచడం ఆగిపోయినప్పుడు నీటిమడుగు నిశ్చలంగా వున్నట్లు, సమస్యలు సమాప్తం అయినప్పుడు మనసు కూడా నిశ్చలమవుతుంది. అయితే మనసుని నిశ్చలంగా చేసివేయడం సాధ్యంకాదు. అట్లా చేస్తే అది మృతప్రాయమే, మురిగిపోయిన నీటిగుంట అవుతుంది. ఇది కనుక స్పష్టమవుతే, సమస్యలని తయారుచేసే కర్తని పరిశీలించవచ్చు. ఈ పరిశీలన మౌనంగా జరగాలి. బాధా సౌఖ్యాలని దృష్టిలో పెట్టుకొని ముందుగానే నిర్ణయించుకున్న ఒక పథకం ప్రకారంగా జరగకూడదు.

'అసాధ్యమైన విషయాలను గురించి మీరు చెప్తున్నారు! మన చదువులే మన మనసులకి విచక్షణ చేయడం, పోల్చిచూడటం, తప్పొప్పులు నిర్ణయించడం, ఎంచుకోవడం నేర్పి అందులో శిక్షణ యిస్తాయి. పరిశీలించినదానిని ఖండించకుండానో, సమర్థించకుండానో ఉండటం చాలా కష్టం. ఇటువంటి నిబద్ధీకరణం నుంచి విముక్తి చెంది, మౌనంగా పరిశీలన చేయడం ఎట్లా?'

మౌనంగా పరిశీలించడం, నిర్లిప్తమైన ఎరుక వుండటం అవగాహనకు చాలా అవశ్యకం అని మీరు గ్రహించినప్పుడు, మీ గ్రహింపు అనే సత్యమే వెనకాలవున్న నేపథ్యమంతటి నుండి మిమ్మల్ని విడుదల చేస్తుంది. నిర్లిప్తంగా వుంటూనే, అప్రమత్తమైన ఎరుకను కూడా కలిగి వుండాలనే తక్షణావశ్యకతను మీరు గ్రహించనప్పుడు మాత్రమే 'ఎట్లా' అనే ప్రశ్నా, మన పూర్వ నేపథ్యాన్ని అంతరింపచేసుకొనే సాధనం కోసం అన్వేషణా బయల్దేరుతాయి. విడుదల కలిగించేది సత్యమే తప్ప సాధనం కాని, పద్ధతి కాని కాదు. మౌనపరిశీలన వల్ల మాత్రమే అవగాహన కలుగుతుందనే సత్యాన్ని మనం గ్రహించాలి. అప్పుడే యీ ఖండించడాలు, సమర్థించడాలు తొలగిపోతాయి. ఒక అపాయాన్ని చూసినప్పుడు దానినుంచి దూరంగా ఎట్లా పోవాలి అని ప్రశ్నిస్తూ మీరు కూర్చోరు. నిర్లిప్తమైన ఎరుకతో వుండవలసిన అవసరాన్ని మీరు చూడటంలేదు కాబట్టే 'ఎట్లా' అని అడుగుతున్నారు. అది చాలా అవసరం అనేది మీరు ఎందుకు గ్రహించడం లేదు?

'గ్రహించాలనే వుంది కాని యింతకు ముందు నేను యీ రకంగా ఆలోచించ లేదు. సమస్యలు నన్ను చిత్రవధ చేస్తున్నాయి కాబట్టి వాటిని వదుల్చుకోవాలని అనుకుంటున్నాను; అది మాత్రమే నేను గట్టిగా చెప్పగలను. అందరిలాగే నేను సంతోషంగా వుండాలని అనుకుంటున్నాను'.

నిర్లిప్తమైన ఎరుక అత్యావశ్యకం అన్న సంగతి గ్రహించడం మనకి యిష్టం వుండదు. ఇది మనకు తెలిసీ జరగవచ్చు, తెలియకుండానూ జరగచ్చు. ఎందుకంటే సమస్యలను నిజంగా వదుల్చు కోవాలని మనకి వుండదు. సమస్యలు లేకపోతే మనం ఏమైపోతాం? అది ఎంత బాధాకరమైనదైనా సరే, మనకి తెలిసినదానిని పట్టుకొని వేలాడటమే నయం అనుకుంటాం. ఎందుకంటే ఎక్కడికి చేరవేస్తుందో తెలియని దాని వెంటపడి అన్వేషించడంలో యింతకన్నా ప్రమాదం వున్నదని అనుకుంటాం. కాబట్టి సమస్యలు కనీసం మనకి బాగా అలవాటయిపోయాయి. అయితే, ఆ సమస్యలని సృష్టించిన కర్తని వెతికి పట్టుకోవాలనే ఆలోచన, చివరకు మనల్ని ఎక్కడకు చేరుస్తుందో తెలియక పోవడం వల్ల మనలో భయాన్ని, స్తబ్ధతనూ కలిగిస్తుంది. సమస్యలని

గురించిన చింత లేకపోతే మనసు అయోమయంలో పడుతుంది. సమస్యలే మనసుకి ఆహారం. అవి ప్రపంచ సమస్యలవచ్చు, వంటింటివి అవచ్చు; రాజకీయపువి, వ్యక్తిగతమైనవి, మత పరమైనవి, సైద్ధాంతిక సంబంధమైనవి ఏవయినా అవచ్చు. కాబట్టి సమస్యలు మనల్ని అల్పంగా, సంకుచితంగా తయారు చేస్తాయి. ప్రపంచ సమస్యలతో సతమతమవుతున్న మనసు ఎంత అల్పమైనదో ఆధ్యాత్మిక వున్నతి కోసం పాటుపడుతున్న మనసు కూడా అంతే అల్పమైనది. సమస్యలు మనసుని భయం అనే భారంతో నింపుతాయి. ఎందుకంటే సమస్యలు స్వీయాన్ని, 'నా'ని, 'నాది'ని యింకా బలంగా తయారవడానికి సహాయం చేస్తాయి. సమస్యలు లేనప్పుడు, విజయసాధనలూ, ఓటములూ లేనప్పుడు స్వీయం అంటే 'నేను' వుండదు.

'కాని, స్వీయం అనేది లేకుండా ఎవరయినా జీవించగలరా? అన్ని చర్యలకూ అదే కదా మూలస్థానం?'

కోరికకు పర్యవసానంగా గాని, స్మృతికి. భయానికి, సుఖానికి, బాధకి పర్యవసానంగా గాని చర్యలు జరుగుతున్నప్పుడు, ఆ చర్యలు తప్పకుండా సంఘర్షణను, గందరగోళాన్ని, విరోధాన్ని పెంచి పోషిస్తాయి. అవి ఏ స్థాయిలో జరిగినా సరే, మన చర్యలన్నీ మన నిబద్ధీకరణం ఫలితంగానే జరుగుతుంటాయి. ఒక స్పందనకు మన ప్రతిస్పందన అసంపూర్ణంగా వుండి, తగినంతగా లేకపోవడం సంఘర్షణను తప్పక కలిగించి తీరుతుంది. సమస్య అంటే అదే. అసలు సంఘర్షణే 'నేను' కు ఆకార స్వరూపాలనిస్తుంది. సంఘర్షణ అనేదే లేకుండా, అత్యాశ అనే సంఘర్షణో, భయం అనే సంఘర్షణో, గెలుపు కోసం సంఘర్షణో, అవి ఏవీ లేకుండా జీవించడం అసంభవమేమీ కాదు. అయితే యీ సంభావనీయతను ప్రత్యక్ష అనుభవం ద్వారా కనిపెట్టనంత వరకు అది అసలైన యదార్థం అవదు. కేవలం సైద్ధాంతిక రూపంలోనే వుంటుంది. 'నేను' యొక్క తీరుతెన్నులన్నీ అవగాహన చేసుకున్నప్పుడు మాత్రమే అత్యాశ అనేదే లేకుండా జీవించడం సాధ్యమవుతుంది.

'నాలోపల భయాలు వుండి, వాటిని అణచుకోవడం వలన నాకు చెవుడు వచ్చిందంటారా? చెవి భౌతిక స్వరూపంలో ఏ లోపమూ లేదని వైద్యులు గట్టిగా చెప్పారు. నా చెవులకు మళ్ళీ వినబడే శక్తి రావడానికి అవకాశం వున్నదా? నా జీవితకాలమంతా ఏదో ఒక రకంగా నేను అణచి త్రొక్కివేయబడుతూనే వున్నాను. నేను నిజంగా చేయాలని యిష్టపడినవి ఎన్నడూ చేయలేక పోయాను'.

అంతర్గతంగాను, బాహ్యంగాను కూడా అవగాహన చేసుకోవడం కంటె అణచివేయడమే సులభం. అవగాహన చేసుకోవడం చాలా కఠినమైన పని, ముఖ్యంగా

చిన్నప్పటి నుండీ బాగా బలంగా నిబద్ధీకరణం చెందినవారికి. చాలా శ్రమతో కూడుకున్నదయినా అణచివేసుకోవడం ఒక అలవాటుగా తయారవుతుంది. అవగాహన చేసుకోవడం ఒక అలవాటుగా, ఒక నిత్యకృత్యంగా ఎన్నటికీ అవలేదు. దానికి నిరంతరమైన జాగరూకత, అప్రమత్తత వుండితీరాలి. అవగాహన చేసుకోవడానికి మెత్తని గుణమూ, సున్నితత్వమూ, భావోద్రేక పూరితం కానటువంటి ఆర్ద్రతా కావాలి. అణచివేత ఏ రకంగా చేసుకున్నా దానికి ఎరుకను పదును పెట్టవలసిన పని వుండదు. ప్రేరణలకు యీ విధంగా ప్రతిస్పందించడం అతి సులువైన, అతి బుద్ధిహీనమైన పద్ధతి. అణచివేసుకోవడం అంటే ఏదో ఒక భావనకో, ఒక పద్ధతికో లొంగిపోయి వుండటం. దీనివల్ల ఒక కృత్రిమమైన భద్రత, మర్యాద లభిస్తాయి. అవగాహన వల్ల విడుదల కలుగుతుంది. అణచుకోవడం సంకుచితంగాను, స్వార్థపూరితంగాను తయారుచేస్తుంది. ఆధిపత్యం అన్నా, భద్రతా లేమి అన్నా, యితరుల అభిప్రాయం అన్నా వుండే భయం సైద్ధాంతిక రూపంలో ఒక ఆశ్రయాన్ని, భౌతికరూపంలో దాని జంటతో పాటుగా నిర్మిస్తుంది. మనసు అందులో పడిపోతుంది. ఈ ఆశ్రయం ఏ స్థాయిలో నిర్మించుకున్నా సరే, భయాన్ని ఎప్పటికీ వుండేలా పోషిస్తూ వుంటుంది. ఈ భయంవల్ల, ఏదో ఒకదానితో భర్తీ చేసుకోవడం, పవిత్రతను ఆపాదించుకోవడం, క్రమ శిక్షణా బయలుదేరుతాయి. ఇవన్నీ అణచివేతకు రకరకాల మారురూపాలు. అణచుకున్నది బయట పడటానికి ఏదో ఒక మార్గం కావాలి. అది శరీర సంబంధమైన రుగ్మత కావచ్చు, సైద్ధాంతిక పరమైన భ్రాంతి కావచ్చు. ఒక్కొక్కరి స్వభావగుణాన్ని బట్టి, వారి వారి వింత విచిత్ర ప్రకృతులను అనుసరించి మూల్యం చెల్లించవలసి వస్తుంది.

'నాకు రుచించనివి వినవలసివచ్చినప్పుడల్లా యీ శ్రవణ యంత్రాన్ని ఆశ్రయిస్తున్నానని నేనే గమనించాను. ఆ విధంగా నా స్వంతదైన మరో లోకంలోకి నేను పారిపోవడానికి అది సహాయపడుతున్నది. అయితే ఏళ్ళ తరబడి జరిగిన అణచివేత నుంచి విముక్తిచెందడం ఎట్లా? దానికి చాలా సమయం పట్టదూ?'

అది సమయానికి సంబంధించిన సమస్య కాదు; గతాన్ని తవ్వితోడటమూ కాదు, జాగ్రత్తగా విశ్లేషించడమూ కాదు. అణచుకోవడం అనే సత్యాన్ని గ్రహించడానికి సంబంధించిన సంగతి. అణచుకోవడం అనే ప్రక్రియ ఎడల ఏ విధమైన ఎన్నిక చేసుకోవడమూ లేని నిర్లిప్తమైన ఎరుక కలిగివుంటే, అందులోని సత్యాన్ని వెంటనే గ్రహిస్తాము. నిన్న, రేపు అనే దృష్టితో ఆలోచించడం ద్వారా అణచివేయడం అనే సత్యాన్ని కనిపెట్టలేము. సత్యం కాలగమనంలో ఆకళింపు చేసుకునేది కాదు. సత్యం సాధించి అందుకునేది కాదు. దానిని చూస్తారు లేదా చూడరు. అంతే తప్ప క్రమ క్రమేణా దానిని చూసి గ్రహించడం అనేది లేదు. అణచి వేసుకోవడం నుండి విముక్తి

పొందాలనే సంకల్పం అందులోని సత్యాన్ని అవగాహన చేసుకోవడానికి ఆటంకమవు తుంది. ఎందుకంటే సంకల్పం అంటే కోరిక; అది అనుకూల సంకల్పమైనా సరే, ప్రతికూలమైనదైనా సరే. కోరిక వున్నప్పుడు నిర్లిప్తమైన ఎరుక వుండటం కుదరదు. అసలు యీ అణచుకోవడాన్ని తయారుచేసినదే కోరిక లేక కాంక్ష. ఈ కోరిక, దీనినే యిక్కడ సంకల్పం అని అంటున్నా కూడా, తానే సృష్టించినదాని నుంచి మళ్ళీ తనని ఏనాటికీ విముక్తం చేసుకోలేదు. అందుకే నిర్లిప్తమైన, అప్రమత్తమైన ఎరుక ద్వారా సంకల్పంలోని సత్యాన్ని పరికించి చూడాలి. విశ్లేషకుడు తనని తాను దీనినుంచి వేరుగా వుంచుకున్నప్పటికీ, అతడు ఆ విశ్లేషించుతున్న విషయంలోని ఒక భాగమే. అతడు విశ్లేషిస్తున్న విషయమే అతడిని నిబద్ధీకరించింది కాబట్టి, దానినుండి తనని తానే విముక్తం చేసుకోలేడు. అందుకే, యిందులోని సత్యాన్ని కూడా గ్రహించుకోవాలి. సత్యం వల్లనే విడుదల కలుగుతుంది తప్ప సంకల్పం వల్ల, ప్రయత్నం వల్ల కాదు.

*(కమెంటరీస్ ఆన్ లివింగ్)*

## ఆరాటం

అర్థంపర్థంలేని చిన్న చిన్న విషయాలు తనని తెగ ఆరాటంలో ముంచెత్తు తుంటాయని చెప్తున్నారు ఆయన. పైగా యీ విషయాలు ఎప్పటికప్పుడు మారిపోతూ కొత్త కొత్త ఆరాటాల్లో పడిపోతుంటారుట. ఏదో ఒక శరీర సంబంధమైన దోషాన్ని వూహించుకొని, దాన్ని గురించి విచారిస్తూ కూర్చుంటారుట. మళ్ళీ కొద్ది గంటల్లోనే ఆయన చింత అంతా యింకో సంఘటన మీదో, యింకో ఆలోచన మీదో లగ్నం అవుతుందిట. ఒకదాని తర్వాత ఒకటిగా కలిగే ఆందోళనా భరితమైన ఖీ యావలతోనే ఆయన బ్రతుకంతా గడిచిపోతున్నది. ఆయన యింకా యిట్లా చెప్తున్నారు. ఈ ఆరాటాలనుంచి బయటపడే మార్గం కోసం ఎన్నో పుస్తకాలు వెతికారు, స్నేహితులతో తన సమస్యగురించి చర్చిస్తుంటారు, ఒక మనోవైజ్ఞానిక నిపుణుడిని సలహా కూడా అడిగారు. ఎందువల్లనో ఏవీ ఆయనకు వుపశాంతిని యివ్వలేదు. చాలా గంభీరమైన, ఆసక్తికరమైన సమావేశాల్లో పాల్గొన్నా, అవి ముగిసిన వెంటనే మళ్ళీ ఏదో ఒక యావ, ఆపైన యింకో రంధి బయల్దేరుతాయట. వీటి వెనకాల వున్న కారణం కనిబెడితే అవి ఆగిపోతాయా అని ఆయన ప్రశ్న.

కారణాన్ని కనిపెట్టడం ద్వారా దాని ప్రభావాన్నుంచి విముక్తి లభిస్తుందా? కారణం గురించి తెలుసుకోవడం ఫలితాన్ని నిర్మూలిస్తుందా? యుద్ధాలకు గల

కారణాలు, ఆర్థిక సంబంధమైనవీ, మనోతత్వసంబంధమైనవీ రెండూ మనకి తెలుసు. అయినా పైశాచికత్వాన్ని, మన వినాశనాన్ని మనమే స్వయంగా ప్రోత్సహిస్తున్నాం. అసలు యీ కారణంకోసం అన్వేషించడానికి వెనకాల వున్న మన వుద్దేశ్యంలో అది కలిగించే ప్రభావాన్ని వదుల్చుకోవాలనే కోరిక వున్నది. ఈ కోరిక మారురూపంలో వున్న ప్రతిరోధభావం లేదా నిరసన భావం. నిరసన వున్నప్పుడు అవగాహన వుండదు.

'అయితే యిప్పుడు నేను ఏం చేయాలి?' అని అతను అడిగారు.

ఇటువంటి అల్పాతి అల్పమైన మూర్ఖమైన ఆరాటాలు మనసును ఎందుకు పట్టిపీడిస్తాయి? 'ఎందుకు' అని అడగడం అంటే, మీ లోపల కాకుండా ఎక్కడో వేరేగా వున్న ఒక కారణాన్ని మీరు అన్వేషించి పట్టుకోవడం అని కాదు అర్థం; మీ ఆలోచనా రీతులు ఎట్లా వున్నాయి అనేది మీరే తెరిచి తీసి చూసుకోవడం. కాబట్టి, ఎందుకు మనసు యీ విధమైన వ్యాపకాలతో నిండిపోతూవుంటుంది? మనసు కృత్రిమంగాను, డొల్లగాను, తుచ్ఛంగాను వుండటం వల్ల, తనకి ఆకర్షణీయంగా వుండే వాటిలోనే మునిగిపోయి వుండాలనుకుంటుంది; కాదూ?

"అవును" అని అతను సమాధానమిచ్చారు. 'అదే నిజమనిపిస్తున్నది. కాని పూర్తిగా కాదు. ఎందుకంటే నేను బాగా లోతుగా ఆలోచించే రకం మనిషిని'.

ఈ ఆరాటాలు కాకుండా మీ ఆలోచనలు యింకా ఏఏ విషయాల గురించి వుంటూ వుంటాయి?

'నా వృత్తిని గురించి' అన్నారాయన. 'నేనొక బాధ్యతాయుతమైన పదవిలో వున్నాను. రోజంతా, ఒక్కొక్కసారి రాత్రివేళల్లో కూడా, నా వృత్తికి సంబంధించిన విషయాలని గురించిన ఆలోచనలతోనే మునిగిపోయివుంటాను. అప్పుడప్పుడు ఏవో చదువుతుంటాను, కాని సమయమంతా దాదాపుగా నా వృత్తి ధర్మంలోనే ఎక్కువగా గడిచిపోతుంది'.

మీరు చేస్తున్న పని మీకు బాగా యిష్టంగా వుందా?

'ఇష్టమే. కాని పూర్తిగా తృప్తికరంగా లేదు. నా జీవితమంతా నేను చేస్తున్న పనిలో కొంత అసంతృప్తితోనే గడిచిపోయింది. అయినా కూడా నేను యిప్పుడున్న పదవిని వదులుకోలేను. నామీద కొన్ని బాధ్యతలున్నాయి. పైగా వయసు కూడా పైబడుతున్నది. నన్ను విసిగించేదల్లా యీ ఆరాటాలూ, నా పనిమీదా, మనుష్యుల మీదా రోజు రోజుకీ నాలో పెరిగిపోతున్న ఆగ్రహమూ. నేను ఎవ్వరిమీదా పెద్దగా దయ చూపించలేదు. భవిష్యత్తు అంటే తగని ఆందోళనగా వుంది. శాంతి అనేది ఎరగనే ఎరగను అని అనిపిస్తున్నది. నా పని నేను బాగానే చేస్తాను, కాని....'

'ఉన్నది' కి వ్యతిరేకంగా ఎందుకు పోరాడుతున్నారు మీరు? నేను నివసిస్తున్న యిల్లు రణగొణధ్వనులతో నిండివుండచ్చు, మురికిగా వుండచ్చు, అక్కడ వున్న సామాన్లన్నీ పరమవికారంగా వుండచ్చు; మొత్తంమీద సౌందర్యం అనేది ఏమాత్రం అక్కడ లేకపోవచ్చు. కాని, అనేక కారణాలవల్ల నేను అక్కడే నివసించాలి. మరో యింటికి మారలేను. అటువంటప్పుడు సమస్య ఆమోదించడమా కాదా అన్నది కాదు; కళ్ళకి కనబడుతున్న వాస్తవాన్ని చూడటం గురించి. 'ఉన్నది' ని నేను చూడకపోతే, పూలని వుంచే ఆ కూజాను గురించో, ఆ కుర్చీ గురించో, ఆ చిత్రపటం గురించో విచారించి సుడిపడిపోతాను. అవే నా ఆరాటాలుగా మారతాయి. అప్పుడు మనుష్యులన్నా, నా పని అన్నా నాలో ఆగ్రహం పుట్టుకొస్తుంది. ఇదంతా పూర్తిగా వదిలేసి మళ్ళీ కొత్తగా నేను మొదలుపెట్టగలిగితే, అది వేరు. కాని, నేను అట్లా చేయలేను. 'ఉన్నది' కి, అసలు వాస్తవానికి వ్యతిరేకంగా నేను తిరగబడటంవల్ల లాభం లేదు. 'ఉన్నది' ని గుర్తించాక నా పాటికి నేను హాయిగా, తృప్తిగా వుండిపోవడం జరుగుతుందని అనుకోకండి. 'ఉన్నది' ని వప్పేసుకోవడం వల్ల, అది నాకు అవగాహన అవడమే కాకుండా, మనసు వుపరితలం పైన ఒక విధమైన నెమ్మది కూడా ఏర్పడుతుంది. ఉపరితల మానసం ప్రశాంతంగా లేనప్పుడే అది ఆరాటాల్లో- అవి నిజమైనవి కావచ్చు, కల్పితమైనవి కావచ్చు- వాటిల్లో పడి మునిగిపోతుంది. రకరకాలైన సంఘ సంస్కరణల్లోనో, మతానికి సంబంధించిన సూక్తులలోనో, పరమగురువులు, లోకరక్షకుడు, పూజాపునస్కారాలు మొదలైనవాటిల్లో చిక్కుకొని పోతుంది. ఉపరితల మానసం నెమ్మదిగా వున్నప్పుడే, అజ్ఞాతంగా లోపల వున్నది బయటపడటానికి అవకాశం వున్నది. అజ్ఞాతంగా లోపల వున్నది బయటపడి తీరాలి. అయితే వుపరితల మానసం ఆరాటాల బరువును, చింతల భారాన్ని మోస్తున్నప్పుడు దీనికి అవకాశం లేదు. ఉపరితల మానసం నిరంతరం ఏదో ఒక ఆందోళనలో వుంటూవుండటం వల్ల మనసు యొక్క పైపై పొరలకు లోలోపలి పొరలకు మధ్యన సంఘర్షణ అనివార్యం. ఈ సంఘర్షణను పరిష్కరించుకోనంత వరకు ఆరాటాలు ఎక్కువవుతూనే వుంటాయి. నిజంగా చూస్తే, మన సంఘర్షణల నుండి తప్పించుకొని పారిపోవడానికి మార్గాలే యీ ఆరాటాలు. పలాయనాలు అన్నీ ఒకటే రకం. అయితే వాటిలో కొన్ని మాత్రం సమాజానికి చాలా హానికరమైనవి అనడంలో ఏమాత్రం సందేహం లేదు.

ఈ ఆరాటాలు, లేదా మరో సమస్యలు ఏవైనా సరే, వాటి మొత్తం ప్రక్రియను గురించి మనం ఎరుకగా వున్నప్పుడే ఆ సమస్య నుంచి విముక్తి కలుగుతుంది. బాగా విస్తృతమైన ఎరుక కలిగివుండాలంటే ఆ సమస్యను ఖండించడం గానీ, సమర్థించడం కానీ వుండకూడదు. ఆ ఎరుకలో ఎంపిక చేసుకోవడం వుండకూడదు. ఆ విధమైన

ఎరుక కలిగివుండటానికి చాలా వోరిమి, సున్నితత్వమూ అత్యావశ్యకం. ఉత్సాహం, ఆగిపోకుండా కొనసాగే సావధానత కూడా అవసరం. అప్పుడే ఆలోచనా ప్రక్రియ నంతటినీ పరిశీలించవచ్చును, అవగాహన చేసుకోవచ్చును.

*(కమెంటరీస్ ఆన్ లివింగ్)*

# మరణం అనే యీ దుఃఖం ఎందుకు వున్నది?

ధ్యానం అంటే కొత్తది విచ్చుకొని వికసించడం. పునరావృత్తి వంటి గతానికి ఆవలగా, ఎత్తుగా కొత్తది వుంటుంది. ధ్యానం అంటే యీ పునరావృత్తిని సమాప్తం చేయడం. ధ్యానంవల్ల కలిగే మరణమే కొత్త యొక్క అమరత్వం. కొత్తది ఆలోచనల పరిధిలో వుండదు. ఆలోచనలు మౌనంగా వుండటమే ధ్యానం.

ధ్యానం ఒక సాధన కాదు, ఒక దివ్యస్వప్నాన్ని అందుకోవడమూ కాదు, వుద్వేగ పూరితమైన యింద్రియానుభూతీ కాదు. అది నది వంటిది. దానిని లొంగదీసుకోలేము; అది వడివడిగా ప్రవహిస్తూ తీరాలను ముంచివేస్తూ వుంటుంది. ధ్వని లేని సంగీతం వంటిది అది. దానిని మచ్చిక చేసుకొని వుపయోగించుకోలేము. ఆరంభంలోనే పరిశీలకుడు లేకుండా పోయిన నిశ్శబ్దం అది.

ఇంకా సూర్యుడు పైకి రాలేదు. చెట్ల మధ్య నుండి వేగుచుక్క కనబడుతునే వున్నది. ఒకే అపూర్వమైన నిశ్శబ్దం అంతటా అలముకొని వున్నది. రెండు ధ్వనుల మధ్యనో, రెండు సంగీత స్వరాల మధ్యనో వుండే మౌనం కాదు. బొత్తిగా ఏ కారణమూ లేకుండానే వుండే నిశ్శబ్దం- యీ లోకం ఆరంభమైనప్పుడు యిటువంటి నిశ్శబ్దమే వుండివుంటుంది. లోయా, కొండలూ అన్నీ దానితో నిండిపోయాయి. రెండు పెద్ద పెద్ద గుడ్లగూబలు ఒకరినొకరు పిల్చుకుంటున్నాయి. అయితే ఆ నిశ్శబ్దాన్ని అవి భంగపరచలేదు. చాలా దూరంలో ఒక కుక్క ఆలస్యంగా వుదయించిన చంద్రుడిని చూసి మొరుగుతున్నది. అది కూడా యీ అపారనిశ్శబ్దంలో భాగంగానే అనిపిస్తున్నది. పొగమంచు బాగా దట్టంగా ముసురుకున్నది. కొండ చాటునుంచి సూర్యుడు మెల్లిమెల్లిగా పైకి లేస్తుంటే చిత్రమైన వర్ణాలతోను, సూర్యుడి ప్రథమకిరణాల్లో వుండే ప్రకాశంతోను కొండ తళ తళ లాడటం మొదలుపెట్టింది.

జకరంద వృక్షాల సుకుమారమైన ఆకులు మంచుతో తడిసి బరువెక్కి పోయాయి. పక్షులు వుదయస్నానాలకై వచ్చి వాలాయి. అవి రెక్కలు అల్లల్లాడిస్తుంటే

ఆ సుకుమారమైన ఆకుల్లోని మంచునీరు వాటి యాకలను తడుపుతున్నది. కాకులు అదేపనిగా కావు కావుమంటున్నాయి. ఒక కొమ్మ నుంచి మరో కొమ్మమీదికి ఎగురుతూ, ఆకుల మధ్య నుంచి తలలు పైకెత్తిచూస్తూ, రెక్కలు టపటప లాడిస్తూ, మధ్య మధ్య ముక్కులతో పొడుచుకొని రెక్కలను శుభ్రంచేసుకుంటున్నాయి. ధృడంగా వున్న ఆ కొమ్మమీద సుమారు అరడజను కాకులు కూర్చున్నాయి. ఇంకా ఎన్నోరకాల పక్షులు ఆ చెట్టునిండా చెదరుమదరుగా వాలి, ప్రాతఃకాల స్నానాలు చేస్తున్నాయి.

ఈ నిశ్శబ్దం వ్యాపిస్తున్నది. ఆ కొండలను కూడా దాటి అవలగా పోతున్నది. రోజూలాగే పిల్లల అరుపులూ, నవ్వులూ మొదలయినాయి. తోట మెలమెల్లగా నిద్ర నుంచి మేలుకుంటున్నది.

ఈ రోజు చల్లగా వుండేటట్లుగా వుంది. ఇక యిప్పుడు కొండలు సూర్యుడి కాంతిని చేదుకుంటున్నాయి. అవి చాలా పురాతనమైన కొండలు- బహుశ ప్రపంచంలోకల్లా అతిప్రాచీనమైనవేమో- చాలా శ్రద్ధతో చెక్కినట్లు అనిపిస్తున్న వింత వింత ఆకారాల రాళ్ళు ఒకదానిమీద ఒకటి పేర్చిపెట్టినట్లుగా సుతారంగా నిలబడి వున్నాయి. అయితే గాలి వీచినా, చేతులతో కదిలించినా ఆ రాళ్ళు వాటిస్థానాలనుంచి పడిపోవు.

ఇది పట్నవాసాలకి చాలా దూరంగా వున్నలోయ. దీని మధ్య నుంచి మరో గ్రామానికి పోయే దారి వుంది. దారి ఎగుడుదిగుడుగా వుంటుంది. ఈ లోయలో ఏళ్ళ తరబడిగా నిలబడిపోయిన ప్రశాంతతను భగ్నంచేయడానికి కార్లు, బస్సులు ఏవీ యిటు రావు. ఎడ్లబళ్ళు పోతుంటాయి. అయితే వాటి కదలిక ఆ కొండల్లో ఒక భాగంగా కలిసి పోతుంది. ఈ ఎండిపోయిన నదీగర్భంలో కుండపోతగా వర్షాలు కురిస్తే తప్ప నీళ్ళు నిండవు. అక్కడి యిసుక ఎరుపు, పసుపు, మట్టిరంగుల మిశ్రమ వర్ణంలాగా వుంది. అది కూడా ఆ కొండలతో పాటు కదిలి పోతున్నట్లుగా వుంది. నిశ్శబ్దంగా నడిచిపోతున్న ఆ గ్రామీణులు కొండ రాళ్ళలాగా కనబడుతున్నారు.

రోజు గడిచిపోతున్నది. సాయంత్రమయ్యేసరికి, పడమటి కొండల్లో సూర్యుడు అస్తమిస్తుంటే, దూరంగా వున్న కొండలమీద నుంచి, చెట్లలో నుంచి నిశ్శబ్దం వ్యాపిస్తూ వచ్చి, చిన్న చిన్న పొదలనూ, పురాతనమైన మర్రిచెట్టునూ కప్పివేసింది. నక్షత్రాల ప్రకాశం ఎక్కువైన కొద్దీ, నిశ్శబ్దం అత్యంతమైన చిక్కదనాన్ని సంతరించుకున్నది. మనం భరించలేనంతగా.

గ్రామంలోని చిట్టిదీపాలు ఆరిపోయాయి. నిద్రతో పాటుగా యీ నిశ్శబ్దపు తీవ్రత్వం యింకా గాఢంగా, యింకా విశాలంగా, అన్నింటినీ తనలో యిముడ్చుకుంటూ

పెరిగిపోయింది. కొండలు కూడా బాగా నెమ్మది వహించినట్లు అనిపించింది. వాటి గుసగుసలు, వాటి కదలికలు ఆగిపోయాయి. బ్రహ్మాండమైన తమ బరువుని అవి కోల్పోయినట్లు కూడా అన్పించాయి.

ఆమె తనకు నలభై అయిదు ఏళ్ళు అని చెప్పారు. చాలా పొందికగా చీరకట్టుకొని వున్నారు. చేతులకు కాసిని గాజులున్నాయి. ఆమెతోపాటు వున్న పెద్దమనిషి ఆమె మేనమామట. అందరం నేలమీదే కూర్చున్నాం. అక్కడనుండి తోటంతా కనిపిస్తున్నది. ఒక మర్రిచెట్టు, కొన్ని మామిడిచెట్లు, పూలతో మెరిసిపోతున్న బోగన్ విల్లా, ఎదుగుతున్న కొబ్బరిచెట్లు కనబడుతున్నాయి. ఆమె విచారంగా వున్నారు. చేతులు అశాంతిగా కదులుతున్నాయి. తన లోపలినుంచి పొర్లుకొని వస్తున్న మాటలనీ, బహుశ కన్నీటిని కూడా బయటికి రాకుండా అణచివేసుకుంటున్నారు.

'మా మేనకోడలి గురించి మాట్లాడటానికి మీ వద్దకు వచ్చాం. కొద్ది సంవత్సరాల క్రితం యీమె భర్త పోయాడు. ఆ తరువాత కొడుకు పోయాడు. ఈమె దుఃఖాన్నుంచి తేరుకోలేక పోతున్నది. ఒక్కసారిగా వృద్ధాప్యం మీదపడ్డట్లుగా వున్నది. మాకు ఏం చేయాలో పాలు పోవడంలేదు. మామూలుగా వైద్యులు చెప్పే సలహాలేవీ పనిచేయడం లేదు. తన తక్కిన పిల్లల సంగతే పట్టించుకోవడం మానేసింది. రోజు రోజుకీ చిక్కి పోతున్నది. ఇదంతా చివరకు ఏవిధంగా పరిణమిస్తుందో తెలియడంలేదు. మిమ్మల్ని చూడాలని యీమె పట్టుబట్టడం వల్లనే యిక్కడికి వచ్చాము' అని ఆ మేనమామ చెప్పారు.

'నాలుగు సంవత్సరాల క్రితం నా భర్తను పోగొట్టుకున్నాను. ఆయన డాక్టరు; కేన్సరుతో పోయారు. చాలాకాలం తనకు కేన్సరున్న సంగతి నాకు చెప్పకుండా దాచి వుంచారు. ఇక చివరికి, అంటే ఆఖరి సంవత్సరంలో మాత్రమే నాకు ఆ సంగతి తెలిసింది. డాక్టర్లు మార్ఫిన్ మొదలైన మత్తుమందు లిచ్చేవారు. అయినా ఆయన విపరీతమైన బాధ అనుభవించారు. నా కళ్ళముందే కృశించి, కృశించి, చివరకు లేకుండా పోయారు'.

అక్కడ ఆపేశారు ఆవిడ, కళ్ళనీళ్ళు వుక్కిరిబిక్కిరి చేసేశాయి. కొమ్మమీద ఒక పావురం కూర్చొని చిన్నగా కువకువలాడుతున్నది. దాని రంగు కొంచెం మట్టిరంగు, కొంచెం బూడిదరంగు కలిసిన మిశ్రమంలాగా వుంది. చిన్న తల, పెద్ద శరీరం- మరీ అంత పెద్దది కాదు, పావురాయి కదా! అంతలోనే అది ఎగిరిపోయింది. పావురం ఎగిరిన వూపుకి కొమ్మ పైకీ కిందకూ వుయ్యాలలూగడం మొదలుపెట్టింది.

'ఈ ఒంటరితనాన్ని ఎందుకో నేను భరించలేక పోతున్నాను. ఆయన లేని జీవితం అర్థవిహీనంగా వుంది. నా పిల్లలంటే నాకు ప్రేమే. ముగ్గురు పిల్లలుండేవారు. ఒక అబ్బాయి, యిద్దరమ్మాయిలు. క్రిందటి సంవత్సరం ఒకరోజు మా అబ్బాయి స్కూలునుంచి ఒక వుత్తరం రాశాడు, తనకు ఒంట్లో బాగుండటం లేదని. ఆ తరువాత కొద్దిరోజులకే హెడ్‌మాస్టరు ఫోనుచేసి, మా అబ్బాయి చనిపోయాడని చెప్పారు.'

ఇక ఆమె ఆపుకోలేక వెక్కివెక్కి ఏడవడం మొదలుపెట్టారు. కొద్దిసేపటికి, ఒక వుత్తరం తీసి చూపించారు. అందులో ఆ అబ్బాయి తనకు ఒంట్లో బాగుండటంలేదనీ, యింటికీ రావాలనుందనీ, అమ్మా నీవు కులాసాగా వున్నావని తలుస్తున్నాననీ రాశాడు తనగురించి పిల్లవాడికి ఎంత శ్రద్ధ వుండేదో ఆమె వివరించి చెప్పారు. అసలు అతనికి స్కూలుకి వెళ్ళడం యిష్టంలేదనీ, తల్లిని కనిపెట్టుకొని వుండాలనుకున్నాడనీ ఆమె చెప్పారు. దాదాపుగా అతన్ని బలవంతంచేసి స్కూలుకి పంపారట. ఎందుకంటే తనతో వుంటే తన దుఃఖం అతన్ని బాధిస్తుందేమోనని. ఇప్పుడింక అంతా అయిపోయింది. ఆడపిల్లలిద్దరూ చాలా చిన్నవాళ్ళు. జరిగినదంతా పూర్తిగా గ్రహించే వయసు కాదు. ఆమెకి మళ్ళీ ఆవేశంలాగా వచ్చింది. "ఏం చేయాలో నాకు తోచడంలేదు. మృత్యువు నా జీవితపు పునాదులను మొదలంటా కుదిపివేసింది. ఒక యిల్లు కట్టుకున్నట్లుగా మా వివాహజీవితాన్ని గట్టి పునాదులు వేసి నిర్మించామని మేము అనుకున్నాం. ఈ విపరీత సంఘటనలవల్ల అంతా సర్వనాశనమై పోయింది.'

ఆ మేనమామకి దేవుడిలో విశ్వాసం వున్నట్లుంది. సంప్రదాయ వాదిలాగా వున్నాడు. అందుకని, 'ఇదంతా ఆ పరమాత్ముడి లీల. ఈమె చేత అన్ని కర్మకాండలూ చేయించాను. కాని ఆమెకు నెమ్మది చేకూరలేదు. పునర్జన్మలో నాకు నమ్మకం వుంది. అయితే యీమెకు అదీ ఓదార్పునివ్వడం లేదు. అసలు ఆ మాట మాట్లాడటానికే యీమె యిష్టపడటంలేదు. అదంతా అర్థంలేనిదిగా ఆమెకు కనబడుతున్నది. మేమెవ్వరం ఆమెని ఓదార్చలేక పోతున్నాం' అని అందించారు.

కొంతసేపు అందరం మౌనంగా కూర్చుండిపోయాం. ఆమె జేబురుమాలు అప్పటికి పూర్తిగా తడిసిపోయింది. సొరుగులో నుంచి తీసి యిచ్చిన కొత్త జేబురుమాలు ఆమె బుగ్గల మీద కన్నీటిని శుభ్రంగా తుడిచివేసింది. కిటికీలోంచి ఎర్రని బోగన్‌విల్లా తొంగిచూస్తున్నది. ప్రకాశవంతమైన దక్షిణపు కాంతి పడి ప్రతి ఆకూ వెలిగిపోతున్నది.

దీన్ని గురించి మీరు నిజంగానే లోతుగా మాట్లాడాలను కుంటున్నారా- లోపలగా వున్న మూలందాకా పోయి? లేదూ కొన్ని వివరణలతో, కొంత హేతు పూర్వకమైన

చర్చతో వోదార్పు చెందాలనుకుంటున్నారా? మీకు తృప్తి కలిగించే కొన్ని మాటల ఆసరాతో దుఃఖాన్ని మరిచిపోవాలనుకుంటున్నారా?

'దీన్ని గురించి లోతుగా వెళ్ళి చూడాలనుకుంటున్నాను. అయితే మీరు చెప్పబోయేదానిని విని తట్టుకునే సామర్థ్యం కాని, బలంకాని నాకు వున్నాయా అని సందేహిస్తున్నాను. మావారు బతికున్న రోజుల్లో మీ ప్రసంగాలు వినడానికి అప్పు డప్పుడు వస్తుండేవాళ్ళం. కాని యిప్పుడు మీరు చెప్పేది అర్థంచేసుకోవడం నాకు చేతనవుతుందో లేదో' అని ఆమె జవాబిచ్చారు.

మీలో దుఃఖం ఎందుకు వుంది? దానిని సమర్థిస్తూ కారణాలు వివరించకండి. ఎందుకంటే అదంతా మీ మనోభావాలను మాటల్లో పేర్చి చెప్పడం అవుతుందే తప్ప అసలు వాస్తవం కాదు. అందుకని మేము ప్రశ్న అడిగినప్పుడు దయచేసి సమాధానం చెప్పకండి. ఊరికే వినండి. విని మీ అంతట మీరే తెలుసుకోండి, ఈ మరణం అనే దుఃఖం ఎందుకు వున్నది- పేద వారికి, గొప్ప వారికి; బాగా అధికారబలం వున్నవాళ్ళకు, బిచ్చగాళ్ళకూ, ప్రతి యింట్లోనూ? మీరెందుకు దుఃఖిస్తున్నారు? మీ భర్త కోసమా- లేక మీ కోసమేనా? అతని కోసమే గనుక దుఃఖిస్తుంటే, మీ కన్నీళ్ళు అతనికేమైనా సహాయం చేయగలవా? ఆయన పోయారు, యింక తిరిగిరారు. మీరు ఏంచేసినా సరే, అతను మళ్ళీ మీవద్దకు ఎన్నడూ తిరిగి రాలేరు. కన్నీళ్ళు కాని, నమ్మకాలు కాని, కర్మకాండలు కాని, దేవుడు కాని అతన్ని తిరిగి తీసుకొని రాలేవు. మీరు ఒప్పుకొని తీరవలసిన వాస్తవం అది. ఈ విషయంలో మీరు యింకేమీ చేయలేరు. కాని, ఒకవేళ మీరు ఏడుస్తున్నది మీ కోసమే అయితే, మీ ఒంటరితనం, మీ శూన్యజీవితం, మీరు పొందిన యింద్రియ సుఖాలు, మీ సన్నిహిత స్నేహం తలుచుకొని మీరు ఏడుస్తుంటే, అప్పుడు మీరు ఏడుస్తున్నది నిజంగా మీ లోపలి శూన్యత్వం వల్ల, మీపై మీకే జాలివేయడం వల్ల. మీలో వున్న అంతర్గతమైన పేదరికం గురించిన స్పృహ కలగడం బహుశ యిదే మొట్టమొదటిసారి అనుకుంటా. మీ పెట్టుబడి అంతా మీ భర్తమీద పెట్టారు. అవునా కాదా? మృదువుగా చెప్పాలంటే యీ పెట్టుబడి మీద సౌఖ్యం, తృప్తి, సంతోషం మీకు లభించాయి. మీరు యిప్పుడు పడుతున్న బాధ అంతా ఆ వెలితి; ఒంటరితనం వల్ల, ఆందోళనల వల్ల కలిగిన మనోవ్యధ- యిదంతా ఒకరకంగా మీ మీద మీరు జాలిపడటమే; అవును కదూ? దానివైపు పరికించి చూడండి; అది చూసి హృదయాన్ని కఠినం చేసుకోకండి. చేసుకొని, 'నేను నా భర్తని ప్రేమిస్తున్నాను, ఒక్క రవ్వంత కూడా నా గురించి ఆలోచించడం లేదు. అతన్ని కాపాడుకోవాలనుకున్నాను, తరచు అతని మీద అధికారం చేసింది కూడా యీ కారణంగానే. అయితే అదంతా అతని కోసమే. నా కోసం నేను ఎప్పుడూ

ఆలోచించుకోలేదు.' అని అనకండి, అతను యిప్పుడు వెళ్ళిపోయారు కాబట్టి మీ అసలు పరిస్థితి ఏమిటి అన్నది యిప్పుడే గ్రహిస్తున్నారు, కాదూ? అతని మరణం మిమ్మల్ని కుదిపివేసింది. యదార్థమైన మీ మానసిక పరిస్థితినీ, హృదయస్థితినీ మీకు చూపించింది. అటువైపు చూడటం మీకు యిష్టంలేక పోవచ్చు; భయంవల్ల అదంతా నిరాకరించవచ్చు; కాని మీరు మరి కాస్త పరిశీలనగా చూస్తే, మీ లోపలే వున్న ఒంటరి తనం కారణంగా, మీ లోపల వున్న అంతర్గత పేదరికం కారణంగా మీరు దుఃఖిస్తున్నారని గ్రహిస్తారు- ఇదంతా మీ మీద మీరే జాలిపడుతూవుండటం వల్ల జరుగుతున్నది.

'మీరు చాలా నిర్దాక్షిణ్యంగా మాట్లాడుతున్నారు, కాదా చెప్పండి' అన్నారు ఆమె. 'మీరు ఎంతో వూరట కలిగిస్తారని వచ్చాను. కాని మీరు నాకిస్తున్నది ఏమిటి?'

చాలామందికి వుండే భ్రాంతుల్లో యిదీ ఒకటి- అంతర్గతమైన వూరట అనేది ఒకటి వుంటుందని, ఎవరో ఒకరు అది మీకు యివ్వగలుగుతారని మీరనుకుంటారు. లేదా మీ అంతట మీరే అది సంపాదించాలనుకుంటారు. అటువంటిది అసలు లేనే లేదని చెప్తున్నాను. ఊరట కోసం మీరు వెతుకుతుంటే భ్రాంతిలోనే జీవించక తప్పదు. ఆ భ్రాంతి బ్రద్దలైనప్పుడు బాధపడక తప్పదు. ఎందుకంటే దానితోపాటు ఆ వూరట కూడా మాయమవుతుంది. అందువల్ల దుఃఖాన్ని అవగాహన చేసుకోవడానికి లేదా దుఃఖాన్ని మించి ఆవలగా పోవడానికి, అంతర్గతంగా అసలు ఏం జరుగుతున్నదో చూడాలి తప్ప, దానికి ముసుగు వేసి దాచకూడదు. ఇదంతా స్పష్టంగా చూపించడం నిర్దాక్షిణ్యత కాదు కదా, ఏమంటారు? ఇందులో మనం సిగ్గుపడవలసినంత అసహ్యకరమైనదేమీ లేదు. ఇదంతా చాలా స్పష్టంగా మీరు గ్రహించినప్పుడు, ఆ క్షణమే అందులో నుండి బయట పడిపోతారు. జీవితంలోని సంఘటనలు మిమ్మల్ని ఏ మాత్రం తాకకుండా, ఒక్క గాటుకాని, ఒక్క మచ్చగాని-మీమీద వదలకుండా, ఎప్పటికీ నవ్యనూతనంగా మీరు వుండిపోతారు. మరణం అన్నది మన అందరికీ అనివార్యమే. దానినుంచి ఎవ్వరమూ తప్పించుకోలేము. దానిని మించిపోయి తప్పించుకోవాలనే ఆశతో రకరకాల నమ్మకాలని పట్టుకొని వేలాడతాం, రకరకాల తాత్పర్యాలు కనిపెట్టాలని ప్రయత్నిస్తుంటాం. మీరు ఏమయినా చేయండి, అది లేకుండా పోదు. రేపో, త్వరలోనేనో, ఎన్నో ఏళ్ళ తర్వాతో- అది రాక మానదు. జీవితంలోని యీ అతి పెద్ద వాస్తవం మనల్ని తాకకుండా వదలదు.

'కాని...' అంటూ మొదలుపెట్టారు ఆ మేనమామ. ఆత్మ అనేది ఒకటి వున్నదనీ, అది కలకాలం కొనసాగే శాశ్వత సత్యమనీ నమ్మే సాంప్రదాయికమైన విశ్వాసాలన్నీ బయటకు వచ్చాయి. ఆయన తనకి బాగా పరిచయం వున్న రంగంలోకి ప్రవేశించారు. యుక్తి యుక్తమైన వాదాలతోను, వుదాహరణల వ్యాఖ్యలతోను బాగా నలిగిన రంగం

అది. హఠాత్తుగా ఆయన లేచి నిటారుగా కూర్చోవడం అందరూ గమనించారు. ఆయన కళ్ళల్లోకి యుద్ధపు మెరుపులు, మాటలతో చేసే యుద్ధపు మెరుపులు వచ్చాయి. సానుభూతి, ప్రేమ, అవగాహన అన్నీ పోయాయి. ఆయన యిప్పుడు నమ్మకమూ, సంప్రదాయమూ అనే పవిత్ర రంగం మీదకు, నిబద్ధీకరణం అనే అతిభారమైన బరువుతో బలంగా ముద్రలు పడిపోయిన రంగం మీదకు ప్రవేశించారు. 'కాని ఆత్మ అనే ఒకటి మనందరిలోనూ వున్నది! అది పునర్జన్మల ద్వారా కొనసాగుతూవుంటుంది, చివరకు తానే బ్రహ్మ అనే పరమార్థాన్ని చేరుకునేదాకా జన్మిస్తూనే వుంటుంది. ఆ పరమసత్యాన్ని అందుకోవాలంటే యీ దుఃఖాన్ని మనం అనుభవించి తీరాలి. మనం మాయలో జీవిస్తుంటాం. ఈ లోకమంతా మాయ. పరమసత్యం మాత్రం ఒకే ఒక్కటి.'

అట్లా సాగిపోతున్నారు ఆయన. ఆమె నావైపే చూస్తున్నారు, ఆయన చెప్తున్నది వినిపించుకోవడం లేదు. ఆమె ముఖం సన్నని చిరునవ్వుతో విచ్చుకోవడం మొదలుపెట్టింది. మేమిద్దరం తిరిగివచ్చిన పావురంవైపు, ఎర్రగా మెరిసిపోతున్న బోగన్‌విల్లా పూలవైపు చూస్తూ వుండిపోయాం.

ఈ భూమిమీద కాని, మనలో కాని శాశ్వతమైనవి ఏవీ లేవు. ఒకదానిని, గురించి తాము ఆలోచన చేసి, దానికి శాశ్వతంగా వుండే గుణాన్ని ఆపాదించగలవు ఆలోచనలు. ఒక మాటకు, ఒక భావానికి, ఒక సంప్రదాయానికి ఆలోచనలే శాశ్వతత్వాన్ని యిస్తాయి. ఆలోచన తాను శాశ్వతం అని అనుకుంటుంది. కాని, అది శాశ్వతమా? ఆలోచన అంటే స్మృతి స్పందించడం. ఆ స్మృతి శాశ్వతమా? ఆలోచన ఒక కాల్పనిక బింబాన్ని నిర్మించి, ఆ కల్పిత చిత్రానికి కొనసాగే గుణమూ, శాశ్వతత్వమూ యిచ్చి, దానికి ఆత్మ అనో, లేదూ యింకొక పేరో పెట్టగలదు. భర్తదో, భార్యదో ఒక ముఖాన్ని జ్ఞాపకం పెట్టుకొని, దాన్ని పట్టుకొని వేలాడనూగలదు. ఇదంతా ఆలోచనలు చేసే కార్యకలాపాలు. ఇవి భయాన్ని సృష్టిస్తాయి, ఆ భయంలోనుండి శాశ్వతత్వం కోసం తపన బయలుదేరుతుంది- రేపు భోజనం దొరకదేమో, ఆశ్రయం దొరకదేమో అనే భయాలు, మరణం అంటే భయం మొదలైనవి. ఆలోచనలకు ఫలితమే యీ భయం. బ్రహ్మం కూడా ఆలోచనలు తయారు చేసిన వుత్పత్తే.

'స్మృతి, ఆలోచన కొవ్వొత్తి వంటివి. వాటిని ఆర్పేయవచ్చు, మళ్ళీ వెలిగించ వచ్చు. మర్చిపోతారు, మళ్ళీ కొంతకాలానికి జ్ఞాపకం తెచ్చుకుంటారు. చనిపోతారు, మళ్ళీ యింకో జన్మలో పునర్జన్మ ఎత్తుతారు. కొవ్వొత్తిలో వెలిగే జ్వాల ఒకటే- ఒకటి కానూ కాదు. కాబట్టి, యీ జ్వాలలో కొనసాగడం అనే ప్రత్యేక గుణం వున్నది' అని మేనమామ అన్నారు.

కాని ఆర్పివేసిన జ్వాల, క్రొత్త జ్వాల ఒక్కటి కావు. పాతదానిని అంతంచేశాకే కొత్తది వస్తుంది. ఒక్కటే రూపాంతరం చెందుతూ ఎప్పటికీ కొనసాగుతుంటే కొత్తది అప్పుడు వుండనే వుండదు. వేయి నిన్నలను కొత్తవాటిగా మార్చలేము. కొవ్వొత్తి కూడా పూర్తిగా కాలాక అయిపోతుంది. ప్రతిదీ, కొత్తది రావడం కోసం సమాప్తమై తీరాలి.

ఇప్పుడు ఆ మేనమామకు వుదాహరణాల వ్యాఖ్యలు, నమ్మకాలు, యితరుల సూక్తులు ఏవీ సహాయపడటం లేదు. అందుకని తనలోకి తను ముడుచుకొనిపోయి, మెదలకుండా కూర్చున్నారు. అయితే ఆయనలో అయోమయం, ఆగ్రహం కూడా కలిగాయి. ఎందుకంటే తాను ఏమిటో ఆయనకే చాలా బాహాటంగా కనిపించింది. తన మేనకోడలిలాగే ఆయనా ఆ వాస్తవాన్ని సూటిగా చూడటానికి యిష్టపడటంలేదు.

'ఇదంతా నాకు అక్కర్లేదు' అన్నారు ఆమె. 'నేను దారుణమైన వేదనలో వున్నాను. భర్తనీ, కొడుకునీ పోగొట్టుకున్నాను. ఇద్దరు పిల్లలూ, నేనూ మిగిలి వున్నాం. నేను యిప్పుడు ఏం చేయాలి?'

ఆ యిద్దరు పిల్లల మీద కనుక మీకు శ్రద్ధవుంటే, మీ గురించి, మీ వేదన గురించి విచారించరు. వాళ్ళ ఆలన, పాలన చూస్తారు; సవ్యంగా చదివిస్తారు, సగటురకంగా తయారవకుండా వాళ్ళని పెంచుతారు. మీమీదే జాలిలోపడి మీరు మునిగిపోరు. దానినే 'నా భర్తమీద ప్రేమ' అని అంటూవుంటే, మీ ఒంటరితనంలోకి మీరు ముడుచుకొని పోతూవుంటే, యీ యిద్దరు పిల్లల జీవితాలని కూడా మీరు ధ్వంసం చేసేస్తారు. మనకి తెలిసో, మనకి తెలియకుండానో విపరీతమైన స్వార్థపరత్వం మనందరిలోనూ వున్నది. మనకి కావలసినవి మనకు దొరుకుతున్నంతవరకు అంతా సవ్యంగా వున్నట్లు పరిగణిస్తాం. దీన్నంతటినీ భగ్నం చేసే సంఘటన ఏదయినా జరిగిన మరుక్షణమే నిస్పృహతో ఏడ్చేస్తాం. ఇంకోరకమైన సౌఖ్యాలకోసం చూస్తాం. అవీ యీ విధంగానే భగ్నమవడం ఖాయమనుకోండి. ఈ ప్రక్రియ అంతా యిట్లాగే సాగిపోతూ వుంటుంది. ఇందులో వున్న సాధక బాధకాలన్నీ పూర్తిగా తెలుసుకొని కూడా, దానిలో చిక్కుకొని పోవాలని మీరు కోరుకుంటే, నిక్షేపంగా కానివ్వండి. అయితే అందులోని అసంబద్ధతనంతా గ్రహించినప్పుడు దానంతట అదే మీ ఏడుపూ ఆగిపోతుంది, మీరు ఒంటరితనంలో మునిగిపోవడమూ మానేస్తారు. ఒక కొత్త కాంతితో, ఒక చక్కని చిరునవ్వుతో మీ పిల్లలతో జీవితం గడపడం ఆరంభిస్తారు.

*(ది వోన్లీ రివల్యూషన్)*

# భద్రత

వరిమళ్ళని చుట్టుకుంటూ పోతున్న యీ త్రోవ పక్కనే ఒక చిన్న కాలువ మందంగా ప్రవహిస్తూ వుంది. దాని నిండా తామరపూలు విచ్చుకొని వున్నాయి. మధ్యలో బంగారపు రంగు బొడ్లతో వున్న ఆ ముదురు వూదా రంగు పూలు నీళ్ళమీద బాగా పైకి వచ్చి తేలుతున్నాయి. వాటి పరిమళం పూలని అంటిపెట్టుకొని అక్కడే వుండిపోయింది. చాలా అందంగా వున్నాయి ఆ పూలు. ఆకాశం మేఘావృతమై వుంది. సన్నగా జల్లు పడడం మొదలయింది. మబ్బులు వుండి వుండి వురుము తున్నాయి. ఎక్కడో చాలా దూరంలో మెరుపులు మెరుస్తున్నాయి. కాని త్వరలోనే మేము నిలబడిన చెట్టు వైపుగానే రాబోతున్నాయి. వర్షం బాగా ఎక్కువైంది. తామర ఆకులమీద నీటి బిందువులు నిలబడిపోతున్నాయి. నీటి బిందువులు కొన్ని పోగయ్యాక, అవి మరీ పెద్దవైనప్పుడు ఆకులమీద నుంచి జారి కిందపడిపోతున్నాయి. మళ్ళీ కొత్త బిందువులు పోగవుతున్నాయి. ఇప్పుడు మా చెట్టుమీదే మెరుపులు మెరవడం ఆరంభమైంది. పశువులు భయపడిపోయి కట్టుతాళ్ళని తెంచుకోవడానికి ప్రయత్నిస్తు న్నాయి. నల్లని దూడ ఒకటి బాగా తడిసి, వణికిపోతూ, అతిదీనంగా అరిచింది. తరువాత తాడు తెంపేసుకొని, దగ్గిరలోనే వున్న గుడిసెలోకి పరుగెత్తింది. తామరపూలు గట్టిగా ముడుచుకొని పోతున్నాయి. చుట్టూ ముసురుకుంటున్న చీకట్లనుండి తమ హృదయాలను దాచుకుంటున్నాయి. ఇప్పుడు వాటి లోపల వున్న బంగారపురంగు బొడ్లను చూడాలంటే వూదారంగు పూరేకులను బలంగా పీకి తెరవాలిసిందే. మళ్ళీ సూర్యుడు కనబడేదాకా అవి గట్టిగా ముడుచుకొనిపోయి వుంటాయి. అట్లా నిద్ర పోతున్నప్పుడు కూడా అవి ఎంతో అందంగా వున్నాయి. విద్యుల్లతలు వూరివైపుగా కదులుతున్నాయి. ఇప్పుడిక బాగా చీకటి పడిపోయింది. కాలువ నీటి గలగలల చప్పుడు మాత్రం సన్నగా చెవులకు వినిపిస్తున్నది. ఈ త్రోవే గ్రామాన్ని దాటుకుంటూ రహదారి వద్దకు చేరుస్తుంది. ఆ రహదారిమీదే ప్రయాణించి, కోలాహలంగా వుండే పట్టణాన్ని, తిరిగి మేము చేరుకున్నాం.

అతను యువకుడు. వయసు యిరవైలలో వుంటుంది. మంచి పోషణలో పెరిగిన శరీరం. ప్రపంచం కొంత తిరిగి చూశాడు. కళాశాలలో చదువుకున్నవాడు. భయభయంగా కనబడుతున్నాడు. అతని కళ్ళల్లో ఆదుర్దా వుంది. అప్పటికే ఆలస్యమైంది. కాని అతను ఏదో మాట్లాడాలన్నాడు. తన మనసును ఎవరయినా శోధించి, అక్కడ ఏమున్నదో వెదికి కనిపెట్టాలని కోరాడు. చాలా మామూలుగా తనని

గురించి తాను చెప్పుకున్నాడు. కాస్తయినా సంకోచమూ, దాపరికమూ కనబరచలేదు. అతని సమస్య ఏమిటో స్పష్టంగానే తెలుస్తున్నది, కాని అతనికి అది కనబడటంలేదు. అందువల్ల తడుముకుంటున్నాడు.

'ఉన్నది' ఏమిటో దానిని మనం వినిపించుకోము, కనిపెట్టము. మన వూహలు, మన అభిప్రాయాలు యితరుల మీద రుద్దుతూ వుంటాం. ఇతరులని మన ఆలోచనల చట్రంలో యిరికించాలని ప్రయత్నిస్తుంటాం. 'ఉన్నది'ని కనిపెట్టడంకంటె మన ఆలోచనలు, మనం చేసే న్యాయనిర్ణయాలు మనకి చాలా ముఖ్యం. 'ఉన్నది' చాలా సరళంగా వుంటుంది. క్లిష్టంగా వుండేది మనం. సరళంగా వుండే 'వున్నది'ని సంక్లిష్టపరచి, అందులో పూర్తిగా మునిగిపోతాం. రోజు రోజుకీ మన లోపల ఎక్కువై పోతున్న యీ గందరగోళమూ, అది చేసే గోలా మాత్రమే మనకు వినబడుతూ వుంటాయి. 'ఉన్నది' ని వినాలంటే మనకి స్వేచ్ఛ వుండాలి. అంటే అర్థం ఏ వ్యాపకాలూ వుండకూడదని కాదు. ఆలోచన కూడా ఒక రకమైన వ్యాపకమే. నిశ్శబ్దంగా వుండటానికి యివేవీ మనకి అడ్డుతగల కూడదు. అట్లా నిశ్శబ్దంగా వున్నప్పుడే వినడం అనేది సాధ్యపడుతుంది.

అతను యిట్లా చెప్పాడు. నిద్ర పట్టబోతూ వున్నప్పుడు హఠాత్తుగా ఏ ఆకారమూ లేని అచ్చమైన భయం అతన్ని లేపి కూర్చోబెడుతుందిట. ఆ సమయంలో గది స్వరూపమే తల్ల క్రిందులై పోతుంది. గోడలు నేలమట్టంగా వుంటాయట. పైన కప్పు వుండదు. కింద నేల మాయమవుతుంది. అతను భయంతో వణికి పోతుంటాట్ట. ఉగచెమటలు పోస్తాయి. చాలా సంవత్సరాలుగా యిట్లా జరుగుతున్నదిట.

దేన్ని గురించి మీరు భయపడుతుంటారు?

'నాకు తెలియదు. కాని ఆ భయంతో నాకు మెలకువ వచ్చినప్పుడు మా అక్కయ్య వద్దకో, మా అమ్మానాన్నల వద్దకో వెళ్తుంటాను. కాసేపు వాళ్ళతో మాట్లాడాక నాలో అలజడి తగ్గిపోతుంది. ఆ తరువాత మళ్ళీ నిద్రపోతాను. వాళ్ళు అర్థంచేసు కుంటారు. అయితే నాకు యిరవై ఏళ్ళు దాటాయి. ఇదంతా చాలా వెర్రితనంగా అనిపిస్తున్నది.' మీరు భవిష్యత్తుని గురించి వ్యాకులపడుతున్నారా?

'ఆఁ, కొంత అదే. మేము బాగా వున్నవాళ్ళమే. అయినా నాకు యీ విషయంలో కొంత ఆందోళన వున్నది'.

ఎందువల్ల?

'నేను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. నా కాబోయే భార్యకు అన్నీ సౌకర్యంగా ఏర్పాటు చేయాలి.'

భవిష్యత్తుని గురించి ఆందోళన పడటం ఎందుకు? మీరు యింకా చాలా చిన్న వయసులో వున్నారు. ఉద్యోగం చేసి, భార్యకి కావలసినవన్నీ సమకూర్చవచ్చు. ఎప్పుడూ అదే ధ్యాసలో పడిపోయివుండటం ఎందుకు? సమాజంలో మీకున్న హోదా పోతుందేమోననే భయం మీలో వున్నదా?

'కొంతవరకు అదీ వుంది. మాకు కారు వున్నది, కొంత ఆస్తి, పేరు ప్రఖ్యాతులు వున్నాయి. ఇదంతా పోగొట్టుకోవాలని లేకపోవడం సహజమే. బహుశ నా భయానికి అదే కారణమై వుండచ్చు. కాని పూర్తిగా అదే కాదు. అసలు భయం నా అస్తిత్వం పోతుందేమోనన్నది. భయంతో నాకు మెలకువ వచ్చినప్పుడు, నాకు అంతా అయోమయంగా అనిపిస్తుంది. నేను ఎవరినీ కాను అని అనిపిస్తుంది, ముక్కలు ముక్కలై నేను విరిగిపడిపోతున్నట్లుగా అనిపిస్తుంది.'

ఒకవేళ ఏదయినా కొత్త ప్రభుత్వం వస్తే, మీ ఆస్తి, మీ సంపద అంతా మీరు కోల్పోవచ్చు. కాని మీరు యింకా చిన్నవయస్సులోనే వున్నారు. ఉద్యోగం చేసి, సంపాదించుకోవచ్చు. లక్షలాదిమంది తమ యిళ్ళూ వాకిళ్లూ పోగొట్టుకుంటున్నారు. మీకూ అది జరుగుతే జరగచ్చు. అంతే కాకుండా, అసలు ప్రపంచంలో వున్న సంపద అందరూ పంచుకోవాలి తప్ప, కొద్దిమంది చేతుల్లో వుండటం సమంజసం కాదు. ఈ వయసులో యింత సనాతనమైన పాతధోరణి ఆలోచనలు ఎందుకున్నాయి మీలో, ఆస్తి పోతుందని అంత భయం ఎందుకు?

'చూడండి, ఒక అమ్మాయిని నేను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. దీనికి ఏ అవరోధాలు వస్తాయోనని భయపడుతున్నాను. మమ్మల్ని ఏవీ ఆపలేవని నాకు తెలుసు; ఆమెని విడిచి నేను, నేను లేకుండా ఆమె వుండలేక పోతున్నాం. నా భయానికి గల కారణాలలో యిదీ ఒకటేమో.'

మీ భయానికి కారణం అదేనా? మీకు తెలిసినంతలో మీ వివాహానికి అడ్డుతగిలేది ఏదీ లేదని మీరు గట్టిగా చెప్తున్నారు. అట్లాంటప్పుడు యింకా యీ భయం దేనికి?

'నిజమే. మేము ఎప్పుడు కావాలని నిర్ణయించుకుంటె అప్పుడు వివాహం చేసుకోవచ్చు. కాబట్టి నా భయానికి అది కారణం కాకపోవచ్చు. కనీసం ప్రస్తుతానికి. బహుశ నేను భయపడుతున్నది నా అస్తిత్వం లేకుండా పోతుందని అనుకుంటా. నేను అనే వ్యక్తి ఒకరు, నా పేరు యివి లేకుండా పోతాయని'.

మీ పేరును గురించి మీరు లెక్కచేయకపోయినా, మీ ఆస్తిపాస్తులన్నీ భద్రంగా వున్నా అప్పుడు కూడా మీలో ఏదో భయం వుంటుంది కదూ? అసలు మీరు- అంటే అర్థం ఏమిటి? మీ పేరు, మీ ఆస్తిపాస్తులు, మీరు అనే వ్యక్తి, మీ ఆలోచనలు వీటితోనేగా మిమ్మల్ని గుర్తించేది; ఏదో ఒకదానికి సంబంధించినవారుగా, ఫలానా వారు, ఫలానా వీరు అని గుర్తించడం, ఒక ప్రత్యేకమైన సమూహానికో, దేశానికో చెందినవారుగా ముద్ర వేసుకోవడం మొదలైనవి. ఈ ముద్రను పోగొట్టుకుంటానేమోనని మీ భయం. అంతేనా?

'అంతే. అది లేకపోతే నేను ఎవర్ని? అంతే, అదే అసలు సంగతి'.

కాబట్టి, మీరు అంటే మీ స్వాధీనంలో వున్న మీ సంపదలు, మీ పేరు ప్రఖ్యాతులు, మీ కారు మొదలైన మీ ఆస్తులు, మీరు పెళ్ళిచేసుకోబోయే ఆ అమ్మాయి, మీలో వున్న ఆకాంక్షలు- మీరు అంటే యీ విషయాలే. ఈ విషయాలతో పాటు కొన్ని లక్షణాలు, కొన్ని విలువలు కూడా చేరి, మీరు అంటున్న యీ 'నేను' ను తయారు చేస్తున్నాయి. ఈ మొత్తం అంతా కలిపితే అదీ మీరు. దీనిని పోగొట్టుకుంటానేమో అనే మీ భయం. పోగొట్టుకోవడం అనేది అందరికీ జరిగినట్లే మీకూ జరిగే అవకాశం వుంది. యుద్ధం రావచ్చు, విప్లవం రావచ్చు. వామపక్షపు ప్రభుత్వం ఏర్పడచ్చు. ఈ రోజు కాని, రేపు కాని ఏదైనా జరిగి, మీకున్నవన్నీ పోవడం జరగచ్చు. అయితే భద్రతాలేమి అంటే యింతభయం ఎందుకు? భద్రతా రాహిత్యం చాలా సర్వ సహజమైన లక్షణం కాదూ? ఈ భద్రతారాహిత్యం నుండి రక్షించుకోవడానికి మీరు గోడలు నిర్మించుకుంటున్నారు. కాని యీ గోడలు కూడా పడిపోవచ్చు, పడిపోతున్నాయి కూడా. కొంతకాలం పాటు దీనినుంచి మీరు దూరంగా పారిపోవచ్చు. కాని భద్రతాలేమి అనే ప్రమాదం ఎప్పుడూ పొంచి వుంటూనే వుంటుంది. 'ఉన్నదాని' ని మీరు తప్పించు కోలేరు. మీకు యిష్టం వున్నా, లేకపోయినా భద్రతాలేమి అనేది వున్నది. అయితే దీని అర్థం మీరు యీ విషయంలో చేతులు ముడుచుకొని కూర్చోవాలని కాదు. అంగీకరించాలనీ కాదు, నిరాకరించాలనీ కాదు. మీరు యువకులు; మీరెందుకు భద్రతాలేమిని గురించి భయపడాలి?

'మీరు యిట్లా వివరించి చెప్పారు కాబట్టి భద్రతాలేమిని గురించి నేను భయపడటం లేదు. పనిచేయడానికి నాకు ఏ అభ్యంతరమూ లేదు. నేను చేస్తున్న వుద్యోగంలో రోజుకు ఎనిమిది గంటల పైగా పని వుంటుంది. నాకు పెద్దగా యిష్టంలేకపోయినా యిదే విధంగా కాలం గడిపివేయగలను. ఉహూఁ, ఆస్తి, కారు వగైరా పోతాయేమో అనే భయం లేదు నాకు. నేను ప్రేమిస్తున్న అమ్మాయిని నేను

ఎప్పుడు తలుచుకుంటే అప్పుడు వివాహం చేసుకోగలను. వీటిలో ఏవీ నా భయానికి కారణాలు కావని నాకు స్పష్టంగా తెలుస్తున్నది. అసలు కారణం ఏది?'

మనిద్దరం కలిసి కనిపెడదాం. అది యిదీ అని నేను మీకు చెప్పొచ్చు. కాని అప్పుడది మీరు స్వయంగా కనిపెట్టినట్లుగా వుండదు. మాటల స్థాయిలోనే వుంటుంది. కాబట్టి దానివల్ల వుపయోగం ఏదీ వుండదు. అది తెలుసుకోవడం మీ స్వంత అనుభవంగా వుండాలి. అదే అన్నింటికంటె అసలు ముఖ్య విషయం. కనిపెట్టడం అంటే అనుభవం. మన యిద్దరం కలిసి అది కనిపెడదాం.

మీ భయం వీటిలో ఏవైనా పోగొట్టుకుంటానేమో అన్నదానిని గురించి కాకపోతే, బాహ్యమైన భద్రతాలేమిని గురించి కూడా మీ భయం కాకపోతే, యిక మీ ఆదుర్దా దేన్ని గురించి? వెంటనే సమాధానం చెప్పేయకండి, వింటూ వుండండి, అంతే. అప్రమత్తంగా వుండి కనిపెట్టాలి మీరు. భౌతికమైన భద్రతారాహిత్యం కారణంగా మీరు భయపడటంలేదని బాగా గట్టిగా చెప్పగలరా? ఇటువంటి విషయాల్లో ఎంతవరకు నిశ్చయంగా చెప్పగలమో అంతమేరకు. మీ భయం యీ విషయంలో కాదు అని అంటున్నారు. ఇవి వట్టి మాటలు కావు అని కూడా మీరు గట్టిగా అంటున్నారు. ఇక అప్పుడు మీరు భయపడుతున్న అసలు విషయం ఏమిటి?

'భౌతికమైన భద్రతారాహిత్యం నా భయానికి కారణం కాదు. అందులో నాకు ఏ మాత్రం సందేహం లేదు. పెళ్ళి మేము ఎప్పుడంటే అప్పుడు చేసుకోవచ్చు. మాకు కావలసినవన్నీ వున్నాయి. కేవలం వస్తుసంపద పోగొట్టుకుంటానేమో అన్నదాని కంటే భిన్నమైనదేదో నన్ను భయపెడుతున్నది. అయితే అది ఏమిటి?'

అదే కనిపెడదాం. అయితే ప్రశాంతంగా అన్నీ పరిశీలిద్దాం. నిజంగానే యిది కనిపెట్టాలని మీకు వున్నది, వున్నదా లేదా?

'తప్పకుండా వున్నది. ఇప్పుడు యింతదూరం యీ విషయంలో ప్రయాణించాక యింకా గట్టిగా అనిపిస్తున్నది. దేనిని గురించి నేను భయపడుతున్నాను?'

అది కనిపెట్టాలంటే మనం ప్రశాంతంగా, అప్రమత్తంగా వుండాలి. ఏ మాత్రం ఒత్తిడి ప్రయోగించకూడదు. భౌతికమైన భద్రతాలేమి గురించి మీరు భయపడటం లేదు. సరే, అప్పుడు అంతర్గతంగా భద్రత లేదని భయపడుతున్నారా? మీరే నిర్దేశించుకున్న ఒక గమ్యాన్ని అందుకోలేరేమోనని భయమా? సమాధానం చెప్పకండి. వినండి, అంతే. ఏ గొప్పతనమూ సాధించలేని అసమర్థుడిని అని మీరు భావిస్తున్నారా? బహుశ మీలో ఆధ్యాత్మిక సంబంధమైన ఒక ఆదర్శం ఏదయినా వున్నదేమో. ఆ

విధంగా జీవించడానికి, దానిని అందుకోడానికి తగిన సామర్థ్యం మీకు లేదని భావిస్తున్నారా? ఇది చాలా నిరాశాజనకమైన భావాన్ని కలిగిస్తున్నదా? అపరాధభావాన్ని నిస్పృహనూ కలిగిస్తున్నదా?

'మీరు చెప్తున్నది నూరుపాళ్ళు నిజం. చాలా సంవత్సరాల క్రితం, నా చిన్నతనంలో మీ ప్రసంగాలు విన్నప్పటినుండీ మీరే నా ఆదర్శం అయ్యారు. ఇట్లా నేను అనవచ్చునో లేదో కాని నాకు మీలాగా వుండాలని వుంది. ఆధ్యాత్మికత మా రక్తంలోనే వున్నది. అందుకని మీలాగా నేను వుండగలను అని గట్టిగా అనిపించింది. అయితే, లోలోపల ఆ దరిదాపులకి కూడా చేరలేనేమో అనే భయం కూడా వుంటూనే వుంది.'

మనం మెల్లగా వెళదాం. బాహ్యంగా భద్రత లేకపోవడం గురించి మీరు భయపడకపోయినా, అంతర్గతమైన భద్రతాలేమి గురించి మీరు భయపడుతున్నారు. ఒక్కొక్కరు బాహ్యమైన భద్రత కోసం పరువు ప్రతిష్ఠలపైనా, కీర్తిపైనా, డబ్బుపైనా యింకా అటువంటివాటిపైనా ఆధారపడతారు. మీరు ఒక ఆదర్శం ద్వారా అంతర్గతమైన భద్రత సాధించాలని కోరుకుంటున్నారు. కాని ఆ ఆదర్శాన్ని అందుకునే శక్తి సామర్థ్యాలు మీలో లేవేమో అనీ అనుకుంటున్నారు. ఒక ఆదర్శంగా అవాలని, ఒక ఆదర్శాన్ని అందుకోవాలని ఎందుకు కోరుకుంటున్నారు? అక్కడ భద్రతా, రక్షణా వుంటాయని కదూ? ఈ సురక్షిత స్థానానికి మీరు ఆదర్శం అనే ఒక పేరు పెట్టారు. వాస్తవంగా మీరు కోరుతున్నది క్షేమంగా వుండాలని, సురక్షితంగా వుండాలని. అంతేనా?

'ఇంత సూటిగా మీరు చెప్పాక నాకు తెలుస్తున్నది, ఖచ్చితంగా ఇదే.'

'ఇప్పుడే యీ సంగతి మీరు కనిపెట్టారు, అవును కదూ? సరే, యింకా ముందుకు పోదాం. బాహ్యమైన భద్రత వట్టి డొల్ల అన్నది యిప్పుడు మీకు స్పష్టంగా తెలిసింది. అయితే, ఒక ఆదర్శాన్ని చేపట్టడం ద్వారా అంతర్గతమైన భద్రతను పొందాలనుకోవడంలోని మిథ్యను మీరు గ్రహిస్తున్నారా? ఇక్కడ డబ్బుకి బదులుగా ఆదర్శాన్ని రక్షణకోసం మీరు ఆశ్రయిస్తున్నారు. నిజంగానే యిది మీరు చూడగలుగుతున్నారా?

"అవును, నిజంగానే గ్రహించాను."

ఇక యిప్పుడు మీరు ఏమిటో అట్లాగే వుండండి. ఆదర్శం మిథ్య అని మీరు గ్రహించినప్పుడు, అది దానంతటది అదే రాలిపడిపోతుంది. 'ఉన్నది' ఏదో అదే మీరు.

ఇక అక్కడి నుండి 'వున్నది' ని అవగాహన చేసుకోవడం ఆరంభించండి. అయితే చివరకి ఒక గమ్యస్థానం చేరుకోవడం కోసం కాదు. గమ్యమూ, లక్ష్యమూ అనేవి 'వున్నది' కి ఎప్పుడూ చాలా దూరంలో వుంటాయి. 'ఉన్నది అంటే మీరే. అంటే ఒక ప్రత్యేక సమయంలో కాదు, ఒక రకమైన స్థితిలో వున్నప్పుడూ కాదు; ఒక్కొక్క క్షణంలోను మీరు ఎట్లా వుంటారో ఆ మీరు. మిమ్మల్ని మీరే నిరసించుకోకండి, నిరాశగా చూస్తూ కూర్చోనూవద్దు. ఏ తాత్పర్యాలూ చెప్పుకోకుండా 'వున్నది' యొక్క కదలికను జాగరూకతతో చూస్తూ వుండండి. ఇది చాలా కఠినమైన పనే. కాని అందులో ఎంతో ఆనందం వున్నది. స్వేచ్ఛగా వున్నవారికే ఆనందం లభిస్తుంది; 'ఉన్నది' అనే సత్యంతో పాటుగా మాత్రమే ఆ స్వేచ్ఛ లభిస్తుంది.

*(కమెంటరీస్ ఆన్ లివింగ్)*

# కోపం

**అంత** ఎత్తుమీద వున్నా వేడి మహా తీవ్రంగా వుంది. గాజు కిటికీ తలుపులని చేత్తో తాకి చూస్తే కాలుతున్నాయి. విమానాన్ని నడిపిస్తున్న యంత్రాల చప్పుడు జోలపాటలాగా వున్నది. చాలా మంది ప్రయాణీకులు కునుకు తీస్తున్నారు. నేల మాకు కిందగా, చాలా దూరంలో వుంది; బాగా వేడెక్కి తళతళమని మెరుస్తున్నది. అంతా మట్టినేలే, అక్కడక్కడ మాత్రం కాస్త పచ్చపచ్చగా కనిపిస్తున్నది. ఇంకాసేపయాక విమానం ఆగింది. ఇప్పుడు వేడి మరీ భరించలేనంతగా ఎక్కువైంది. నిజంగానే చాలా బాధాకరంగా వుంది. నీడలోకి వెళ్ళాక కూడా తలకాయ బ్రద్దలవు తుందేమోననిపించేంత వేడి. నడి వేసంకాలం అవడంతో ఆ ప్రాంతం అంతా దాదాపు ఎడారిలాగా వుంది. మళ్ళీ అందరం విమానం ఎక్కాం. చల్లని గాలులు వెతుక్కుంటూ విమానం యింకా ఎత్తులకి ఎగరడం ఆరంభించింది. ఇప్పుడు యిద్దరు కొత్త ప్రయాణీకులు ఎదురుగుండా కూర్చున్నారు. బాగా గట్టిగా మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ మాటలు వినకుండా వుండటం శక్యంకాని పని. ముందు కొంచెం మెల్లగానే మొదలుపెట్టారు. ఆపైన వాళ్ళ కంఠాల్లో కోపం ప్రవేశించింది. ఎంతోకాలంగా పరిచయమూ, లోలోపల విరోధమూ వుండటంవల్ల వచ్చే కోపం అది. వాళ్ళ వుద్రేకంలో తక్కిన ప్రయాణీకుల సంగతే మరిచినట్లున్నారు. వాళ్ళిద్దరూ ఎంత ఆందోళనలో మునిగి వున్నారంటే తక్కిన ప్రపంచపు వునికినే పట్టించుకోవడం లేదు.

అందరి నుంచీ దూరంగా విడదీసే ఒక ప్రత్యేక గుణం కోపంలో వుంటుంది. దుఃఖం లాగే యితర్లనుంచి మనల్ని దూరం చేస్తుంది. కనీసం ఆ కొంతసేపు అన్ని బాంధవ్యాలు అదృశ్యమై పోతాయి. ఏకాంతంగా వున్నవారిలో కనబడే దారుఢ్యమూ, జీవశక్తీ కోపంలో కూడా తాత్కాలికంగా వుంటాయి. కోపంలో ఒక వింతైన నిస్పృహ వుంటుంది. అసలు ఒంటరిపాటు అంటేనే నిస్పృహ. నిరాశలో, అసూయలో, గాయపరచాలనే వాంఛలో వుండే కోపం గొప్ప తీవ్రత్వంతో బయటపడుతుంది. అందులో తనని తాను సమర్థించుకోవడమనె సుఖం వుంటుంది. ఇతర్లని మనం నిరసిస్తాం. ఆ నిరసించడంలోనే మనల్ని సమర్థించుకోవడం వుంటుంది. ఏదో ఒక రకమైన యిటువంటి వైఖరి- తామే నీతిమంతులమనే స్వాతిశయంకానీ, లేదా ఆత్మన్యూనతాభావం కానిలేనప్పుడు మనం ఏమిటి? ధైర్యం తెచ్చుకొని బలం పుంజుకోవడానికి మనంతట మనమే రకరకాలుగా ప్రయత్నిస్తూ వుంటాం. ఇటువంటి పద్ధతుల్లో చాలా సులువైనది ద్వేషం. అటువంటిదే కోపమూ. మామూలు కోపం, క్షణాల మీద మరుపులో పడిపోయేదీ, ఛప్పున ఎగసి ఆరిపోయే మంట వంటిదీ అయిన కోపం- ఒక రకం. కావాలని ప్రయత్నపూర్వకంగా పెంచుకొని, మరగబెట్టి, గాయపరచాలని, ధ్వంసం చేయాలనీ చూసే కోపం పూర్తిగా మరొక రకానికి చెందినది. సరళమైన సాధారణ కోపానికి వెనుక ఏదో ఒక శరీరసంబంధమైన కారణం వుండచ్చు. అది కనిపెట్టి చికిత్స చేసి నయంచేసుకోవచ్చు. కాని మనోతత్వ సంబంధమైన కారణం వల్ల జనించే కోపం అంతకంటె క్లిష్టంగా వుంటుంది. దానితో వ్యవహరించడమూ కష్టమే. మనలో చాలామందికి కోపం తెచ్చుకోవడానికి ఏ అభ్యంతరమూ వుండదు. ఏదో ఒక సాకు కోసం చూస్తూ వుంటాం. మనల్ని కాని, మన తోటివారిని కానీ యితరులు కష్టపెడుతున్నప్పుడు ఎందుకు కోపం తెచ్చుకో గూడదు? అప్పుడు న్యాయం కోసం ఆగ్రహం తెచ్చుకుంటాం. కోపం వచ్చింది అని ఆ తర్వాత మాట్లాడకుండా వూరుకోవచ్చు కదా. అట్లా వూరుకోము. ఆ కోపానికి గల కారణాలను గురించి చాలా వివరంగా వ్యాఖ్యానాలు యిస్తాం. అసూయో, పగో నాకు వున్నది అని అనేసి వూరుకోం. దాన్ని సమర్థించడమో, దానిని గురించి వివరించడమో చేయాల్సిందే. అసూయ లేకుండా ప్రేమ వుంటుందా అని ప్రశ్నిస్తాం. ఎవరో చేసిన పనుల ఫలితంగా నాలో యీ కసి ఏర్పడింది అనీ యింకా యిట్లాంటివే ఎన్నో అంటూ వుంటాం.

మౌనంగా కాని, సంభాషణల ద్వారా కాని వివరించడం, మాటల్లో వ్యక్తీకరించడం కోపానికి విషయమూ, లోతూ యిచ్చి కోపం చల్లారి పోకుండా చూస్తాయి. మౌనంగానో, మాటల్లోనో మనం యిచ్చే వివరణాత్మక సమాధానాలు మనం ఏమిటి అన్నదానిని వున్నది వున్నట్లుగా కనిపెట్టకుండా అడ్డుతగిలే అవరోధంగా పనిచేస్తాయి. మనకి

మెప్పుదల, పొగడ్తలు కావాలి. ఎప్పుడూ ఆశగా ఎదురుచూస్తూ వుంటాం. అవి దొరకనప్పుడు నిరాశలో మునిగిపోతాం. మన లోపల కసి, యీర్ష్యే పెంచుకుంటాం. ఇక అప్పుడు వుద్రేకంగానో, నెమ్మదిగానో ఎవరో ఒకరి మీద తప్పు తోసేస్తాం. మనలోని యీ కటుత్వానికి బాధ్యత అంతా యితరులదే అని అంటాం. నీకు అందరికంటె గొప్ప ప్రాధాన్యం యిస్తాను, ఎందుకంటే నా సంతోషానికి, నా హోదాకి, నా పరువు ప్రతిష్ఠలకి నీమీద ఆధారపడతాను కాబట్టి. నీ ద్వారానే నా సార్థకత. అందుకని నాకు నీవు చాలా ముఖ్యం. నిన్ను రక్షించుకోవాలి, నిన్ను నా స్వాధీనంలో వుంచుకోవాలి. నా నుంచి నేను నీ ద్వారా తప్పించుకొని పారిపోతాను. వెనక్కి మళ్ళించి నన్ను నాకే ఎదురుగా నిలబెడితే, నా స్థితిని చూసి కలిగిన భయంలో కోపం తెచ్చుకుంటాను. కోపం రకరకాల రూపాలని తాలుస్తుంది; నైరాశ్యం, కసి, యీర్ష్యే మొదలైనవి.

కోపాన్ని కూడబెట్టుకున్నప్పుడు అది ద్వేషమవుతుంది; దీనికి విరుగుడుగా క్షమాగుణం అవసరమవుతుంది. అయితే క్షమాగుణాని కంటె యీ కోపాన్ని కూడబెట్టుకోవడం అన్నదానిదే అసలు ప్రధానపాత్ర. కోపాన్ని కూడబెట్టి దాచుకోవడమే లేకపోతే క్షమాగుణం ఆవశ్యకతే వుండదు. ద్వేషం వున్నప్పుడే క్షమించడమూ అవసరమవుతుంది. నిర్లక్ష్యభావం అనే కాఠిన్యాన్ని పెంచుకోకుండా పొగడ్తలనుంచి, గాయపడినట్లుగా భావించడం నుంచి విముక్తి చెందాలంటే కరుణ, దయాగుణమూ తప్పక కావాలి. ఒక సంకల్పం చేసుకోవడం ద్వారా కోపాన్ని పోగొట్టుకోవడం సాధ్యంకాదు. ఎందుకంటే సంకల్పం హింసలో ఒక భాగం. కోరికకు పర్యవసానంగా సంకల్పం కలుగుతుంది. మరొకటి అవాలనే వ్యామోహం అది. కోరిక అంటేనే దాని స్వభావంలో దూకుడూ, మనదే పైచేయిగా వుండాలనే తత్వమూ వుంటాయి. గట్టిగా సంకల్పించుకొని కోపాన్ని అణచివేయడం దాన్ని మరొక స్థాయిలోకి తీసుకొనిపోతుంది. అప్పుడు దాని పేరు యింకొకటవుతుంది. అయితే, అప్పుడు కూడా అది హింసలో భాగమే. అహింసను అలవాటు చేసుకోవడం ద్వారా హింసను వదుల్చుకోలేము. కోరికను అవగాహన చేసుకుంటేనే అది జరుగుతుంది. కోరికకు బదులుగా ఆధ్యాత్మికమైన ప్రత్యామ్నాయం ఏదీ వుండదు. కోరికను అణచివేయలేము, నిగ్రహించనూ లేము. కోరిక ఎడల మౌనంగా, యిష్టాయిష్ట ప్రసక్తి లేని ఎరుకతో వుండాలి. ఈ నిరాసక్తమైన ఎరుక కలిగివుండటమే కోరికను ప్రత్యక్ష అనుభవంలోకి తెచ్చుకోవడం. ఇక్కడ అనుభవించేవాడు ఆ కోరికకి ఒక పేరు పెట్టడం వుండదు.

*(కమెంటరీస్ ఆన్ లివింగ్)*

# నిబద్ధీకరణం

అతని ఆసక్తి అంతా మానవాళికి సేవలు చేయడంలో, మంచి పనులు చేయడంలో లగ్నమై వుంది. రకరకాల సమాజ సంక్షేమ సంస్థలతో, వాటి కార్యకలాపాలతో అతను తీరిక లేకుండా వుంటాడు. రోజులకొద్దీ సెలవు పెట్టి సరదాగా గడపడం అనేది ఎరగనే ఎరగనని అతడు అన్నాడు. కళాశాలలో చదువు ముగించగానే సమాజాభ్యుదయ కార్యక్రమాలను చేపట్టాడు. అప్పట్నుంచీ వదలకుండా అందులోనే నిమగ్నమై వున్నాడు. తను చేసే పనికి డబ్బు తీసుకోవడం అనే మాటే లేదుట. అన్నింటికంటే అతనికి తను చేస్తున్న పనే అతి ముఖ్యమైపోయింది. ఆ పనితో విడదీయలేని బంధాన్ని పెంచుకున్నాడు. ఒక వుత్తమమైన సమాజ సేవకునిగా అతను స్థిరపడ్డాడు అది అతనికి నచ్చింది. అయితే ప్రసంగాలలో ఒకసారి, మనసుని నిబద్ధం చేసే రకరకాల పలాయన మార్గాలను గురించి చెప్తుంటే ( న్నాడు. ఆ విషయమే యింకా వివరంగా మాట్లాడాలనుకుంటున్నాడు.

'సమాజ సేవకునిగా పనిచేయడం కూడా నిబద్ధీకరణమే నంటారా? దీనివల్ల కూడా సంఘర్షణ పెరగడమే జరుగుతుందా?'

నిబద్ధీకరణం చెందడం అంటే ఏమిటో తెలుసుకుందాం. నిబద్ధీకృతమై వున్నామనే ఎరుక మనకెప్పుడు కలుగుతుంది? అసలు ఆ ఎరుక మనకి వుంటుందా? మీరు నిబద్ధీకృతులై వున్నారన్న సంగతి మీకు అసలు తెలుసా? మీ అస్తిత్వంలోని కొన్ని కొన్ని పొరల్లో మాత్రమే సంఘర్షణ, పోరాటం వున్నాయని అనుకుంటున్నారా? మనకి మన నిబద్ధీకరణం గురించి తెలియకపోచ్చు కానీ మన సంఘర్షణలు, మన బాధలు, మన సుఖాల గురించి మాత్రం బాగా తెలుసు.

'సంఘర్షణ అంటే మీ అర్థం ఏమిటి?'

అన్ని రకాల సంఘర్షణలూ : దేశాల మధ్య, వివిధ సమాజాల మధ్య, వ్యక్తుల మధ్య వుండే సంఘర్షణలూ, మనిషి లోలోపల వుండే సంఘర్షణలూ కూడా. కర్తకి అంటే చర్య చేస్తున్న వాడికీ చర్యకీ మధ్య, ప్రేరణకి ప్రతిస్పందనకీ మధ్య సమైక్యత లేనంతవరకు సంఘర్షణ అనివార్యమే కాదా? సంఘర్షణే మన సమస్య, అవునా కాదా? ఏదో ఒక్క సంఘర్షణ కాదు. అన్ని రకాల సంఘర్షణలూ : భావాలకు, నమ్మకాలకు, సిద్ధాంతాలకు మధ్య గల పోరాటం, రెండు పరస్పర వ్యతిరేక విషయాల మధ్య పోరాటం; సంఘర్షణలు కనుక లేకపోతే సమస్యలే వుండవు.

'అందరూ ఏకాంత జీవితాన్ని, ధ్యానమూ, గాఢ అంతర్విచారణలతో కూడిన జీవితాన్నే గడపాలని మీ సలహానా?'

గాఢమైన ఆలోచనా నిమగ్నత చాలా శ్రమతో కూడుకున్న విషయం. దానిని అవగాహన చేసుకోవడం చాలా కష్టం. తెలిసో, తెలియకుండానేనో ప్రతి ఒక్కరూ తమ తమ పద్ధతులకు చెందిన ఒక ఏకాంత జీవితాన్నే కోరుకుంటూ వుంటారు. అయితే ఆ ఏకాంత వాసం మన సమస్యలను పరిష్కరించలేదు. పైగా సమస్యలు యింకా పెరిగిపోతాయి. ఈ నిబద్ధీకరణంలోని ఏయే అంశాలు సంఘర్షణలను యింకా ఎక్కువ చేస్తాయి అన్నది అవగాహన చేసుకోవాలని మనం ప్రయత్నిస్తున్నాం. మన సంఘర్షణలని గురించి, బాధలు, సుఖాల గురించి మనకు తెలుసు. అయితే మన నిబద్ధీకరణాన్ని గురించి మనకే తెలియదు. అసలు యీ నిబద్ధీకరణం ఎట్లా జరుగుతుంది?

'సామాజిక ప్రభావాల వల్ల, పరిసరాల ప్రభావాల వల్ల. మనం జన్మించిన సమాజం, మనం పెరిగిన సంస్కృతి, ఆర్థికపరమైన, రాజకీయమైన ఒత్తిడులు మొదలైన వాటివల్ల.'

అది సరే, కాని మొత్తం అంతా అదేనా? ఇవన్నీ మనం స్వయంగా తయారు చేసుకున్న ప్రభావాలు. అవునా కాదా? మనిషికి తన తోటి మనుష్యులతో వుండే సంబంధ బాంధవ్యాల ఫలితంగా సమాజం ఏర్పడింది. దీనిలో సందేహం లేదు. ఉపయుక్తత, అవసరాలు, సౌకర్యం, సంతృప్తి అనే వాటి మీద యీ బాంధవ్యాలు ఆధారపడి వున్నాయి. ఈ బాంధవ్యాలే మనల్ని కట్టి పడ వేసే ప్రభావాలను, విలువలను తయారుచేస్తున్నాయి. ఈ కట్టిపడేయడమే మన నిబద్ధీకరణం. మన ఆలోచనలు, మన చర్యలే మనల్ని బంధిస్తాయి. అయితే మనం యీ విధంగా బంధించబడి వున్నామని మనకే తెలియదు. మనకు తెలిసిందల్లా మన బాధలు, సుఖాలు, వాటికి సంబంధించిన సంఘర్షణ. దీనిని మించి పోవడం మన వల్ల కాదు. మనకు చేతనైనది ఏమిటంటే మన సంఘర్షణను యింకాస్త ఎక్కువ చేసుకోవడం. మన నిబద్ధీకరణాన్ని గురించి మనకు తెలియనే తెలియదు. అది తెలుసుకోనంతవరకు సంఘర్షణను, గందరగోళాన్ని యింకా పెంచుకుంటూనే వుంటాం.

'నిబద్ధీకరణాన్ని గురించిన ఎరుక మనలో ఎట్లా కలుగుతుంది?'

అది కలగాలంటే మరొక ప్రక్రియని మమకారబంధం అనే ప్రక్రియని అర్థం చేసుకోవాలి. మమకారాన్ని ఎందుకు పెంచుకుంటామో అర్థం చేసుకుంటే, అప్పుడు బహుశ మన నిబద్ధీకరణాన్ని గురించిన ఎరుక మనలో కలుగుతుంది.

'సూటిగా అడిగిన ప్రశ్నకు డొంక తిరుగుడుగా వున్న సమాధానం కాదా యిది?'

అట్లాగా? మీరు నిబద్ధులై వున్నారనే ఎరుక పొందడానికి ప్రయత్నించి చూడండి. పరోక్షంగా, మరొక దానితో సంబంధించిన అంశంగా మాత్రమే దానిని తెలుసుకోగలుగుతారు. దేనిమీదా ఆధారపడని, కేవలం ఒక సిద్ధాంతంలాగా మీ నిబద్ధీకరణాన్ని గురించి తెలుసుకోలేరు. అప్పుడది ఒక మాట, ఒక శబ్దం అవుతుందే తప్ప అంతకంటె గొప్ప అర్థం అందులో కనిపించదు. మనకు ఒక్క సంఘర్షణను గురించే తెలుసు. సమస్యకూ ప్రతిస్పందనకూ మధ్యన సమైక్యత లేనప్పుడు సంఘర్షణ కలుగుతుంది. ఈ సంఘర్షణ మన నిబద్ధీకరణానికి పర్యవసానం. నిబద్ధీకరణం అంటే మమకార బంధం. మన పనితో, సంప్రదాయంతో, ఆసక్తితో, మనుష్యులతో, సిద్ధాంతాలతో యింకా ఎన్నో యిటువంటి వాటితో మనకు వుండే మమకార బంధం. ఈ మమకారమే కనుక లేకపోతే నిబద్ధీకరణం వుంటుందా? ఉండనే వుండదు. మరి అప్పుడు మనం ఎందుకీ మమకారం పెంచుకుంటాం? నా దేశం మీద నాకు మమకారం; ఎందుకంటే దేశం పేరు చెప్పుకుంటే గాని నాకో గుర్తింపు వుండదు. నేను చేస్తున్న పనివల్ల నాకు ఒక గుర్తింపు వస్తుంది కాబట్టి ఆ పని నాకు చాలా ప్రధానమైపోతుంది. నేను అంటే నా కుటుంబం, నా ఆస్తిపాస్తులు. వాటిమీద నాకు మమకారం. నా లోని ఖాళీతనాన్నుంచి నేను దూరంగా పారిపోవడానికి, నేను మమకారం పెంచుకున్న విషయం నాకొక దారిని చూపిస్తుంది. మమకారం అంటేనే పలాయనం. ఈ పారిపోవడమే నిబద్ధీకరణాన్ని యింకా పటిష్ఠంగా తయారుచేస్తున్నది. నీమీద నేను మమకారం పెంచుకున్నానంటే దానికి కారణం నేను పారిపోవడానికి నీవు ఒక సాధనంగా పనికొస్తున్నావు కాబట్టి. అందువల్ల నీవు నాకు చాలా ముఖ్యమైన వ్యక్తివి. నీవు నాకు స్వంతం అవాలి, నిన్ను గట్టిగా పట్టుకొని వుంటాను. నిబద్ధీకరణంలో నీవూ ఒక అంశం; పారిపోవడమే ఆ నిబద్ధీకరణం. మన యీ పారిపోవడాలని గురించిన ఎరుక మనకు కలిగితే అప్పుడు యీ నిబద్ధీకరణాన్ని తయారుచేస్తున్న కారణాలను, ప్రభావాలను చక్కగా పరిశీలించవచ్చు.

'సమాజసేవ ద్వారా నానుంచి నేను పారిపోతున్నానా?'

దాని మీద మీకు మమకారం వుందా? అది మిమ్మల్ని బంధిస్తున్నదా? సమాజసేవ చేయకపోతే మీరు అయోమయంలో పడిపోతారా; అంతా ఖాళీగానూ, విసుగ్గానూ అనిపిస్తుందా మీకు?

'తప్పకుండా అనిపిస్తుంది.' పనిమీద మీరు పెంచుకున్న మమకార బంధమే మీ పలాయనం. మన అస్తిత్వంలోని అన్ని స్థాయిల్లోనూ యిది జరుగుతుంటుంది.

మీరు పనిలో పడటం ద్వారా పారిపోతారు. మరొకరు త్రాగుడులో; మతపరమైన కర్మకాండల్లో యింకొకరు; జ్ఞానం ఆర్జించడంలో కొందరూ, దేవుడి పేరు చెప్పుకొని కొందరూ పారిపోతుంటారు. ఒక్కొక్కళ్ళు వినోదకాలక్షే పాలకు బానిసలవుతారు. అన్ని పలాయనాలు ఒకటే, అందులో గొప్పవీ, అల్పమైనవీ అనే తేడాలు లేవు. మనం ఏమిటో ఆ దానినుంచి పారిపోవడానికి వుపయోగించుకుంటు న్నంత కాలం దేవుడూ, త్రాగుడూ రెండింటి స్థాయీ ఒకటే. ఈ పలాయనాల గురించిన 'ఎరుక కలిగినప్పుడే, మన నిబద్ధీకరణాన్ని గురించి తెలుసుకోగలుగుతాం.

'సమాజసేవ ద్వారా పారిపోవడం అనేది నేను ఆపివేశాననుకోండి. ఆ తరువాత నేను ఏంచేయాలి? పలాయనం అన్నది లేకుండా ఏ పనైనా నేను చేయగలనా? నేను చేసే అన్ని పనులూ ఏదో ఒక రూపంలో నానుంచి నేను పారిపోవడమే కాదా?'

ఈ ప్రశ్న కేవలం మాటలతో పేర్చినదా, లేక మీరు నిజంగా అనుభూతి చెందుతున్న ఒక వాస్తవాన్ని వ్యక్తం చేస్తున్నదా? మీరు పారిపోకుండా వుంటే అప్పుడు ఏమవుతుంది? అదెప్పుడయినా ప్రయత్నించారా?

'ఇట్లా నేను అనవచ్చో కూడదో కాని మీరు చెప్పేదంతా వట్టి వ్యతిరేక వాదంగా వుంది. పనికి ప్రత్యామ్నాయంగా యింకొకదానిని మీరు చూపడం లేదు.'

ఈ ప్రత్యామ్నాయాలు వెతుక్కోవడం అంతా యింకో రకం పలాయనం కాదూ? ఒక రకం కార్యకలాపాలు సంతృప్తికరంగా లేకపోతేనో, సంఘర్షణను పెంచుతుంటేనో మరొకదానివైపు మళ్ళుతాం. అసలు పలాయనం అనే దానిని అర్థం చేసుకోకుండా ఒక పని ఆపేసి, ఆ స్థానంలో మరో కార్యకలాపాన్ని పెట్టుకోవడం వల్ల ఏమీ లాభం లేదు. అవునా కాదా? ఈ పలాయనాలు, వాటి మీద మనం పెంచుకున్న మమకార బంధాలే నిబద్ధీకరణాన్ని తయారు చేస్తున్నాయి. నిబద్ధీకరణం వల్లనే సమస్యలు, సంఘర్షణ వుత్పన్నమవుతున్నాయి. ఈ నిబద్ధీకరణమే సమస్యలని అవగాహన చేసుకోకుండా మనకి అడ్డు తగులుతున్నది. నిబద్ధులమై వుండటంవల్ల మన ప్రతిస్పందనలన్నీ తప్పకుండా సంఘర్షణకు దారితీస్తాయి.

'నిబద్ధీకరణం నుంచి విముక్తి ఎట్లా దొరుకుతుంది?

అవగాహన చేసుకోవడం వలన; మన పలాయనాల గురించి ఎరుక పొందడం వలన. ఒక మనిషిపైన, ఒక సిద్ధాంతంపైన మమకారం పెంచుకోవడమే నిబద్ధీకరణం పొందడానికి గల కారణం. మనం అర్థం చేసుకోవలసింది అదీ. అంతే తప్ప, యింతకంటె మంచి పలాయనాన్నో, యింతకంటె తెలివిగల పలాయనాన్నో వెతుక్కో

వడం కాదు. పలాయనాలన్నీ తెలివి తక్కువ వల్ల జరిగేవే. ఎందుకంటే వాటి వలన సంఘర్షణతప్పకుండా పుడుతుంది. నిర్మమకారంగా వుండటం అలవాటు చేసుకోవడం యింకొక రకమైన పలాయనమూ, ఏకాంతవాసమూ అవుతుంది. అది మళ్ళీ ఆకారం లేని ఒక భావన మీద, ఒక ఆదర్శం మీద మమకారం పెంచుకోవడం అవుతుంది. ఆదర్శం కాల్పనికమైనది. అహం తయారుచేసినది. ఆదర్శాన్ని అందుకోవడం అంటే 'వున్నది' నుంచి పారిపోవడమే. మనసు ఏరకమైన పలాయనాన్నీ కోరుకోకుండా వున్నప్పుడు మాత్రమే 'వున్నది' ని అవగాహన చేసుకోవడం, 'వున్నది' కి సంబంధించి సముచితమైన చర్య చేయడం జరుగుతాయి. 'ఉన్నది' గురించి ఆలోచించడం కూడా 'వున్నది' నుంచి పారిపోవడమే. సమస్య గురించి ఆలోచించడం అంటే సమస్య నుంచి పారిపోవడం. ఎందుకంటే ఆలోచించడమే సమస్య. అసలు సమస్య అదే. మనసు తను ఏమిటో అట్లా వుండటం యిష్టపడదు కాబట్టి, తను ఏమిటో అది అంటే భయపడుతుంది కాబట్టి, యీ రకరకాల పలాయనాలు వెతుక్కుంటుంది. పలాయనానికి దారితీసేది ఆలోచన. ఆలోచన వున్నంతవరకు పలాయనాలు, మమకార బంధాలు వుండి తీరుతాయి. వాటివల్ల నిబద్ధీకరణం యింకా గట్టిపడుతుంది.

ఆలోచించడం నుంచి విముక్తి పొందడం ద్వారా నిబద్ధీకరణం నుంచి స్వేచ్ఛ లభిస్తుంది. మనసు సంపూర్ణమైన నిశ్చలతతో వున్నప్పుడు మాత్రమే యదార్థమైనది వుండటానికి కావలసిన స్వేచ్ఛ లభిస్తుంది.

*(కమెంటరీస్ ఆన్ లివింగ్ ; సెకండ్ సిరీస్)*

# స్వాభిమానం

ఆమె తన ముగ్గురు స్నేహితులని వెంటబెట్టుకొని వచ్చింది. వాళ్ళందరిలోనూ మంచి ఆసక్తి, తెలివితేటలవల్ల వొనగూడే హుందాతనమూ వున్నాయి. వారిలో ఒకరికి చాలా త్వరగా గ్రహించగలిగే శక్తి వున్నది; మరొకరిలో చురుకుదనంతోపాటు అసహనం కూడా వుంది; మూడోవారిలో వుత్సాహం వుంది కాని అది ఎక్కువసేపు కొనసాగే వుత్సాహం కాదు. మంచి మిత్రబృందం అది. తమ స్నేహితురాలి సమస్య గురించి వారందరిలోనూ విచారం వుంది. అయితే ఎవ్వరూ సలహాలు కాని, బరువైన అభి ప్రాయాలు కాని వెలిబుచ్చడంలేదు. సంప్రదాయానికో, పదిమంది అభిప్రాయానికో, వ్యక్తిగతమైన అభిలాషకో అనుగుణంగా కాకుండా ఏది చేస్తే మంచిది అని ఆమె

అనుకుంటే అది చేయడానికి ఆమెకు తోడ్పడాలనుకుంటున్నారు. ఇబ్బంది ఎక్కడంటే అసలు ఏది మంచిది అనేది కనుక్కోవడం ఎట్లా? ఆమెకే అంత నిర్ధారణగా తెలియడంలేదు. ఆమెకి అంతా అలజడిగాను, తారుమారుగాను అనిపిస్తున్నది. కాని తక్షణమే చర్య తీసుకోవలసిన వొత్తిడి కూడా ఎక్కువగా వుంది. ఏదో ఒక నిర్ణయం తీసుకోవాలి. ఇక ఎక్కువ కాలం యిట్లాగే పొడిగించడానికి వీల్లేదు. ఒకానొక బాంధవ్యాన్నుంచి విడుదల చెందాలన్నదే ప్రస్తుత సమస్య. ఆమెకి స్వేచ్ఛ కావాలి. ఈ మాట అనేకసార్లు ఆమె మళ్ళీ మళ్ళీ అంటూ వచ్చారు.

గదిలో అంతా ప్రశాంతంగా వుంది. అందరిలోనూ అసహనం, ఆందోళన నెమ్మదించాయి. సమస్యను గురించి చర్చించాలని వాళ్ళంతా చాలా ఆత్రంగా వున్నారు. అయితే దానివల్ల ఫలితం వుంటుందని కాని, ఏది సరియైన కర్తవ్యం అన్నదానికి ఒక నిర్వచనం లభిస్తుందని కాని వాళ్ళు ఆశించడంలేదు. సమస్య పూర్తిగా బయటకు వ్యక్తమయాక కర్తవ్యం ఏమిటో దానంతట అదే సహజంగా, సంపూర్ణంగా వెల్లడవుతుంది. సమస్య లోపల వున్న విషయాన్ని కనిపెట్టడం ప్రధానం కాని, చివరకు కలిగే ఫలితం ముఖ్యం కాదు. ఎందుకంటే చివరికి ఏ సమాధానం వచ్చినా సరే అది కూడా ఒక తీర్పో, ఒక అభిప్రాయమో, యింకొక సలహానో అవుతుందే తప్ప అసలు సమస్యని ఏవిధంగానూ అది పరిష్కరించలేదు. సమస్యని సమస్యగా అవగాహన చేసుకోవాలి తప్ప, ఆ సమస్యకు ఎట్లా ప్రతిస్పందించాలి, ఆ విషయంలో ఏం చేయాలి అన్నవి ముఖ్యం కాదు. సమస్యను సవ్యమైన దృష్టితో దరిచేరడం ముఖ్యం. ఎందుకంటే సమస్యలోనే చేయదగిన కర్తవ్యం నిబిడీకృతమై వుంటుంది.

సూర్యుడు నదిలోని నీళ్ళపై వెలిగించిన కాంతిరేఖలు నీళ్ళను పులకింపజేసి నాట్యం చేయిస్తున్నాయి. తెల్లని తెరచాపతో ఒక పడవ ఆ దారినే వెళ్ళింది. కాని నాట్యం మాత్రం ఆగిపోలేదు. స్వచ్ఛమైన ఆనందపారవశ్యంతో చేస్తున్న నృత్యం అది. చెట్లనిండా పక్షులు వాలి వున్నాయి. గట్టిగా అరుస్తూ, ముక్కులతో పొడిచి యీకలు సవరించుకుంటూ, కాసేపు అటూ యిటూ ఎగిరి, మళ్ళీ వచ్చి వాలుతూ సందడి చేస్తున్నాయి. ఎక్కడ చూసినా కోతులు - లేత ఆకులు తెంపి నోళ్ళల్లో కుక్కుకుంటూ అల్లరి చేస్తున్నాయి. ఆ కోతుల బరువువల్ల సన్నగా లేతగా వున్న కొమ్మలు అర్ధచంద్రాకారాల్లో వంగిపోయాయి. అయినా కోతులు ఏమాత్రం భయపడ కుండా కొమ్మల్ని పట్టుకొని తేలిగ్గా వేలాడుతున్నాయి. ఎంతో సునాయాసంగా ఒక కొమ్మమీద నుంచి యింకో కొమ్మమీదికి మారుతున్నాయి. అవి ఎగరడమూ, మరో కొమ్మమీదికి దూకడమూ రెండూ కలిసిపోయి ఒకే ఒక కదలికలాగా అనిపిస్తున్నది. తోకలు కిందకు వేళ్ళాడేసుకొని కూర్చుని, ఆకులు అందుకుంటున్నాయి. బాగా పై

కొమ్మలమీద కూర్చొని వుండటంవలన కింద నడిచిపోతున్న మనుష్యులు వాటి దృష్టిలోకి రావడంలేదు. చీకటి పడుతుండగా వందలకొద్ది రామచిలకలు వచ్చి, గుబురుగా వున్న ఆకుల మధ్యన ఆ రాత్రికి మకాం వేస్తున్నాయి. అవి రావడం కనిపిస్తున్నది. కాని వచ్చాక ఆ చిక్కని గుబురాకుల్లో అదృశ్యమైపోతున్నాయి. అమావాస్య దాటిన పాడ్యమినాటి చంద్రుడు సన్నగా బయటపడుతున్నాడు. దూరంగా నదివొంపు తిరిగిన చోట వున్న పొడుగాటి వంతెన దాటుతూ రైలు కూత వేస్తున్నది. ఈ నది చాలా పవిత్రమైనది. దూరదూరాలనుంచి ప్రజలు వచ్చి, తమ పాపాలు కడిగేసుకోవడానికి యీ నీళ్ళలో స్నానం చేస్తుంటారు. అసలు ప్రతి నదీ పవిత్రమైనదే, అందమైనదే. ఈ నదిలోని సౌందర్యం ఏమిటంటే విశాలంగా విస్తరించుకొని వున్న దాని వంపు, లోతయిన నీటి మడుగుల మధ్య ద్వీపాలవంటి యిసుక తిన్నెలు. ప్రతిరోజూ ఆ నదిపైన నిశ్శబ్దంగా కదులుతూ, వచ్చీ పోయే తెల్లని తెరచాపలు.

'చాలా ప్రత్యేకమైన ఒక బాంధ్యవ్యం నుంచి స్వేచ్ఛ పొందాలని నేను కోరుకుంటున్నాను' అన్నది ఆమె.

స్వేచ్ఛ కావాలి అని అంటే మీ అర్థం ఏమిటి? 'నాకు స్వేచ్ఛ కావాలి' అని మీరు అంటున్నారంటే, దాని అర్థం మీరు స్వేచ్ఛగా లేరు అన్నమాట. మీకు స్వేచ్ఛ లేనిది ఏ విషయంలో?

'భౌతికంగా నేను స్వేచ్ఛగానే వున్నాను. ఎక్కడికంటే అక్కడికి వెళతాను, వస్తాను. ఎందుకంటే యిప్పుడు నేను ఒకరి భార్యను కాను. అయితే యింకా సంపూర్ణమైన స్వేచ్ఛ నాకు కావాలి. ఆ మనిషితో యింక నాకు ఏ సంబంధమూ వుండకూడదు.'

భౌతికంగా మీకు స్వేచ్ఛ వచ్చేసినప్పుడు, ఆ వ్యక్తితో మీకిక ఏవిధమైన బాంధవ్యం వుంది? ఇంకేరకంగానైనా అతనితో మీకు సంబంధం వుందా?

'నాకు తెలియదు కాని అతనంటే నాకు విపరీతమైన ఆగ్రహం వుంది. అతనికీ, నాకూ మధ్యన యిక ఏమీ వుండకూడదు.'

మీకు స్వేచ్ఛ కావాలని కోరుకుంటున్నారు. అయినా అతనంటే మీకు ఆగ్రహం వుందా? అంటే అర్థం మీరు అతని నుంచి విముక్తి పొందలేదు అతనంటే ఎందుకు మీకీ ఆగ్రహం?

'ఈ మధ్యనే అతని అసలు స్వరూపం ఏమిటో తెలుసుకున్నాను. ఆ నీచత్వం, అంతటి ప్రేమరాహిత్యం, అంతటి విపరీతమైన స్వార్థపరత్వం. అతనిలో నేను కనిపెట్టిన ఆ భయంకరత్వాన్ని గురించి నేను చెప్పలేను. ఒకప్పుడు అతని మీద యీర్ష్య

పడ్డానని, అతన్ని ఆరాధించానని, అతనికి పూర్తిగా నన్ను నేను సమర్పించుకున్నానని తలచుకుంటేనే! ఎంతో ప్రేమ, గొప్ప దయ వున్న ఆదర్శమూర్తి నా భర్త అని అనుకున్నాను. వట్టి మూర్ఖుడూ, వంచకుడూ అని నేను కనిపెట్టినప్పుడు అతనంటే అసహ్యం వేసింది. ఒకప్పుడు అతనితో జీవించానన్న తలంపే నేను కలుషితమై పోయాననే భావం కలిగిస్తున్నది. అతని నుంచి నాకు పూర్తిగా స్వేచ్ఛ కావాలి.'

భౌతికంగా మీరు అతని నుంచి విముక్తి పొందవచ్చు. కాని మీలో అతనంటే ఆగ్రహం వున్నంతవరకు, మీకు స్వేచ్ఛ దొరకదు. అతన్ని మీరు ద్వేషిస్తుంటే, అతనితో మీకు బంధం వున్నట్లే. అతన్ని తలచుకొని మీరు సిగ్గుపడుతుంటే అతనికి మీరు యింకా దాసులుగా వున్నట్లే. మీ కోపం అతని మీదనా, మీ మీదేనా? అతను ఏమిటో అట్లా అతను వున్నాడు. మీకెందుకు కోపం? అసలు మీ ఆగ్రహం నిజంగా అతనిమీదేనా? 'ఉన్నది'ని చూశాక, దానితో కొంతకాలం సహవాసం చేశానే అని మీరు సిగ్గుపడుతున్నారా? మీలో వున్న ఆగ్రహం నిస్సందేహంగా అతనిమీద కాదు. ఒకప్పుడు మీరు ఏర్పరచుకున్న అభిప్రాయాలమీద, నిర్ణయాలమీద, మీచర్యలమీద. మిమ్మల్ని చూసుకొని మీరే సిగ్గుపడుతున్నారు. ఇది ఒప్పుకోవడం యిష్టంలేక అతను అట్లా వున్నాడని అతనిమీద దోషం ఆరోపిస్తున్నారు. మీలో వున్న కాల్పనిక ప్రణయ ఆరాధన నుంచి పారిపోవడానికి అతని మీద ద్వేషం ఒక మార్గం అని మీకు తెలిసివచ్చినప్పుడు, అప్పుడు అతను అనే వ్యక్తి మీ దృష్టిపథం నుంచి అదృశ్యమౌతాడు. మీరు సిగ్గుపడుతున్నది అతన్ని గురించి కాదు, అతనితో సహవాసం చేసిన కారణంగా మీ గురించే. మీ కోపం అంతా మీ మీదే, అతని మీద కాదు.

'అవును, అది నిజమే.'

ఇది మీరు నిజంగా గ్రహిస్తే, దాన్ని ఒక వాస్తవంగా అనుభూతిలోకి తెచ్చుకుంటే, అప్పుడు మీకు అతని నుంచి స్వేచ్ఛ లభిస్తుంది. ఇక ఆ తరువాత మీ శత్రుత్వానికి అతను కారణభూతుడు అవడు. ప్రేమలాగే శత్రుత్వం కూడా ఒక బంధం అవుతుంది.

'కాని నా అవమానాన్నుంచి, నా అవివేకాన్నుంచి నేను ఎట్లా విముక్తి పొందుతాను? నాకు యిప్పుడు అంతా స్పష్టంగా అర్థమవుతున్నది. అతనున్నట్లుగా అతనున్నాడు. అతని దోషం ఏమీ లేదు. కాని, యీ అవమానాన్నుంచి, నా లోపల మెల్లమెల్లగా పెరుగుతూ, యీ విషమస్థితిలోకి, పూర్తిగా పరిపక్వదశ చేరుకున్న యీ ద్వేషభావాన్నుంచి, నాకు ఎట్లా విముక్తి కలుగుతుంది? జరిగిపోయిన గతాన్ని ఎట్లా చెరిపివేయగలను?'

గతించినదాన్ని ఎట్లా చెరిపివేయాలో తెలుసుకోవడంకంటే, ఆ గతాన్ని చెరిపివేయాలని మీరు ఎందుకు కోరుకుంటున్నారన్నది ముఖ్యం. ఒక సమస్యని గురించి ఏంచేయాలి అన్నదానికంటే, మీరు వెనకాల ఏ వుద్దేశ్యం పెట్టుకొని ఆ సమస్యను చూస్తున్నారన్నది చాలా ముఖ్యం. ఆ సహవాసం యొక్క జ్ఞాపకాన్ని తుడిచిపారేయాలని మీరు ఎందుకు కోరుకుంటున్నారు?

'అప్పటి ఆ రోజులకు చెందిన స్మృతులంటే నాకు బొత్తిగా యిష్టంలేదు. అవి తలచుకుంటేనే నా మనసు చేదెక్కుతున్నది. ఈ కారణం సరిపోదా?'

అంతగా సరిపోదు. సరిపోతుందా? ఆ పాత స్మృతులను చెరిపివేయాలని మీరు ఎందుకు కోరుకుంటున్నారు? అవి మీ మనసును చేదెక్కిస్తున్నాయనే కారణంగా కానే కాదు. ఒకవేళ మీ పాత జ్ఞాపకాలను ఏదో ఒక విధంగా మీరు చెరిపివేయగలిగినా, మళ్ళీ మీకు అవమానంగా అనిపించే చర్యల్లో మీరు చిక్కుకోవచ్చు. మీకు అసహ్యంగా అనిపించే జ్ఞాపకాలను తుడిచిపారేసినంత మాత్రాన మీ సమస్యకు పరిష్కారం దొరకదు. దొరుకుతుందా?

'దొరుకుతుందని అనుకున్నాను. అయితే యిప్పుడు అసలు సమస్య ఏమిటి? మీరు అనవసరంగా సమస్యను మరీ సంకీర్ణంగా తయారుచేయడంలేదూ? అసలే జటిలమైన సమస్య. పోనీ నా జీవితమే జటిలమైనది. దాని మీద యింకా భారాలన్నీ మోపడం ఎందుకు?'

భారం ఎక్కువ చేస్తున్నామా, 'వున్నది' ని అవగాహన చేసుకొని దానినుంచి విముక్తి పొందడానికి ప్రయత్నిస్తున్నామా? దయచేసి కొంచెం ఓర్పుతో వినండి. గతాన్ని చెరిపివేయమని మిమ్మల్ని ప్రేరణ చేస్తున్నది ఏమిటి? గతం అసహ్యకరంగా అనిపించవచ్చు. కాని చెరిపివేయాలని మీరు ఎందుకు కోరుకుంటున్నారు? మీ గురించి మీకు ఒక ప్రత్యేకమైన భావన, ఒక కాల్పనిక చిత్రం వున్నది. దానికి యీ స్మృతులు విరుద్ధంగా వున్నాయి. అందుకని ఆ స్మృతులను వద్దు పొమ్మంటున్నారు. మీకు మీరే ఒక ప్రత్యేకమైన విలువను యిచ్చుకున్నారు కదూ?

"అవును మరి, లేకపోతే --------"

రకరకాలైన అంతస్థుల్లో మనల్ని నిలబెట్టుకోవడం మనం అందరమూ చేసే పనే. ఈ ఎత్తు మీదనుంచి మనం కిందపడిపోవడం కూడా జరుగుతూనే వుంటుంది. మనం సిగ్గుపడేది ఈ పడిపోవడం గురించి. ఈ సిగ్గుపడటానికి, యీ పడిపోవడానికి మనకి మనం ఆపాదించుకునే ఘనతే కారణం. అవగాహన చేసుకోవలసింది మనకి మనమే స్వయంగా యిచ్చుకున్న యీ ఘనతని తప్ప పడిపోవడాన్ని కాదు. ఒక

వున్నత సింహాసనంమీద మిమ్మల్ని మీరే నిలబెట్టుకోకపోతే పడిపోవడం అనేది ఎందుకుంటుంది? స్వీయఘనత, వ్యక్తిగౌరవం, ఏదో ఒక ఆదర్శం అనే వున్నతపీఠం మీద మిమ్మల్ని మీరే ఎందుకు నిలబెట్టుకున్నారు? ఇది కనుక మీరు అర్థం చేసుకుంటే అప్పుడు గతాన్ని గురించి సిగ్గుపడటం వుండదు. అదంతా పూర్తిగా అదృశ్యమై పోతుంది. ఆ వున్నతపీఠం లేకపోతే మీరు ఏమిటో అట్లాగే మీరు వుంటారు. ఉన్నతపీఠం లేనప్పుడు, ఒకర్ని ఎక్కువగాను, ఒకర్ని తక్కువగాను చూపించిన ఆ ఎత్తుమీద మీరు నిలబడనప్పుడు, మీరు యిన్నాళ్ళూ చూడకుండా తప్పించుకొని తిరిగిన ఆ అసలు మీరు అక్కడ వుంటారు. 'వున్నది' ని, మీరు ఏమిటో దానిని, చూడకుండా తప్పించుకోవడంవల్లనే గందరగోళం, విరోధం, అవమానం, ద్వేషం కలుగుతాయి. మీరు ఏమిటో అది నాకు గాని, మరొకరికి గాని మీరు చెప్పవలసిన పనిలేదు. కాని, మీరు ఏమిటి అనేది, అది ఏదయినా సరే, దాని ఎరుక మీకు వుండాలి. సమర్థించడం కాని, నిరోధించడం కాని చేయకుండా దానితో జీవించండి. దానికొక పేరు పెట్టకుండా దానితో జీవించండి. ఎందుకంటే ఆ పేరే ఒక దూషణగానో, ఒక గుర్తింపుగానో పనిచేస్తుంది. ఏ భయమూ లేకుండా దానితో జీవించండి. భయం వుంటే దానితో సాన్నిహిత్యానికి అడ్డు వస్తుంది. సాన్నిహిత్యం లేనప్పుడు దానితో జీవించలేరు. సాన్నిహిత్యం వుండటమే ప్రేమించడం. ప్రేమ లేకుండా గతాన్ని మీరు తుడిచి వేయలేరు. ప్రేమ వున్నప్పుడు గతం వుండదు. ప్రేమించండి, అప్పుడు కాలం వుండదు.

*(కమెంటరీస్ ఆన్ లివింగ్)*

# మనసులోని తుఫాను

ఈ రోజంతా పొగమంచు వదలకుండా వుండిపోయింది. సాయంత్రానికి కరిగి, మాయమయ్యేసరికి తూర్పునుంచి గాలి వీచడం మొదలుపెట్టింది బొత్తిగా తేమ లేని ఆ గాలి తెరిపి లేకుండా వీస్తూ, రాలి పడిపోయిన ఆకుల్ని ఎగరగొట్టుతూ, నేలలో వున్న తడినంతా పీల్చేస్తున్నది. తీవ్రంగా వీస్తున్న తుఫాను గాలులతో భయంకరంగా వున్న రాత్రి అది. గాలి యింకా ఎక్కువైంది. ఇల్లు కిర్రు కిర్రుమని వూగుతున్నది. చెట్ల కొమ్మలు విరిగి కూలిపోతున్నాయి. ఆ మర్నాడు పొద్దున వాతావరణం ఎంత నిర్మలంగా వుందంటే, దూరాన వున్న పర్వతాలు చేత్తో తాకచ్చేమో అన్నంత స్పష్టంగా అనిపించాయి. గాలీ, దానితోపాటు వేడీ విజృంభించాయి.

మధ్యాహ్నం దాటే వేళకు గాలి తగ్గిపోయింది. కాని సముద్రంమీది నుంచి పొగమంచు మళ్ళీ వచ్చి ఆవరించుకుంది.

ఈ భూమి మీద ఎంత అద్భుతమైన సౌందర్యం వుంది, ఎంత సంపన్నమైంది యీ భూమి! విసుగు అనేదే అనిపించదు. ఎండిపోయిన నదీ గర్భాలలో ఎన్నిరకాల ప్రాణులో జీవిస్తుంటాయి : ముళ్ళగడ్డి, రక్కిస మొక్కలు, ఎత్తుగా, పసుపురంగులో పూసే సూర్యకాంతులు. బండరాళ్ళమీద వూసరవెల్లులు, నలికెల పాములు వుంటాయి. తెలుపు, మట్టిరంగుల అడ్డచారలు వున్న పాము ఎండ పొడన పడుకున్నది. నల్లని నాలుకను బయటకు లోపలకు ఆడిస్తూ. డొంకకు అటువైపునుంచి కుక్క అరుపులు వినిపిస్తున్నాయి. ఉడతనో, కుందేలునో తరుముతూ వుండి వుంటుంది.

సంతుష్టి అంటే సఫలత పొందడంవల్లకానీ, ఒకదానిని సాధించడంవల్ల కానీ, వస్తు సంపద ఆర్జించడంవల్లకానీ కలిగేది కాదు. ఒక క్రియవల్లకానీ, నిష్క్రియవల్లకానీ అది కలగదు. 'ఉన్నది' తో మనం నిండిపోయినప్పుడు అది కలుగుతుంది తప్ప, 'వున్నది' ని సవరించడంవల్ల కాదు. నిండిపోయి వున్నప్పుడు సవరింపులు, మార్పులు అవసరం వుండవు. అసంపూర్ణమైనది సంపూర్ణంగా అవడానికి ప్రయత్నిస్తున్నప్పుడు అది అసంతుష్టి, మార్పు అనే కల్లోలంలో చిక్కుకుంటుంది. 'ఉన్నది' అనేది అసంపూర్ణంగా వుంటుంది; అది సంపూర్ణం కాదు. సంపూర్ణంగా వుండేది వాస్తవంలో వుండదు. ఆ అవాస్తవాన్ని అందుకోవాలనే ఆరాటంలో అసంతుష్టి అనే బాధ వుంటుంది. ఈ బాధకు చికిత్స లేదు. ఈ బాధని తగ్గించాలనే ప్రయత్నం కూడా వాస్తవం కాని దానికోసం అన్వేషించడమే. అందులోనుంచే అసంతుష్టి జనిస్తుంది. అసంతుష్టినుంచి తప్పించుకోవడానికి మార్గం లేదు. అసంతుష్టి గురించి ఎరుకగా వుండటమే 'వున్నది' గురించిన ఎరుక. దానితో మనం నిండిపోయి వుండటంలో సంతుష్టి అని పిలవదగిన ఒక స్థితి వుంటుంది. దానికి వ్యతిరేకంగా వుండే స్థితి వుండదు.

ఆ యింటిలోనుంచి చూస్తే లోయ అంతా కనబడుతుంది. దూరంగా వున్న పర్వతాల్లోని అతి ఎత్తయిన శిఖరం అస్తమిస్తున్న సూర్యుడి కిరణాలు తాకి ఎర్రగా వెలుగుతున్నది. రాళ్ళమయంగా వున్న ఆ శిఖరం ఆకాశంలోనుంచి వేలాడుతున్నట్లు, దాని గర్భంలో నుంచి వెలుగు వస్తున్నట్లు అనిపిస్తున్నది. చీకట్లు ముసురుకుంటున్న యీ గదిలోనుండి చూస్తుంటే ఆ సౌందర్యపు వెలుగు అన్నింటికీ అతీతంగా కనబడింది. అతను చాలా చిన్నవాడు. ఎంతో వుత్సాహం, అన్వేషణాసక్తీ వున్నాయి అతనిలో.

"మతం గురించి, మతాచారాల గురించి, ధ్యానం గురించి, పరమోత్కృష్టమైన దానిని అందుకోవడానికి అవలంబించవలసిన రకరకాల పద్ధతులను గురించి చాలా గ్రంధాలు చదివాను. ఒకప్పుడు నేను కమ్యూనిజం ఆకర్షణలో పడ్డాను. అయితే, ఎంతమంది మేధావులు దానికి కట్టుబడి వున్నప్పటికీ, అది అభివృద్ధి నిరోధకమైనదని నాకయితే చాలా త్వరగానే తెలిసివచ్చింది. కేథలిక్ మతం కూడా నన్ను ఆకర్షించింది. దానిలోని కొన్ని వుపదేశ సూత్రాలు నాకు బాగా నచ్చాయి. కేథలిక్‌గా మారాలని కొంతకాలం అనుకున్నాను కూడా. అయితే ఒకరోజు గొప్ప పండితుడైన ఒక కేథలిక్ మతాచార్యుడితో మాట్లాడుతున్నప్పుడు, యీ మతమూ కమ్యూనిజం అనే జైలు రెండూ ఒకేలాగే వున్నాయని నాకు హఠాత్తుగా స్పష్టపడింది. ఒక ఓడలో నావికునిగా చేరి తిరుగుతున్న రోజుల్లో నేను భారతదేశానికి వెళ్ళాను. సుమారు ఒక సంవత్సరం అక్కడ గడిపాను. సన్యాసం పుచ్చుకుందామని అనుకున్నాను. కాని అసలు జీవితాన్నుంచి అది నునల్ని దూరం చేస్తుంది. కల్పితమైన ఆదర్శాలే తప్ప అందులో యదార్థం వుండదు. ఒంటరిగా జీవిస్తూ ధ్యానాన్ని సాధన చేయాలనుకున్నాను. అదీ అయిపోయింది. ఇన్ని సంవత్సరాలు యిట్లా గడిపాక కూడా ఆలోచనలను అదుపు చేయడం నాకు బొత్తిగా చేతకావడంలేదనే అనిపిస్తున్నది. దీన్ని గురించే మీతో మాట్లాడాలనుకుంటున్నాను. ఇంకా చాలా సమస్యలున్నాయనుకోండి, సెక్స్ మొదలైనవి. ఆలోచనలను కనుక పూర్తిగా నా స్వాధీనంలో వుంచుకుంటే, అప్పుడు నాలో వున్న కోరికలను, నిగూఢమైన వాంఛలను నేను అధుపు చేసుకోగలుగుతాను."

ఆలోచనలను అదుపు ఆజ్ఞల్లో పెట్టడంవల్ల కోరికలు నిర్మూలిస్తాయా, లేదూ వాటిని అణచివేయడం జరుగుతుందా? అణచివేయడం మళ్ళీ యితరమైన, యింకా లోతైన సమస్యలను తెచ్చిపెడుతుందా?

'కోరికలకు లోబడి పొమ్మని మీరు సలహా యివ్వడంలేదనే అనుకుంటున్నాను. కోరిక ఆలోచనయొక్క స్వభావపు తీరు. ఆలోచనలను అదుపుచేసే ప్రయత్నాల ద్వారా కోరికలను జయించాలని ఆశించాను. కోరికలను జయించనన్నా జయించాలి, లేదా నిగ్రహించాలి. అయితే నిగ్రహించాలంటే ముందు వాటిని అదుపులో వుంచాల్సిందే. సాధారణంగా గురువులందరూ కోరికలను అధిగమించాలని నొక్కిచెప్తుంటారు. ఇది సాధించడానికి రకరకాల పద్ధతులను వాళ్ళు సూచించారు.'

తక్కినవారు చెప్పినది సరే, అసలు మీరు ఏమనుకుంటున్నారు? కోరికలను అదుపు చేసినంత మాత్రాన కోరికలవలన కలిగే సమస్యలన్నింటినీ పరిష్కరించు కోగలమా? కోరికలను అణచివేయడంకాని, నిగ్రహించడంగాని వాటి అవగాహనకి

తోడ్పతాయా? వాటి నుంచి మిమ్మల్ని విముక్తి చేస్తాయా? ఏదో ఒక వ్యాపకం మతపరమైనది కాని, మరొకరం కాని – పెట్టుకోవడం ద్వారా రోజులో ప్రతి నిముషమూ మనసుని క్రమశిక్షణలో వుంచవచ్చు. వ్యాపకంతో వున్న మనసు స్వేచ్ఛగా వున్న మనసు కాదు. స్వేచ్ఛగా వున్న మనసుకే కాలరహితమైన సృజనాత్మకతను గురించిన ఎరుక వుంటుంది.

"కోరికలను అధిగమించడం ద్వారా స్వేచ్ఛ కలగదా?"

అదిగమించడం అంటే మీ అర్థం ఏమిటి?

"సంతోషాన్ని పొందడంకోసమే కాకుండా, ఆ పరమ ఔన్నత్యాన్ని అందుకోవాలంటే కూడా కోరిక మనమీద స్వారి చేయకుండా చూసుకోవడం అవసరం. కల్లోలంలో, ఆ గందరగోళంలో మనం చిక్కుకొనిపోకుండా వుండటం ముఖ్యం. కోరికలను అదుపుచేయాలంటే ఏదో రకంగా వాటిని లొంగతీసుకోవడం చాలా అవసరం. అల్పమైన విషయాల వెంటబడకుండా ఆ మహనీయమైన దానిని యీ కోరికే అన్వేషించవచ్చుగదా!"

కోరుకుంటున్న అంశాన్ని మీరు మార్చేయవచ్చు. ఒక యింటిని కాకుండా, జ్ఞానాన్ని, నీచమైన వాటిని కాకుండా వున్నతమైన వాటిని మీరు కోరుకోవచ్చు. అయితే అప్పుడు కూడా యిదంతా కోరిక చేస్తున్న పనేకదా, కాదంటారా? యీ లౌకిక ప్రపంచంలో గుర్తింపు కావాలని మీరు కోరుకోకపోవచ్చు కాని స్వర్గాన్ని అందుకోవాలలనే కాంక్ష కూడా ఒక ఫలితం కోసం ప్రాకులాడటమే కాదా? కోరిక ఎప్పుడూ సఫలం అవాలని, ఏదో అంది పుచ్చుకోవాలని చూస్తూ వుంటుంది. ఈ కోరికల కదలికలను అవగాహన చేసుకోవాలే తప్ప, వాటిని దూరంగా నెట్టివేయడమో, అణగద్రొక్కడమో కూడదు. కోరిక తీరుతెన్నుల్ని అవగాహన చేసుకోకుండా కేవలం ఆలోచనలను అదుపుచేయడంవల్ల లాభం లేదు.

"అసలు నేను మొట్టమొదట మొదలుపెట్టిన విషయానికి తిరిగివస్తాను. కోరికను అవగాహన చేసుకోవాలన్నా ఏకాగ్రత అవసరం కదా? అదే నాకు వచ్చిన యిబ్బంది. ఆలోచనలను అదుపులో పెట్టలేకపోతున్నాను. అవి వాటి యిష్టం వచ్చినట్లు షికార్లు చేస్తుంటాయి. దొర్లిపోతుంటాయి. రకరకాల అర్థంలేని ఆలోచనలు వస్తూ వుంటాయి తప్ప వాటిలో ఒక్కటైనా గంభీరంగా కొనసాగేది వుండదు."

మనస్సు రాత్రింబగళ్ళు పనిచేసే యంత్రం వంటిది. వాగుతూ వుంటుంది. నిద్రలోనూ, మెలకువలోనూ ఆగకుండా పనిచేస్తూనే వుంటుంది. దానికి వేగం ఎక్కువ,

సముద్రంలాగా మహా అశాంతంగా వుంటుంది. చాలా సంక్లిష్టమైన, అత్యంత జటిలమైన యీ యంత్రంలోని మొత్తం కదలికలన్నింటినీ ఒక భాగం అదుపు చేయాలని చూస్తుంది. దానితో పరస్పర వ్యతిరేకమైన కోరికల మధ్య, కాంక్షల మధ్య సంఘర్షణ బయలుదేరుతుంది. వాటికి వున్నతాత్మ, నీచాత్మ అని మీరు పేర్లు పెట్టవచ్చు. అయితే రెండూ మనసు ఆవరణలోనివే. మనసులో, ఆలోచనల్లో జరిగే చర్య, ప్రతిచర్యలు రెండూ దాదాపుగా ఒక్కసారే, చాలావరకు యాంత్రికంగా వాటంతట అవే జరిగిపోతుంటాయి. తెలిసి జరిగేవీ, అచేతనంగా జరిగేవీ అయిన యీ మొత్తం ప్రక్రియలు అంటే అంగీకరించడం, నిరాకరించడం, లొంగిపోవడం, స్వేచ్ఛకోసం ప్రయాసపడటం యివన్నీ అమిత వేగంతో జరిగిపోతుంటాయి. కాబట్టి అసలు ప్రశ్న యీ మహా సంక్లిష్టమైన యంత్రాన్ని ఎట్లా అదుపుచేయాలన్నది కాదు; ఎందుకంటే అదుపు చేయడం అనగానే ఘర్షణ వస్తుంది. దానివల్ల శక్తి వృథా అవుతుంది. అయితే అతి వేగంతో పరుగులు పెడుతున్న యీ మనసు తన వేగాన్ని తగ్గించుకోగలదా?

"కాని, ఎట్లా?"

సర్, దయచేసి ఏమీ అనుకోకండి, అసలు సమస్య 'ఎట్లా' అని కానేకాదు. 'ఏవిధంగా' అనేది కేవలం ఒక ఫలితాన్ని మనకి యిస్తుంది. ఆ చిట్ట చివరి ఫలితానికి ఏ ప్రాముఖ్యమూ లేదు. ఈ ఫలితాన్ని సాధించుకున్నా యింకొక కోరిక ఫలించడం కోసం మళ్ళీ ఒక అన్వేషణ మొదలవుతుంది. దానితోపాటుగా వుండే సంఘర్షణ, వ్యథ తప్పవు.

"అయితే యిప్పుడు మనం చేయవలసింది ఏమిటి?"

మీరు సరియైన ప్రశ్న అడగడంలేదు, అవునా? మనసు తన వేగాన్ని తగ్గించుకోవడంలోని సత్యాసత్యాలు కనిపెట్టడం పోయి, ఒక ఫలితం రాబట్టాలని మీరు ఆరాటపడుతున్నారు. ఫలితాన్ని సాధించడం కొంతవరకు సులువే, కాదూ? కట్టి పడవేసి ఆపడం ద్వారా కాకుండా మరో విధంగా తన వేగాన్ని తగ్గించుకోవడం మనసుకి సాధ్యపడుతుందా?

"వేగం తగ్గించుకోవడం అంటే అర్థం ఏమిటి?"

కారులో చాలా వేగంగా పోతున్నప్పుడు చుట్టూ వుండే దృశ్యాలు మసక మసగ్గా కనిపిస్తాయి. నడుస్తూ వెళ్తున్నప్పుడుండే వేగంలో మాత్రమే చెట్లని, పక్షులని, పూలని మీరు వివరంగా పరిశీలించగలుగుతారు. మనసు వేగం తగ్గించుకున్నప్పుడు స్వీయజ్ఞానం కలుగుతుంది. అంటే అర్థం వేగం తగ్గించమని మనసుమీద వొత్తిడి

ప్రయోగించడం కాదు. నిర్బంధంవల్ల ప్రతిరోధించడం బయలుదేరుతుంది. మనసు వేగాన్ని తగ్గించడానికి యీ విదంగా శక్తిని వృధాచేయడం జరగకూడదు. అంతేనంటారా కాదా?

"ఆలోచనను అదుపుచేయడం అనే ప్రయత్నం అంతా వ్యర్థ ప్రయాస అని యిప్పుడిప్పుడే నేను గ్రహిస్తున్నాను. అయితే అసలు చేయవలసిందేమిటో నాకు అర్థంకావడం లేదు."

ఏం చర్య తీసుకోవాలనేదాకా మనం యింకా రాలేదు. అవునా? మనసు వేగం తగ్గించుకోవడం చాలా ముఖ్యం అనేది గ్రహించడానికి మనం ప్రయత్నిస్తున్నాం. వేగం ఎట్లా తగ్గించాలి అనే సంగతిని కాదు. మనసు వేగం తగ్గించుకోగలదా? అది ఎప్పుడు జరుగుతుంది?"

'నాకు తెలియదు. దీన్ని గురించి నేను ఎప్పుడూ ఆలోచించలేదు.'

సర్, ఏదయినా ఒకదాన్ని మీరు అప్రమత్తంగా చూస్తున్నప్పుడు మనసు వేగం తగ్గిపోతుందని మీరు గమనించలేదా? ఆ దారిమీదుగా కారు పోతూండటం మీరు జాగ్రత్తగా గమనిస్తున్నప్పుడు, ఏదయినా ఒక వస్తువును బాగా పరిశీలనగా మీరు చూస్తున్నప్పుడు, మీ మనసు చాలా మెల్లిగా పనిచేయడంలేదూ? గమనించడం, పరిశీలించడం మనసు వేగాన్ని తగ్గిస్తాయి. ఒక చిత్రపటంవైపు కానీ, ఒక ప్రతిమవైపు కానీ, ఒక వస్తువువైపు కానీ చూస్తూ వుండటం మనసు నెమ్మదిగా అవడానికి తోడ్పడుతుంది. అట్లాగే కొన్ని పదాలను మళ్ళీ మళ్ళీ పునరుక్తి చేయడం కూడా. అయితే అప్పుడు ఆ వస్తువు, ఆ పదాలు చాలా ప్రాముఖ్యాన్ని సంతరించుకుంటాయి. మనసు వేగం తగ్గించుకోవడం అన్నదానిని, తరువాత ఏం కనిపెడతాము అన్నదానిని మీరు వదిలేస్తారు.

'మీరు వివరిస్తున్న దానిని నేను గమనిస్తున్నాను. మనసు నిశ్చలంగా అయిన ఎరుక కలిగింది.'

ఏ విషయాన్నయినా మనం నిజంగా గమనిస్తామా? రకరకాల అపోహలతో, ప్రమాణాలతో, తప్పొప్పుల నిర్ణయాలతో, పోల్చిచూడటాలతో, నిరసించడాలతో నిర్మించిన ఒక తెరను పరిశీలకుడికి, పరిశీలిస్తున్న అంశానికీ మధ్యన దించి చూస్తామా.

'ఇటువంటి తెర లేకుండా చూడటం సాధ్యం కాదు. అటూ యిటూ ఏమాత్రం అతిక్రమించని తీరులో పరిశీలించగలగడం నాకు చేతనవుతుందనుకోను.'

మాటలతో కాని, అనుకూలమైనవో, ప్రతికూలమైనవో నిర్ణయాలు చేసుకొని కాని మీరే మీ చుట్టూరా ఒక అవరోధాన్ని పేర్చుకోకండి అని నేను సలహా యివ్వ వచ్చునా. ఇటువంటి ఒక తెర లేకుండా పరిశీలన చేయగలరా? మరొక విధంగా చెప్తాను. మనసు ఒక వ్యాపకంతో వున్నప్పుడు సావధానత్వం వుంటుందా? మనసులో ఏ వ్యాపకమూ లేకుండా వున్నప్పుడే అది శ్రద్ధగా వినగలుగుతుంది. జాగ్రత్తతో గమనించడం వున్నప్పుడు మనసు మెల్లగా నడుస్తూ, అప్రమత్తంగా వుంటుంది. అదే నిర్వ్యాపరంగా వున్న మనసు యొక్క సావధానశీలత.

'సర్, మీరు చెప్తున్నది నేను స్వయంగా అనుభవాత్మకంగా గ్రహిస్తూ వున్నాను.'

ఇంకా కొంచెం ముందుకు వెళ్ళి దీనిని పరీక్షిద్దాం. పరిశీలకుడికి, పరిశీలిస్తున్న అంశానికీ మధ్యన విలువలు బేరీజు వేయడం కాని, ఒక తెర కాని లేనప్పుడు ఆ రెండింటి మధ్యా అప్పుడు విభజన వుంటుందా, అవి అప్పుడు విడివిడిగా వుంటాయా? పరిశీలకుడే పరిశీలిస్తున్న అంశం కాదూ?

'నాకు బొత్తిగా తెలియడం లేదు.'

వజ్రాన్ని దాని స్వభావశీల గుణాలనుంచి విడదీయలేము, విడదీయ గలమా? అసూయాభావాన్ని ఆ అసూయని అనుభవిస్తున్నవాడి నుంచి విడిగా విడదీయలేము. అయితే విభజన చేయగలం అనే భ్రమ వుంటుంది, అది సంఘర్షణకు ఆస్కారమవు తుంది. ఈ సంఘర్షణలో మనసు చిక్కుకొని పోతుంది. అసత్యమైన మీ విభజన మాయమైపోయి నప్పుడు స్వేచ్ఛ పొందడానికి అవకాశం వుంటుంది. అప్పుడు మాత్రమే మనసు నిశ్చలంగా వుంటుంది. అనుభవించేవాడు వేరుగా లేనప్పుడే యదార్థమైనది సృజనాత్మకంగా కదులుతుంది.

*(కమెంటరీస్ ఆన్ లివింగ్ : సెకండ్ సిరీస్)*

## భూమిమీద జీవిస్తున్న ప్రాణులంటే మనకి కనికరం వున్నదా?

నది పక్కనే ఒక చెట్టు వుంది. గత కొన్ని రోజులుగా ప్రతిరోజూ సరిగ్గా సూర్యుడు వుదయించబోయే సమయాన ఆ చెట్టువైపే చూస్తూ కూర్చుంటున్నాము. దిగంతంలో సూర్యబింబం వుదయించి చెట్లమీదుగా మెల్లగా పైకిలేస్తూ వుంటే, యీ చెట్టు అకస్మాత్తుగా బంగారం రంగును పులుముకుంటుంది. ఆకులన్నీ ప్రాణం పోసుకున్నట్లు మెరిసి పోతుంటాయి. ఆ చెట్టు పేరు ఏదయితేనేం - మనం చూస్తున్నది ఆ చెట్టు సౌందర్యాన్ని - అటువంటి ఆ చెట్టువైపు గంటలి తరబడి కూర్చుని చూస్తూ వుంటే, ఒక అనిర్వచనీయమైన గుణతత్వంతో ఆ ప్రదేశం, ఆ నది ఆవరించుకొనిపోయినట్లుగా అనిపిస్తుంది. సూర్యుడు యింకొంచెం పైకి ఎక్కి రాగానే, ఆకులన్నీ గలగలమంటూ కదిలి నృత్యం చేయడం ఆరంభిస్తాయి. గంట గంటకూ ఆ చెట్టు ఒక కొత్త శోభతో మెరిసి పోతున్నట్లుగా అనిపిస్తుంది. సూర్యోదయం అవక ముందు కనిపించీ కన్పించకుండా, ఎక్కడో మనకి చాలా దూరంలో, నిశ్చలంగా నిలబడినట్లుండే ఆ చెట్టులో ఒక గాంభీర్యం కనబడుతుంది. రోజు గడిచినకొద్దీ, కాంతిని పైన పులుముకున్న ఆకులు నృత్యం చేస్తూ, గొప్ప సౌందర్యం అంటే యిదే సుమా అని అనిపించే ఒక ప్రత్యేకతను ఆ చెట్టుకు ఆపాదిస్తాయి. మధ్యాహ్న సమయానికి దాని నీడ బాగా చిక్కనవుతుంది. ఎండ బారిన పడకుండా హాయిగా అక్కడ కూర్చోవచ్చు. ఆ చెట్టు ఒక స్నేహితుడిలా తోడుగా వుండి, ఒంటరిగా వున్నామన్న భావన రానీయదు. అక్కడ కూర్చున్నప్పుడు, చెట్లు మాత్రమే యివ్వగలిగిన ఒక గాఢమైన, స్థిరమైన భద్రతాభావంతో కూడుకున్న బాంధవ్యమూ, స్వేచ్ఛా మనకు దొరుకుతాయి.

సాయంత్రం అస్తమిస్తున్న సూర్యుడు పడమటి ఆకాశాన్ని ఎర్రగా వెలిగించి నప్పుడు, చెట్టు క్రమక్రమంగా కాంతిహీనంగాను, అస్పష్టంగాను అయి, తరువాత పూర్తిగా చీకట్లో మునిగిపోతుంది. ఆకాశం ఎరుపు, పసుపు, ఆకుపచ్చ రంగుల్లోకి మారుతుంది. కాని చెట్టు మాత్రం చలనం లేకుండా వుండిపోయి అదృశ్యమవుతుంది. ఇక రాత్రి అంతా విశ్రాంతి తీసుకుంటూ వుండిపోతుంది.

ఆ చెట్టుతో కనుక ఒక బాంధవ్యం ఏర్పరచుకుంటే మొత్తం మానవాళితోనే బాంధవ్యం ఏర్పరచుకున్నట్లవుతుంది. అప్పుడు ఆ చెట్టు బాధ్యత, లోకంలో వున్న చెట్ల బాధ్యత మీదే అవుతుంది. భూమిమీద జీవిస్తున్న ప్రాణులతో మీకు ఏ బాంధవ్యమూ లేనప్పుడు, మనుష్యులతో, యీ మానవాళితో మీకు వుండే ఆ కాస్త బాంధవ్యమూ కూడా కోల్పోతారు. చెట్టు యొక్క గుణం ఏమిటి అని మనం ఎప్పుడూ లోతుగా పరికించి చూడం. చెట్టుని, దాని దృఢత్వాన్ని గరుకుగా వుండే దాని బెరడుని

తాకి చూసి అనుభవపూర్వకంగా తెలుసుకోము. చెట్టు వినిపించే ధ్వనులని వినం. గాలి చెట్ల ఆకుల్లోంచి వీస్తూ చేసే ధ్వనులని కాదు; పిల్లగాలుల చప్పుళ్ళనీ కాదు. అచ్చంగా చెట్టులోనే వున్న ధ్వనులని. చెట్టు మొదలు వినిపించే ధ్వనులని, చెట్టు వేళ్ళు మౌనంగా వినిపించే ధ్వనులని. ఆ ధ్వనులు వినాలంటే మీలో అసాధారణమైన సున్నితత్వం వుండాలి. అది యీ ప్రపంచం చేస్తున్న గోల వంటిది కాదు. అదేపనిగా వాగుతూ వుండే మనసు చేసే గోల వంటిదీ కాదు. తమ కలహాలతోను, యుద్ధాలతోను మనుష్యులు సృష్టిస్తున్న అసహ్యమైన గోలా కాదు. ఈ విశాల విశ్వంలోని ఒక భాగం అయిన ధ్వని యిది.

ప్రకృతితో, కీటకాలతో, ఎగిరి దుమికే ఆ కప్పతో, కొండల మధ్యన తన జత పిట్టను పిలుస్తూ, కూస్తున్న గుడ్లగూబతో మనకి యింత తక్కువ బాంధవ్యం వుండటం ఎంతో వింతగా అనిపిస్తున్నది. భూమిమీద అసంఖ్యాకంగా వున్న యీ ప్రాణులంటే మనకి ఏమాత్రం లక్ష్యం లేదు. ప్రకృతితో కనుక మనం ఒక గాఢమైన, స్థిరమైన బాంధవ్యం ఏర్పరచుకోగలిగినప్పుడు, మన ఆకలి తీర్చుకోవడం కోసం జంతువుల్ని చంపడానికి చేతులు రావు. స్వప్రయోజనాల కోసం కోతుల్ని, కుక్కల్ని, గినీపందుల్ని కోసి, పరీక్షించి, వాటిని చిత్రవధ చేయలేము, మన గాయాలు మాన్పుకోడానికి, మన దేహాలకి చికిత్స చేసుకోవడానికి యింకో రకమైన మార్గాలని వెతుక్కుంటాము. అయితే మనసుకు చికిత్స చేసుకోవడం అనేది దీనికి పూర్తిగా భిన్నమైనది. ప్రకృతితో మీరు వుండిపోతే, ఆ చెట్టుమీద వున్న నారింజకాంతితోను, సిమెంటులో నుంచి పొడుచుకొని వచ్చిన ఆ గడ్డిపోచతోను, మబ్బులు కమ్మివేసి, అదృశ్యం చేసిన ఆ కొండలతోను మీరు వుండిపోతే, అప్పుడు క్రమక్రమంగా మనసుకు నయమవుతుంది.

ఇది భావుకత్వం కాదు, కాల్పనిక లోక విహారమూ కాదు. ఈ భూమిమీద జీవిస్తున్న, సంచరిస్తున్న ప్రతి ప్రాణితోను మనకు వుండవలసిన బాంధవ్యం అనే ఒక నిజం. లక్షలాది సొరచేపలను మనిషి చంపేశాడు. ఇంకా చంపుతూనే వున్నాడు. వాటిని వధించడం ద్వారా పొందే ప్రయోజనాలన్నీ యితర విధానాల ద్వారా కూడా పొందవచ్చు. కాని మనిషికి చంపడంలో - పరుగెత్తిపోతూ క్షణంలో కనుమరుగయ్యే జింకను, వుత్సాహంగా వురకలు పెడుతున్న లేళ్ళను, గజరాజులు ఏనుగులను - చంపడంలో ఏదో సంతోషం వున్నట్లుగా కన్పిస్తున్నది. మనకి ఒకరి నొకరం చంపుకోవడం అంటే కూడా యిష్టమే. ఈ భూమిమీద మానవుడి చరిత్ర ఆరంభమైన నాటినుండీ యీరోజువరకు తోటి మనుష్యులను చంపడం అనేది సాగుతూనే వున్నది. ప్రకృతితో, చెట్లతోనే నేరుగాను, పొదలతోను, పూలతో, గడ్డితో, బిరబిరమని కదిలిపోయే

మబ్బులతో ఒక గాఢమైన, సుస్థిరమైన, దీర్ఘకాల బాంధవ్యాన్ని మనం నెలకొల్పుకో గలుగుతే - నెలకొల్పగలగటం కాదు, నెలకొల్పి తీరాలి - అప్పుడు ఎటువంటి కారణం కోసమైనా సరే, మరొక మనిషిని చంపలేము. యుద్ధం అంటే వ్యవస్థీకృతం చేసిన హత్యలు. ఏదో ఒక ప్రత్యేకమైన యుద్ధానికి - అణుయుద్ధానికో, మరొకరకమైన యుద్ధానికో వ్యతిరేకంగా మనం ప్రదర్శనలు జరుపుతాం తప్ప, అసలు మొత్తం యుద్ధాలనే నిరసిస్తూ ప్రదర్శనలు ఎప్పుడూ జరపలేదు. తోటి మానవుడిని చంపడం అనేది యీ భూప్రపంచం మొత్తంలోకల్లా అత్యంత పాపకార్యం అని మనం ఏనాడూ ఘోషించలేదు.

('కృష్ణమూర్తి టు హిమ్‌సెల్ఫ్')

# మానవాళి భవిష్యత్తులో ఏమున్నది?

పక్షులకోసం వుంచిన ఆహారపు తొట్టెమీద ఒక పది, పన్నెండు పిట్టలు వాలి కిచకిచలాడుతూ, ఒకటి నొకటి నెట్టుకుంటూ గింజలు ఏరుకోవడానికి అవస్థ పడుతున్నాయి. మరో పెద్ద పక్షి వచ్చి వాలేసరికి, రెక్కలు టప టప కొట్టుకుంటూ యివన్నీ ఎగిరిపోయాయి. ఆ పెద్ద పక్షి ఎగిరిపోగానే మళ్ళీ అన్నీ వచ్చి చేరాయి. మళ్ళీ కలకలా రావాలు చేస్తూ, కొట్లాడుకుంటూ, కిచకిచమంటూ మొత్తంమీద విపరీతంగా గోలచేస్తున్నాయి. అంతలోనే ఒక పిల్లి అటుగా వచ్చింది. పిట్టలన్నీ కలవరపడిపోయి, కీచు కీచుమంటూ అరచి నానా హంగామా చేశాయి. ఎట్లాగయితేనేం ఆ పిల్లిని తరిమేశాయి. అది పెంపుడు పిల్లి కాదు, అడవి జాతికి చెందినది. రకరకాల రంగుల్లో, ఆకారాల్లో, చిన్నా, పెద్దా అడవిపిల్లులు యీ చుట్టుప్రక్కల చాలానే వున్నాయి. ఆహారపు తొట్టె చుట్టూ రోజు పొడుగూతా పిట్టలు వాలుతూనే వున్నాయి, చిన్న చిన్నవీ పెద్దవీ కూడా. మధ్యలో ఒక నీలిరంగులో వున్న పాలపిట్ట వచ్చింది. అందరిమీదా, మొత్తం ప్రపంచం మీదే అరుస్తూ కేకలు పెట్టింది. తన అరుపుల్తో తక్కిన పిట్ట లన్నింటినీ తరిమి పారేసింది. నిజం చెప్పాలంటే అది రావడం చూసి అవే పారిపోయాయి. ఈ పిట్టలన్నీ పిల్లులొస్తాయేమోనని జాగ్రత్తగా కనిపెట్టి వుంటాయి. సాయంత్రం అవుతున్నకొద్దీ ఒక్కటొక్కటిగా అన్నీ ఎగిరిపోయాయి. అంతటా నిశ్శబ్దం, నెమ్మది, ప్రశాంతత అలముకుంది. పిల్లులు వచ్చాయి, వెళ్ళాయి. కాని పిట్టలు ఇక్కడ లేవు.

ఆ వుదయం మబ్బుల్లో మెరుపులు తెగ మెరుస్తున్నాయి. వర్షం బాగా పడే సూచనలున్నాయి. గత కొద్ది వారాలుగా వర్షం కురుస్తూనే వుంది. ఇక్కడ ఒక చెరువులాంటిది తయారుచేశారు. అందులో నీళ్ళు నిండిపోయి అంచులదాకా వచ్చాయి. ఆకుపచ్చని ఆకులు, పొదలు, ఎత్తయిన చెట్లు అన్నీ ఎండకోసం ఎదురుచూస్తున్నాయి. కేలిఫోర్నియాలో సాధారణంగా కాసే తీవ్రమైన ఎండ వంటి ఎండ రానేలేదు. సూర్యుడు తన ముఖం చూపించి చాలారోజులైంది

మానవాళికి భవిష్యత్తులో ఏమున్నదా అని అనిపిస్తూ వుంది. అక్కడ కనబడుతున్న ఆ పిల్లల భవిష్యత్తులో - అరుస్తూ, ఆడుకుంటూ, ఎంతో సంతోషంగా, ఎంతో సౌమ్యంగా, ముద్దుగా వున్న ఆ పిల్లల భవిష్యత్తులో ఏముందో? ఇప్పుడు మనం ఏమిటో అదే మన భవిష్యత్తు. చారిత్రకంగా చూస్తే అనేక వేల సంవత్సరాలుగా జరుగుతున్నది యిదే. బ్రతకడం, చనిపోవడం, జీవించడానికి మనం పడే ప్రయాసా - అంతే. భవిష్యత్తు గురించి మనం అంతగా పట్టించుకున్నట్లు కన్పించదు. పొద్దున లేచిందగ్గర్నుంచీ రాత్రి పడుకునేవరకు అంతులేని వినోదకార్యక్రమాలు మీరు టెలివిషన్‌లో చూస్తూ వుంటారు. ఒకటి రెండు ప్రసారకేంద్రాల్లో మినహాయించి; అవైనా చాలా కొద్దిసేపే వుంటాయి; పైగా అంతగా లోతయిన విషయాల గురించీ వుండవు. పిల్లలకు కాలక్షేపం అయిపోతూ వుంటుంది. మీకు చాలా వినోదం కలుగుతున్నదనే విషయాన్ని వ్యాపారప్రకటనలు మరీ మరీ జ్ఞాపకం చేస్తుంటాయి. దాదాపుగా ప్రపంచం అంతటా యిదే జరుగుతున్నది. ఈ పిల్లలందరూ భవిష్యత్తులో ఏమైపోతారు? క్రీడారంగానికి సంబంధించిన కార్యక్రమాలుంటాయి - కొద్దిమంది ఆడుతుంటే ముప్పయి, నలభై వేలమంది ప్రేక్షకులు చూస్తుంటారు. గొంతులు చించుకొని అరుస్తుంటారు. ఒక గొప్ప చర్చిలో జరుగుతున్న పూజా కాండని కూడా మీరు చూస్తుంటారు. అదీ ఒక రకమైన వినోద కాలక్షేపమే. కాకపోతే అదంతా చాలా పవిత్రమైనది, మతానికి సంబంధించినది అంటారు - వుద్వేగ్నపూరితమైన, భావగర్భిత మైన అనుభూతి, మత ధర్మపరమైన అనుభూతి ఇట్లా ఎన్ని పేర్లు పెట్టినా అదంతా వినోదకాలక్షేపమే. ప్రపంచంలోని అన్ని ప్రాంతాల్లోనూ జరుగుతూ వున్న యిదంతా గమనిస్తున్నప్పుడు, వుల్లాసం కలిగించే వేడుకలతోను, వినోదాలతోను, క్రీడలతోను రకరకాలైన యీ వ్యాపకాలతోను మనసును నింపుకోవడం గమనిస్తు న్నప్పుడు ఏమాత్రం అక్కర వున్నవారయినా తప్పకుండా అడగవలసిన ప్రశ్న ఏమిటంటే - భవిష్యత్తులో ఏముంది? ఇప్పుడున్నదే కొత్త కొత్త రూపాలు ధరించి యింకా ఎక్కువవుతుందా? రకరకాలైన వినోద కాలక్షేపాలా?

మీకు ఏం జరుగుతున్నది అన్న స్పృహ మీకేమాత్రమైనా కలిగితే, వినోద కాలక్షేపాల ప్రపంచం, క్రీడా ప్రపంచం మీ మనసుని ఎట్లా పట్టివుంచుతున్నాయి, మీ జీవితాన్ని ఏవిధంగా మలుస్తున్నాయి అన్న సంగతి మీరు ఆలోచించాలి. ఇదంతా దేనికి దారితీస్తున్నది? బహుశ యిదంతా మీకు అసలు అక్కర్లేదేమో? బహుశ మీకు రేపటి గురించి లెక్క లేనేలేదేమో. బహుశ దాన్ని గురించి మీరెప్పుడూ ఆలోచించలేదేమో. ఒకవేళ ఆలోచించినా - అది మహా సంక్లిష్టమైనదీ, తలుచుకుంటేనే భయం వేస్తుందీ, రాబోయే కాలాన్ని గురించి ఆలోచించడం చాలా ప్రమాదకరం - అనీ అంటారేమో. ఇది ప్రత్యేకంగా మీ ఒక్కరి వృద్ధాప్యం గురించి కాదు. విధిబలీయతను గురించి - ఆ పదం వుపయోగించవచ్చు, ఫరవాలేదు అంటే. ఇప్పుడు మనం గడుపుతున్న జీవిత విధానానికి - అంటే రకరకాల కాల్పనిక భావాలతో, వుద్రేకాలతో, వుద్విగ్నానుభూతులతో, వ్యాపకాలతో కూడుకున్న మొత్తం వినోదప్రపంచం అంతా కలసి మనసు మీద దండెత్తుతున్న - యీ జీవిత విధానానికి పర్యవసానం చివరకు ఏమిటి? దీనంతటినీ గురించిన స్పృహ మీకు వుందో లేదో! మానవాళికి భవిష్యత్తులో ఏముంది?

ఇంతకు ముందే మేము చెప్పినట్లుగా, ప్రస్తుతం మీరు ఏమిటో అదే మీ భవిష్యత్తు. ఏ మార్పూ కనుక జరగకపోతే రకరకాల రాజకీయ, మత, సామాజిక విధానాలకి అనుగుణంగా పైపైన చేసుకునే సద్దుబాట్లు కాదు, పైపైన జరుపుకునే దిద్దుబాట్లు కాదు బాగా గాఢమైన లోతుల్లో వచ్చే మార్పు. ఇటువంటి మార్పు జరగాలంటే మీ పూర్తి ధ్యాస, మీ శ్రద్ధ, మీ వాత్సల్యం దానిమీద తప్పక వుండితీరాలి. ఇటువంటి మౌలికమైన మార్పు వస్తే తప్ప ప్రస్తుతం ప్రతిరోజూ మన జీవితాల్లో మనం ఏంచేస్తున్నామో అదే మన భవిష్యత్తు కూడా అవుతుంది. మార్పు అనే మాటలోనే కొంత క్లిష్టత వుంది. మార్పు చెంది ఏమవాలి? మరొక కొత్త నమూనాకి మారడమా? ఇంకొక ప్రతిపాదనకో మరో రాజకీయ విధానానికో మత విధానానికో మారడమా? దీన్నుంచి దానికి మారడమా? అది కూడా యీ పరిధిలోనిదే; 'ఉన్నది' అనే రంగంలో వుంటుంది. ఇటువంటి మార్పును చిత్రించేది ఆలోచనే. దానిని సూత్రీకరించేదీ, వస్తుప్రపంచానికి సంబంధించినదిగా స్థిరపరచేదీ ఆలోచనే.

కాబట్టి, మార్పు అనే యీ మాటను గురించి జాగ్రత్తగా పరిశోధించాలి. ఒక ప్రయోజనాన్ని ఆశించినప్పుడు అది మార్పు అవుతుందా? ఒక ప్రత్యేకమైన మార్గంలో, ఒక ప్రత్యేకమైన ఫలితం కోసమూ, తెలివిగా, హేతుబద్ధంగా అనిపించే ముగింపు కోసమూ జరిగినప్పుడు అది మార్పు అవుతుందా? బహుశ దీనికంటె సరియైన పదప్రయోగం ఏమిటంటే, 'ఉపన్నది ని సమాప్తం చేయడం' అంటే 'వున్నది' నుంచి 'వుండవలసినది' కి పోవడం కాదు. మార్పు అంటే అది కాదు. మార్పు అంటే సమాప్తం

అవడం, పూర్తిగా అయిపోవడం ---- అంతకంటె సరియైన మాట వుందా ----? 'సమాప్తం అవడం' సరిగ్గా వుంది అనుకుంటాను. అదే మనం తీసుకుందాం. సమాప్తం అవడం. అయితే సమాప్తం కావడానికి వెనకాల ఏదయినా ప్రయోజనమూ, వుద్దేశ్యమూ వున్నట్లవుతే, అది ఒక నిర్ణయం తీసుకోవడం వంటిది గనుక అవుతే, అప్పుడు అది కూడా కేవలం ఒకదానినుంచి మరొకదానికి మార్పు మాత్రమే అవుతుంది. ఇక్కడ నిర్ణయం అనే మాటలో సంకల్పించే చర్య అనే అర్థం కూడా వస్తుంది. 'నేను యిది చేస్తాను', 'నేను యిది చేయను'. సమాప్తం అవడం అనే క్రియలో కోరిక ప్రవేశిస్తే సమాప్తం అవడానికి కోరిక కారణం అవుతుంది. కారణం వున్నప్పుడు లోపల ఒక వుద్దేశ్యమూ వుంటుంది. కాబట్టి అప్పుడది నిజంగా సమాప్తం చెందడం కాదు.

ఇరవయ్యో శతాబ్దంలో చాలా బ్రహ్మాండమైన మార్పులు వచ్చాయి. విధ్వంసపూరితమైన రెండు యుద్ధాలే కాకుండా గతి తార్కిక భౌతికవాదం వచ్చింది. మతవిశ్వాసాలను, మతాచారాలను కర్మకాండలను విమర్శించే ధోరణి కూడా మొదలయింది. వీటితోపాటు సాంకేతిక విజ్ఞానరంగం కూడా ఎన్నో లెక్కలేనన్ని మార్పులు తీసుకొని వచ్చింది. కంప్యూటర్లు అభివృద్ధి చెందినకొద్దీ యింకా ఎన్నో మార్పులు జరగనున్నాయి. ఇంకా మీరు ఆరంభదశలోనే వున్నారు. అంతా పూర్తిగా కంప్యూటర్ల అజమాయిషీలోకి వచ్చినప్పుడు మన మానవ మస్తిష్కాలు ఏమయిపోతాయి? అది మళ్ళీ యింకో సమస్య. ఇంకెప్పుడయినా దానిని గురించి పరిశీలిద్దాం.

వినోదకార్యక్రమాలను వుత్పత్తి చేసే పరిశ్రమ ప్రాబల్యం ఎక్కువయినప్పుడు - ప్రస్తుతం మెల్లిమెల్లిగా అదే జరుగుతున్నది - అప్పుడు నిరంతరంగా సుఖం కోసం, సరదాల కోసం, వూహాలోకాల్లో చిత్రించుకున్న యింద్రియాకర్షణల కోసం యువతీ యువకులు, విద్యార్థులు, చిన్నపిల్లలు ప్రేరేపించబడుతూ వుంటారు. నిగ్రహము, నిరాడంబరత వంటి మాటలను సయితం దూరంగా తోసిపారేస్తారు. ఆ మాటల ముఖం కూడా చూడరు. సన్యాసులు, మునులు అవలంబించే కఠోర నియమనిష్ఠలు, వారి వైరాగ్యం, కాషాయ వస్త్రాలో, ఏదో ఒక చిన్న అంగవస్త్రమో ధరించడం, యీ విధంగా లౌకిక సుఖాల్ని పరిత్యాగం చేశామనుకోవడం నిరాడంబరత్వం కాదని చెప్పడంలో ఏమాత్రం సందేహం అక్కర్లేదు. అసలు యిటువంటి విషయాలను గురించీ, నిరాడంబరత అంటే ఏమిటి అనేదాన్ని గురించీ వినడానికైనా మీరు యిష్టపడరు. చిన్నతనంనుంచీ వినోదాలతో ప్రొద్దుపుచ్చుతూ, మీనుంచి మీరు పారిపోవడానికి మతసంబంధమైనవో, యితరమైనవో కాలక్షేపాలను వెతుక్కుంటూ గడుపుతున్నప్పుడు, మనోతత్వ వైజ్ఞానిక నిపుణులందరూ మీరు లోపల ఏమేమి భావిస్తుంటే అవన్నీ పైకి వ్యక్తం చేసి తీరాలనీ, అట్లా కాకుండా లోపల దాచుకోవడం

వల్ల, నిగ్రహించుకోవడంవల్ల చాలా దుష్ఫలితాలు కలిగి రకరకాల మానసిక రుగ్మతలకు దారితీస్తాయనీ చెప్తున్నప్పుడు - సహజంగానే మీరు యింకా ఎక్కువెక్కువగా క్రీడారంగం లోను, వినోదాలతోను, కాలక్షేపాలలోను మునిగి తేలుతూ వుంటారు. ఇవన్నీ మీనుంచి, అసలు మీరు ఏమిటో దానినుంచి మీరు పారిపోవడానికి సహాయం చేస్తుంటాయి.

మీరు ఏమిటి అన్నదాని స్వభావాన్ని ఏ విపరీతార్థాలూ కల్పించకుండా, ఏ పక్షపాతాలకూ తావులేకుండా, మీరంటే యిదీ అని కనిపెట్టాక, దానిని చూసి ఎటూ చలించకుండా, దానిని అవగాహన చేసుకోవడమే నిరాడంబరతకు ఆరంభం. ప్రతి ఆలోచననూ, ప్రతి మనోభావాన్నీ కనిపెట్టి వుండటం, ఆ ఎరుక కలిగి వుండటం, వాటిని అదుపు చేయకుండా, నిరోధించకుండా, మీ స్వంత అర్థాలను, అపోహలను జోడించకుండా ఎగురుతున్న పక్షిని గమనిస్తున్నట్లుగా గమనించాలి. ఈ విధంగా గమనించడం వలన ఒక అసాధారణమైన నిరాడంబరతత్వం కలుగుతుంది. మనకి మనం విధించుకునే నిబంధనలకంటె, మనమీద మనం చేసుకునే రకరకాల మూర్ఖపు ప్రయోగాల కంటె, స్వీయ వున్నతి అనీ, స్వీయ సాఫల్యం అనీ మనం అనుకునే వాటన్నింటికంటె మించిపోయి వుంటుంది యిది. అసలు అవన్నీ పరిణతిలేనివారు చేసే చేష్టలు. ఈ విధమైన గమనించడంలో గొప్ప స్వేచ్ఛ వుంటుంది. ఆ స్వేచ్ఛలో నిరాడంబరతత్వం అనే వుదాత్త భావం వుంటుంది. ఈనవనాగరిక ప్రపంచానికి చెందిన విద్యార్థులతో, చిన్నపిల్లలతో యిదంతా మాట్లాడితే వాళ్ళకు బహుశ విసుగొచ్చి తలకాయలు యింకోవైపుకి తిప్పేసుకుంటారు. ఎందుకంటే ప్రస్తుత ప్రపంచం తనకి కావలసిన సుఖసంతోషాలని వెతుక్కోవడంలో పూర్తిగా మునిగిపోయి వుంది.

గోధుమరంగులో వున్న పెద్ద వుడుత ఒకటి చెట్టుపైనుంచి దిగి వచ్చి, ఆహారపు తొట్టెవద్దకు వచ్చింది. నాలుగు గింజలు నోట కరచుకొని తొట్టె అంచుమీద కూర్చుంది. తోక నిటారుగా నిలబెట్టి, చివర మాత్రం మెలి త్రిప్పి, పెద్ద పెద్ద గాజు పూసల్లాంటి కళ్ళతో నాలుగువైపులా చూస్తూ ఎంతో ముచ్చటగా వుంది అది. ఒక నిముషంసేపు అట్లా కూర్చుందో లేదో మళ్ళీ తొట్టె కిందికి దిగి వచ్చింది. చెదరు మదరుగా వున్న రాళ్ళమీద గెంతుకుంటూ పోయి, చటుక్కున చెట్టుమీదకెక్కి, అదృశ్యమైపోయింది.

మానవుడు తననుంచి, తను ఏమిటో దానినుంచి, తను ఎక్కడికి పోతున్నాడో దానినుంచి, అసలు యిదంతా దేనిగురించో దానినుంచి అంటే - యీ విశాల విశ్వం, మన దైనం దిన జీవనం, చనిపోవడం, ఆరంభం అనే వాటినుంచి ఎప్పుడూ పారి పోతున్నట్లుగా కనబడుతున్నది. మననుంచి మనం ఎంతగా పారిపోయినా సరే, తెలిసి బుద్ధి పూర్వకంగా గాని, మనకు తెలియకుండానే గాని, యింకా పైకి కనబడని సూక్ష్మ పద్ధతిలో గాని, మనం ఎంత దూరంగా తప్పించుకొని వెళ్ళిపోయినా సంఘర్షణ,

సుఖము, బాధ, భయం మొదలైనవి ఎప్పుడూ మనల్ని అంటిపెట్టుకొనే వుంటాయని మనం ఏమాత్రం గ్రహించం. ఇది నాకు చాలా వింతగా అనిపిస్తుంది. చివరకు అవే మనమీద స్వారి చేస్తాయి. వాటిని అణగద్రొక్కాలని మీరు ప్రయత్నించవచ్చు. ఒక గట్టి నిశ్చయం వంటిది చేసుకొని, వాటిని లోపలకు నెట్టి పారేయాలని మీరు ప్రయత్నించవచ్చు; కాని అవి మళ్ళీ బయటపడుతూనే వుంటాయి. మనమీద చాలా ఎక్కువ ప్రభావం చూపే అంశాల్లో సుఖం ఒకటి. అందులోనూ మళ్ళీ సంఘర్షణలు, బాధ, విసుగు అన్నీ వుంటాయి. సుఖం కూడా బడలిక కలిగించడం, చిరాకు అనిపించడం మన జీవన మహాకల్లోలంలోని భాగమే. దానినుంచి తప్పించుకోలేవు మిత్రమా! ఈ లోతయిన అగాధమైన కల్లోలం నుంచి మీరు తప్పించుకోలేరు. నిజంగా మీరు దానిని గురించి గాఢంగా ఆలోచిస్తే తప్ప; ఒక్క ఆలోచించడమే కాదు, శ్రద్ధతో కూడిన సావధానత్వంతో, శ్రమతో కూడిన అప్రమత్తతతో ఆలోచనలు, 'నేను' అనే మొత్తం కదలికను పరికిస్తే తప్ప. ఇదంతా చాలా అలసటైన పని అనీ, అనవసరం అనీ మీరనవచ్చు. కాని యీ విషయాల మీదకు మీరు ధ్యాస మళ్ళించకపోతే, పట్టించుకోకపోతే భవిష్యత్తు మర్తి విధ్వంసపూరితంగా, మరింత దుర్బలంగా వుండటమే కాకుండా పరమ అర్థవిహీనంగా కూడా తయారవుతుంది.. ఇదంతా ఒక నిరాశా జనకమైన, నిస్పృహ కలిగించేటటువంటి దృక్పథం కాదు. ఇది నిజంగానే యిట్లా వున్నది. ఇప్పుడు ప్రస్తుతంలో మీరు ఏమిటో రాబోయే కాలంలో కూడా అట్లాగే వుంటారు. దానిని తప్పించుకోలేరు. సూర్యుడు వుదయించడమూ, అస్తమించడమూ ఎంత రూఢి అయినవో యిదీ అంతే. ఇది మనిషికి, మానవాళి అంతటికీ వచ్చిన వాటా. మన అందరం, మనలో ప్రతి వొక్కరమూ మారితే తప్ప. అంటే ఆలోచన చిత్రించినది కాని ఒకదానిగా మార్పు చెందితే తప్ప.

*('కృష్ణమూర్తి టు హిమ్‌సెల్ఫ్')*

## 'నేను' ఎట్లా పనిచేస్తుంటుంది - ఒక అంతర్వీక్షణ

మానవుల్లో చాలామంది స్వార్థపరులు. తమలో యింత స్వార్థం వుందని వారికే తెలియదు. వారి జీవన విధానంలోనే అది వుంది. తను స్వార్థపరుడిననే సంగతి ఎవరైనా ఎరిగివున్నా ఆ సంగతిని వారు చాలా జాగ్రత్తగా దాచిపెడతారు. సమాజపు తీరు అంతా స్వార్థం మీద ఆధారపడే నడుస్తున్నది. కాబట్టి, ఆ సమాజపు పద్ధతులకి లోబడి వారు నడుస్తూ వుంటారు. స్వార్థపరమైన మనసు చాలా జిత్తులమారిది. అది చాలా మొరటుగా, బాహాటంగా తన స్వార్థపరత్వాన్ని వెల్లడించుకోనూవచ్చు; లేదా

రకరకాల మారువేషాలనూ వేసుకోవచ్చు. మీరు ఒక రాజకీయవేత్త కనుక అయితే, మీ స్వార్థం అధికారాన్నీ, హోదానీ, ప్రజాభిమానాన్నీ కోరుకుంటుంది. ఒక సిద్ధాంతానికో, సేవాసంస్థకో తనని అంకితం చేసుకుంటుంది. ఇవన్నీ ప్రజలకు మేలు చేయడం కోసమే అని అంటుంది. మీరు కనుక ఒక నియంత అయితే, యితరుల మీద అతి కర్కశత్వంతో పెత్తనం చెలాయించడంలో అది వ్యక్తమవుతుంది. మీకు మతపరమైన విషయాలమీద అభిరుచి వుంటే, అప్పుడది ఆరాధనగానో, భక్తిగానో, ఒక నమ్మకాన్ని గాని, ఒక అంధవిశ్వాసాన్ని గాని గట్టిగా పట్టుకొని కూర్చోవడంలోనో తనని బయటకు వ్యక్తపరచుకుంటుంది, కుటుంబాల్లో కూడా స్వార్థం పనిచేస్తూ వుండటం చూడవచ్చు. తండ్రి జీవితం గడిపే పద్ధతిలో అతని స్వార్థమే కనబడుతుంది. తల్లి అయినా అంతే. లోలోపల అజ్ఞాతంగా దాగి, విస్తరించుకుంటూ పోయే యీ స్వార్థానికి కీర్తి, ఐశ్వర్యం, అందచందాలు అనేవి ఆధారం. మతాచార్యుల చుట్టూ ఉండే అధిష్ఠానశ్రేణీ స్వరూపంలో కూడా యిది వుంటుంది. వారే సృష్టించుకున్న ఒక ప్రత్యేకమైన దేవుడి బొమ్మ మీద తమకు గల భక్తిని, ప్రేమను వారు ఎంత గొప్పగా ప్రకటించుకున్నా సరే, అక్కడా యీ స్వార్థం వుంటుంది. గొప్ప గొప్ప పారిశ్రామిక అధినేతలలోనూ, ఒక పేద గుమాస్తాలోనూ కూడా క్షణ క్షణం విస్తరించిపోతూ, మనిషిని మొద్దుబారేటట్లు చేసే యీ స్వార్థం అనే యింద్రియలోలత్వం వుంటుంది. ఈ లౌకిక జీవనాన్ని పరిత్యజించిన సన్యాసి అయినా సరే, అతను ప్రపంచమంతా బైరాగిలా పర్యటిస్తుండవచ్చు గాక, లేదూ ఆశ్రమంలో ముక్కు మూసుకొని కూర్చుండవచ్చు గాక, అతనయినా తన లోపల అంతూ పొంతూ లేకుండా జరిగే యీ స్వార్థపు కదలికలను మాత్రం వదుల్చుకోలేడు. వాళ్ళు తమ పేర్లు మార్చుకోవచ్చు, కాషాయ-వస్త్రాలు ధరించవచ్చు, బ్రహ్మచర్య వ్రతమో, మౌనవ్రతమో పాటించవచ్చు. అయినాసరే, ఒక ఆదర్శమో, ఒక వూహా ప్రతిమో, ఒక చిహ్నమో వారిని లోలోపల దగ్ధం చేస్తూ వుంటుంది.

విజ్ఞానశాస్త్రవేత్తల్లో, తాత్వికుల్లో, విశ్వవిద్యాలయాల్లోని ఆచార్యుల్లో కూడా యిది లేకుండా వుండదు. మంచి పనులు చేసే పరోపకారశీలురు, మహాత్ములు, గురూజీలు, పేదలకోసం అహర్నిశలు శ్రమిస్తున్న స్త్రీ, పురుషులు - వీళ్ళందరూ కూడా పనిలో మునిగిపోయి తమని తాము మరిచిపోవాలని కోరుకుంటారు. అయితే ఆ పని కూడా వారి స్వార్థంలోని భాగమే. తమ అహంకారాన్ని వాళ్ళు తమ కృషిలోకి మళ్ళించారు. ఇది చిన్నతనంలోనే ఆరంభమవుతుంది. వృద్ధాప్యంలో కూడా కొనసాగుతూనే వుంటుంది. తన జ్ఞానం చూసుకొని గర్వించేవాడు, దొంగ వినయాన్ని అభ్యాసం చేసి అలవరచుకున్న నాయకుడు, విధేయురాలైన భార్య, పెత్తనం చెలాయించే మగవాడు

వీరందరిలోనూ యీ రుగ్మత వున్నది. దేశంలో, రకరకాల సంఘాలతో, గొప్ప గొప్ప లక్ష్యాలతో, సిద్ధాంతాలతో స్వార్థం తనని తాను పూర్తిగా ఐక్యం చేసుకోవచ్చు. అయినా అది ఆరంభంలో ఎట్లా వుంటుందో, ఎప్పటికీ అట్లాగే వుండిపోతుంది.

విపరీతమైన క్షోభకూ, గందరగోళానికీ కారణమైన యీ కేంద్రాన్ని వదిలించు కోవడం కోసం మానవుడు రకరకాలైన అలవాట్లు, పద్ధతులు, ధ్యాన విధానాలు ప్రయత్నించి చూశాడు. అయితే అది ఒక నీడలాగా చేతికి చిక్కకుండా తప్పించు కుంటూనే వున్నది. అది ఎప్పుడూ అక్కడే వుంటుంది. కాని, చేతుల్లో నుంచి, మనసులో నుంచి తప్పించుకొనిపోతూ వుంటుంది. పరిస్థితులను బట్టి అది బాగా బలం పుంజుకోవటమో, కొంచెం దుర్బలంగా అవడమో జరుగుతూ వుంటుంది. ఇక్కడ దాన్ని పట్టుకున్నామంటే, అది మరెక్కడో పైకి తేలుతుంది.

ఒక కొత్త తరాన్ని తయారుచేసే బాధ్యత తన మీద వున్న అధ్యాపకుడు యీ స్వార్థం అన్నది మన జీవితాలకు ఎంతగా హాని చేస్తున్నదో, ఎంత కలుషితపరుస్తున్నదో, ఎంత వికృతపరుస్తున్నదో, విపరీతాలను సృష్టించగలదో మాటల్లో కాకుండా, నిజంగా అవగాహన చేసుకున్నాడా అని సందేహం కలుగుతున్నది. దానినుండి ఎట్లా విముక్తి చెందగలమన్నది అతనికి తెలియకపోవచ్చు, కాని అసలు అది వున్నదన్న ఎరుక కూడా అతనికి లేకపోవచ్చు. అయితే, ఒకసారి యీ స్వార్థం యొక్క కదలికల తీరుతెన్నుల్ని అతడు గ్రహించాక, దానిలోని సూక్ష్మాసూక్ష్మతలను అతడు (లేక ఆమె) విద్యార్థులకు అందించగలరా? ఇది చేయడం అతని బాధ్యత గాదా? స్వార్థం పనిచేసే తీరు గురించిన అంతర్దృష్టి యీ పాఠ్యపుస్తకాల పఠనంకంటె, పరీక్షలకంటె ముఖ్య మైనది. స్వార్థం తాను యింకా విస్తరించడానికి, తనలోని దౌర్జన్యానికి, తన లోపల వుండే క్రూరత్వానికి తను సంపాదించిన జ్ఞానాన్ని వుపయోగించుకోగలదు కూడా.

మన జీవితాల్లోని అతి ప్రధానమైన సమస్య యీ స్వార్థపరత్వం. లొంగిపోయి వుండటం, అనుకరణ అన్నవి స్వార్థం యొక్క లక్షణాలే. అట్లాగే, పోటీ తత్వం, ప్రతిభలో వుండే నిర్దాక్షిణ్యతా కూడా. మన పాఠశాలల్లోని అధ్యాపకులు యీ సమస్యని గట్టిగా పట్టించుకొని ఆలోచిస్తే కనుక - వాళ్ళు అట్లా చేస్తారనే నేను ఆశిస్తున్నాను అప్పుడు వాళ్ళు విద్యార్థి స్వార్థరహితంగా ఉండటానికి ఏవిధంగా అతనికి తోడ్పడాలి? అబ్బే, అది ఏదో దైవప్రసాదంగా రావలిసిందే అనో, అది అసాధ్యమనో మీరు దీన్ని త్రోసిపారేయవచ్చు. అట్లా కాకుండా నిజంగానే మీరు దీన్ని కనుక గాఢంగా పట్టించుకుంటే - మనం పట్టించుకొని తీరాలి - విద్యార్థి మొత్తం బాధ్యత అంతా

మీదే అనుకుంటే అప్పుడు అనాదిగా వస్తున్నటువంటి, కట్టి బంధించివేసేదైనట్టి యీ శక్తి బారినుంచి మనసును విముక్తం చేయడం ఎట్లా మొదలుపెడతారు? ఎంతో దుఃఖానికి కారణభూతమైన యీ స్వార్థం బారినుంచి? విద్యార్థి కోపంగా మాట్లాడినప్పుడు గాని, మరొకరిని కొట్టినప్పుడు గాని, తను చాలా గొప్పవాడిని అని తలుస్తున్నప్పుడు గాని, వీటి పర్యవసానం ఎట్లా పరిణమిస్తుంది అన్న సంగతిని చాలా శ్రద్ధగా అంటే అందులో ఎంతో ఆత్మీయత పొదిగి చిన్న చిన్న మాటల్లో, సరళమైన భాషలో మీరు వివరించి చెప్పవద్దూ? విద్యార్థి 'యిది నాది' అని మొండికేస్తున్నప్పుడు, 'నేను చేశాను' అని ప్రగల్భాలు పలుకుతున్నప్పుడు, భయంవల్ల ఒక పని చేయకుండా తప్పించుకుంటున్నప్పుడు, యిటుక మీద యిటుక పేరుస్తున్నట్లుగా తన చుట్టూ తాను ఒక గోడను నిర్మించుకుంటున్నాడని వివరించి చెప్పడం సాధ్యం కాదా? అతని కోర్కెలు, అతని యింద్రియానుభూతులు, అతనిలోని హేతుబద్ధమైన ఆలోచనాశక్తిని అణచివేసి తామే ప్రాబల్యం వహిస్తే, అప్పుడు స్వార్థపు నీడ విస్తరిస్తున్నదని అతనికి సూచించడం సాధ్యం కాదా? స్వార్థం, అది ఏ వేషం వేసుకున్నా సరే, అది వున్నప్పుడు ప్రేమ వుండదని విద్యార్థికి చెప్పడం సాధ్యం కాదంటారా?

అయితే విద్యార్థి, 'నిజంగా మీరు యిదంతా గ్రహించారా లేక వూరికే కబుర్లు చెప్తున్నారా?' అని అధ్యాపకుడిని అడగవచ్చు. ఆ ప్రశ్నే మీలోని వివేకాన్ని మేల్కొల్పేది అవచ్చు. అప్పుడు మీలో మేలుకొన్న ఆ వివేకమే మీలో సముచితమైన భావాలను కలిగించి, సవ్యమైన సమాధానాన్ని మాటల రూపంలో మీకు అందివ్వవచ్చు.

అధ్యాపకుడు అనే పెద్ద హోదా ఏదీ మీకు వుండదు. విద్యార్థి లాగానే మీరు కూడా అనేక సమస్యలున్న ఒక మనిషి. ఒక హోదాతో మీరు మాట్లాడిన మరుక్షణమే మనుష్యుల మధ్య వుండవలసిన నిజమైన బాంధవ్యాన్ని మీరు హతమార్చేస్తారు. హోదా అనగానే అందులో అధికారం వుంటుంది. అధికారం కోసం ఆరాటపడుతున్నప్పుడు, దానిని గురించిన స్పృహ మీలో వున్నా లేకపోయినా, ఒక నిర్దాక్షిణ్యమైన వైఖరి వాతావరణంలోకి ప్రవేశిస్తుంది. మిత్రమా, మీ మీద మహత్తరమైన బాధ్యత వుంది. ప్రేమ అనే యీ సంపూర్ణమైన బాధ్యతను కనుక మీరు తీసుకుంటే, అప్పుడు స్వార్థపు పునాదులనే పెకలించివేసినట్లవుతుంది. మిమ్మల్ని ప్రోత్సాహపరచాలన్నో, మీచేత యీ పనులు చేయించాలనే వుద్దేశ్యంతోనో యిది చెప్పడం లేదు. అయితే, మనమందరమూ యీ సమస్త మానవాళికీ ప్రాతినిధ్యం వహిస్తున్న మనుష్యులమే కాబట్టి, కావాలనుకున్నా వద్దనుకున్నా మన మీద యీ సమస్తమైన, సంపూర్ణ బాధ్యత

వున్నది. దీనినుంచి తప్పించుకోవాలని మీరు ప్రయత్నించవచ్చు. అయితే ఆ కదలిక కూడా స్వార్థం చేస్తున్న చర్యే. నిర్దుష్టమైన గ్రహణశీలత వుండటమే స్వార్థం నుంచి విముక్తి చెందడం.

*('లెటర్స్ టు ది స్కూల్')*

# మహత్వపూర్ణమైన అనుగ్రహం

ఇవాళ తెల్లవారుఝామున ఆకాశంకేసి చూస్తే ఒక్క మబ్బు తునక కూడా కనబడలేదు. బూడిదరంగులో వున్న ఆలివుచెట్లతోను, దట్టంగా వున్న సైప్రస్ చెట్లతోను నిండివున్న టస్కన్ కొండల వెనకాలనుంచి సూర్యుడు వుదయిస్తున్నాడు. నది మీద ఒక్క నీడ కూడా పడటంలేదు. ఏస్పెన్ చెట్ల ఆకులు నిశ్చలంగా వున్నాయి. ఇంకా వలసపోని పక్షులు కొన్ని కిలకిలరావాలు చేస్తున్నాయి. నది చలనరహితంగా నిలబడిపోయినట్లు కనిపిస్తున్నది. నది వెనకాలనుంచి సూర్యుడు పైకెక్కి వస్తుంటే, ప్రశాంతంగా వున్న నీటిమీద పొడవాటి నీడలు పరచుకుంటున్నాయి. అంతలో ఒక పిల్లగాలి తెర కొండలపై నుంచి వచ్చి లోయలో ప్రవేశించింది. అది ఆకుల మధ్యలో దూరి, వుదయ సూర్యుని కిరణాలు సోకిన ఆ ఆకులను వణికించి నృత్యం చేయిస్తున్నది. మట్టిరంగులో వుండి, మిల మిల లాడుతున్న నీటిపై పొడవైనవీ, పొట్టివీ, పెద్దవీ, చిన్నవీ నీడలు పడుతున్నాయి. ఒంటరిగా కనబడుతున్న ఒకే ఒక పొగగొట్టంలోనుంచి పొగ పైకి లేస్తున్నది. బూడిదరంగు పొగలు చెట్లను దాటుకొని వెళుతున్నాయి. ఈ వుదయం చాలా మనోహరంగా వుంది. సౌందర్యంతో నిండి ఎంతో సమ్మోహపరుస్తూ వుంది. ఎక్కడ చూసినా నీడలు, తట తట మని వణికిపోతూ ఎన్నో ఆకులు. గాలిలో ఏదో సుగంధం తేలి వస్తున్నది. శీతకాలపు ఎండ కాస్తున్నా, వసంతఋతువు తొంగి చూస్తున్నట్లుగా అనిపిస్తున్నది కర్ణకఠోరమైన చప్పుడు చేస్తూ చిన్నకారు ఒకటి కొండపైకి వెళ్తున్నది. వేలాది నీడలు మాత్రం నిశ్చలంగా నిలబడిపోయి వున్నాయి. చాలా చక్కని వుదయం అది.

నిన్న మధ్యాహ్నం, గోల గోలగా వున్న వీధిని అంటుకొని వున్న ఒక గదిలో హఠాత్తుగా అరంభమైంది. పరతత్వపు శక్తీ, సౌందర్యం ఆ గదిలో నుంచి బయటకు వెలువడి, వీధిలో వస్తూ పోతూ వున్న జనం మీదుగా, తోటల మీదుగా, కొండలు దాటుకొని వ్యాపిస్తూ పోయింది. అపారంగా, అభేద్యంగా అది అక్కడ వుండిపోయింది. ఆ మధ్యాహ్నం అది అక్కడే వున్నది. మంచంమీద పడుకోబోతూ వుంటే యింకా

విపరీతమైన తీక్షణత్వాన్ని సంతరించుకుని, వుండిపోయింది. మహత్వపూర్ణమైన అనుగ్రహం అది. దానికి అలవాటు పడిపోవడం జరుగదు. ఎందుకంటే ప్రతిసారీ అది భిన్నంగా వుంటుంది. ప్రతిసారీ కొత్తగా, ఒక నవ్యత్వంతో, చాలా సున్నితమైన విశిష్టతతో, ఒక కొత్త వెలుగుతో వుండి, అంతకు మునుపు ఎన్నడూ చూడని దానిలాగా వుంటుంది. అది దాచుకునే వస్తువు కాదు. జ్ఞాపకం పెట్టుకొని, ఆ తరువాత ఎప్పుడో తీరిగ్గా కూర్చుని పరీక్షించే సంగతి కాదు. అది అక్కడ వుంటుంది; అయితే ఆలోచన దానిని సమీపించలేదు. ఎందుకంటే అసలు మెదడే పనిచేయడం ఆగిపోతుంది. అనుభవం పొందడానికి, దాచుకోవడానికి అప్పుడు కాలం అక్కడ వుండదు. అది అక్కడ వున్నది; ఆలోచనలన్నీ ఆగిపోయాయి.

ఆ తీక్షణమైన జీవశక్తి ఎప్పుడూ, రాత్రింబగళ్ళూ వుంటుంది. అది ఘర్షణ ఎరగదు; ఒక గమ్యం వైపుగా వుండదు; మన ప్రయత్నం, యిష్టా యిష్టాల ప్రమేయం దానికి అవసరం లేదు. ఎంత తీక్షణత్వంతో వుంటుందంటే ఆలోచనలు, మనోభావాలు దానిని తమ యిచ్ఛలకు, నమ్మకాలకు, అనుభవాలకు, కోరికలకు అనుగుణంగా మలచుకోవడం కోసం దానిని పట్టి బంధించలేవు. అది ఎంత పుష్కలంగా వుంటుం దంటే దేనివల్లా కూడా అది తగ్గిపోవడం జరుగదు. అయితే, దానిని మనం వుపయోగించుకోవాలనీ, ఒక గమ్యంవైపు మళ్ళించాలనీ, మన అస్తిత్వం అనే మూసలో దానిని పట్టి బంధించాలనీ, ఆవిధంగా మన పద్ధతులకు, మన అనుభవాలకు, మన జ్ఞానానికి లోబడేటట్లుగా దానిని తిప్పుకోవాలనీ ప్రయత్నిస్తాం. ఆకాంక్ష, అసూయ, అత్యాశ అనే వాటివల్ల ఆ శక్తి సన్నగిల్లుతుంది. ఆ కారణంగా సంఘర్షణ, దుఃఖం కలుగుతాయి. వ్యక్తిగతమైన ఆకాంక్షల్లో కాని సామూహిక ఆకాంక్షల్లో కాని వుండే నిర్దాక్షిణ్యత దాని తీక్షణతను చెదిరిపోయేటట్లు చేస్తుంది. అందువల్ల ద్వేషం, విరోధం, సంఘర్షణ కలుగుతాయి. అసూయతో కూడుకున్న చర్యలు యీ శక్తిని వక్రంగా తయారుచేస్తాయి. దానివల్ల అసంతృప్తి, వేదన, భయం వుత్పన్నమవుతాయి. భయంతో పాటుగా అపరాధభావం, ఆందోళన బయల్దేరుతాయి. ఆపైన పోల్చిచూడటం, అనుకరణ అనే నిరంతర క్షోభ ఆరంభమవుతుంది. వక్రమైపోయిన యీ ప్రాణశక్తే మతాచార్యుడినీ, సైనికాధికారినీ, రాజకీయవాదినీ, దొంగనీ తయరుచేస్తుంది. శాశ్వతత్వం కోసం, భద్రత కోసం మనం కోరుకోవడం యీ పరిమితులు లేని ప్రాణశక్తిని అసంపూర్ణంగా వుంచుతుంది. అందుకే అది నిష్ఫలమైన భావాలకు, పోటీలకు, క్రూరత్వానికి, యుద్ధాలకు నిలయమవుతున్నది. మనిషికీ, మనిషికీ మధ్య నిరంతర సంఘర్షణకు కారణమవుతున్నది.

వీటన్నింటినీ సునాయాసంగా, ఏ ప్రయత్నమూ లేకుండా పక్కకు నెట్టివేయ గలిగినప్పుడు మాత్రమే తీక్షణతతో కూడిన ఆ ప్రాణశక్తి వుంటుంది. ఇటువంటి స్వేచ్ఛలోనే తప్ప అది జీవించి, వికసించలేదు. స్వేచ్ఛగా వున్నప్పుడు మాత్రమే అది సంఘర్షణను, దుఃఖాన్నీ కలిగించకుండా వుంటుంది. అప్పుడు మాత్రమే అది సమాప్తమవకుండా వృద్ధి చెందుతూ వుంటుంది. ఆది, అంతమూ లేని ప్రాణం అది. ప్రేమ, నాశము అనే రెండింటినీ కలిగి వున్న సృష్టి అది.

ప్రాణశక్తిని ఏదో ఒక దిశవైపుగా వుపయోగిస్తే జరిగేది ఒకటే - సంఘర్షణా, దుఃఖమూ. జీవిత సమస్తం ద్వారా వ్యక్తమవుతూ వుండే ప్రాణశక్తి కొలతలకు అందని మహదానంద స్వరూపం.

# దేవుడున్నాడా?

*ప్రశ్నిస్తున్నవారు :* దేవుడు అనేవాడు అసలు వున్నాడా అన్న సంగతి నిజంగా తెలుసుకోవాలనుంది నాకు. దేవుడు కనుక లేకపోతే జీవితానికి అర్థమే లేదు. దేవుడు అంటే ఏమిటో తెలియకపోవడంవల్ల వేలాది నమ్మకాలలో, కల్పిత రూపాలలో మనిషి అతన్ని ప్రతిష్ఠించుకున్నాడు. ఈ నమ్మకాలు తయారుచేసిన భయాలు, విభేదాలు మనిషిని తన తోటి మనుష్యుల నుండి విడదీశాయి ఈ విభజనలవల్ల కలిగిన బాధలనుండి, గోలల నుండి తప్పించుకోవడానికి మనిషి మళ్ళీ కొన్ని నమ్మకాలను తయారుచేసుకున్నాడు. ఇంకా దారుణంగా పరిణమించిన బాధలు, గందరగోళం అతన్ని చుట్టుముట్టేసాయి. తెలియక పోవడంవల్ల నమ్మకంలో పడతాం. దేవుడిని నేను తెలుసుకోగలనా? ఇండియాలోను, యిక్కడా కూడా ఎంతో మంది మహాత్ములను యీ సంగతి అడిగాను. వాళ్ళంతా 'మొదట నమ్ము, ఆ తరువాత నీకు తెలుస్తుంది. నమ్మకం లేకపోతే ఏమీ తెలుసుకోలేవు' అని నమ్మకాన్నే బలపరిచారు. మరి మీరేమంటారు?

*కృష్ణమూర్తి :* ఒక విషయం కనిపెట్టడానికి నమ్మకం అవసరమా? తెలుసుకోవడం కంటె నేర్చుకోవడం చాలా ముఖ్యం. నమ్మకం అంటే ఏమిటో నేర్చుకోగానే నమ్మకం అంతరిస్తుంది. నమ్మకాన్ని వదిలేసి స్వేచ్ఛ పొందినప్పుడే మనసు చూడగలుగుతుంది. నమ్మకం అయినా సరే, అపనమ్మకం అయినా సరే, రెండూ మనిషిని కట్టిపడేస్తాయి. ఎందుకంటే నమ్మకం, అపనమ్మకం రెండూ ఒకటే. అవి ఒకే నాణేనికి వున్న రెండు ప్రక్కలు. కాబట్టి నమ్మకం వుండటాన్ని, దానికి వ్యతిరేకమైనదాన్ని కూడా మనం పూర్తిగా త్రోసిపారేయాలి. విశ్వాసి, అవిశ్వాసి యిద్దరూ ఒకటే. యిదంతా యదార్థంగా చూశాక, అప్పుడు 'దేవుడు వున్నాడా' అన్న ప్రశ్నకు అర్థం మరొకలాగా వుంటుంది. 'దేవుడు' అనే మాటకు వెనకాల వున్న సంప్రదాయం, స్మృతులు, మేధనుపయోగించీ, భావోద్వేగాలననుసరించీ, ఆ మాటకు మనం యిచ్చుకునే విశేషార్థాలు- యివన్నీ దేవుడు కాదు. ఆ మాట అసలైన నిజం కాదు. కాబట్టి ఆ పదాన్ని మనసు వదిలేయ గలుగుతుందా?

ప్ర : అంటే ఏమిటో నాకు తెలియడంలేదు.

కృ : ఆ మాట అంటేనే సంప్రదాయం; ఒక నిత్యసత్యాన్ని కనిపెట్టాలనే ఆశ, కోరిక పరమార్థాన్ని చేరుకోవాలనే యత్నం; మన అస్తిత్వానికి వూపిరి పోసే ఒక వుద్యమం. అందువల్ల ఆ మాటే ఒక పరమార్థం అయిపోతుంది. అయితే, అసలైనది ఆ మాటలో లేదని మనం గ్రహించవచ్చు. మన మనస్సే ఆ మాట. మాట అంటే ఆలోచన.

ప్ర : నాలోనుంచి ఆ మాటను తీసిపారేయమని మీరంటున్నారు. అదెట్లా సాధ్యం? ఆ మాటలో గతం వుంది. జ్ఞాపకాలు వున్నాయి..భార్య అంటే ఒక మాట. యిల్లు అన్నా ఒక మాటే. సృష్టి ఒక మాటతో ఆరంభమైంది. అంతే కాకుండా మాట ద్వారానే భావప్రసారం జరుగుతుంది. మాట ఒక గుర్తుగా పనిచేస్తుంది. మీరు అంటే మీ పేరు కాదు. అయినా కూడా మిమ్మల్ని గురించి నేను తెలుసుకోవాలంటే మీ పేరు పెట్టి అడగాలి. మీరేమో మనసు యీ మాటను వదిలించుకోగలదా, అంటే మనసు తాను చేసే పనులన్నింటినీ తానే ఆపివేయగలదా అని అడుగుతున్నారు.

కృ : చెట్టు అనే విషయం తీసుకుందాం. అందులో వస్తువు మన కళ్ళ ముందు వుంటుంది. ఆ మాట చెట్టుని గురించి అని అందరూ ఒక ఒప్పందానికి వచ్చారు. ఇప్పుడు 'దేవుడు' అనే మాట తీసుకుంటే, ఆ మాటకు సంబంధించినది ఏదీ లేదు. అందువల్ల ప్రతివారూ తమకు తోచిన వూహాచిత్రాన్ని సృష్టించుకుంటున్నారు. ఎందుకంటే ఆ మాటకు సంబంధించినది ఏదీ లేదు కాబట్టి. ఇది వేదాంతి ఒక రకంగానూ, మేధావి మరో రకంగాను సృష్టించుకుంటాడు. నమ్మకం వున్నవాడు, నమ్మకం లేనివాడు కూడా తమకు నచ్చిన పద్ధతుల్లో తయారుచేసుకుంటారు. ఆశలోనే యీ నమ్మకం పుట్టి, ఆపైన వెంపర్లాట ఆరంభమవుతుంది. ఆ ఆశ అసలు నిస్పృహ యొక్క -। అంటే లోకంలో మన చుట్టూరా వున్నదంతా చూడటంవల్ల కలిగిన నిస్పృహ యొక్క పర్యవసానం. నిస్పృహలో నుంచే ఆశ పుడుతున్నది. ఇవి రెండూ కూడా ఒకే నాణేనికి వున్న రెండు ప్రక్కలు. ఏ ఆశా లేనప్పుడు అది నరకమే. నరకం అంటే భయం కాబట్టి మనం ఆశకి ప్రాణం పోస్తాం. అప్పుడు భ్రాంతి ఆరంభమవుతుంది. కాబట్టి, ఆ మాట మనల్ని భ్రాంతిలో పడవేసిందే తప్ప దేవుడి దగ్గరకు మాత్రం చేర్చలేదు. దేవుడు అంటే భ్రాంతి. ఆ భ్రాంతిని మనం పూజిస్తున్నాం. ఇక అవిశ్వాసి యింకోరకం దేవుడిని గురించి ఒక భ్రాంతిని సృష్టించుకొని, దాన్ని పూజిస్తాడు. అదే తన దేశం లేదా ఒక భూలోకస్వర్గం లేదా సత్యం మొత్తం అందులోనే వుందని అతను అనుకునే ఒక గ్రంథం. అందువల్ల యీ భ్రాంతితో కూడుకున్న ఆ మాటను మీరు వదిలేయగలరా అని అడుగుతున్నాము.

ప్ర : ఈ విషయమై నేను బాగా యోచించాలి.

కృ : భ్రాంతి లేనప్పుడు, యిక మిగిలింది ఏమిటి?

ప్ర : ఉన్నది ఏదో అది మాత్రమే

కృ : ఆ 'వున్నది' అత్యంత పవిత్రమైనది

ప్ర : 'ఉన్నది' కనుక అత్యంత పవిత్రమైనదయితే, అప్పుడు యుద్ధం అతిపవిత్రమైనది; ద్వేషం, అస్తవ్యస్తత, బాధ్యదురాశ, దోపిడీ యివన్నీ పవిత్రమైనవి. అప్పుడు మనం మార్పు గురించి ఏమీ మాట్లాడకూడదు. 'ఉన్నది' కనుక పవిత్రమైనదయితే, అప్పుడు ప్రతి హంతకుడు, దోపిడీ చేసే ప్రతివాడూ, స్వలాభానికి యితర్లని వుపయోగించుకునే వాడూ, అందరూ 'నన్ను ఏమీ అనకండి, నేను చేస్తున్నది పవిత్రమైన పని' అని అనవచ్చు.

కృ : 'ఉన్నది' అత్యంత పవిత్రమైనది అన్న వాక్యంలోని సరళత్వమే దాన్ని చాలా అపార్థం చేసుకోవడానికి దారి తీస్తున్నది. ఎందుకంటే మనం అందులోని సత్యాన్ని చూడం. 'ఉన్నది' పవిత్రమైనది అని నిజంగా గ్రహించినప్పుడు, మీరు యుద్ధమూ చేయరు, ఆశలూ పెంచుకోరు, యితర్లని దోపిడీలూ చేయరు. ఇవన్నీ చేశాక, మీరు వుల్లంఘించిన ఆ సత్యమే మళ్ళీ మిమ్మల్ని రక్షించాలని మీరు కోరుకోవడానికి వీల్లేదు. వీధుల్లో హింసాకాండ చేస్తున్న నల్లవాడితో, "ఉన్నది చాలా పవిత్రమైనది, దానిని ఎదిరించకు, దానిని మంటబెట్టకు" అంటున్న శ్వేత జాతీయుడు 'వున్నది' ని గ్రహించలేదనమాట. ఎందుకంటే నిజంగా అతడు గ్రహించి వుంటే అతనికి ఈ నీగ్రో పవిత్రంగా కనబడి వుండేవాడు. అప్పుడు యీ విధ్వంసానికి ఆస్కారమే వుండేది కాదు. కాబట్టి మనలో ప్రతి ఒక్కరూ యీ సత్యాన్ని చూస్తే, మార్పు తప్పక కలుగుతుంది. సత్యాన్ని గ్రహించడమే మార్పు.

ప్ర : దేవుడున్నాడా లేదా అన్నది తెలుసుకోవడానికి నేను యిక్కడికి వచ్చాను. మీరు నన్ను పూర్తిగా గందరగోళంలో పడేశారు.

కృ : దేవుడున్నాడా అన్నది అడగడానికి మీరు వచ్చారు. ఆ మాట భ్రాంతికి దారితీస్తున్నది; ఆ భ్రాంతిని మీరు పూజిస్తున్నారు; ఈ భ్రాంతికోసంగాను ఒకరినొకరం హతమార్చుకోవడానికి మనకు ఏ అభ్యంతరమూ వుండటం లేదు. ఏ భ్రాంతులూ లేనప్పుడు 'వున్నది' అత్యంత పవిత్రమైనది. అసలు యదార్థంగా వున్నదేమిటో యిప్పుడు చూద్దాం. మనం తీసుకున్న ఒక క్షణంలో 'వున్నది' భయం కావచ్చు, తళుక్కున మెరిసి మాయమయే వుల్లాసం కావచ్చు. ఇవన్నీ నిరంతరం మారిపోతూనే వుంటాయి. ఇవి కాక, 'నా చుట్టూరా యివన్నీ మారిపోతూ వుంటాయి. కాని నేను శాశ్వతంగా వుండిపోతాను' అని అంటున్న పరిశీలకుడు కూడా వున్నాడు. అది వాస్తవమేనా, అది నిజంగా అట్లా వున్నదా? అతను కూడా మార్పు చెందడం లేదూ? కొంత తనలో చేర్చుకుంటూ, కొంత తననుంచి తొలగించుకుంటూ, రూపం మార్చుకుంటూ, సర్దుబాట్లు చేసుకుంటూ, మరొకలాగా అవుతూనో, అవకుండానో - అతను మారడం లేదూ? కాబట్టి పరిశీలిస్తున్న అంశమూ, పరిశీలకుడూ రెండూ

నిరంతరం మార్పు చెందుతూనే వుంటాయి. 'ఉన్నది' అంటే మార్పు. అది ఒక వాస్తవం 'ఉన్నది' అంటే అదీ.

ప్ర : అంటే, అప్పుడు ప్రేమ కూడా మార్పు చెందుతుంటుందా? ప్రతిదీ మార్పు అనే కదలికకు లోనవుతున్నప్పుడు, ప్రేమ కూడా యిటువంటి కదలికలోనిదేగా? ప్రేమ కూడా మారుతూ వుండేదయితే, అప్పుడు నేను యీ రోజు ఒక స్త్రీని ప్రేమించవచ్చు, రేపు మరొక స్త్రీతో సంబంధం పెట్టుకోవచ్చు.

కృ : ప్రేమ అంటే అదేనా? ప్రేమ వేరూ, అది బయటకు వ్యక్తపరచడం వేరూ అని మీరు అంటున్నారా? లేదూ ప్రేమకంటె, వ్యక్తం చేయడానికే ఎక్కువ ప్రాధాన్యం యిస్తున్నారా? ఆ విధంగా పరస్పర వైరుధ్యాలనూ, సంఘర్షణనూ సృష్టిస్తూ. ప్రేమ మార్పు అనే చక్రంలో చిక్కుకొని పోతుందా? అప్పుడది ద్వేషంగా కూడా అయిపోవచ్చు. అప్పుడు ప్రేమ అంటే ద్వేషం. ఏ భ్రాంతులూ లేనప్పుడే 'వున్నది' అత్యంత పవిత్రమైనది. ఏ భ్రాంతీ లేనప్పుడు 'వున్నది' ని దేవుడనవచ్చు, లేదూ మీకిష్టమైన మరొక పేరు కూడా పెట్టుకోవచ్చు. కాబట్టి, దేవుడు కాని, మీరు పెట్టుకున్న మరొక పేరు కానీ మీరు లేనప్పుడే వుంటాడు. మీరు వున్నప్పుడు అది వుండదు. మీరు లేనప్పుడు ప్రేమ వుంటుంది. మీరు వుంటే ప్రేమ వుండదు.

*(ది అర్జెన్సీ ఆఫ్ ఛేంజ్)*

# బాధ

ప్రశ్నిస్తున్నవారు : నా జీవితకాలమంతా ఎన్నో బాధలతో గడిపినట్లుగా నాకనిపిస్తున్నది. శారీరకమైనవి కావు. మరణం చూశాను. ఒంటరితనం అనుభవించాను. బ్రతుకు వట్టి నిరర్థకం అనిపించింది ఎన్నోసార్లు. నాకు ఒక కొడుకు. వాడిని ఎంతగానో ప్రేమించాను. ఒక ప్రమాదంలో చనిపోయాడు. నా భార్య నన్ను వదలి వెళ్ళిపోయింది. ఆ విషయం నన్ను అమితంగా కలవరపరచింది. చాలామంది మా వర్గం మనుష్యుల్లాగే నాకూ కొంత డబ్బు, స్థిరమైన వుద్యోగం వున్నాయి. నా పరిస్థితులను గురించి నేను వాపోవడంలేదు. అయితే దుఃఖం అంటే ఏమిటి, అది అసలు ఎందుకు కలుగుతున్నది, అనేది నేను అర్థం చేసుకోవాలనుకుంటున్నాను. దుఃఖం అనుభవించడం ద్వారా వివేకం వస్తుందని అందరూ అంటారు. కాని అందుకు విరుద్ధంగా జరుగుతుందని నేను అంటున్నాను.

కృష్ణమూర్తి : బాధ అనుభవించడం ద్వారా మీరు ఏం నేర్చుకున్నారా అని నేను ఆలోచిస్తున్నాను. అసలు మీరు ఏదయినా నేర్చుకున్నారా? దుఃఖం మీకు ఏం నేర్పించింది?

ప్ర : ఒకటి మాత్రం ఖచ్చితంగా నేర్పించింది. అదే మనుష్యులతో బంధం పెంచుకోకూడదు - అని. ఒక విధమైన విరక్తి, అన్నింటినుండీ దూరంగా తొలిగి వుండటం, మనోభావాలను అదుపులో వుంచుకోవడం - యివన్నీ అలవర్చుకున్నాను. మళ్ళీ మళ్ళీ గాయపడకుండా జాగ్రత్త పడటం కూడా నేను నేర్చుకున్నాను.

కృ : కాబట్టి మీరు అంటున్నట్లుగానే దుఃఖం వివేకాన్ని మీకు నేర్పలేదు. పైగా మిమ్మల్ని మరింత కపటంగా, మరింత మొరటుగా తయారుచేసింది. మనల్ని మనం రక్షించుకోవడం కోసం జరిపే యీ ప్రతిక్రియలు కాకుండా మరింకేమైనా దుఃఖం మనకి నేర్పిస్తుందా?

ప్ర : బాధని జీవితంలో ఒక భాగంగా నేను స్వీకరిస్తూనే వున్నాను. కాని యిప్పుడు ఎందువల్లనో దాన్నుంచి విముక్తి పొందాలనుకుంటున్నాను. బంధాలు మళ్ళీ మళ్ళీ పెంచుకోవడం, మళ్ళీ ఆ భరింపరాని విరక్తినీ, ఆ నిరాసక్తతనూ అనుభవించడమూ నుంచి విముక్తి చెందాలనుకుంటున్నాను. నా జీవితానికి ప్రయోజనం లేదు, వట్టి శూన్యం. చాలా స్వార్థపూరితంగా, చాలా తుచ్ఛంగా అనిపిస్తున్నది. అతి సగటు బ్రతుకు నాది. బహుశ యీ సగటుదనమే అన్నిటినీ మించిన ఆవేదనను కలిగిస్తున్నది.

కృ : వ్యక్తిగతమైన దుఃఖమూ వున్నది. లోకానికి సంబంధించిన దుఃఖమూ వున్నది. అవివేకం అనే దుఃఖం, కాలం అనే దుఃఖం వున్నాయి. తనని గురించి తనకి తెలియకపోవడమే యీ అవివేకం అంటే. కాలం అనే దుఃఖం అంటే కాలమే చికిత్స చేస్తుంది, కాలమే నయం చేస్తుంది, మార్పులు తెస్తుంది అనే భ్రమ. చాలామంది యీ భ్రమలో చిక్కుకొనిపోయి, దుఃఖాన్ని నెత్తిన పెట్టుకొని పూజించడమో, సమర్థించడమో చేస్తుంటారు. ఏవిధంగా చేసినా దుఃఖం మాత్రం అట్లాగే వుండిపోతుంది. అయితే దానిని పూర్తిగా అంతం చేయలేమా అనే ప్రశ్న మాత్రం మనం వేసుకోము.

ప్ర : అది అంతమవుతుందా, ఏవిధంగా అనేకదా నేను అడుగుతున్నది. దుఃఖాన్ని నేను ఎట్లా అంతం చేయగలను? దానినుంచి పారిపోవడంవల్ల లాభంలేదని నాకు తెలుసు. విరక్తితో, నిరాశావాదంతో దానిని నిరోధించీ లాభంలేదు. ఎంతో కాలంనుంచి నేను మోసుకొస్తున్న యీ దుఃఖాన్ని అంతమొందించడానికి నేను ఏంచేయాలి?

కృ : దుఃఖంలో వున్న ప్రధానాంశాల్లో ఒకటి తన మీద తనే జాలిపడటం. మరొక వ్యక్తితో అనుబంధం పెంచుకోవడం; ఆ వ్యక్తి తిరిగి మనతో అనుబంధం పెంచుకోవడాన్ని ప్రోత్సహించి, పెంపు చేయడం రెండవది. దుఃఖం కలిగేది యీ అనుబంధం సడలిపోయినప్పుడే. కాని దుఃఖపు బీజాలు మాత్రం అనుబంధపు ఆరంభదశలోనే పడతాయి. దీనంతటికీ కారణం ఏమిటంటే మనల్ని గురించిన జ్ఞానం మనకు బొత్తిగా లేకపోవడం. తనని తాను తెలుసుకోవడమే దుఃఖాన్ని అంతం చేయడం. మనల్ని గురించి తెలుసుకోవాలంటే మనకు భయం. ఎందుకంటే అందరినీ మంచివాళ్ళు - చెడ్డవాళ్ళు, దుర్మార్గులు - మహాత్ములూ, నిష్కళంకులు- అవినీతి పరులూ అని మనమే విభజించి కూర్చున్నాం. చెడుని గురించి మంచి ఎప్పుడూ తీర్పులు యిస్తూ వుంటుంది. ఈ వేరు వేరు పక్షాలు ఒకదానితో ఒకటి కలహిస్తూ వుంటాయి. ఈ కలహమే దుఃఖం. దుఃఖాన్ని అంతం చేయడం అంటే యీ వాస్తవాన్ని చూడటం. దానికి వ్యతిరేకమైనది కనిపెట్టడం కాదు. ఎందుకంటే పరస్పర వ్యతిరేకాలలో (ద్వంద్వాల్లో) ప్రతిదానిలోనూ రెండోది కూడా వుంటుంది. ఈ ద్వంద్వాలను పట్టుకొని నడవడమే దుఃఖం. జీవితాన్ని యీవిధంగా వున్నతమూ నీచమూ, మహోత్తమం - అతిక్షుద్రం, దేవుడు - దయ్యమూ అనే పక్షాలుగా ముక్కలు చేయడంవల్ల సంఘర్షణ, బాధ పుట్టి పెరుగుతాయి. దుఃఖం వున్నప్పుడు ప్రేమ వుండదు. ప్రేమ, దుఃఖం రెండూ కలిసి ఒకేచోట వుండలేవు.

ప్ర : అహ! ప్రేమ ఎదుటివారిని దుఃఖంలో ముంచగలదు. నేను ఒకరిని ప్రేమిస్తుండవచ్చు, అయినా వారికి దుఃఖాన్ని కూడా కలిగించవచ్చు.

కృ : మీరు ఒకరిరిని ప్రేమిస్తున్నప్పుడు, దుఃఖాన్ని మీరు యిస్తున్నారా, అవతలి వ్యక్తి కలిగించుకుంటున్నారా? ఒక వ్యక్తి మీతో అనుబంధం పెంచుకున్నాడనుకుందాం. మీరు దానిని ప్రోత్సహించినా సరే, ప్రోత్సహించకపోయినా సరే అతను పెంచుకున్నాడు. మీరు అతని నుంచి దూరంగా తొలగిపోయారు. అతను బాధపడతాడు. అతను పడుతున్న బాధకు కారణం మీరా, అతనా?

ప్ర : మరొకరి దుఃఖానికి బాధ్యత -.ఆ దుఃఖం నాకోసం అయినా సరే - ఆ బాధ్యత నాది కాదని మీరంటున్నారా? అప్పుడు మరి దుఃఖం ఎట్లా అంతమవుతుంది?

కృ : మేము చెప్పినట్లుగా, తనని తాను పూర్తిగా తెలుసుకోవడంలో మాత్రమే దుఃఖం అంతమవుతుంది. ఒకే ఒక్క చూపుతోనే మిమ్మల్ని మీరు తెలుసుకుంటారా లేదూ బహుశా, దీర్ఘమైన విశ్లేషణ అనంతరం - అంటారా? విశ్లేషణ ద్వారా మిమ్మల్ని మీరు తెలుసుకోలేరు. పరస్పర సంబంధాలలో, కూడబెట్టి నిలవ చేసుకోవడంవల్ల

కాకుండా, క్షణ క్షణపు బాంధవ్యంలో మిమ్మల్ని మీరు తెలుసుకోగలుగుతారు. దీని అర్థం ఏమిటంటే, యదార్థంగా యిప్పుడు జరుగుతున్నది ఏమిటో దాని ఎడల, మన యిష్టా యిష్టాలతో ప్రసక్తి లేని ఎరుక వుండాలి. అంటే ఏమిటంటే మనం ఏమిటో దానినే చూడటం. దానికి వ్యతిరేకమైనదిగాని, ఒక ఆదర్శం గాని, ఒకప్పుడు మనం ఏమిటో ఆ సమాచారం గాని లేకుండా చూడటం. మీవైపు మీరు ఆగ్రహంతోనో, ద్వేషంతోనో కూడుకున్న దృష్టితో చూసుకుంటే గతించిన కాలం పులిమిన ఛాయల్లోనే మీరు కనబడతారు. మిమ్మల్ని మీరు చూసుకుంటున్నప్పుడల్లా గతాన్ని వదిలివేస్తూ వుండటమే గతంనుంచి విముక్తి చెందడం. అవగాహన అనే కాంతి వున్నప్పుడే దుఃఖం అంతమవుతుంది. అయితే యీ కాంతి ఏదో ఒక అనుభవం వల్ల వెలగదు; మెరుపు లాంటి ఒక అవగాహనవల్లా రాదు. ఈ అవగాహన ఎల్లవేళలా తనని తాను వెలిగించు కుంటూ వుంటుంది. ఇంకొకరు ఎవరో మీకు దీనిని యివ్వలేరు - గ్రంథం కానీ, తంత్రం కానీ, బోధకుడు కానీ, లోక రక్షకుడు కానీ - ఎవ్వరూ యివ్వలేరు. మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడమే దుఃఖాన్ని సమాప్తం చేయడం.

*(ది అర్జెన్సీ ఆఫ్ ఛేంజ్)*

# పారమార్థిక జీవనం

*ప్రశ్నిస్తున్నవారు :* పారమార్థిక జీవనం అంటే ఏమిటో నాకు తెలుసుకోవాలని వుంది. కొన్ని నెలల తరబడి ఆశ్రమాలలో నివసించాను. ధ్యానం చేశాను. క్రమశిక్షణా బద్ధమైన జీవితం అనుసరించాను. ఎంతో చదివాను. అన్ని రకాలైన దేవాలయాలకు, చర్చిలకు, మసీదులకు వెళ్ళి చూశాను. నిరాడంబరంగా వుండే సాధుజీవనం గడపడానికి, మనుష్యులకు గాని, జంతువులకు గాని ఏమాత్రం హాని కలిగించకుండా బ్రతకడానికి ప్రయత్నించాను. పారమార్థిక జీవనం అంటే యింతేనంటారా? యోగాభ్యాసం చేశాను. 'జెన్' అధ్యయనం చేశాను. ఎన్నో మతాలకు చెందిన పద్ధతులను అనుసరించాను. ఇప్పుడూ, మొదట్లోనూ ఎప్పుడూ నేను శాకాహారినే. నాకు వృద్ధాప్యం సమీపిస్తున్నదని మీరు గమనించే వుంటారు. ప్రపంచంలో వివిధ ప్రాంతాల్లో వున్న ఎందరో సాధుపుంగవులతో పాటు కలిసి నివసించాను. కాని యిదంతా అసలైనదాని అంచులను కూడా తాకకుండా బయటే వుండిపోయిందని నాకు ఎందుచేతనో అనిపిస్తున్నది. అందుకని, మీ దృష్టిలో పారమార్థిక జీవనం అంటే ఏమిటో అది చర్చిస్తే బాగుండుననిపిస్తున్నది.

కృష్ణమూర్తి : ఒకరోజు సన్యాసి ఒకరు నన్ను కలవడానికి వచ్చారు. చాలా దిగులు పడుతున్నట్లుగా కనిపించారు. ఆయన బ్రహ్మచర్యవ్రతం చేపట్టారుట. సన్యాసం పుచ్చుకొని వూరూరా తిరుగుతూ భిక్షాటనతో కాలం గడుపుతున్నారు. అయితే, తనలో కలిగిన శరీరవాంఛల ధాటికి తట్టుకోలేక, ఒకరోజు తన మర్మావయవాలను శస్త్రచికిత్సకుని సహాయంతో తొలగించుకున్నారు. నెలల తరబడి వేధించిన ఆ నొప్పిని భరించారు. ఏదో విధంగా అదంతా నయమైపోయింది. చాలా యేళ్ళు గడిచాక తాను చేసిన పని ఏమిటో గ్రహింపుకి వచ్చింది. అందుకని నన్ను కలవడానికి వచ్చారు. ఆ చిన్నగదిలో కూర్చున్నాం; యీ విధంగా అంగవిచ్ఛేదం చేసుకున్నాననీ, మళ్ళీ మామూలుగా అవడానికి - అంటే శారీరకంగా కాదు, అంతర్గతంగా - ఏం చేయాలనీ అడిగారు. ఇదంతా ఆయన ఎందుకు చేశారంటే ధార్మిక జీవనానికి సెక్స్ సంబంధమైన కార్యకాలాపాలు పనికిరావని అంటారు కాబట్టి. సెక్స్ అంటే చాలా ఐహిక విషయమూ, సుఖలోలత్వానికి సంబంధించినదీ, నిజమైన సన్యాసి వాటి దరిదాపులకు కూడా పోగూడదనీ అంటుంటారు. 'నన్ను చూడండి నా మనుష్యత్వమే పోగొట్టుకొని అయోమయంలో పడిపోయాను. నాలోని కామవాంఛలను నిరోధించాలని, అణచి వేయాలని సకల ప్రయత్నాలు చేశాను. చివరికది యింత దారుణంగా పరిణమించింది. ఇప్పుడిక నేనేం చేయాలి? నేను చేసింది తప్పని నాకు తెలుసు. నాలోని శక్తి అంతా దాదాపుగా అణగారిపోయింది. ఇక అంధకారంలోనే జీవితం ముగిసిపోయేటట్లుగా వుంది,' అని ఆయన అన్నారు. నా చేతిని పట్టుకొని కొంతసేపు కూర్చున్నారు. ఇద్దరం నిశ్శబ్దంగా వుండిపోయాం.

ఇది పారమార్థిక జీవనమా? పారమార్థిక జీవితం గడపడానికి సుఖాన్నీ, సౌందర్యాన్నీ త్యజించడం ఒక మార్గమా? ఆకాశంలోను, కొండలలోను, మనిషి రూపురేఖల్లోనూ వున్న సౌందర్యాన్ని కాలద్రన్నడం ద్వారా పారమార్థిక జీవనాన్ని చేరుకోగలమా? అయితే చాలామంది మహాత్ములు, సన్యాసులు దీన్నే నిజమని నమ్ముతున్నారు. ఈ నమ్మకంతో తమని తాము చిత్రహింస చేసుకుంటున్నారు. చిత్రహింసలకు లోనై, వికలమైపోయిన మనసు పారమార్థిక జీవనం అంటే ఏమిటో తెలుసుకోగలుగుతుందా? అయితే పరమసత్యాన్ని లేదా దైవాన్ని లేదా వాళ్ళు పెట్టిన మరో పేరు ఏదయినా సరే దానిని చేరుకోవాలంటే యీ చిత్రహింస, యీ వక్రత్వం తప్ప మరో మార్గం లేదని అన్ని మతాలూ నొక్కి చెప్తున్నాయి. ఆధ్యాత్మిక లేదా పారమార్థిక జీవనం అని వాళ్ళు పేరు పెట్టిన దానికి, ప్రాపంచిక లేదా ఐహిక జీవనం అని వాళ్ళే అంటున్న దానికీ చాలా అంతరం వుందని వాళ్ళు అంటారు.

అడపా దడపా కొంత ఆవేదన, కొంత భక్తి తనలో కనబడి మాయమవుతున్నా, అసలు సుఖపడటం కోసమే జీవిస్తున్న మనిషి, తన జీవితకాలమంతటినీ వినోదాలతోను, కాలక్షేపాలతోను గడిపే మనిషి నిస్సందేహంగా ప్రాపంచిక లోకానికి చెందినవాడే. అతనిలో బుద్ధి చాతుర్యం వుండవచ్చు, పాండిత్యం వుండవచ్చు, ఎప్పుడూ గొప్ప గొప్ప ఆలోచనలు, యితరులు చెప్పినవో, తన స్వంతమైనవో చేస్తుండవచ్చు. అయినా సరే. ఒకరిని ఒక గొప్ప కళ వరిస్తుంది. ఆ కళను అతడు సమాజం కోసమో, తన సంతోషం కోసమో ప్రదర్శిస్తూ వుంటాడు. తనలోని ఆ కళాప్రతిభను సఫలీకృతం చేసుకోవడం ద్వారా గొప్ప కీర్తి కూడా ఆర్జించి వుండవచ్చు. అటువంటి వ్యక్తి కూడా నిస్సందేహంగా ప్రాపంచిక లోకానికి చెందినవాడే. అంతే కాదు. చర్చికి, దేవాలయానికి, మసీదుకి వెళ్ళడం, ప్రార్థనలు చేయడం, స్వమత దురభిమానంలో, పక్షపాతంలో పూర్తిగా మునిగిపోయి, అందులోనూ క్రూరత్వం వున్నదనే గ్రహింపు లేకపోవడం కూడా ఐహిక ప్రపంచానికి సంబంధించినవే. దేశాభిమానం, జాతీయాభిమానం, ఆదర్శవాదమూ కూడా ప్రాపంచిక విషయాలే. ఆశ్రమంలో ముక్కు మూసుకొని కూర్చుని, ఝాము ఝాముకూ లేచి ఒక గ్రంథం చేతబుచ్చుకొని పారాయణం చేస్తూ, ప్రార్థనలు చేస్తూ వుండే వ్యక్తి కూడా నిస్సందేహంగా ప్రాపంచికుడే. లోకంలో మంచి పనులు చేయాలని బయల్దేరేవారు, సమాజ సంస్కర్తలవచ్చు, మత సేవకులవచ్చు - వారికీ దేశం గురించి ఆరాటపడే రాజకీయవాదులకీ ఏమీ భేదం లేదు. పారమార్థిక జీవనానికీ, ప్రాపంచిక జీవనానికి మధ్యన ఒక గీత గీసిపెట్టేయడమే ప్రాపంచికత్వంలో వున్న ప్రధాన తత్వం. ఈ సన్యాసుల, మహాత్ముల, సంస్కర్తల మనసులకీ, జీవితంలో సుఖసంతోషాలను మాత్రమే వెతుక్కునే వారి మనసులకీ మధ్యన పెద్దగా భేదమేమీ లేదు.

కాబట్టి జీవితాన్ని ప్రాపంచికమనీ, ప్రాపంచికం కానిదనీ విభజించకుండా వుండటం ముఖ్యం. ప్రాపంచికాన్నీ, పారమార్థికమని మనం అనుకునేదానినీ వేరు చేసి చూడకుండా వుండటం ముఖ్యం. ఈ స్థూలప్రపంచం లేకుండా అంటే పదార్థ ప్రపంచం లేనప్పుడు మనమూ వుండం. ఆకాశపు ఆ సౌందర్యం, కొండమీద ఒంటరిగా నిలబడి వున్న ఆ చెట్టు, నడిచి వెళ్తున్న ఆ స్త్రీ, గుర్రపుస్వారీ చేస్తున్న ఆ పురుషుడు - యివన్నీ లేకుండా జీవితం వుండలేదు. మనం ఆలోచించవలసింది యీ మొత్తం జీవితం గురించి తప్ప, అందులోని ఒక ప్రత్యేక భాగం పారమార్థికమైనదనీ, తక్కినవి అందుకు వ్యతిరేకమైనవనీ అనే దృష్టితో కాదు. కాబట్టి పారమార్థిక జీవనం అంటే మొత్తం జీవితాన్ని గురించిన దృష్టే తప్ప, అది ఒక ప్రత్యేకమైన విభాగం కాదని మనం అర్థం చేసుకోవాలి.

ప్ర : మీరు చెప్పున్నది నాకు అర్థమయింది. మొత్తంగా మన సంపూర్ణ జీవితం గురించి యోచించాలి. ప్రాపంచికాన్ని పారమార్థికమనేదాని నుంచి విడదీయలేము. ఇప్పుడిక ప్రశ్న ఏమిటంటే - జీవితంలోని అన్ని విషయాలలోను పారమార్థికంగా వర్తించడం ఎట్లాగ?

కృ : పారమార్థికంగా వర్తించడం అంటే ఏమిటి? మీరంటున్నది విభజనలు లేకుండా వుండటం - అంటే ప్రాపంచికమని, పారమార్థికమనీ, ఎట్లా వుండాలి, ఎట్లా వుండకూడదు అనీ, యిష్టమూ, రోతా అనే విభజనలు లేని జీవన విధానం అని కదూ? ఈ విభజనే సంఘర్షణ. సంఘర్షణతో కూడుకున్న జీవితం పారమార్థిక జీవనం కాదు. సంఘర్షణను బాగా లోతుగా అవగాహన చేసుకుంటేనే పారమార్థిక జీవనం సాధ్యమవుతుంది. ఈ అవగాహనే తెలివి లేదా ప్రజ్ఞ. ఈ తెలివే సరియైన చర్యకు దారి తీస్తుంది. సాధారణంగా అందరూ ఏదో ఒక సాంకేతిక రంగంలో నేర్పునో, వ్యాపారంలో కపటాన్నో, రాజకీయపు కుతంత్రాలనో తెలివి అని అంటూ వుంటారు.

ప్ర : ఇంతకూ అసలు నా ప్రశ్న ఏమిటంటే - సంఘర్షణ లేకుండా ఎట్లా జీవించాలి. ఆవిధంగా ఒక నిజమైన పవిత్ర భావాన్ని పొందడం ఎట్లాగ అన్నది, అయితే యిది మతం అనే ఒక పంజరంలో నిబద్ధం అవడంవల్ల కలిగిన భక్తి అనే భావోద్వేగం కానే కాదు. ఆ పంజరం ఎంత ప్రాచీనమైనదైనా సరే, ఎంతో పూజనీయమైనదైనా సరే.

కృ : ఎక్కడో ఒక పల్లెటూళ్ళో ఏ సంఘర్షణలూ లేకుండా జీవించే వ్యక్తిగాని, 'పునీతమైన' కొండలమీద ఒక గుహలో కూర్చుని కలలు కంటున్న వ్యక్తిగాని మనం మాట్లాడుకుంటున్న యిటువంటి పారమార్థిక జీవనం గడపడంలేదని నిస్సందేహంగా చెప్పచ్చు. సంఘర్షణను అంతం చేయడం అనేది మహా సంక్లిష్టమైన విషయాల్లో ఒకటి. దానికి స్వీయ పరిశీలన కావాలి. బాహ్యమైన వాటి ఎడల, అంతర్గతమైన అన్నింటి ఎడల ఎరుకగా వుండటం అనే ఒక సున్నితత్వం వుండాలి. మనలో వుండే వైరుధ్యాలను గురించి అవగాహన కలిగినప్పుడే సంఘర్షణ అంతమవుతుంది. మనకు తెలిసినది అంటే గతం; ఆ గతం నుంచి విముక్తి చెందకపోతే యీ వైరుధ్యం ఎప్పటికీ అట్లాగే వుండిపోతుంది. గతం నుంచి విముక్తి అంటే ప్రస్తుతంలో జీవించడం. ప్రస్తుతం కాలానికి సంబంధించినది కాదు. గతం కాని, మనం తెలుసుకున్నది కాని స్పృశించని స్వేచ్ఛాపూరితమైన కదలిక వుంటుంది యీ ప్రస్తుతంలో.

ప్ర : గతాన్నుంచి విముక్తి అంటే ఏమిటి?

కృ : గతం అంటే మనం కూడబెట్టుకున్న జ్ఞాపకాలు. ఈ జ్ఞాపకాలే వర్తమానంలో పనిచేసి భవిష్యత్తుని గురించి ఆశలను, భయాలను తయారుచేస్తున్నాయి. ఈ ఆశలూ, భయాలూ మానసికమైన భవిష్యత్తు. ఇవి లేకుండా భవిష్యత్తు అనేది లేనే లేదు. కాబట్టి వర్తమానం అంటే గతం చేయిస్తున్న పని. మనసు అంటే గతం కలిగిస్తున్న కదలికలు. మనం భవిష్యత్తు అని అంటున్నది గతం వర్తమానంలో పనిచేస్తుండటం వల్ల తయారవుతున్నది. గతం జరుపుతున్న యీ ప్రతిస్పందన అంతా అప్రయత్నంగానే జరుగుతుంటుంది. దానిని రమ్మని ఆజ్ఞాపించడమ్మూ లేదూ, ఆహ్వానించడమూ లేదు. మనం గ్రహించకముందే అది మన మీదకు వచ్చి కూర్చుంటున్నది.

ప్ర : అటువంటప్పుడు దానిని వదిలించుకొని ఎట్లా విముక్తి చెందగలుగుతాం?

కృ : ఎంపిక చేసుకోవడం అనేది లేకుండా యీ కదలికలన్నింటి గురించి ఎరుకగా వుండటమే. ఎంపిక చేసుకోవడం అనేది కూడా మళ్ళీ యీ గతం యొక్క కదలికల్లోనిదే అవుతుంది. ఎరుకగా వుండటం అంటే గతం పనిచేయడాన్ని పరిశీలించడం. అటువంటి పరిశీలన గతం యొక్క కదలిక కాదు. ఆలోచన తయారు చేస్తున్న కాల్పనిక బింబాలు లేకుండా పరిశీలించడం - అనే చర్య గతం అంతరించి పోయిన చర్య. ఆలోచన లేకుండా చెట్టును పరిశీలించడం అనే చర్యలో గతం వుండదు. గతం చేస్తున్న చర్యని పరిశీలించడం కూడా గతం అన్నది లేని చర్యే. ఏది మనం చూస్తున్నామో అన్నదాని కంటే చూడటం అనే స్థితి ప్రధానమైనది. ఎంపిక రహితమైన ఆ పరిశీలనలో గతాన్ని గురించి ఎరుకగా వుండటం అంటే ఒక విభిన్నమైన చర్య చేయడమే కాకుండా విభిన్నంగా వుండటం కూడా. ఇటువంటి ఎరుకలో స్మృతి (జ్ఞాపకం) ఏ ఆటంకాలు లేకుండా చాలా సమర్థవంతంగా పనిచేస్తుంది. పారమార్థికత అంటే ఎంపిక చేసుకోవడం ఏమాత్రం లేని ఎరుక; ఇందులో మనం తెలుసుకున్నదాని నుండి స్వేచ్ఛ లభించివుంటుంది; అదే సమయంలో ఆ తెలుసుకున్నది ఎక్కడ పనిచేయాలో అక్కడ పని చేస్తూ వుంటుంది.

ప్ర : కాని మనం తెలుసుకున్నది, మన గతం మనం ఎంత వద్దనుకున్నా పనిచేస్తూ, ఘర్షణకు కారణమవుతూనే వుంటుంది.

కృ : ఆ సంగతి మీరు గ్రహిస్తూ వుంటే అదీ గతం పనిచేస్తూ వున్నప్పుడు గతం ఎడల క్రియాశూన్యంగా వుండిపోయే స్థితి అన్నమాట. కాబట్టి మనం తెలుసుకున్నదాని నుంచి విముక్తి పొందడమే అసలైన పారమార్థిక జీవనం. అంటే అర్థం తెలుసుకున్న దానిని పూర్తిగా తుడిచిపెట్టేయడం అని కాదు. పూర్తిగా విభిన్నమైన మరొక పరిమాణస్థితి లోనికి ప్రవేశించి, తెలుసుకున్న దానిని పరిశీలించడం. ఎంపిక

చేయకుండా చూడటం అనే యీ చర్య ప్రేమపూర్వకమైన చర్య. పారమార్థిక జీవనం అంటే యిటువంటి చర్య. అసలు జీవించడం అంటేనే యిటువంటి చర్య. పారమార్థిక మైన మనసు అంటే యిటువంటి చర్య. కాబట్టి మతమూ, మనసూ, జీవితమూ, ప్రేమా యివన్నీ ఒకటే.

*(ది అర్జెన్సీ ఆఫ్ ఛేంజ్)*

# నిజమైన పరిత్యాగం అంటే ---

***అధ్యాపకుడు :*** విద్యార్థులతో ప్రసంగిస్తూ ఒకసారి మీరు, సమస్య ఏదయినా తలెత్తినప్పుడు వెంటనే దానిని పరిష్కరించుకోవాలని అన్నారు. ఇది ఎట్లా చేయగలుగుతాం అంటారు.

***కృష్ణమూర్తి :*** ఒక సమస్యని వెంటనే పరిష్కరించాలంటే, ఆ సమస్యని అవగాహన చేసుకోవాలి. ఒక సమస్యని అవగాహన చేసుకోవడానికి కొంత సమయం అవసరమా, లేదూ అది గ్రహింపులోని తీక్షణతకూ, చూడటంలోని గాఢత్వానికీ సంబంధించినదా? నాకో సమస్య వున్నదీ అనుకుందాం : నాకు గర్వం, అది సమస్య ఎందుకయిందీ అంటే దానివల్ల నాలో నాకే సంఘర్షణ, పరస్పర వైరుధ్యమూ కలుగుతున్నాయి కాబట్టి. నాకు గర్వం అన్న సంగతీ వాస్తవమే, గర్వపడటం నాకు యిష్టం లేదు అన్న సంగతీ మరొక వాస్తవమే. మొట్టమొదట, నాకు గర్వం అన్న వాస్తవాన్ని నేను అవగాహన చేసుకోవాలి. ఆ వాస్తవంతో నేను కలిసి నివసించాలి. ఆ వాస్తవం విషయంలో నాకు చాలా గాఢమైన ఎరుక వుండటమే కాకుండా, దానిని సమగ్రంగా ఆకళింపు చేసుకోవాలి. సరే, ఆకళింపు చేసుకోవడం అన్నది సమయానికి సంబంధించినదా? వాస్తవాన్ని నేను వెంటనే చూడగలను. చూడలేనా? తక్షణమే జరిగే ఆ గ్రహింపే, ఆ చూడటమే సమస్యను కరిగించివేస్తుంది. నేను ఒక పాముని చూసినప్పుడు తక్షణమే చర్య తీసుకుంటాను. అయితే గర్వాన్ని మాత్రం నేను ఈ రకంగా చూడటం లేదు. గర్వాన్ని నాలో చూస్తున్నప్పుడు, నాకు అది యిష్టం కాబట్టి ఆ విధంగానే కొనసాగుతాను; లేదూ దానివలన సంఘర్షణ పుడుతున్నది కాబట్టి అది నాకు అక్కర్లేదు, అంటాను. అది కనుక సంఘర్షణను కలిగించకపోతే అప్పుడు ఏ సమస్యా వుండదు.

గ్రహింపు, అవగాహన కాలానికి సంబంధించినవి కావు. గ్రహింపు చూడటంలోని తీక్షణతకు సంబంధించినది. అంటే సమగ్రంగా చూడటం. ఏదయినా ఒక విషయాన్ని సమగ్రంగా చూడటం అంటే ఎట్లా వుంటుంది? ఒక సమస్యతో మనకున్న మొత్తం

శక్తి అంతటితోను, తక్షణమే తలపడేటట్లుగా చేసే సామర్థ్యం, సత్తువ, సజీవశక్తి, పట్టుదల మనకు ఎట్లా వస్తున్నాయి? మనలోని శక్తిని విభజించడం జరిగిన మరుక్షణమే సంఘర్షణ పుట్టుకొస్తుంది. అందువల్ల ఒక విషయాన్ని సమగ్రంగా చూడటం జరుగదు, గ్రహించడం జరగదు. సరే, ఒక నాగుపాముని చూసినప్పుడు వులిక్కిపడి ఎగురుతారు, యీ శక్తి మీకు ఎక్కడినుంచి వస్తున్నది? ఈ విధంగా మీరు అనే ఆ మొత్తం జీవి ఏ మాత్రం ఆలస్యం చేయకుండా, తక్షణమే ప్రతిస్పందన జరిపి, వులిక్కిపడి ఎగరడానికి వెనకాల వున్న ప్రక్రియలు - శరీర సంబంధమైనవీ, మనోతత్వ సంబంధమైనవీ కూడా అవి ఏమిటి? ఆ తక్షణత వెనకాల వున్నవి ఏమేమిటి? తక్షణమే జరిగే ఆ చర్యలో చాలా సంగతులు నిబిడీకృతమై వున్నాయి: భయమూ, ప్రాణరక్షణ చేసుకొనే స్వభావం - యిది తప్పకుండా వుండవలసిన గుణం - నాగుపాము ప్రాణాపాయం కలిగిస్తుందనే సమాచారం - యివన్నీ వున్నాయి.

అటువంటప్పుడు, గర్వాన్ని కరిగించివేసుకొనే విషయంలో కూడా యిదే విధమైన, సశక్తిమంతమైన చర్య ఎందుకు జరుగదు? గర్వాన్ని ఒక వుదాహరణగా మాత్రమే యిక్కడ తీసుకుంటున్నాం. ఈ విషయంలో ఆ శక్తి మనకు లేకపోవడానికి వెనకాల అనేక కారణాలు వున్నాయి. గర్వంగా వుండటం నాకు యిష్టం. ప్రపంచం దానిమీదే నడుస్తున్నది. సమాజపు పద్ధతులన్నీ దీనిమీదే ఆధారపడి వున్నాయి. ఈ గర్వం వల్ల నాలో ఒక బలోత్సాహం, ఒక రకమైన హుందాతనం, ఎవ్వరితోనూ సన్నిహితంగా వుండకపోవడం, యితరుల కంటె గొప్ప అనే ఒక భావమూ కలుగుతున్నాయి. ఇవన్నీ కలిసి గర్వాన్ని కరిగించి వేసెయ్యడానికి అవసరమైన శక్తికి అడ్డుగా నిలుస్తాయి. చూడండి, నేను చేయవలసిన చర్యకు అడ్డు తగులుతున్న కారణాలను, గర్వంతో తలపడటానికి కావలసిన శక్తిని నిరోధిస్తున్న కారణాలను నేను విశ్లేషిస్తూనైనా కూర్చుంటాను. లేదూ తక్షణమే ఆ సంగతి గ్రహిస్తాను. విశ్లేషణ అంటే కాలంతో ముడిపడిన ప్రక్రియ. వాయిదా వేయడానికి ఒక పద్ధతి. నేను విశ్లేషణ జరుపుతూ వున్నప్పుడు గర్వం కొనసాగుతూనే వుంటుంది. కాలం దాన్ని అంతం చేయబోవడం లేదు. కాబట్టి గర్వాన్ని సంపూర్ణంగా నేను చూడాలి. కాని అట్లా చూసే శక్తి నాకు లేదు. ఈ విధంగా చెదిరిపోయి వృధా అవుతున్న శక్తిని పోగుచేసుకోవాలంటే, గర్వం వంటి సమస్యలను ఎదుర్కొనప్పుడు కాకుండా, నిరంతరమూ, ఏ సమస్యా లేనప్పుడు కూడా శక్తిని కూడగట్టుకోవడం అన్నది జరుగుతూనే వుండాలి. ఎప్పుడూ సమస్యల్లోనే మునిగి తేలుతూ వుండం. సమస్యలు లేని క్షణాలు కూడా వుంటాయి. అటువంటి సమయాల్లో శక్తిని కనుక మనం సేకరించుకుంటూ వుంటుంటే, యిక్కడ సేకరణ

అంటే ఎరుకతో వుండటం అనమాట - అప్పుడు సమస్యలు తలెత్తినప్పుడు వాటిని ఎదుర్కోగలుగుతాం. అప్పుడు విశ్లేషణ అనే ప్రక్రియలో పడి మునిగి పోనక్కరలేదు.

**అధ్యాపకుడు** : మరో యిబ్బంది కూడా వుంది : సమస్య ఏదీ లేనప్పుడు, శక్తిని కూడగట్టుకోవడం కూడా లేనప్పుడు, ఏదో ఒక రూపంలో ధ్యానం చేస్తూ వుంటాం.

కృష్ణమూర్తి : వర్ణించినదే మళ్ళీ మళ్ళీ కేవలం వర్ణిస్తూ వుండటం వల్ల, స్మృతులకు ప్రతిస్పందిస్తూ వుండటం వల్ల, అనుభవాలకు ప్రతిస్పందిస్తూండటం వల్ల శక్తి వృథా అవుతుంది. మీ మనసుని కనుక మీరు పరిశీలిస్తూ వుంటే, సుఖాస్పదమైన ఒక జరిగిపోయిన సంఘటన మనసులోకి మళ్ళీ పునరావృతం అవుతూంటుందని గమనిస్తారు. ఆ సంఘటనలోకి మీరు తిరిగి వెళ్ళాలనుకుంటారు. దాన్ని గురించే ఆలోచించాలను కుంటారు. ఆ విధంగా అది మళ్ళీ ప్రాణం పోసుకొని వేగం పుంజుకుంటుంది. మనసు ఎరుకగా వున్నప్పుడు, యీ ఆలోచనని పూర్తిగా వికసించ నివ్వడం సాధ్యమా? అంటే అర్థం ఏమిటంటే, 'ఇది తప్పు, యిది ఒప్పు' అని అనకుండా, ఆ ఆలోచనని పూర్తిగా జీవించ నివ్వడం; ఆ ఆలోచన చక్కగా ఎదిగి తనంతట తానే సమసిపోయే మనోస్థితిని కలిగి వుండటం.

ఒక కొత్తదైన తీరులో సమస్యలతో మనం తలపడదామా? ఒక నవ్యనూతనమైన మానసిక గుణం గల యువతరాన్ని తయారుచేయాలనే విషయం మనం చర్చించు కుంటున్నాం. అది ఎట్లా సాధించగలం? నేనే కనుక యిక్కడి అధ్యాపకుల్లో ఒకరినవుతే యీ విషయంలో నాకు చాలా అక్కర వుంటుంది. ఒక మంచి అధ్యాపకుడి హృదయంలో నిస్సందేహంగా యీ అక్కర వుంటుంది : ఒక కొత్త మనసుని, ఒక కొత్త సున్నితత్వాన్ని తీసుకొని రావడం, చెట్ల ఎడల, మబ్బులు, ఆకాశం, సెలయేళ్ళ ఎడల ఒక కొత్త మనోభావాన్ని కలగజేయడం; పాతచేతననే సరిదిద్ది కొత్త రూపంలోకి తేవడం కాకుండా, ఒక నవ్యనూతనమైన చేతనను తీసుకొని రావడం. నేను చెప్పున్నది గతంచేత ఏమాత్రం కలుషితం అవని, పూర్తిగా నవ్యనూతనమైన ఒక కొత్త మనసు గురించి. నేను అపేక్షించేది కనుక అదే అవుతే యీ విషయంలో నేను చేయవలసినది ఏమిటి?

అసలు అటువంటి మనసును తయారుచేయడం సాధ్యమా? గతాన్నే కొన సాగించుకుంటున్న మనసును ఒక కొత్తరూపంలోకి మలచుకోవడం కాదు. గతం స్పర్శతో ఏమాత్రం కలుషితం కాని మనసును తయారుచేయడం. అది నెరవేరే పనేనా? లేక వర్తమానంలోకి చొచ్చుకొని వచ్చి కొనసాగుతూ వుండే యీ గతానికే కాస్త మార్పు చేర్పులు చేసి కొత్త ఆకారం యివ్వడం తప్ప గత్యంతరం లేదా? అటు వంటప్పుడు

కొత్త తరం అనేది వుండనే వుండదు. పాత తరమే యింకో కొత్త రూపంలో పునరావృతం అవుతుంది.

ఒక నవ్యనూతనమైన తరాన్ని తయారుచేయడం సాధ్యమేనని నాకనిస్తున్నది. ఇది నాలో నేనే అనుభూతి చెందడంతో పాటుగా, విద్యార్థికి కూడా దీనిని అందించడం ఎట్లా అని నేను ప్రశ్నించుకుంటున్నాను.

నాలోపల ఏదయినా ప్రయోగత్మకంగా దర్శిస్తున్నప్పుడు విద్యార్థికి ఆ విషయం వ్యక్తీకరించకుండా వుండలేను. ఎందుకంటే యిందులో నేను వేరు అతను వేరు అన్న ప్రశ్నే లేదు. ఇది యిద్దరికీ సంబంధించిన విషయం. అవునా కాదా?

సరే, కలుషితం అవని, నిర్మలమైన మనస్సును తీసుకొని రావడం ఎట్లా? మీరూ, నేనూ యిప్పుడే కొత్తగా పుట్టిన శిశువులం కాదు. సమాజమూ, హిందూమతమూ, మన చదువు, కుటుంబమూ, వార్తాపత్రికలూ అన్నీ మనల్ని కలుషిత పరిచాయి. ఈ కాలుష్యాన్నుంచి బయట పడటం ఎట్లా? ఇదంతా మన అస్తిత్వంలోని భాగమే అని అనుకుంటూ స్వీకరించాలా? సర్, చెప్పండి, ఏం చేయాలి మనం? మన మనస్సులు కలుషితమైపోయాయి అనే సమస్య ఎదురుగా వున్నది. కొంత వయసు పైబడిన వారికి యిందులో నుండి బయట పడటం మరీ కష్టం. మీరు కొంత నయమే, యింకా చిన్న వయసులోనే వున్నారు. సమస్య ఏమిటంటే మనస్సును కాలుష్య రహితంగా చేయడం. ఇది ఎట్లా జరుగుతుంది?

ఇది సాధ్యమైనా అవచ్చు, లేదూ అసాధ్యమూ కావచ్చు. అయితే సాధ్యమా కాదా అనేది కనుక్కోవడం ఎట్లా? తక్షణమే దీనిని మీరు తేల్చుకోవాలని కోరుతున్నాను.

'పరిత్యాగం' అనే మాటకు అర్థం ఏమిటో మీకు తెలుసా? గతాన్ని, హిందూత్వాన్ని త్యజించడం అంటే దాని అర్థం ఏమై వుంటుంది? పరిత్యజించడం అనే మాటకు అర్థం ఏమిటసలు? ఎప్పుడయినా, ఏదయినా పరిత్యజించారా మీరు? నిజమైన పరిత్యాగం వుంటుంది, బూటకపు పరిత్యాగం కూడా వుంటుంది. వెనకాల ఒక వుద్దేశ్యం పెట్టుకొని చేసేది బూటకపు పరిత్యాగం. ఒక ఆశయాన్ని సాధించడానికి గాని, ఒక లక్ష్యం మీద దృష్టి పెట్టుకొని గాని, భవిష్యత్తులో ఏదో ఆశించి గాని చేసేది పరిత్యాగం కాదు. ఒకదాన్ని త్యజించడం ద్వారా దాన్ని మించిన దాన్ని లాభంగా పొందాలని చేసేది పరిత్యజించడం కాదు. అయితే ఏ వుద్దేశ్యమూ పెట్టుకోకుండా చేసే పరిత్యాగమూ వుంది. పరిత్యజించాక, యిక ఆపైన నా భవిష్యత్తులో ఏం జరుగుతుందో నాకు తెలియనప్పుడు, అది నిజమైన పరిత్యాగం అవుతుంది. నేను హిందువును కాను అనీ, ఏ సంస్థకూ చెందననీ, ఏ ఒక్క ప్రత్యేకమైన మతశాఖకూ

చెందనని అన్నింటినీ వదిలేస్తాను. ఈ విధంగా అన్నింటినీ త్యజించడంలో నేను పూర్తిగా భద్రత పోగొట్టుకుంటాను. అటువంటి పరిత్యాగం మీకు తెలుసా? మీరు ఎప్పుడయినా ఏదయినా పరిత్యజించారా? ఆ రకంగా మీరు గతాన్ని త్యజించగలరా? భవిష్యత్తులో ఏముందో అన్న సంగతి తెలియకపోయినా త్యజించగలరా? మీకు తెలిసినదంతా పరిత్యజించగలరా?

**అధ్యాపకుడు** : నేను ఏదయినా పరిత్యజించినప్పుడు, వుదాహరణకి హిందూ మతాన్ని త్యజిస్తే, అప్పుడే అదే సమయంలో హిందూత్వం అంటే ఏమిటి అన్న అవగాహన కలుగుతుంది.

**కృష్ణమూర్తి** : మనం చర్చిస్తున్న అంశం ఏమిటంటే, ఒక నవ్యనూతనమైన మనస్సును తయారుచేయడం గురించీ, అది అసలు సాధ్యమేనా అనీ. కాలుష్యం వున్న మనసు కొత్తది అవలేదు. అందుకని మనసుని కాలుష్య రహితంగా చేయడమూ, అది సాధ్యమా కాదా అన్న విషయమూ మాట్లాడుకుంటున్నాం. ఆ సందర్భంగా పరిత్యజించడం అంటే ఏమిటి అని మిమ్మల్ని అడగడం ఆరంభించాను. ఎందుకంటే పరిత్యాగానికీ దానికీ చాలా దగ్గిర సంబంధం వుంది. పరిత్యాగానికి నవ్యనూతనమైన మనసుతో చాలా సన్నిహిత సంబంధం వుంది. వెనకాల కారణాలు మిగల్చకుండా, ఏ ప్రయోజనాలూ ఆశించకుండా నేను శుభ్రంగా పరిత్యజించివేస్తే అది నిజమైన పరిత్యాగం అవుతుంది. అయితే, అది సాధ్యమేనా? చూడండి, యీ సమాజాన్ని - అంటే రాజకీయ, ఆర్థిక సూత్రాలతోను, సామాజికమైన సంబంధ బాంధవ్యాలతోను, ఆకాంక్షా పరత్వం, అత్యాశలతోను నిండిపోయి వున్న - యీ సమాజాన్ని కనుక నేను పూర్తిగా త్యజించకపోతే, నవ్యనూతనమైన మనసు వుండటం అంటే ఏమిటో కని పెట్టడం నాకు సాధ్యం కాదు. కాబట్టి పునాదులను పగలగొట్టడంలో మొదటిది ఏమిటంటే నాకు తెలిసిన విషయాలన్నింటినీ పరిత్యజించడం, అది సాధ్యమేనా?

మాదక ద్రవ్యాల వలన నవ్యనూతనమైన మనసు కలగదని నిస్సందేహంగా చెప్పచ్చు. గతం అంతటినీ మొత్తంగా పరిత్యజించడం అన్న ఒక్కటి తప్ప మరేదీ దానిని కలిగించలేదు. అది చేయగలమా? ఏమంటారు? అటువంటి పరిత్యాగంలోని పరిమళాన్ని, ఆ దృష్టిని, ఆ రుచిని నేను చవిచూశాక, విద్యార్థికి అది చెప్పకుండా వుండగలనా? అది విద్యార్థికి ఎట్లా అందజేయాలి? అతను గణితమూ, భూగోళశాస్త్రం, చరిత్ర - యివన్నీ బాగా క్షుణ్ణంగా తెలుసుకోవాలి. అయితే, అంత క్షుణ్ణంగానూ తెలిసిన వాటిని వదిలివేయాలి. ఏమాత్రం పరితాప పడకుండా వదిలివేయాలి.

**అధ్యాపకుడు** : సర్! గ్రహణేంద్రియాల ద్వారా కలిగే అనుభూతులన్నీ కొంత అవశేషాన్ని, కొంత అలజడిని మిగులుస్తాయి. ఇది రకరకాల సంఘర్షణలకు, అనేక రకాల మానసిక కార్యకలాపాలకు దారితీస్తుంది. అన్ని మతాలలోను సంప్రదాయంగా వస్తున్న పద్ధతి ఏమిటంటే క్రమశిక్షణ ద్వారా, నిరోధించడం ద్వారా యీ యింద్రియాను భూతులను తిరస్కరించడం. కాని మీరు, యీ అనుభూతులను చాలా పదునైన స్పందనశీలత్వంతో గ్రహించాలనీ, అప్పుడే యీ యింద్రియాను భూతులను వక్రీకరించడం గాని, అవశేషాన్ని మిగుల్చుకోవడం గాని లేకుండా చూస్తామనీ అంటున్నారు.

**కృ** : అదీ అసలు విషయం. సున్నితత్వమూ, యింద్రియానుభూతులూ ఒకటి కావు. అవి వేరు, యివి వేరు. ఆలోచనలకు, యింద్రియాను భూతులకు, మనోభావాలకు దాస్యం చేసే మనసు అవశేషాలను మిగుల్చుకొనే మనసు. మిగుల్చుకున్న దానివి పట్టుకొని అది సంతోషిస్తూ వుంటుంది. ప్రాపంచిక సుఖాలను తలచుకొని తలచుకొని సంతోషిస్తుంది. ప్రతి ఆలోచనా ఒక ముద్రను వదలివెళ్తుంది. అదే మిగిలిపోయిన అవశేషం. మీరు పొందిన ఒక్కొక్క సుఖాన్ని గురించిన ఆలోచన ఒక్కొక్క ముద్రను వదిలి వెళ్తుంది. అవే మన సున్నితత్వాన్ని పోగొడతాయి. ఇవి తప్పకుండా మనసును మొద్దుబారేటట్లు చేస్తాయి. క్రమశిక్షణ, ఆదుపులో పెట్టడం, అణచివేయడం మనసుని యింకా కాస్త మందకొడిగా తయారుచేస్తాయి. నేను చెప్తున్నది ఏమిటంటే సున్నితత్వం అంటే యింద్రియానుభూతి కాదూ అని. సున్నితత్వం అంటే ఏ ముద్రలూ వుండవు, అవశేషం మిగలదు. ఇక అప్పుడు సమస్య ఏముంది?

**అధ్యా** : అయితే మీరు చెప్తున్న పరిత్యజించడం వేరూ, యింద్రియాను భూతులను నిరోధించడం అనే పరిత్యాగం వేరూ అనా?

**కృ** : అదుగో ఆ పూవుల సౌందర్యాన్ని చూసి, వాటి ఎడల సంపూర్ణమైన సున్నితాత్మకతతో వుండి, యిక ఆపైన వాటిని గురించిన ఏ అవశేషమూ, జ్ఞాపకమూ మిగుల్చుకోకుండా వుండాలంటే వాటివైపు ఎట్లా చూడాలి? అంటే ఒక గంట పోయాక వాటివైపు చూసినప్పుడు మళ్ళీ కొత్త పూవులను చూసినట్లుగా వుండా లంటే ఎట్లా చూడాలి? ఒక యింద్రియానుభూతి లాగా, పూవులకు, సుఖానికి సంబంధించిన ఒక యింద్రియానుభూతి లాగా చూస్తే మాత్రం అది సాధ్యపడదు. సాంప్రదాయికమైన పద్ధతి ఏమిటంటే సుఖాన్నిచ్చే వాటన్నింటికీ దూరంగా వుండటం. ఎందుకంటే వాటితో సాంగత్యం వల్ల మనలో యింకా యితర రకాలైన సుఖాలు మేలుకుంటాయి. అందుకని అసలు అటు దృష్టే పోకుండా మిమ్మల్ని ఒక క్రమశిక్షణలో వుంచుకుంటారు. ఇటువంటి సాంగత్యాలను శస్త్రచికిత్స చేసినట్లుగా కోసి పారేస్తే అది పరిణతి

అనిపించుకోదు. కాబట్టి అద్భుతమైన యీ రంగులను మనసు, కళ్ళు చూశాక కూడా అవి ఏ ముద్రలను వదలకుండా వుండటం ఎట్లా జరుగుతుంది?

దీనికి ఒక పద్ధతి వుండాలని నేను అనడం లేదు. అటువంటి స్థితి ఎట్లా కలుగుతుంది? లేకపోతే మనలో సున్నితత్వం వుండదు. అంటే ఒక ఫోటోగ్రాఫిక్ కాగితంలాగా చిత్రాల ముద్రలను స్వీకరించడమూ, తనంతట తానే చెరిపేసుకొని తిరిగి శుభ్రంగా అవడమూ. ఫిల్ములాగే వెలుతురు మీద పడగానే ముద్రించుకోవడం, మళ్ళీ వెలుతురు తగిలితే నెగెటివ్‌గా అయిపోయి క్రొత్త ముద్రను స్వీకరించడం. కాబట్టి స్వీకరించిన సుఖాలన్నింటినీ తనకు తానే చెరిపేసుకొని నిరంతరంగా శుభ్రం చేసుకుంటూ వుండాలి మనసు. అది సాధ్యమయేదేనా? వాస్తవాలతో కాకుండా కేవలం వట్టి మాటలతో మనం ఆటలాడుకుంటున్నామా?

నాకు స్పష్టంగా కనబడుతున్న సంగతి ఏమిటంటే యింద్రియానుభూతుల, అనుస్పందనల అవశేషాలను మిగుల్చుకుంటే మనసు మందకొడిగా తయారవుతుందీ అని. ఈ యదార్థాన్ని మనం వొప్పుకోము. అనుభవపు మరకలను మిగుల్చుకోకుండా, అత్యంత తీవ్రమైన గాఢత్వంతో ఒక పూవును సంపూర్ణంగా చూడటం అనే అద్భుతమైన సున్నితశీలత్వం అంటే ఏమిటో మనకు తెలియదు. ప్రతి యింద్రియానుభూతీ, ప్రతి మనోభావమూ, ప్రతి ఆలోచనా ఒక మరకను ముద్రిస్తాయనీ, యిటువంటి మరకల మనసు ఒక నవ్యనూతనమైన మనసును మనకు యివ్వలేదనీ, యిది ఒక తిరుగులేని నిజమనీ నేను చూడగలుగుతున్నాను. ఇటువంటి మరకలతో వున్న మనసు వుండటమే మరణం అనీ గ్రహించాను. కాబట్టి నేను మరణాన్ని తిరస్కరిస్తున్నాను. అయితే మరొకటి ఏమున్నదో నాకు తెలియదు. మంచి మనసు అంటే అనుభవాల అవశేషం మిగుల్చుకోకుండా సున్నితంగా వుంటుందని కూడా నేను గ్రహించాను. ఆ మనసు అనుభవాలను పొందుతుంది. అయితే ఆ అనుభవాలు మరకలను ముద్రించడం వుండదు. ఆ మరకల్లో నుంచి మరికొన్ని అనుభవాలను పొందడమూ, కొన్ని అభిప్రాయాలను తయారు చేసుకోవడమూ, ఆ విధంగా యింకా మరణించడమూ వుండదు.

ఒకదానిని నేను త్యజిస్తున్నాను. ఇంకొకటి ఏమున్నదో నాకు తెలియదు. తెలిసినది త్యజించడంలో నుండి తెలియని దానిలోకి అవస్థాంతరం చెందడం ఎట్లా జరగాలి?

ఈ త్యజించడం అనేది ఎట్లా చేస్తాను? తెలిసిన దానిని ఎట్లా త్యజిస్తాను? బ్రహ్మాండమైన నాటకీయ సంఘటనల్లోనా, చిన్న చిన్న సంఘటనల్లోనా? గడ్డం క్షవరం

చేసుకుంటున్నప్పుడు అది వదిలేసి, స్విట్జర్లాండులో గడిపిన మధుర క్షణాలు గుర్తుకి తెచ్చుకుంటూ వుంటామా? చాలా సంతోషకరంగా గడిపిన రోజు స్మృతులను ఎవరయినా త్యజిస్తారా? ఈ విషయం గురించి ఎరుక కలిగాక అప్పుడు వాటిని త్యజిస్తారా? ఇందులో నాటకీయత ఏమీ వుండదు. పరమ విచిత్రాలూ వుండవు. దీనిని గురించి యితరులకి ఏమీ తెలియనూ తెలియదు. అయినా సరే, ఒకే ఒక్క పెద్ద, బ్రహ్మాండమైన తుడిచిపెట్టేయడమే కాకుండా, చిన్న చిన్న విషయాలను సదా త్యజిస్తూ వుండటం, చిన్న చిన్న తుడిపివేతలూ, చిన్న చిన్నవి తొలగించుకోవడాలూ చాలా అవసరం. సంతోషకరమైనవి కానివ్వండి, అసహ్యకరమైనవి కానివ్వండి. జ్ఞాపకాలు అనే ఆలోచనలను, ప్రతి రోజూ ప్రతి క్షణమూ అవి లేవగానే వాటిని త్యజించివేయడం చాలా అవసరం. దీనివల్ల ఏదో ప్రయోజనం సిద్ధిస్తుందనీ కాదు, అజ్ఞేయమైన ఒక పరమాద్భుత స్థితిలోకి ప్రవేశించడం కోసమూ కాదు. రిషీవేలీలో నివసిస్తుంటారు, ఏ బొంబాయి గురించో, రోము గురించో ఆలోచిస్తుంటారు. దీనివల్ల సంఘర్షణ పుడుతుంది, మనసు మందకొడిగా తయారవుతుంది, విభజన జరిగి ముక్కలై పోతుంది. ఇదంతా గ్రహించాక దీన్ని తుడిచి వేయగలరా? మనకు తెలియని ఒక అజ్ఞేయమైన స్థితిలోకి ప్రవేశించడం కోసం కాకుండా వూరికనే అన్నింటినీ తుడిచివేస్తూ వుండగలరా? అజ్ఞేయమైనది ఏమిటో మీరు ఎన్నటికీ తెలుసుకోలేరు. ఎందుకంటే యిది అజ్ఞేయమైనది అని మీరు గుర్తించిన మరుక్షణమే తిరిగి తెలిసిన దానిలోకే మీరు వచ్చేస్తారు.

గుర్తించడం అనే ప్రక్రియ అంటే తెలిసినదే కొనసాగే ప్రక్రియ. అజ్ఞేయమైనది ఏమిటో నాకు తెలియదు. కాబట్టి నేను చేయగలిగింది ఒక్కటే. ఆలోచన పుట్టగానే దానిని తుడిపివేస్తూ వుండటం.

ఆ పూవును చూస్తారు, దాన్ని తాకి చూస్తారు, ఆ సౌందర్యాన్ని, ఆ తీక్షణతనూ, వుజ్వలంగా మెరిసిపోతున్న దాని రంగునీ చూస్తారు. ఆ తరువాత మీరు నివసిస్తున్న మీ గది లోపలకు వెళతారు. హెచ్చుతగ్గులుగా వున్న కొలతలతో, వికారంగా వున్న మీ గదిలోకి వెళ్తారు. ఆ గదిలోనే నివసిస్తుంటారు. కాని సౌందర్యం గురించిన ఒక అనుభూతి మిమ్మల్ని వదలదు. అందుకని ఆ పూవును తలచుకుంటారు. ఆ తలపు మీలో కలగగానే దాన్ని పట్టుకొని శుభ్రంగా తుడిచివేసేయాలి. అయితే ఎంత లోతులదాకా వెళ్ళి దానిని పెకలించి వేయగలుగుతారు; ఆ పూవుని, మీ భార్యని, మీ దేవుళ్ళని, మీ ఆర్థిక జీవనాన్ని ఎంత లోతులనుండి వాటిని త్యజించి వేస్తున్నారు? మీ భార్యతో, మీ పిల్లలతో, యీ వికారమైన, భయంకరమైన సమాజంలో మీరు

నివసించక తప్పదు. ఈ జీవితాన్ని వదిలేసి దూరంగా ఎక్కడికీ పారిపోలేరు. అయితే మీరు కనుక ఆలోచనలను, దుఃఖాన్ని, సుఖాన్ని సంపూర్ణంగా త్యజించివేస్తే, అప్పుడు మీ బాంధవ్యం అంతా వేరుగా వుంటుంది. అందువల్ల సంపూర్ణంగా త్యజించడం జరగాలి. పాక్షికంగా త్యజించడం కాదు. ఇష్టమైనవి వుంచుకోవడమూ, యిష్టంకానివి త్యజించడమూ కాదు.

సరే, యిప్పుడు మీరు అవగాహన చేసుకున్న దానిని విద్యార్థికి ఎట్లా విడమరచి చెప్తారు?

**అధ్యా** : బోధించడంలో, నేర్చుకోవడంలో వుండవలసినది ఒక ప్రగాఢమైన స్థితి అనీ, అక్కడ 'నేను యీ విషయం నీకు నేర్పిస్తున్నాను' అన్న దృష్టి వుండదనీ మీరు చెప్పారు. ఇప్పుడు, ఆలోచన వదిలే మరకలను నిరంతరం తుడిచివేస్తూ వుండటానికి, 'బోధించడం నేర్చుకోవడం' స్థితిలోని ప్రగాఢత్వానికీ సంబంధం వున్నదంటారా?

కృ : నిస్సందేహంగా. చూడండి, బోధించడమూ నేర్చుకోవడమూ రెండూ ఒకటే అని నేననుకుంటున్నాను. ఇక్కడ జరుగుతున్నది ఏమిటి; నేను మీకు బోధించడం లేదు. నేను మీకు అధ్యాపకుడినీ కాదు, అధికారినీ కాదు. నేను అన్వేషణ సాగిస్తూ వున్నాను. నా అన్వేషణలను మీకూ తెలియ పరుస్తున్నాను. అవి అందుకుంటారా, వదిలేస్తారా - అది మీ యిష్టం. విద్యార్థుల విషయంలో కూడా యిట్లాంటి వైఖరే వుండాలి.

**అధ్యా** : అప్పుడు అధ్యాపకుడు చేయవలసినది ఏమిటి?

కృ : నిరంతరమూ త్యజించివేస్తూ వున్నప్పుడే మీరది కనిపెట్టగలుగుతారు. ఎప్పుడయినా ప్రయత్నించి చూశారా? అది పగటివేళలో ఒక్క నిముషం కూడా నిద్రపోకుండా వుండటం లాంటిది.

**అధ్యా** : సర్! దీనికి ఎంతో శక్తి అవసరం. అయితే దీనివలన ఎంతో శక్తి లభిస్తుంది కూడా.

కృ : కాని, ముందుగా త్యజించడానికి మీకు శక్తి కావాలి.

(కృష్ణమూర్తి ఆన్ ఎడ్యుకేషన్)

# కాంతి దర్శనం

**ఒకరి ప్రశ్న :** పారమార్థికులము అని చెప్పుకునే వాళ్ళందరిలోనూ ఒక సామాన్య లక్షణం వుంటుంది. మీ ప్రసంగాలు వినడానికి వస్తున్న వారిలో కూడా నాకు యీ లక్షణం కనబడుతున్నది. నిర్వాణమనీ, విమోచనమనీ, జ్ఞానోదయం అనీ, ఆత్మ సాక్షాత్కారమనీ, ఆద్యంతరహితమైనదనీ, దేవుడనీ రకరకాల పేర్లు పెట్టి, దానికోసం వాళ్ళు వెతుకుతూ వుంటారు. వాళ్ళకు వాళ్ళ లక్ష్యం స్పష్టంగా కనబడుతూ వుంటుంది. రకరకాలైన వుపదేశ మార్గాలన్నీ యీ లక్ష్యాన్నే మన కళ్ళ ముందు ఆడిస్తూ వుంటాయి. ఈ వుపదేశాలకు, మార్గాలకు అన్నింటికీ ప్రత్యేకమైన గ్రంథాలు, ప్రత్యేకమైన బోధనా రీతులు, గురువులు, నీతి నియమావళి, తాత్విక ధోరణి వుంటాయి. ఆశలు రేకెత్తించడం, బెదిరింపులు కూడా వుంటాయి. ఇవన్నీ కలిసి తక్కిన ప్రపంచానికి దూరంగా వుండే ఒక తిన్నని, యిరుకైన మార్గంగా ఏర్పడతాయి. ఈ మార్గానికి చివరి కొసన స్వర్గమో, మరొకటో వున్నట్లు వూరిస్తాయి. అన్వేషకుల్లో చాలామంది ఒక మార్గం వదిలేసి మరొక పద్ధతికి మారుతూ వుంటారు. పాతదానిని వదిలేసి, ఆ స్థానంలో తాజాగా వినబడుతున్న యింకొక కొత్త బోధనా మార్గాన్ని స్వీకరిస్తూ వుంటారు. అన్నింటిలో వున్నదీ ఒకటే సూత్రమని గ్రహించుకోలేక, వుద్రేకాలను రెచ్చగొట్టే యీ కార్యక్రమాలలో, ఒకదాని తర్వాత యింకోదానిలో పడిపోతూ దేనికోసమో వెతుక్కుంటూ వుంటారు. కొంతమంది ఏదో ఒక పద్ధతి, ఒక కూటమిలోనే వుండిపోయి, అక్కడ నుండి కదలడానికి యిష్టపడరు. కొంతమంది చివరకు తాము కోరుకున్న సత్యదర్శనాన్ని సాధించామని నమ్మి, అందరికీ దూరంగా ఒక ప్రశాంతమైన ఆశ్రమంలో రోజులు గడుపుతుంటారు. వీళ్ళచుట్టూ శిష్యబృందం మూగి, మళ్ళీ అదే కార్యక్రమ చక్రం తిరగడం ఆరంభమవుతుంది. వీరందరిలోనూ ఏదో విధంగా సత్యదర్శనం పొంది తీరాలనే ఒత్తిడీ, విపరీతమైన ఆశా వుంటాయి. వాటితోపాటే దుర్భరమైన నిస్పృహ, ఆశలు విఫలమవడంవల్ల కలిగిన బాధ కూడా వుంటాయి. ఇదంతా నాకు చాలా అనారోగ్య కరంగా అనిపిస్తున్నది. వీళ్ళందరూ ఏదో ఒక కాల్పనికమైన లక్ష్యం అందుకోవడం కోసం తమ సాధారణ జీవితాన్ని త్యాగం చేసివేస్తారు. ఈ రకమైన వాతావరణంలో నుండి అతి తీవ్ర మతమౌఢ్యం, వెర్రి వుత్సాహం, హింసాతత్వం, మూర్ఖత్వం వంటి జుగుప్సాకరమైన ధోరణులు పుట్టుకు రావడంలో సందేహం లేదు. ఇటువంటి వారిలో కొందరు మంచి మంచి రచయితలు కూడా వుండటం చాలా ఆశ్చర్యం గొల్పుతుంది. ఇదొక్కటి తప్ప యిరతత్రా వాళ్ళు మానసికంగా దృఢంగానే వుంటారు. దీనంతటికీ మతం అని పేరు పెడతారు. మహా కంపు కొట్టే వ్యవహారం

యిది. ఇదీ భక్తి పంచుతున్న పరిమళం. అన్ని చోట్లా నాకు యిదే కనబడుతున్నది. జ్ఞానోదయం లేదా సత్య సాక్షాత్కారం కోసం పడే యీ ఆరాటం విపరీతమైన గందరగోళాన్ని సృష్టిస్తున్నది. ఎంతోమంది బలైపోతున్నారు దీని కారణంగా. ఇప్పుడు మిమ్మల్ని నేను అడుగుతున్నది ఏమిటంటే, నిజంగానే సత్య సాక్షాత్కారం అనేది ఒకటి వున్నదా; వుంటే కనుక అది ఏమిటి?

కృష్ణమూర్తి : మీ నిత్యజీవితం నుంచి అది ఒక పలాయనం కనుక అవుతే - నిత్యజీవితం అంటే అసంఖ్యాకమైన కదలికలతో కూడుకొని వున్న సంబంధ బాంధవ్యాలు - అటువంటి నిత్యజీవితం నుంచి యిది పలాయనం కనుక అవుతే, అప్పుడు ఆత్మజ్ఞానం అనీ, యింకా ఏవేవో పేర్లతో మీరు పిలుస్తున్నదీ అయిన యీ సత్య సాక్షాత్కారం వట్టి మిధ్య;, బూటకం. జీవితం ఎడల ప్రేమనీ, అవగాహనని, క్రియాచరణని తిరస్కరించేది ఏదయినా సరే చాలా విపరీతమైన అనర్థాలని సృష్టిస్తుంది. మనసుని వక్రీకరిస్తుంది. ఇక అప్పుడు జీవితం చాలా ఘోరంగా తయారవుతుంది. పోనీ, లోకమంతా ఆమోదించిన ఒక పరమ సూత్రంగా దీనిని తీసుకుంటే - అప్పుడు యీ సత్య సాక్షాత్కారాన్ని - దాని అర్థం ఏదయినా సరే, దానిని జీవించడం అనే చర్యలోనే పొందగలమా అనేది తెలుసుకోవడానికి ప్రయత్నించవచ్చు. నిజానికి, ఒక సిద్ధాంతం కంటె, ఒక ఆదర్శం కంటె, ఒక లక్ష్యం కంటె, సూత్రం కంటె కూడా జీవించడం అన్నదే చాలా ప్రధానమైనది. జీవించడం అంటే ఏమిటో మనకి తెలియదు గాబట్టి పలాయనవాదాన్ని వుపదేశించే యిటువంటి మిధ్యాపూర్వకమైన, అవాస్తవమైన సూత్రాలను మనం తయారు చేసుకుంటాం. అసలు ప్రశ్న ఏమిటంటే, మనిషి జీవించడంలోనే, జీవితానికి సంబంధించిన రోజువారీ కార్యకలాపాలలోనే యీ సత్య సాక్షాత్కారాన్ని పొందగలడా లేక చాలా అసాధారణమైన శక్తులు సంపాదించిన కొద్దిమందికి మాత్రమే యీ కటాక్షం సిద్ధిస్తుందా? సత్య సాక్షాత్కారం అంటే తనే ఒక దీపంగా వెలిగి, తనకు కాంతినిచ్చుకోవడం. కాని, యీ దీపం తను స్వయంగా చిత్రించుకున్నదీ, తనే కల్పన చేసుకున్నదీ కాకూడదు; తన వ్యక్తిగతమైన ఒక తిక్కచేష్టా కాకూడదు. మొదటి నుంచీ నిజమైన మతం, అంటే వ్యవస్థగా ఏర్పడిపోయిన విశ్వాసాలు, భయాలు కావు - ఆ నిజమైన మతం చెప్తున్నది యిదే.

ప్ర : నిజమైన మతం చెప్పేది యిదీ అని మీరు అంటున్నారా? మరి అప్పుడు, యిందులో నిష్ణాతులైన వారూ, యిదే వృత్తిగా అవలంబించినవారూ కలిసి ఒక పక్షమూ, తక్కిన ప్రపంచమంతా ఎదుటి పక్షమూ అయిపోతారే. అంటే మీ అర్థం మతం వేరూ, సాధారణ జీవనం వేరూ అనా?

కృష్ణమూర్తి : మతమూ, జీవితమూ విడివిడిగా వుండవు. అసలు మతమంటే జీవితమే. మీరు చెప్తున్న దురవస్థలన్నింటికీ మూలం మతాన్నీ, జీవితాన్నీ వేరుచేస్తున్న విభజనే. మళ్ళీ మన మొదటి ప్రశ్నకు తిరిగి వస్తున్నాం. నిత్య జీవితంలో వుంటూనే సత్యదర్శనం ప్రస్తుతానికి ఆ మాటనే వాడుకుందాం- కలిగిన ఆ స్థితిలో వుండటం సాధ్యమేనా?

ప్రశ : సత్య దర్శనం అంటే అర్థమేమిటో నాకింతవరకూ తెలియలేదు.

కృష్ణమూర్తి : అన్నింటినీ కాదంటున్న స్థితి. కాదు కాదు అనడమే అన్నింటికంటె నిర్ద్వంద్వమైన చర్య. నిర్ద్వంద్వంగా నొక్కి చెప్పడం కాదు. ఇది మీరు అవగాహన చేసుకోవలసిన చాలా ముఖ్యమైన విషయం. నిర్ద్వంద్వంగా వుండే మూఢ విశ్వాసాలను, నిర్ద్వంద్వంగా వుండే మతాచారాలను మనలో చాలామంది ఏ అభ్యంతరమూ లేకుండా ఆమోదిస్తుంటారు. ఎందుకంటే మనకి అందులో భద్రత దొరుకుతుంది, మేము దానికి చెందిన వాళ్ళం అని చెప్పుకోవచ్చు; దానితో అనుబంధమూ, దానిమీద ఆధార పడటమూ మనకు కావాలి. నిర్ద్వంద్వంగా వుండే వైఖరే విభజిస్తుంది. ద్వైదీభావాన్ని కలిగిస్తుంది. అప్పుడు యీ వైఖరికీ, తక్కిన వాటికీ మధ్యన సంఘర్షణ ఆరంభ మవుతుంది. అయితే సమస్తమైన విలువలను, సమస్త నీతి సూత్రాలను అన్ని నమ్మకాలనూ కాదనడం, చుట్టూ ఏ సరిహద్దులూ గీసుకోకుండా వుండటం అనేదీ, ఏ ఒక్కదానికో వ్యతిరేకతను చూపడమూ ఒకటి కావు. వుద్ఘాటన అన్నదాని నిర్వచనంలోనే విభజన వున్నది. విభజించడం అంటే ప్రతిఘటన చూపడం. ఇదంతా మనకు అలవాటై పోయింది. ఇదంతా మన నిబద్ధీకరణం. ఇదంతా విసర్జించడం నీతిబాహ్యం కాదు. అంతే కాదు, యీ విభజనలను, యీ ప్రతిఘటించడాలను విసర్జించడమే అసలైన గొప్ప నీతి. మనిషి కల్పన చేసుకున్న అన్నింటినీ కాదనడం - అతని విలువ లను, నీతిశాస్త్రాలను, దేవుళ్ళను - అన్నింటినీ కాదనడం అంటే ఏ ద్వైదీభావమూ లేని ఒక మానసిక స్థితిలో వుండటం. అటువంటి స్థితిలో అనుకూల, ప్రతికూలతల మధ్య విభజన, ప్రతిఘటించడమూ వుండవు. ఈ స్థితిలో పరస్పర వ్యతిరేకమైనవి వుండనే వుండవు. ఈ స్థితి మరొక దానికి వ్యతిరేకమైన స్థితి కానే కాదు.

ప్రశ్న : అప్పుడు ఏది మంచి, ఏది చెడు అనేది మనకు ఎట్లా తెలుస్తుంది? అసలు మంచీ, చెడూ అనేవి లేనే లేవా? నేరాలూ, హత్యలూ చేయకుండా నన్ను ఏది నిరోధిస్తుంది? ఏ ప్రమాణాలూ, విలువలూ లేకపోతే రకరకాలైన వెధవ పనులు చేయకుండా నన్ను ఏ దేవుడు రక్షిస్తాడు?

కృష్ణమూర్తి : వీటన్నింటినీ వర్జించడం అంటే తన్ను తాను వర్జించుకోవడమే. తాను అంటే అలవాటుగా మంచి అని నమ్ముతున్న దానినే అనుసరిస్తూపోతూ వుండే నిబద్ధుడైన ఒక జీవి అనమాట. అన్నింటినీ కాదనడం వల్ల మిగిలేది శూన్యం అని మనలో చాలామంది భావిస్తుంటారు. ఇది ఎందువల్ల అంటే, మన నిబద్ధీకరణం, మన భయాలు, మన బాధలు అనే జైలు లోపల జరిగే కార్యకలాపాలు మాత్రమే మనకు తెలుసు. ఈ దృష్టితో చూసినప్పుడు అన్నింటినీ కాదనడం అంటే అదేదో భయంకరమైనదనీ, అంధకారమయమూ, శూన్యమూ అనీ వూహిస్తుంటాం. సమాజమూ, మతమూ, సంస్కృతీ, నీతి సూత్రాలూ వుద్ఘాటించి చెప్పినవన్నీ కాదన్న మనిషి, సామాజిక కట్టుబాట్లు అనే జైల్ళులోనే యింకా మగ్గిపోతున్న వాళ్ళంతా దుఃఖంలో మునిగి వున్నట్లుగా గ్రహిస్తాడు. గతాన్నుంచి విముక్తి చెందిన మనిషి యొక్క కార్యకలాపాలన్నింటిలోనూ పనిచేస్తూ వుండే యీ కాదనడమే సత్య సాక్షాత్కార స్థితి. కాదు అని మనం విసర్జించవలసినది సంప్రదాయంతోను, ఆధిపత్యంతోను ముడిపడివున్న గతాన్ని. కాదనడమే విముక్తి. విముక్తి చెందిన స్వేచ్ఛా మానవుడే జీవించగలడు, ప్రేమించగలడు. చనిపోవడమంటే ఏమిటో తెలిసేది అతనికే.

ప్రశ్న : అంతవరకు స్పష్టంగా వుంది. కాని, అతీంద్రియమైనది, అలౌకికమైనది, లేదూ మీరు దానికి యింకో పేరు పెట్టినా సరే, దానినుండి వినవచ్చే అజ్ఞాత సందేశాలను గురించి మీరు ఏమీ మాట్లాడటం లేదు.

కృష్ణమూర్తి : స్వేచ్ఛలో మాత్రమే దానినుండి వచ్చే సందేశాలను కనిపెట్ట గలుగుతాము. దానిని గురించి ఏ వ్యాఖ్యానం చేసినా అది మళ్ళీ స్వేచ్ఛకు అడ్డు వస్తుంది. దానిని గురించి మాట్లాడటం అంటే అర్థం లేని శబ్దాలు వుచ్చరించడమే. అది వుంటుంది, అంతే. దానిని మనం కనిపెట్టలేము; రమ్మని పిలిచి ఆహ్వానించ లేము. ఒక ప్రత్యేకమైన మార్గంలో దానిని అసలే బంధించలేము. మనసు తన చాతుర్యంతో గారడీలు చేసి దానిని చేజిక్కించుకోలేదు. చర్చిలలో గాని, మసీదుల్లో గాని, ఆలయాల్లో గాని అది లేదు. దానిని చేరడానికి ఏ మార్గమూ లేదు. ఏ గురువులూ, ఏ విధానాలూ ఆ సౌందర్యాన్ని ఆవిష్కరించి చూపలేరు. ప్రేమ వున్నప్పుడే ఆ తన్మయానుభూతి కలుగుతుంది. సత్య సాక్షాత్కారం అంటే అదీ.

ప్రశ్న : దాని ద్వారా యీ మహా విశ్వపు స్వభావరీతిని గురించి కాని, చేతనని గురించి కాని, అస్తిత్వాన్ని గురించి కాని ఒక నవ్యమైన అవగాహన కలుగు తుందంటారా? అటువంటిదేదో జరుగుతుందని మతగ్రంథాలన్నీ ఎంతగానో వర్ణించాయి.

**కృష్ణమూర్తి** : ఈ తీరం మీద నివసిస్తూ, అవస్థలు పడుతూ అవతలి తీరం గురించి ప్రశ్నలు వేయడంలా వుంది మీరు అడుగుతున్నది. ఆ అవతలి తీరం మీద మీరు వున్నప్పుడు సమస్తం మీరే, ఏమీ లేకపోవడమూ మీరే, ఇటువంటి ప్రశ్నలు మీరు అడగనే అడగరు. ప్రశ్నలన్నీ యీ తీరం మీద వున్నప్పుడే, నిజానికి యీ ప్రశ్నలకు అర్థం లేదు. జీవించడం అరంభించండి. అప్పుడు మీరు కోరుకోకుండానే, ప్రయత్నించకుండానే, నిర్భయంతో అక్కడికి చేరుకుంటారు.

*(కన్వర్‌జేషన్స్)*



# ఆంగ్లమూలంలోని కొన్ని పదాలకు వుపయోగించిన తెలుగు మాటలు

| | |
|---|---|
| Action | చర్య, క్రియ, కార్యం, పని |
| Attention | సావధానం, సావధానశీలత |
| Authority | ఆధిపత్యం, అధికారం |
| Awareness | ఎరుక |
| Being | అస్తిత్వం, ఉనికి, జీవి |
| Brain | మెదడు |
| Clarity | స్పష్టత, నిర్దుష్టత |
| Conflict | సంఘర్షణ |
| Challenge | సవాలు, సమస్య |
| Confusion | గందరగోళం |
| Conditioning | నిబద్ధత, నిబద్ధీకరణం |
| Consciousness | చేతన, చేతనావర్తం |
| Unconscious | అచేతన, అంతఃచేతన |
| Dimension | ఆయతన ప్రమాణం |
| Division | విభజన |
| Energy | శక్తి |
| Enquiry | విచారణ |
| Escape | తప్పించుకోవడం, తప్పించుకొని పారిపోవడం |
| Experience | అనుభవం |
| Fact | వాస్తవం |
| Freedom | స్వేచ్ఛ, విముక్తి, స్వతంత్రం |
| Follower | అనుయాయి |
| Following | అనుసరించడం |
| Image | మనోబింబం, మనోరూపం, కాల్పనికబింబం, ఊహాబింబం |
| Intellect | మేధ |
| Intelligence | తెలివి, ప్రజ్ఞ, తెలివితేటలు |
| Judging | తప్పొప్పులు నిర్ణయించడం |
| Idea | ఊహ, భావన |
| Knowledge | జ్ఞానం, విజ్ఞానం |
| Learning | నేర్చుకొనడం |
| Mind | మనసు, మనస్సు, |
| Memory | స్మృతి, జ్ఞాపకం |
| Negate | కాదనడం, లేకుండా చేయడం |
| Negative | ప్రతికూలమైన, విరుద్ధమైన |
| Observation | పరిశీలన |
| Opposites | ద్వంద్వాలు |
| Order | క్రమత, క్రమశీలత్వం |
| Dis-order | అస్తవ్యస్తత, క్రమరాహిత్యం |
| Problem | సమస్య |
| Positive | అనుకూలమైన, నిర్ద్వంద్వమైన |
| Perception | గ్రహింపు, పరిగ్రాహ్యత |
| Reaction | ప్రతిచర్య, ప్రతిక్రియ |
| Reality | యదార్థం |
| Relationship | బాంధవ్యం, సంబంధ బాంధవ్యాలు |
| Response | ప్రతిస్పందన |
| Religion | మతం |
| Religiousman | పారమార్థికుడు |
| Self | నేను, తాను, స్వ, స్వార్థం |
| Sensation | ఇంద్రియానుభూతి |
| Sensitivity | సున్నితత్వం, స్పందనశీలత |
| Thought | ఆలోచన |
| Tradition | సంప్రదాయం |
| Truth | సత్యం |
| Understanding | అవగాహన |
| Violence | హింస, దౌర్జన్యం |
| 'What is' | 'ఉన్నది' |
| 'What should be' | 'ఉండవలసినది' |